# విషయసూచిక



## ఉదాహృత గ్రంథసంకేతాలు

| సంకేతం | గ్రంథం | రచయిత |
|---|---|---|
| .... | కొత్తగడ్డ .... | శ్రీ నార్ల వెంకటేశ్వరరావు |
| .... | పిచ్చాపాటి .... | శ్రీ నార్ల వెంకటేశ్వరరావు |
| .... | మాటామంతి .... | శ్రీ నార్ల వెంకటేశ్వరరావు |
| .... | వ్యావహారికాంధ్రమహాభారతం .... | శ్రీ పురిపండా అప్పలస్వామి |
| .... | ఆంధ్రులచరిత్రసంగ్రహం .... | శ్రీ మొటుకూరి బలరామమూర్తి |
| .... | రథచక్రాలు .... | శ్రీ మహీధర రామమోహన్ |
| .... | రామాయణం (సుందరకాండ) .... | శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి |
| .... | విరాటపర్వం. [illegible] పత్రికలు [illegible] | |

# నా ను డి

వ్యావహారికభాషకు వ్యాకరణం రచియించడంలో యిది తొలిప్రయత్నం. సాధ్యమైనంతవరకూ సమగ్రంగా వుండాలనే ప్రయత్నించాను. అయినా [illegible] లేననలేను. సర్వజ్ఞు లెవరు గనుక? భాషాస్రవంతీ మహాప్రవాహాన్ని [illegible] అసాధ్యమైనపని. అంతాకాకపోతే కొంతైనా అరికట్టడానికి [illegible] రణ నిర్మాణం అసాధ్యమైనపనికాదు. అది సాధ్యమేఅయినా [illegible] ష్టంగా వుండేట్లు చెయ్యడం ఆ బ్రహ్మతరంకూడా కాదు. ఎంతనిర్దుష్టంగా వుండాలని ప్రయత్నించినా ఏమూలో లొసుగుండకతప్పదు. అలాగే ఈగ్రంథముద్రణ పూర్తయ్యాక యిందులో నాలుగైదు లోపాలున్నట్లు నేనే గమనించాను. [illegible] నాకు కనిపించని - అందరూ గమనించతేని - లోపా లేమైనా యిక్కడ [illegible] వచ్చును. గమనించినవారు ఆదరంతో తెలియజేస్తే మలిముద్రణలో [illegible] సవరించుకొంటాను. ఈర్ష్యాద్వేషాలతోకాక సహృదయత్వంతో యీవ్యాకరణం[illegible] వచ్చే విమర్శలకు హృదయపూర్వకంగా స్వాగతమిస్తున్నాను.

నాకూ శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారికీ అభిప్రాయభేదా లనేకం [illegible]. అది వేరుమాట. వ్యావహారికభాషను వ్యాకరించడానికి తగిన [illegible] తీసుకొనిరావడంలో ఆంధ్రప్రభ దినపత్రికద్వారా వారు చేసినకృషి అనన్య[illegible] మైనది. నాకూ శ్రీ నార్ల వారికీ అభిప్రాయభేదా లున్నంతమాత్రంచేత [illegible] వ్యావహారికభాషకుచేసిన అమూల్యమైనసేవను కాదని నన్ను నేను వంచించు[illegible] వలసిన అవసరం కనిపించలేదు. ఈవ్యాకరణంలో మొట్టమొదట శ్రీ [illegible] ప్రముఖమైన స్థానమివ్వడం అభిమానపురస్కృతమని కిట్టనివారు ఆత్మవంచన[illegible] బైటకు అన్నప్పటికీ వారి అంతరాత్మలవద్దమాత్రం ఆ ఆత్మవంచన చేయ[illegible] రనుకుంటాను.

గ్రాంథిక వ్యావహారికాలకు పదస్థితిలోగాని వాక్యనిర్మాణాదుల్లోగాని [illegible] కలు కొన్ని లేకపోలేదు. అటువంటి సామ్యాలున్న సందర్భాల్లో ఈ వ్యాకరణ రచనలో - అసాధారణమేధానిధి - గ్రాంథికభాషాక్షీరార్ణవరాజహంస అయిన శ్రీ పరవస్తు చిన్నయసూరి బాలవ్యాకరణాన్ని అనుసరించినందుకు నేను [illegible]

న్ంచిన ఆప్తమిత్రులు శ్రీ అద్దేపల్లి నాగేశ్వరరావుగారికి వారి సతీమణి శ్రీమతి వివేకానందాదేవిగారికి కృతజ్ఞతలు.

వ్యాకరణం సాఫ్టు వ్రాయడంలో చేదోడుగా పనిచేసిన నా ప్రియశిష్యులు చిరంజీవులు చింపిడి పున్నారావు (భాషాప్రవీణ ఫైనల్) ప్రతాప కృష్ణమూర్తి (విద్యాప్రవీణ - ప్రిలిమినరీ) లను విద్యాభివృద్ధిగా ఆశీర్వదిస్తున్నాను.

వ్యాకరణానికూడా ముఖచిత్రమా అని కొందరనుకోవచ్చును ... నరే కళాస్వరూపంగానే భావించడంనాకు ఉత్సుకతో నే అచ్చిన ... విషయంలోలాగానే దీనివిషయంలోనూ ఏవోభావాలు తొంగిచూచాయి. ... కనుగుణంగా ఈవ్యాకరణానికి ప్రముఖచిత్రకారుల ప్రశంసలు ... కొనేట్లు చక్కని బహువర్ణచిత్రాన్ని కష్టపడి తీర్చిదిద్దారు శాంతినికేతన ... శ్రీ కందాళ సత్యనారాయణ (హైదరాబాద్) గారు. వారువేసిన ఆ ... చిత్రం కమ్మర్షియల్ ఆర్టుకి సంబంధించిందికానందువల్ల ముద్రణ ... కాక మా గృహాన్నలంకరించేదిగానే ఉండిపోయింది. అంత ... చిత్రాన్ని చిత్రించిన శ్రీ సత్యనారాయణగారికి - ముద్రించడానికి ... నల కనుగుణంగానే తిరిగి చక్కగా ముఖచిత్రాన్ని చిత్రించిన శ్రీ వెలయుగారికి కృతజ్ఞతలు. కొత్తఅక్షరాలను బ్లాకులు చేయించడానికి అనువుగా ... మిత్రులు ప్రముఖచిత్రకారులు శ్రీ వై. సుబ్బారావుగారికి కృతజ్ఞతలు. ... వ్యావహారికభాషోద్యమాన్ని ప్రారంభించి కీర్తిశేషులైన వెలుగుబోరి ... శ్రీ స్వామినేని ముద్దునరసింహంగారి ఫోటో యెంతపాతబడినా చాలా శ్రమప... దాన్ని మళ్లీ ఫోటోతీసిన శ్రీ వేములపల్లి కోటేశ్వర్రావుగార్ని (... గుడివాడ) అభినందిస్తున్నాను. శ్రీ గురజాడ అప్పారావుగారికి సంబంధించిన అనేక విషయాలు వివరంగా వ్రాసిచ్చిన శ్రీ అప్పారావుగారి పుత్రులు ... శ్రీ గురజాడ వెంకటరామదాసుగారికి శ్రీ అప్పారావుగారి ఫోటో ... శ్రీఅప్పారావుగారి కుమార్తె శ్రీమతి పులిగడ్డ అప్పలకొండాయమ్మగారికి ... శ్రీయుత పులిగడ్డ కృష్ణమూర్తిగారికి, (బి. ఏ. బి. యల్. ఐడ్వకేటు, ...) కృతజ్ఞతలు. ఈ వ్యాకరణ ముద్రణనిమిత్తమై నేను రాజమండ్రిలో ఉన్న ... నాకు చేదోడు వాదోడుగా సహాయపడిన ప్రియమిత్రులు జానపదవాఙ్మయ ... శ్రీ నేదునూరి గంగధరంగారికి శ్రీ రమణం శ్రీరాములుగారికి హార్దికాభివందనాలు ... ప్రూఫులు చూడడంలో శ్రద్ధవహించిన నాసహాధ్యాయి మధురకవి భాషాప్రవీ...



శ్రీ ముద్దు నరసింహంగారు

ఆరసున్న యెప్పుడో అడుగంటిపోయింది
అక్షరమాల్లోనె వ్యర్థమండి !
బండి రా యేనాడో బండలై పోయింది
రేఫ భేదా లింక లేవకండి !
మాట్లాడ్డ మెట్లాగో అట్లాగె వ్రాయండి
కృతకభాషను తెచ్చి కూర్చకండి !
మనలోను మనమనమాటలలో లేని
వైకల్య మెందుకు వ్రాతలోన ?
అని పరమసత్యనిత్యసిద్ధాంతగరిమ
మొట్టమొదట చాటిన సత్యమూర్తి అతను
వ్యావహారికభాషోద్యమాంకురార్ప
ణం మొదట చేసిన మనిషి. నవమనీషి.

సంస్కృతాంధ్రాధివేత శ్రీ స్వామినేని
ముద్దు నరసింహుడికి ప్రేమ ముప్పిరిగొన
దీన్ని అంకిత మివ్వడం దివ్యమూర్తి
ఆంధ్ర భాషామతల్లికి అర్చ తాను



శ్రీ అప్పారావుగారు

# శ్రీ ముద్దు నరసింహంగారు

శ్రీ ముద్దు నరసింహంగారి యింటిపేరు స్వామినేనివారు. వీరు అదివెలమలు. వీరి తల్లిదండ్రులపేరులుగాని జననమరణాదికాలుగాని తెలియరావడంలేదు. వీరు బాలవ్యాకరణాది మహోద్గ్రంథాలు వ్రాసిన శ్రీ పరవస్తు చిన్నయసూరిగారి సమకాలీకులు. క్రీ॥ శ॥ 1862 వరకూ జీవించి ఉన్నారనే చెప్పవచ్చు. 1862 లోన వీరు వ్రాసిన "హితసూచని" గ్రంథంముద్రితమైనది. దీన్ని వీరికుమారులు ఆరోజుల్లో రాజమండ్రిలో జిల్లాఆక్టింగ్ గవర్నమెంటు వకీలుగావున్న శ్రీస్వామినేని రంగప్రసాదనాయుడుగారు అచ్చువేయించి ప్రకటించారు. శ్రీ ముద్దునరసింహంగారు ఫస్టుక్లాస్ ఆక్టింగ్ డిస్ట్రిక్ట్‌మున్సబుగా రాజమండ్రిలో పనిచేశారు. ఇంగ్లీషుతోపాటు సంస్కృతాంధ్రాల్లో వీరికి అసాధారణమైన పాండిత్య మున్నట్లు అనేకగ్రంథాలు కూలంకషంగా వీరు చదివినట్లు హితసూచనిగ్రంథం చదివితే స్పష్టపడుతుంది. వీరు వ్యావహారిక భాషోద్యమానికి-వితంతువివాహాదిసంఘసంస్కరణోద్యమాలకు-మంత్రతంత్రాలున్నాయని దేవతలున్నారనే మూఢనమ్మకాలపై ధ్వజమెత్తిన ఉద్యమానికి మూలపురుషులు. మామూలుగా వ్యావహారికభాషలో గ్రంథరచన చెయ్యడంవేరు. ఉచ్చారణలో భ్రష్టమైన అక్షరాలను తొలగించాలనీ జనవ్యావహారికాని కనుగుణంగా గ్రంథరచన సాగించాలనీ, సకారణంగా సిద్ధాంతప్రతిపాదన చెయ్యడంవేరు. ఈవిధంగా సకారణంగా మొట్టమొదట సిద్ధాంతప్రతిపాదన హితసూచనిపీఠికలో శ్రీ ముద్దు నరసింహంగారు చేశారు. ఈ హితసూచనిముద్రణ జరిగిన ఒకసంవత్సరానికి శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారు పుట్టారు. హితసూచనిలో శ్రీ ముద్దు నరసింహంగారు వ్రాసుకొన్న పీఠికను గద్య చింతామణి మొదటిభాగం 182 - 185 పుటల్లో శ్రీరామమూర్తిపంతులుగారు ప్రకటించారు. శ్రీ ముద్దు నరసింహంగారు హితసూచని పీఠికలో ప్రతిపాదించిన సిద్ధాంతాన్ని అనుసరించే శ్రీ గిడుగువారు బ్రహ్మాండమైన ఉద్యమాన్ని లేవదీశారు. శ్రీ ముద్దు నరసింహంగారు వితంతువివాహాలు చెయ్యవచ్చని అది శాస్త్రసమ్మతమేనని అసాధారణమైన చర్చచేసి నిరూపించారు. వీరి యీ నిరూపణను అనుసరించే వీరి తరువాత శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారు సంఘసంస్కరణవిషయంలో మహావిప్లవాన్ని లేవదీశారు. శ్రీ ముద్దు నరసింహంగారి హితసూచని ముద్రితమై వెలువడేనాటికి శ్రీ వీరేశలింగంగారు సుమారు 14 సంవత్సరాల కుఱ్ఱవాడు. శ్రీ వీరేశలింగంగారి సంతకంతోవున్న హితసూచని పుస్తకం నావద్ద వున్నది. ఈహితసూచనిలోనే మంత్రాలు తంత్రాలు అబద్ధాలని దేవత లనేవారు లేరని

వాదిస్తూ శ్రీ ముద్దు నరసింహంగారు చాలా చర్చచేశారు. వీరి తర్వాత కవిరాజు శ్రీ త్రిపురనేని రామస్వామిచౌదరిగారు మూఢవిశ్వాసాలమీద ధ్వజమెత్తి మహోద్యమాన్ని లేవదీశారు. హితసూచనిగ్రంథం ముద్రితమై వెలువడినతరువాత సుమారు 25 సంవత్సరాలకు (క్రీ॥ శ॥ 1887 లో) కవిరాజుగారు జన్మించారు. అంటే హితసూచని వెలుపడినతర్వాత సుమారు 50 సంవత్సరాలకుగాని కవిరాజుగారు రచనావ్యాసంగానికి దొరకొనలేదని చెప్పవచ్చును. మధ్యకాలం సుదూరమైనందువల్ల కవిరాజుగారు ఈ హితసూచని చూచివుంటారనేగాని చూచివుండరనేగాని యిదమిద్ధంగా నిర్ణయించలేము. క్రీ॥ శ॥ 19 వ శతాబ్దాంతంలోను 20 వ శతాబ్దిలోను ఆంధ్రదేశం నలుమూలలా విజృంభించిన అతిముఖ్యాలైన మహోద్యమాలు మూడింటికికూడా శ్రీ ముద్దు నరసింహంగారు మూలపురుషులు. వ్యావహారిక భాషోద్యమానికి శ్రీరామమూర్తి పంతులుగారిని - సంఘసంస్కరణోద్యమానికి శ్రీ వీరేశలింగంపంతులుగారిని - మూఢనమ్మకాలపై ధ్వజమెత్తిన శ్రీరామస్వామి చౌదరిగారిని - ఆ ఉద్యమాలకు పితామహులుగానే మనం యెంచినా శ్రీ ముద్దు నరసింహంగారిని ప్రపితామహులుగా భావించవచ్చు.

## శ్రీ రామమూర్తిపంతులుగారు

వ్యావహారికభాషా మహోద్యమాన్ని శరవేగంతో ఆంధ్రదేశం నలుమూలలా వ్యాపింపచేసి పండితుల గుండెలు దద్దరిల్లజేసిన శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు శ్రీ కాకుళంజిల్లా పర్వతాలపేటలో క్రీ॥ శ॥ 1863 లో _అంటే_హితసూచని ప్రింటయిన ఒక యేడాదికి జన్మించారు. వీరికి గురజాడ అప్పారావుగారికి చిన్నతనంనుంచి స్నేహంవుండేది. గిడుగువారికి 12వ యేటనే పితృవియోగం సంభవించింది. అనంతరం చాలా శ్రమలుపడి బి. ఎ. ప్యాసయ్యారు. 1880 లో పర్లాకిమిడి హైస్కూలులో ఉపాధ్యాయులుగా చేరారు. 1896 లో పార్లాకిమిడి కాలేజీలోనే లెక్చరర్‌గా ఉద్యోగంలోచేరి 1911 లో రిటైరయ్యారు. మొట్టమొదట వీరు సవరభాషలో పరిశోధనచేసి ఆభాషకు లిపికల్పనచేశారు. ఆతర్వాత వ్యావహారికభాషా మహోద్యమాన్ని చేబట్టి ఆంధ్రభాషలో అనన్యసామాన్యమైన పరిశ్రమచేసి దిగ్గంతులవంటి పండితుల్నియెదుర్కొన్నారు. సంఘసంస్కారప్రియులు. వీరి మహత్తరభాషాపరిశ్రమకు ప్రతిబింబాలుగా బాలకవిశరణ్యం _ గద్యచింతామణి_ ఆంధ్రపండిత భిషక్కుల భాషా భేషజం - యితరవ్యాసాలు అనేకం వీరికలంనుంచి అవతరించాయి. వ్యావహారిక భాషామహోద్యమ పితామహులని కీర్తిగాంచి గిడుగు కాదు పిడుగు గనిపించుకున్న శ్రీ రామమూర్తి పంతులుగారు 22_1_1940 తేదీని దివంగతులయ్యారు.

# శ్రీ అప్పారావుగారు

వ్యావహారికభాషా మహోద్యమంలో శ్రీగిడుగురామమూర్తిపంతులుగారికి మొట్టమొదటినుంచీకూడా కొండంత అండగా గుండెలో గుండెగా నిలిచిన మహాకవి శ్రీ గురజాడ వెంకటఅప్పారావుగారు విశాఖపట్టణంజిల్లా రాయవరంలో 31-11-1861 తేదీన జన్మించారు. బి. ఏ. వరకూ విజయనగరంలోనే విద్యాభ్యాసం చేశారు. అనంతరం చాలాకాలం విజయనగరం కాలేజీలోనే లెక్చరర్‌గా పనిచేశారు. ఆతరువాత విజయనగరం మహారాజాగారి సంస్థానంలోనే ఒక చిన్న ఉద్యోగిగా నియమించబడ్డారు. అప్పుడే కళింగదేశ చరిత్ర వ్రాయడానికి ఉద్యమించారు. భాషాశాస్త్రంలోను నాటకకళలోను బహుముఖమైన పరిశ్రమచేశారు. 1913వ సంవత్సరంలో మద్రాసు యూనివర్సిటీ సెనేటుకి ఫెల్లో మెంబరుగా నామినేట్ చెయ్యబడ్డారు. ఒకసారి మద్రాసు యూనివర్శిటీ బోర్డ్‌అఫ్ స్టడీస్ మీటింగులో శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారు శ్రీ గురజాడ అప్పారావుగారికి పెద్దగా పాండిత్యంలేదని గ్రాంథిక భాషలో రచనచెయ్యలేరని అందుకే గ్రాంథికంలో గ్రంథాలు వ్రాయించి ప్రకటించుతున్న మా విజ్ఞానచంద్రికా గ్రంథమండలి వారికి ఆయన కళింగదేశచరిత్ర వ్రాసిస్తానని వ్రాసివ్వలేదనీ ఆరోపించారు. ఈ ఆరోపణను ఆమీటింగులోవున్న శ్రీ పి. టి. శ్రీనివాసయ్యంగారు పూర్తిగా ప్రతిఘటించారు. శ్రీ లక్ష్మణరావుగారి ఆరోపణ విన్న తరువాత వారికి సమాధానంగా తమ పాండితీగరిమను చూపిస్తూ - సుభద్ర (కావ్యం)-పుష్పలావికలు-అనే పేరుతో కరుడుగట్టిన గ్రాంథికంలో శ్రీ అప్పారావుగారు పద్యాలు వ్రాశారు. కన్యాశుల్కం-కొండుభట్టీయం-బిల్హణీయం-ముత్యాలసరాలు-చిన్నికథలు-వ్యాసాలు-సమస్యలు-ఆశుపద్యాలు-మొదలైనవి వీరి రచనలు. ఇంతవరకూ లోకం దృష్టిలో ప్రాధాన్యతవహించని మహోత్కృష్టమైన రచన మరొకటి వున్నది. అది "ది తెలుగు కాంపోజిషన్ కాంట్రవర్సి" అనే పేరుతో వ్యావహారికభాషావాదం గురించి వ్రాయబడ్డ అద్భుతగ్రంథరాజం. ఒక మహాకవిగా స దేశానికి పరిచయమైన శ్రీ అప్పారావుగారు ఈగ్రంథంతో ప్రముఖభాషావేత్తగా కూడా దృగ్గోచర మవుతున్నారు. శ్రీ గిడుగు రామ్మూర్తిపంతులుగారికంటె శ్రీ అప్పారావుగారు రెండుసంవత్సరాలు పెద్దవారు. తమపెద్దతనానికి తగినట్లు శ్రీ గిడుగువారిని ఉద్యమంలో ముందుంచి తాము వెనకాల యెంతో అండగా నిలిచి అపూర్వమైన సేవ చేశారు శ్రీ అప్పారావుగారు. వ్యావహారిక భాషామహోద్యమానికి యెదుగడగా నిలిచిన మహాకవి అప్పారావుగారు 30-11-1915 తేదీని స్వర్గస్థులయ్యారు.



శ్రీ తాపీ



శ్రీ నార్ల



శ్రీ శ్రీ

## వ్యావహారిక భాషోద్యమంలో

## పాత్ర వహించిన

## అతిరథులు - మహారథులు

### శ్రీ వీరేశలింగం పంతులుగారు

ఆంధ్రదేశంలో అనేకసంస్కరణోద్యమాలు విజృంభించడానికి మూల పురుషులైన శ్రీ కందుకూరి వీరేశలింగంగారు 1848 ఏప్రిల్ 16 న జన్మించారు. 1870 లో మెట్రిక్యులేషన్ ప్యాసయి ఉపాధ్యాయవృత్తిలో ప్రవేశించారు. ఉపాధ్యాయవృత్తిలో ప్రవేశించినప్పటినుంచికూడా శ్రీ స్వామినేని ముద్దునరసింహంగారి సిద్ధాంతాలను చేబట్టి మంత్రాలు తంత్రాలు అబద్ధాలని దేవతలు లేరని బాల్యవివాహాలు కూడదని - వితంతువివాహాలు చెయ్యవచ్చని మొదలైన సంఘసంస్కరణోద్యమాలను అనేకాలను విజృంభింపజేశారు. "వివేకవర్ధని" - "హాస్యసంజీవని"- "సతీహితబోధ" అన్న పత్రికలను నడిపారు. అనేకగ్రంథాలు రచించారు. చివరి దశలో శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారితో కలిసి వ్యావహారికభాషోద్యమాన్ని సమర్థించారు. ఆ చివరిదశలోనే వ్యావహారికభాషా వ్యాకరణం వ్రాయాలని తలపెట్టారు. దాని ఆలోచన కలిగిన కొద్దిరోజులకే 27—5—1919 న వీరు కీర్తిశేషులు కావటంతో వ్యావహారికభాషా వ్యాకరణ రచనాసంకల్పం కార్యరూపం దాల్చలేదు.

### శ్రీ నాగేశ్వరరావుగారు

విశ్వదాత బహుముఖాంధ్రోద్యమమూర్తి అయిన శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు 1—5—1867 న జన్మించారు. బి. ఎ. చదివారు. ఆంధ్రదేశంలో మొట్టమొదట దినపత్రికనుపెట్టి విజ్ఞానజ్యోతిని వెలిగించిన కీర్తి శ్రీ నాగేశ్వరరావుగారికే దక్కింది. ఆకాలంలో వీరికి సంబంధంలేని - వీరివల్ల ఉత్సాహప్రోత్సాహాలుపొంది పైకిరాని ఉద్యమ మొంటూలేదు. ముఖ్యంగా ఆంధ్రపత్రిక దినపత్రిక వారపత్రికలను భారతి మాసపత్రికను నడపడంద్వారా అనేకమంది కవి పండిత పరిశోధక విమర్శకుల్ని ఆదరించి గౌరవించి ఆంధ్ర సాహిత్యలోకానికి శ్రీ నాగేశ్వరరావుగారు చేసిన మహోపకారాన్ని సంస్కారంకల యే ఆంధ్రుడూ మరచిపోలేడు. యేవిద్య

మానికి ఏమవసరమైనా ముందువెనుకలు చూడకుండా శ్రీ నాగేశ్వరరావుగారుచేసిన దాన ధర్మాలకు చిహ్నంగా విశ్వదాత అని బిరుదాన్నిచ్చి ఆంధ్రదేశం తన్ను తాను గౌరవించుకొన్నది. శ్రీ నాగేశ్వరరావుగారు మంచిపండితులు విమర్శకులు - రచయితలుకూడా. బహుముఖాలుగా దేశానికి సేవచేసిన అనన్యసామాన్యశక్తివంతులైన శ్రీ నాగేశ్వరరావుగారు ప్రకృతిమాతబిడ్డ. వీరు చివరిదశలో వ్యావహారిక భాషోద్యమాన్ని సమర్థించి శ్రీ గిడుగుప్రభృతులుకి యెంతో ప్రోత్సాహాన్నిచ్చారు. ఆంధ్రతేజోవ్యాప్తికి యెన్నోరూపాల దోహదంచేసిన శ్రీ నాగేశ్వరరావుగారు 11–4–1938 న కీర్తిశేషు లయ్యారు.

## శ్రీ వెంకటశాస్త్రిగారు

గ్రాంధిక వ్యావహారిక భాషావాదాల్లో దేనితోనుసంబంధం పెట్టుకోకుండా వ్యావహారికభాషోద్యమంవైపు ప్రజాభిప్రాయంమెండుగా మొగ్గడం గమనించిన శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు. ఔను-కాదు-అనకుండా వ్యావహారికభాషలో రచనలు కొనసాగించి పద్యాల్లో సైతం యిష్టంవచ్చినట్లు వ్యావహారికపదాలను ప్రయోగించడానికి పూనుకున్నారు. ఈరూపంగా కవిత్వమంటే యేమిటో ప్రజలందరికి రుచిచూపించి కవిత్వాన్ని సర్వసామాన్యమైనదిగా రూపొందించారు శ్రీ శాస్త్రిగారు. శ్రీ శాస్త్రిగారు 1870లో జన్మించారు. తిరుపతి శాస్త్రిగారితో కలుపుకొంటే ఆధునిక కవితలో సంపూర్ణప్రజామోదంకల ఒక యుగాన్నే శ్రీ వెంకటశాస్త్రిగారు నెలకొల్పారని చెప్పవచ్చు. ఆరోజుల్లో వ్యావహారిక భాషాపదప్రయోగాలమీదా-తద్వాదంమీదా ధ్వజమెత్తిన కవులు శతాధిక గ్రంధకర్తలే అయినాప్రజాభిమానాన్ని చూరగొనలేక అత్యధికంగా ముందుగా పొందవలసిన ఆదరాభిమాన గౌరవాదుల్ని పొందలేక పోయారు. వ్యావహారికభాషాపద ప్రయోగవైశిష్ట్యంతో ప్రజాభిమానాన్ని చూరగొన్న శ్రీ వెంకటశాస్త్రిగారిని ఆంధ్రప్రజాప్రభుత్వం ఆస్థానకవిగా మొట్టమొదట నియమించడం ఒక గొప్పవిశేషంకాదు· మద్రాసు ఆంధ్రప్రభుత్వప్రధమాంధ్రాస్థాన కవి పదవి నధిరోహించిన శ్రీ శాస్త్రిగారు 15-2-1950 న కీర్తిశేషు లయ్యారు.

## శ్రీ ప్రభాకరశాస్త్రిగారు

వ్యావహారికభాషావాదానికి తరగని అండగా నిలిచిన పరిశోధకశిఖామణులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 1883 ఫిబ్రవరిలో జన్మించారు. శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి శిష్యులుగా విద్యాభ్యాసంచేసి గురువులను మించిన శిష్యులై

అసాధారణ ప్రతిభావ్యుత్పత్తులతో ఆంధ్రభాషవిషయంలో వీరు చేసిన పరిశోధన సర్వాంధ్రానికి శిరోధార్యమైనది. ప్రాచీనకవితల్లజులు ప్రయోగించిన వ్యావహారిక భాషాప్రయోగాలను ఎత్తిచూపడంలోను తాళపత్రగ్రంధాల పరిశోధనలోను వీరు చూపిన నేర్పు ఓర్పు తర్వాతివారికి ఆదర్శనీయమైనది. వీరి "తెలుగుమెరుగులు" నిజంగా మన తెలుగు భాషలో మెరుగులు చూపించింది. తాము అనన్యమైన భాషా సేవ చేయడమేకాక సుప్రసిద్ధభాషాపరిశోధకులు శ్రీ తిరుమలరామచంద్రవంటి పండితులను శిష్యులుగా పెంపొందించుకొన్న శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు యిటీవలనే దివంగతు లయ్యారు.

## శ్రీ ధర్మారావుగారు

వ్యావహారికభాషోద్యమంలో ఒక ప్రత్యేకస్థానం గడించుకొన్న శ్రీ తాపీ ధర్మారావుగారు 19-9-1887 న జన్మించారు. బి. ఏ. ప్యాసయ్యారు. వేగుచుక్కగ్రంధమాలను నడిపారు. కొండెగాడు - సమదర్శిని - కాగడా - జనవాణి మొదలైన పత్రికలను స్థాపించి నడిపారు. 1937 లో జనవాణి అనే దినపత్రికకు సంపాదకులుగా పనిచేశారు. వ్యావహారికభాషను పత్రికల్లో మొట్టమొదట ప్రవేశపెట్టినకీర్తి శ్రీ ధర్మారావుగారికే దక్కినది. ఆంధ్రసాహిత్యం లోతులుతెలిసినపండితులు. విజయవిలాసంగురించి వీరుచేసిన పరిశ్రమ అసాధారణమైనది. వ్యావహారికభాషోద్యమానికి సంబంధించి వీరువ్రాసిన రచనలు భాషావిప్లవానికి యెంతో తోడ్పడ్డాయి. ఏవిషయాన్ని చేబట్టినా దానిపుట్టుపూర్వోత్తరాలు ఎంత అధఃపాతాళంలో ఉన్నా పైకిలాగి నలుగురికి అందించనిదే వీరికి నిద్రపట్టదు. అటువంటి బహుళపరిశ్రమ ఫలితాలైన ఓనమాలు - కొత్తపాళీ - దేవాలయాలమీద బూతుబొమ్మ లెందుకు: పెళ్లి - దానిపుట్టుపూర్వోత్తరాలు - మొదలైన గ్రంథాలు ఆంధ్రవాఙ్మయానికి అలంకారాలు. ప్రస్తుతం వీరు మద్రాసులో ఉంటూ సినీమాలకు పాటలు మాటలు వ్రాస్తున్నారు.

## శ్రీ వెంకటేశ్వరరావుగారు

శ్రీ గిడుగు రామ్మూర్తిపంతులుగారి తరువాత తిన్నగా ఉద్యమంలో ప్రవేశించేవుంటే - వ్యావహారికభాషోద్యమానికి నాయకులుకావలసినవారు శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు. వీరు 1-12-1908 న జన్మించారు. బి. ఏ. ప్యాసయ్యారు. వ్యావహారికభాషను వ్యాకరించడానికి తగినట్లు భాషను ఒక ఉన్నతమైన

స్థాయికి తీసుకొనిరావడానికి నిరాడంబరంగా ఆంధ్రప్రభ దినపత్రికద్వారా అంతర్వాహినియైన పవిత్రసరస్వతీనదిలా భాషకొకమార్గాన్ని నిర్ణయించడంలో ప్రతి రోజూ కష్టపడి సేవచేస్తున్న వ్యావహారికభాషా పదార్థ తత్వ రహస్యజ్ఞులు. ఔచిత్యానుగుణ పదప్రయోగ నైపుణ్యంకల మనీషి. ఆంధ్రదేశంలో వేలెత్తి చూపదగిన ఒకేఒక అంతర్జాతీయ రాజకీయ పరిజ్ఞాన సర్వస్వ మనదగిన మేధానిధి. ప్రముఖ జర్నలిష్టుగా - వ్యాస రచయితగా - విమర్శకశిరోమణిగా - కవిగా - నాటికా రచయితగా వీరిని ఆంధ్రజాతి అడుగడుగునా అనుదినం రుచి చూస్తూనే వున్నది. తద్రూపంగా తన తెలుగుతనాన్ని తాను అనుభవిస్తూనే వున్నది. ఆంధ్రదేశచరిత్రలో ప్రత్యేకంగా పేర్కొనదగి ప్రశంసనీయాలైన యిటీవల జరిగిన సంఘటనలు రెండు. అవి పాఠ్యపుస్తకాల జాతీయకరణం - ఆంధ్రసాహిత్యఎకాడమీ సంస్థాపనం - ఈరెండు సంఘటనలూ జరగడానికి ముఖ్యులనేకీర్తి శ్రీ నార్లవారికే దక్కింది. ఇంక వ్యావహారికభాషను ప్రభుత్వం విశ్వవిద్యాలయాలు ఆమోదించేట్లు కృషిచెయ్యడంలో శ్రీ నార్లవారు ప్రముఖపాత్రవహించుతారని ఈభాషోద్యమానికి స్థిరంగా ప్రాణప్రతిష్ఠ చేస్తారని ఆశకల ఆంధ్రదేశం సువర్ణాక్షరాలతో లిఖింపదగిన అటువంటి పర్వదినం యెప్పుడువస్తుందా అని వెయ్యికళ్లతో యెదురుచూస్తున్నది.

## శ్రీ ని వా స రా వు గా రు

వ్యావహారికభాషామహోద్యమానికి తగువిధంగా కవితారచనారూపంగా మరి కొంతబలాన్ని చెప్పకుండానే చేకూర్చడంలో ప్రత్యేకపాత్ర వహించినవారు శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావుగారు. వీరు ఆధునికాంధ్ర కవితాలోకంలో విప్లవయుగానికి నాందీప్రస్తావన చేసి తానై ప్రముఖపాత్ర వహించిన వైతాళికులు. వీరు 2–1–1910 న జన్మించారు. బి. ఏ. ప్యాసయ్యారు. వీరిమహాప్రస్థానాన్ని - ముఖ్యంగా మరోప్రపంచ మహాగేయాన్ని ఆంధ్రజాతి గుర్తించినట్లు వీరి కథారచనలో ప్రత్యేకంగా గోచరించే యితర రచయితల్లోలేని ఒకవిధమైన "టెక్నిక్" ను గుర్తించలేకపోయింది. మామూలు అభ్యుదయ కవులవంటి కవికాక ప్రత్యేకమైన పాండిత్యం ప్రతిభ వున్న కవి అవ్వడంచేత శ్రీ శ్రీనివాసరావుగారికి భాషమీద ఒక విశిష్టమైన అధికారం వున్నట్లు కనిపిస్తుంది. ఆ అధికారంకూడా భావంలాగానే విప్లవాత్మకం అవ్వడంచేతనే యెవ్వరూ త్రోసిరాజనలేని విశిష్టస్థానాన్ని శ్రీ శ్రీనివాసరావుగారు సంపాదించుకొన్నారు. వీరుకూడా ధర్మారావుగారివలెనే మద్రాసులోవుంటూ సినీమాలకు పాటలు మాటలు వ్రాస్తున్నారు.

# వ్యావహారికభాషా వ్యాకరణం

## సంజ్ఞాపరిచ్ఛేదం

ఆంధ్రప్రభ కెడిటరుగా
ఆంధ్రజనవ్యావహారికామరవాక్కి
తంధ్రా న్నలంకరిస్తూ
ఆంధ్రప్రభయైన నార్ల నభినందిస్తా॥

ఆంధ్రభాషకు వర్ణాలు యాభైనాలుగు. ౧

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఎ ఏ ఐ ఏా ఒ ఓ ఔ అం అః. క ఖ గ ఘ ఙ చ చ ఛ జ జ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ ఫ బ భ మ య ర ల వ శ ష స హ ళ.

ఏా ఇది తాటి ; అరటి వంటిచోట్ల ఇత్వ అత్వాల సంధిలోవచ్చే విశిష్టస్వరం. ఆకార ఏకారాల అంశతో తత్స్వరద్వయ మధ్యస్థంగా ఉచ్చరింపబడుతుంది. తాటోంకు - దీనికి హల్లులమీద గుణింతం యిలావుంటుంది.

కేా గేా చేా జేా టేా డేా ణేా
తేా దేా నేా పేా ఫేా బేా మేా
యేా రేా లేా వేా శేా షేా హేా ళేా

మొదలైనవి. తక్కిన మహాప్రాణాదుల కే స్వరసంయోగం సామాన్యంగా వుంటదు. ఫ ఇది దంత్య ఓష్ఠ్యమైన విశిష్టోచ్చారణగల హల్లు. అన్యదేశభాషాపదాలతో కూడి తెలుగులో ప్రవేశించింది. దీనికి ప్రాణయోగంలో గుణింతం యిలావుంటుంది.

ఫ ఫా ఫి ఫీ ఫు ఫూ
ఫె ఫే ఫై ఫొ ఫో ఫౌ

మీద ఉదాహరణలవల్ల స్పష్టపడుతుంది.

అచ్చులు హల్లులు ఉభయాలని వర్ణాలు త్రివిధాలు. ౬

అకారాదులు పదిహేనూ అచ్చులు. ౭

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఎ ఏ ఐ ఒ ఓ ఔ.

ఈ పదిహేనూ అచ్చులు. వీటినే ప్రాణాలని స్వరాలని వ్యవహరిస్తారు.

కకారాదులు ముప్పైయేడూ హల్లులు. ౮

క ఖ గ ఘ ఙ చ ౘ ఛ జ ౙ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ
భ ఱ మ య ర ల వ శ ష స హ ళ.

ఈ ముప్పైయేడూ హల్లులు. వీటిని వ్యంజనాలనికూడా వ్యవహరిస్తారు. సహజంగా స్వరయుతాలైన హల్లుల్ని ప్రాణులనికూడా వ్యవహరిస్తారు. వర్ణసమామ్నాయంలోవున్న కకారాదుల్లోని అకారం ఉచ్చారణ సౌకర్యార్థం చెప్పబడింది.

అనుస్వార విసర్గలు ఉభయాలు. ౯

ం ఇది అనుస్వారం. ః ఇది విసర్గ. హల్లులమీదవుంటే వీటిమీద అచ్చు నిలువదు కాబట్టి యివి అచ్చులు - హల్లుల్లాగానే అచ్చుల సహాయం లేకుండా వీటిని ఉచ్చరించలేం కాబట్టి యివి హల్లులు. అంతేగాదు. ఈ అనుస్వార విసర్గలు అచ్చులకు పరమవుతుంటే అచ్చుకచ్చు పరమైనప్పుడు జరిగేసంధికార్యాలేమీ జరుగవు. అందువల్లకూడా వీటిని హల్లులుగా పరిగణిస్తారు. అనుస్వారానికి బిందువని సున్న అనీ మారుపేర్లు. విసర్గను విసర్జనీయం అనికూడా వ్యవహరిస్తారు. కకారానికి పూర్వంలోవున్న విసర్గను జిహ్వామూలీయమని, పకారానికి పూర్వంలోవున్న విసర్గను ఉపధ్మానీయమని అంటారు. సున్న తుది అత్వానికి దీర్ఘం వైకల్పికం. సున్నా - సున్న - సున్నాలు - సున్నలు - సున్నాకు - సున్నకు.

ఉ పూపధ్మానీయాలు ఓష్ఠ్యాలు. ౧౫

ఉ ఊ ప ఫ బ భ మ లకు పకారానికి పూర్వంలోవున్న అర్ధవిసర్గకు స్థానం ఓష్ఠాలు - మనఃపద్మం - పయఃపానం.

ఎ ఏ ఐ లు కంఠతాలవ్యాలు. ౧౬

ఎ ఏ ఐ లకు స్థానం కంఠము తాలువులు రెండూ నని తాత్పర్యం.

ఒ ఓ ఔ లు కంఠ ఓష్ఠ్యాలు. ౧౭

ఒ ఓ ఔ లకు స్థానం కంఠం ఓష్ఠం రెండూనని తాత్పర్యం.

ఏ కారం కంఠతాలవ్యం. ౧౮

ఏకారానికి స్థానం కంఠము తాలువులు రెండూనని తాత్పర్యం.

జిహ్వామూలీయం జిహ్వామూలియం. ౧౯

కకారానికి పూర్వంలోవున్న అర్ధవిసర్గను జిహ్వామూలీయ మంటారు. దీనికి జిహ్వామూలమే స్థానం - మనఃకమలం - యశఃకాయం. జిహ్వామూలీయ ఉపధ్మానీయాలను ᳵ అన్న అర్ధవిసర్గరూపంలో వ్రాయాలంటారు - కాని తరచుగా విసర్గే వ్రాతల్లో కనిపిస్తుంది.

ఫ్వ వ లు దంత ఓష్ఠ్యాలు. ౨౦

ఫ్వ కార వకారాలకు స్థానం దంతాలు ఓష్ఠాలు రెండూనని తాత్పర్యం.

ఙ ఞ ణ న మ అనుస్వారాలు నాసిక్యాలు. ౨౧

ఙ ఞ ణ న మ సున్నాలకు స్థానం నాసిక.

య ర ల వ లంతస్థలు. ౨౨

శ ష స హ లూష్మలు. ౨౩

వర్గాక్షరాలు స్పర్శలు. ౨౪

కకారం మొదలు మకారంవరకూ ఉన్న హల్లులను స్పర్శలని అంటారు.

కాదు లైదైదు కాదివర్గులు. ౧౫

క ఖ గ ఘ ఙ లకు కవర్గు
చ ఛ జ ఝ ఞ లకు చవర్గు
ట ఠ డ ఢ ణ లకు టవర్గు
త థ ద ధ న లకు తవర్గు
ప ఫ బ భ మ లకు పవర్గు

అని పేర్లు. చవర్గులో తాలవ్యచకారంచేత దంత్యచకారం తాలవ్య జకారం చేత దంత్యజకారం గ్రాహ్యం - పవర్గులో ఫకారంచేతనే యిక్కడ ఫకారానికి గ్రహణ.

క చ ట త ప లు పరుషాలు. ౧౬

క చ చ ట త ప లకు పరుషాలని పేరు.

గ జ డ ద బ లు సరళాలు. ౧౭

గ జ జ డ ద బ లకు సరళాలని పేరు.

ఇతరాలు స్థిరాలు. ౧౮

క చ ట త ప లు గ జ డ ద బ లు కానివాట్లులకు స్థిరాలనిపేరు. ఖ ఘ ఙ ఛ ఝ ఞ ఠ ఢ ణ థ ధ న ఫ ఫ భ మ య ర ల వ శ ష స హ ళ ఇవి స్థిరాలు.

క్షర స్థిరం. ౧౯

క్షకారంలోని కకారానికి ఈసూత్రంచేత స్థిరత్వం అతిదేశింపబడింది. క్షకారం కకార షకారాల సంయుక్తమే అయినా దానికి ఉండవలసిన పరుషోష్మల ఉచ్చారణం నశించి ఒక విలక్షణమైన స్థిరోచ్చారణం యేర్పడింది. అందువల్లనే పరుషవర్ణం పరమవుతుంటే జరిగేసంధికార్యం క్షకారంలోని పరుషం పరమవుతుంటే జరుగదు. స్థిరత్వ అతిదేశంచేత తక్కిన స్థిరవర్ణాలు పరమైతే జరిగే సంధికార్యాలే జరుగుతాయి. త్సరువు ఇత్యాదుల్లోని పదాదిగత త్సకారం విస్పష్ట పరుషోష్మోచ్చారణం కలదే. అయినా సంధివిషయంలో యిది క్షకారం వంటిది. ఈ "త్స" కారాది పదాలు ఆంధ్రభాషా వ్యవహారంలో అప్రసిద్ధాలు. కాబట్టి ఉపేక్షణీయాలు.

వర్గప్రథమ తృతీయవర్ణాలు అచ్చులు అంతస్థలు అల్పప్రాణాలు. ౩౦

క చ ట త ప గ జ డ ద బ లను అకారాద్యచ్చులను య ర ల వ లను అల్పప్రాణాలని పేరు.

వర్గద్వితీయ తురీయ వర్ణాలు శ ష స హ లు మహాప్రాణాలు. ౩౧

తురీయవర్ణాలంటే చతుర్థవర్ణాలు - ఖ ఛ ఠ థ ఫ ఘ ఝ ఢ ధ భ లను శ ష స హ లను మహాప్రాణాలని పేరు. వీటినే ఒత్తక్షరాలనికూడా అంటారు. ప్రాణశబ్దం కేవల స్వరనిర్దేశకం - ప్రాణవిశిష్టాలైన హల్లులను ప్రాణులు అని వ్యవహరించవలెను. ప్రాణవిశిష్టాలైన హల్లులనిర్దేశంలో అల్పప్రాణులు మహాప్రాణులు అని ప్రాణి శబ్ద ప్రయోగం చేయవలసివుండగా యెందువల్లనో ప్రాచీన వైయాకరణులు ఈ రెండుచోట్ల ప్రాణశబ్దాన్నే ప్రయోగించారు. కేవలహల్ నిర్దేశంలో ప్రాణిశబ్దాన్ని వినియోగించరాదు. అటువంటి సందర్భాల్లో ప్రాణ్యాలనే పదాన్ని ఆహోబలాదులు వ్యవహరించారు. ప్రాచీనులు వర్గయుగ్మాలు శ ష స హ ల హల్మాత్ర నిర్దేశంలో సైతం మహాప్రాణమని, వర్గయుక్ శ ష స హ వర్జ హల్మాత్రనిర్దేశంలో సైతం అల్పప్రాణమని ప్రాణశబ్దాన్నే వినియోగించడం విశేషం. శ ష స హ లను పాణినీయాదుల్లో ప్రక్రియావశాత్ మహాప్రాణాలుగా వ్యవహారం మృగ్యం.

ప్రత్యేకస్వర నిర్దేశకం త్వప్రత్యయం. ౩౨

అత్వానికి ఉత్వం వస్తుంది. ఇక్కడ హ్రస్వంమీద త్వప్రత్యయప్రయోగం చేత హ్రస్వమే గ్రాహ్యం - అత్వానికి ఊత్వంవస్తుంది. ఇక్కడ దీర్ఘంమీద త్వప్రత్యయప్రయోగంచేత దీర్ఘమే గ్రాహ్యం.

అవర్ణాదులకు నిర్దేశార్థంలో తరచుగా కారప్రత్యయం చేరుతుంది. ౩౩

అకారం - ఇకారం - ఉకారం - ఆకారం - ఈకారం - ఊకారం కకారం - గకారం - వకారం - మొదలైనవి. తరచుగా అనడంచేత [illegible] కార ప్రత్యయం చేరడం ప్రశస్తంకాదు.

రకారానికి ఇఫ ప్రత్యయం బహుళం. ౩౪

రకారం - రేఫ - రేఫం. బాహుళకంచేత స్వరసహిత రవర్ణగ్రహణంలో ఇఫ ప్రత్యయం చేరదు. రేఫశబ్దం అత్వవిశిష్టరవర్ణానికిసైతం గ్రాహకమని

బడింది. తెచ్చాడు — వచ్చాను ఇత్యాదుల్లోవున్న ఏ కారధ్వని లిపిలో ఆకారరూపం తాల్చినప్పుడుకైతం దంత్యత్వం నివారించబడింది.

### ఇ ఈ ఎ ఏ పరాలున్న చ జ లు తాలవ్యాలు ౪౦

చిలుక — చీమ — చెండు — చేటు — మించేను — వంచేను — జిల — జీడి — జెఱ్ఱి — జేజే — జేన (జేన) — మొదలైనవి. ఐకారాంతాలైన చ జ లు సమేతర భాషలోలేవు. చైవులసాకిరి చాయమగడు అని ఒకకవి ప్రయోగంవున్నది. కాని అందులో దంత్యోచ్చారణే వున్నదనిగాని తాలవ్యోచ్చారణేవున్నదనిగాని యిదమిద్ధంగా నిర్ణయించలేము. జైశబ్దంలో తాలవ్యోచ్చారణే స్థిరంగావున్నది. ఇది జయశబ్దభవం — జయు — జయ్ — జై — అని దీని పరిణతి. పూర్వసూత్రంలో సాధారణశబ్ద ప్రయోగంచేత మించాను — పంచాను — వచ్చాను — తెచ్చాను — ఇత్యాదుల్లో ఏ ధ్వని లిపిలో ఆకార రూపంతాల్చినా తాలవ్యత్వాని కది భంగకరంకాదు.

### ఇత్వసంధిలో చ జ లు తాలవ్యాలు. ౪౧

ఇత్వసంధిలో ఆదేశంగా వచ్చిన అకారాదులతో కూడిన చ జ లు తాలవ్యాలేనని తాత్పర్యం — వచ్చక్కడున్నాడు — బుచ్చన్నకిచ్చింది — వచ్చుంటే — తెచ్చుంటే — అమ్మాజమ్మ - మొదలైనవి. అంజయ్య — అంజమ్మ పదాల్లో జకారం తాలవ్యంగానే కనిపిస్తున్నది. వీటికి మూలం ఆంజనేయశబ్దం.

### ఇకారాంత సంస్కృత సమపదాల వుపధా చ జ లు బహువచనం పరమైతే దంత్యాలవుతాయి. ౪౨

ఉపధ అంటే చివరి వర్ణంకంటే ముందువర్ణం - అర్చి - అర్చులు - రోచి - రోచులు - వీచి - వీచులు - రాజి - రాజులు - వాజి - వాజులు - మొదలైనవి.

### దంత్యయుక్తం రాజు శబ్దం. ౪౩

రాజుశబ్దం సంస్కృత సమమే అయినా ఇకారాంతంకాకపోయినా దానికి పరంలో బహువచనం లేకపోయినా దంత్యయుక్తంగా కనిపిస్తున్నదని తాత్పర్యం. రాజు - రాజులు - రాజును - రాజుచేత - రాజుకు.

సంబోధనాకార యుక్తం తాలవ్యయుక్తం. ౬౪

రాజుశబ్దం తక్కిన విభక్తుల్లో దంత్యయుక్తమే అయినా సంబోధనాప్రథమైక వచనంలో అకార విశిష్టమైనప్పుడుమాత్రం తాలవ్యయుక్తమే నని తాత్పర్యం. అనగా రాజా! అన్నప్పుడు జకారానికి దంత్యత్వం లేదనడం. లోకంలో "మారాజా" అన్నప్పుడు దంత్యయుక్తంగానే వ్యవహారం. ఇది మహారాజ శబ్దభవ మని గుర్తించాలి. సంబోధనాకారయుక్తం అనడంచేత - ఒరేయ్ రాజు! యిటురా! - ఇత్యాదుల్లో అకార అభావంలో తాలవ్యత్వంలేదు.

గారు వారు లు పరమైన అకారాంత రాజుశబ్దం తాలవ్య యుక్తం. ౬౫

రాజాగారు - రాజావారు. అకారాంతమనడం రాజుగారు అన్నప్పుడు దంత్యయుక్తత్వ రక్షణార్థం. వక్ష్యమాణసూత్రంచేత రాజుశబ్దానికి వారు గారులు పరమైతే ఆకారాంతత్వం నిత్యవైకల్పికంగా వస్తుంది.

అర్యాద్యర్థకాలు పరమైతే రాజుశబ్దం తాలవ్యయుక్తం. ౬౬

రాజయ్య - రాజమ్మ - రాజన్న - మొదలైనవి.

కొన్నిచోట్ల ఛ ఝ లు దేశ్యశబ్దగతాలు దంత్యాలు. ౬౭

ఛస్తున్నాడు - ఝుడుసుకున్నాడు - ఇత్యాదుల్లో ఛ ఝ లు దంత్యోచ్చారణం కలవి. - ఛస్తేవొప్పుకుంటామా? అని నార్ల ప్రయోగం - మా - 134.

దంత్య తాలవ్య చ జ లు సవర్ణాలు. ౬౮

దంత్యచకారంచేత తాలవ్యచకారం, తాలవ్య చకారంచేత దంత్యచకారం, దంత్యజకారంచేత తాలవ్య జకారం, తాలవ్యజకారంచేత దంత్యజకారం పరస్పరం గ్రహింపబడుతుందని తాత్పర్యం. సంధివిషయంలో సమ సమేతర చ జ ల పరస్పర గ్రహణార్థం యీసూత్రం. సంస్కృతసంధిలో అసంస్కృతాలకు గ్రహణలేదు.

ష శ లు సవర్ణాలు. ౬౯

సమేతర సంధిలో షకారంచేత శకారం శకారంచేత షకారం గ్రాహ్యమని తాత్పర్యం.

నకారం ద్రుతం. ౫౦

ద్రుతాంతాలయిన పదాలు ద్రుతప్రకృతికాలు. ౫౧

ప్రథమా కయినట్టి యొక్కేతరాలయిన విభక్తులు - ఉత్తమపురుషైక వచనాలు త్రిపురుషైక బహువచన వ్యవహారానుప్రయుక్త తద్ధర్మార్థక ఉండు - వచ్చు ధాతువులు - శతృప్రత్యయాంతాలు - అన్నంతాలు - అప్యాద్యర్థకాలు - నేను తాను పదాలు - వలె ప్రభృతులు ద్రుతప్రకృతికాలు. వీటికి హలవసానాలు అజాది పదాలు పరమైతే తరచుగా ద్రుతలోపం వక్ష్యమాణసూత్రంచేత గ్రాహ్యం. అపవాద్యమైన అచ్చు పరమైతే ద్రుతానికి లోపం తరచుగాలేదు. వేసుకుని - నాచేత నాతోడ - నాకొరకు - నావలన - నాకంటె - నాకు - మాలోపల మాయందు - వస్తాను - వచ్చాను - వస్తున్నాను - బాగుండును - కొట్టవచ్చును - లేవచ్చును - వస్తూ - తెస్తూ - ఇక్కడ ద్రుతలోపం పూర్వస్వరానికి దీర్ఘం - కొట్టగా - తిట్టగా - పెట్టగా - కొట్టినా - తిట్టినా - పెట్టినా - ఇక్కడకూడా ద్రుతలోపం పూర్వస్వరానికి దీర్ఘం - దానివలె - దానిలాగ మొదలైనవి ఊహ్యాలు.

అపవాద్యమైన అచ్చు పరమైతే అడగ్గానే - దానివల్లనే - దానిలాగానే - నాతోనేఅన్నాడు - నాచేతనే చేయించాడు - మనలోనే స్తుతికి - ఇత్యాదుల్లో ద్రుతానికి లోపంలేదు.

ద్రుతప్రకృతులుకాని పదాలు కళలు. ౫౨

బుద్ధుడు - బుద్ధులు - వర్గము - గుర్రం - విష్ణువు - ధేనువు - మేక - గోవ - అయ్యో - అమ్మ - బుద్ధునికై - జ్ఞానంబట్టి - నాయొక్క - వచ్చారు - వచ్చాము - వస్తారు - వస్తాము - వస్తున్నారు - వస్తున్నాము - రాడు - రాదు - రాను - రావు - రాము - కొట్టక - తిట్టక - ఊరికే - మిన్నక - భళి - అరరే - అయ్యో! మొదలైనవి ఊహ్యాలు.

ఫ కారంకల పదాలు అన్యదేశ్యాలు. ౫౩

ఫర్లాంగు - ఫస్టు - ఫారం - ఫిల్ము - రాఫీ - సోఫా - ఫ్లాటు - ఫ్రెంచి - సఫేదు - ఫ్రేము - ఫేక్టరి - ఫైరు - ఫోర్‌మెన్ - ఫౌండరీ - ఇత్యాది పదాలు అన్యదేశ్యాలు.

| తత్సమం | తద్భవం |
|---|---|
| ఆకాశః | ఆకసం |
| అలిః | ఓలి |
| కటుః | కారం |
| కుడ్యమ్ | గోడ |
| గౌరవమ్ | గారవం |
| చంద్రమస్ | చందమామ |
| జటా | జడ |
| తామరసమ్ | తామర |
| నిభః | నెవం |
| మీరా | మేర |
| ముఖమ్ | మొకం<br>మొగం<br>మొఖం<br>మొహం |
| రాజ్ఞీ | రాణి |
| వక్రః | వంకర |
| శృంగారః | సింగారం |
| శ్రీ | సిరి |
| సూచీ | సూది |
| హరణమ్ | అరణం |

మొదలైనవి గ్రాహ్యాలు.

మనప్రాచీన వ్యాకరణకర్తలు ప్రాకృత సమ భవాలను ప్రత్యేకంగా పరిగణించారు. సంస్కృత సమ దేశ్యేతరమైన భాషను సంస్కృతభవంగానే గణన రాబట్టి వ్యాకరణశాస్త్రంలో పృథక్పరిగణనవృథా — చరిత్రకేగాని శాస్త్రానికి అటువంటి పృథక్పరిగణనతో పనిలేదు.

ఆంధ్రదేశ వ్యవహార సిద్ధమైన భాష దేశ్యం. ఉదా

ఊరు - పేరు - ఇల్లు - ముల్లు - కోట - పేట - దూడ - మేడ - కోత - లేత - తావి - మోవి - మొదలైనవి.

ఇతర దేశభాషాపదాలు ఆంధ్రదేశ వ్యవహార ప్రసిద్ధాలు అన్య దేశ్యాలు. ౫౮

టర్కీ - అరబ్బీ - పర్షియా మొదలైన భాషల పదాలు అనేకాలు హిందూస్థానీద్వారా తెలుగులో ప్రవేశించాయి. ఇంగ్లీషు పదాలు వేలకొలది దేశకాల పరిస్థితుల కనుగుణంగా మన భాషా స్రవంతిలో లీనమయ్యాయి. ఆ యా భాషల్లోంచి ప్రవేశించి తెలుగులో కించిత్పరిణామంతో శిష్టులు వ్యవహరిస్తున్న పదజాలంలోంచి కొన్ని ఉదాహృతా లవుతున్నాయి.

అంబారి - జీను - స్వారి - బాబా - సగటు - బాతు - బొప్పాయి - బత్తాయి- బటాని - జాజి - గులాబి - పట్టా - మామూలు - మాగాణి - బంజరు - పోరంబోకు - దాఖలా - తహశీలి - అంచనా - అపరాలు - జిరాయితీ - మహజరు - ఖుద్దాయి - బందిఖానా - బందిలీదొడ్డి - బందీలదొడ్డి - ఫర్మానా - ఫిర్యాదు - పితూరీ - పారికత్తు - నౌకరి - దివాని - దివాను - దావా - దస్తావేజు - దస్తరం - దస్త్రం - దస్కత్ - దివాను - దర్యాప్తు - తాపేదారు - తాఖీదు - తహశీల్దారు - తనిఖీ - తగాదా - అమలు - ఇలాకా - కిస్తీ - గస్తీ - అర్జీ - ఖజానా - ఖైదు - ఖైదీ - గుమాస్తా - జప్తు - జమాబంది - జామీను - జుల్మానా - టపా - పటేలు - పహరాలు - వాయిదా - వారసు - హక్కు - హోదా - షరతు - షరాబు - సిరస్తాదారు - సిస్తు - దర్జీ - తాపీ - కసాయి - కార్ఖానా - లంగరు - మేజా - భరంతు - బంగళా - పంకా - పాయిఖానా - తనాఖి - అలమారు - కుర్చీ - చప్టా - మసాలా - పలావు- బక్షీ- హల్వా - కసరత్ - పస్తాదు - పైల్మాను - మొహమల్ - కుర్పా-పరాయి - లాగు-రుమాలు - జల్తారు - బురఖా-గలీబు - లంగోటి-రజాయి - మామూలు - మోటు - ముద్దతు - భర్తీ - బేజారు - పైసలా - పురాతు - దాఖలా - ఖులాసా - దర్జా - తాహత్ - ఖర్చు - ఖాయం - ఖరాబ్ - హంగామా - షుమారు - బోణీ - ఖిమా - ఖజానా - బజారు - బరాయ్ - బాకీ - సగటు - ఫరాపతు - ఖాతా - కిరానా - కిరాయి - చిట్టా - ఆవర్జా - లావాదేవి - హుండీ - షాహుకారు - కాగితం - సిరా - దస్తూరి - కలం - చిరునామా - షరా - జాబు - మహలు - దర్వాజా - దేవిడీ - సర్దార్ - సుబేదార్ - సాలు - కొష్ఠం - రాస్తా - నగారా - బాజా - నౌబతు - అత్తరు - బుర్కా - ముర్కా - మసీదు - బస్తీ - ఫిర్కా - పేర్లు - సమాజు - దగుల్బాజీ - ఖామందు - సఫేదు - బావుటా - ఫిరంగి - లడాయి - సిపాయి - షతాబు - చలాయించు - మిలాయించు - టలాయించు - బనాయించు - విడాయించు - ఫిరాయించు - పస్తాయించు - రైలు - మోటారు -

# వ్యావహారికభాషా వ్యాకరణం

## సంధిపరిచ్ఛేదం

అవ్యవహితశబ్దద్వయంమధ్య కలిగే మార్పు సంధి. ౧

అవ్యవహితమనగా వ్యవధానం లేకుండడం - ఆగమ ఆదేశాదిరూపకమైన ఈసంధి అజ్ఝల్లులకు రెండింటికీ వర్తిస్తుంది. అజ్ఝల్లులంటే అచ్చులు హల్లులు. ఒక అక్షరానికి పూర్వానగాని పరానగాని అధికంగా ఒకఅక్షరం వచ్చిచేరడం ఆగమం. ఒక అక్షరస్థానంలో మరొక అక్షరం రావడం ఆదేశం.

అత్వానికి అచ్చు పరమైతే సంధి బహుళం. ౨

సంధి అనగా అచ్చులసంధిలో తరచుగా పరరూపసంధి గ్రాహ్యం. తరచుగా అనడంచేత కొన్నిచోట్ల పూర్వరూపసంధికూడా కలదని తాత్పర్యం. పరరూపం అనగా పూర్వపరస్వరాలకు పరస్వరం ఒక్కటే ఆదేశంగా రావడం - ప్రవృత్తి - అప్రవృత్తి - విభాష - అన్యత్కార్యం - అని బహుళం నాల్గువిధాలు. ప్రవృత్తి అనగా నిత్యం - నిత్యమంటే చెప్పినకార్యం తప్పకుండా జరగడం. అప్రవృత్తి అంటే అసలు జరక్కుండా ఉండడం - ఒకసారి జరిగి మరొకసారి జరక్కపోవడం, అసలు జరక్కపోవడం విభాష - ఏదో కొత్తకార్యం జరగడం అన్యత్కార్యం.

| | | | | |
|---|---|---|---|---|
| రాము | .... | అయ్య | .... | రామయ్య |
| సీత | .... | అమ్మ | .... | సీతమ్మ |
| మేన | .... | అత్త | .... | మేనత్త |
| పెద్ద | .... | అత్త | .... | పెద్దత్త |
| యెఱ్ఱ | .... | ఆవు | .... | యెఱ్ఱావు |

| | | | | |
|---|---|---|---|---|
| నల్ల | .... | ఎద్దు | .... | నల్లెద్దు |
| తామర | .... | ఆకు | .... | తామరాకు |
| చింత | .... | ఆకు | .... | చింతాకు |
| గంప | .... | అంత | .... | గంపంత |
| అంత | .... | ఏసి | .... | అంతేసి |
| చేసిన | .... | అటువంటి | .... | చేసినటువంటి |

ఇత్యాదుల్లో సంధి నిత్యం.

| | | | | |
|---|---|---|---|---|
| అమ్మ | .... | ఇచ్చింది | .... | అమ్మిచ్చింది<br>అమ్మయిచ్చింది |
| మాత | .... | ఏది | .... | మాతేది<br>మాతయేది |

ఇత్యాదుల్లో సంధి విభాష.

| | | | | |
|---|---|---|---|---|
| ఒక | .... | ఒక | .... | ఒకానొక |

ఇక్కడ అన్ అనేది పూర్వస్వరానికి ఆదేశంగా రావడం అన్యత్కార్యం. బాహుళకంచేత వెలయాలు మొదలైనవాటిల్లోను సంబోధనలోను సంధిరాదు. ఏమిటిరా కృష్ణ! అలా వున్నావు? వంటివి వ్యావహారికాలు. చెరొక్క పినా దొక్కడడం లేదు - చెమటోడ్చడమే – మా – 26

ఇత్వాని కచ్చుపరమైతే సంధి బహుళం. 3

| | | | | |
|---|---|---|---|---|
| లక్ష్మి | .... | అమ్మ | .... | లక్ష్మమ్మ |
| భారతి | .... | అమ్మ | .... | భారతమ్మ |
| గౌరి | .... | అమ్మ | .... | గౌరమ్మ |
| ఏమి | .... | అన్నాడు | .... | ఏమన్నాడు |
| మరి | .... | ఏమిటి | .... | మరేమిటి |
| బండి | .... | ఎక్కు | .... | బండెక్కు |
| పెళ్ళి | .... | ఎక్కడ | .... | పెళ్ళెక్కడ |
| అనతి | .... | ఇవ్వు | .... | అనతివ్వు |
| వెండి | .... | ఏది | .... | వెండేది |
| పొయ్యి | .... | ఎక్కించు | .... | పొయ్యెక్కించు |
| నెయ్యి | .... | ఉన్నది. | .... | నెయ్యున్నది |
| తెలివి | .... | ఎంత | .... | తెలివెంత |

| | | | | |
|---|---|---|---|---|
| బంతి | .... | అదిగో | .... | బంతదిగో |
| అది | .... | ఏమిటి | .... | అదేమిటి |
| ఇది | .... | ఎందుకు | .... | ఇదెందుకు |
| ఏది | .... | అక్కడ | .... | ఏదక్కడ |
| పుచిటి | .... | ఆలు | .... | పుచిటాలు |
| మగని | .... | ఆలు | .... | మగనాలు |
| గంగి | .... | ఎద్దు | .... | గంగెద్దు |
| కొబ్బరి | .... | ఆకు | .... | కొబ్బరాకు |
| మామిడి | .... | ఆకు | .... | మామిడాకు |
| హరి | .... | ఇచ్చాడా | .... | హరిచ్చాడా |
| శౌరి | .... | ఉన్నాడు | .... | శౌరున్నాడు |
| చించి | .... | ఇచ్చింది | .... | చించిచ్చింది |
| తెచ్చి | .... | ఉంచింది | .... | తెచ్చుంచింది |

లక్ష్మ్యాదులకు సంధినిత్యం - ఏమ్యాదులకు సాధారణంగా విభాషగా సంధి జరుగుతుంది. సాధారణశబ్దంచేత కొన్నిచోట్ల నిత్యసంధి సూచింపబడింది.

| | | | | |
|---|---|---|---|---|
| ఆది | .... | అమ్మ | .... | ఆదెమ్మ |
| సోది | .... | అమ్మ | .... | సోదెమ్మ |
| చిట్టి | .... | అయ్య | .... | చిట్టెయ్య |
| పొట్టి | .... | అమ్మ | .... | పొట్టెమ్మ |
| బుల్లి | .... | అన్న | .... | బుల్లెన్న |

ఇత్యాదుల్లో సంధిలో పూర్వపరస్వరాలకు ఎత్వాదేశం అన్యత్కార్యమని గ్రహించవలెను.

| | | | | |
|---|---|---|---|---|
| తాటి | .... | ఆకు | .... | తాటే కు |
| మర్రి | .... | ఆకు | .... | మర్రేకు |
| కర్రి | .... | అవు | .... | కర్రే వు |
| వెర్రి | .... | అమె | .... | వెర్రేమె |

ఇత్యాదుల్లో పూర్వపరస్వరాలకు వచ్చిన ఏకస్వరాదేశం బాహుళకంచేతనే నని గుర్తించవలెను.

ఏదైనా ఎక్కువ నలుపైతే అది కారినలుపు — పి—76 — తెములుతుందను కొండి—మా—27 — ఏమైనా కృతికర్త ప్రశంసలోనే — మా—34 — సిట్టెమ్మగారు

ఇక - ఇంక - ఇగ - ఇంగ - అక్కడ - ఇక్కడ - ఎక్కడ - మీద - బైట - పైని - నన్ను - నిన్ను - తన్ను - తనను - మమ్ము - మిమ్ము - తమ్ము - అంత - ఇంత - ఎంత - ఇత్యాదు లికాదులు. ఇకాదుల తుదిస్వరం ఐదమిత్తమని నిర్దేశించనందువల్ల అకార ఇకారాది స్వరాంతపదాల పరిగ్రహణ ప్రకాశం లభించింది. అక్కడొక పంక్తిలోను, ఇక్కడొక పద్యంలోను వెల్లువిరే ఇత్వం - మా — 30 — నన్నేమిచావమంటావయ్యా — కొ — 27 —

ప్రథమేతర విభక్తుల్లోవున్న ఇత్వఉత్వాలకు సంధివిభాష. ఉ

| | | | | | |
|---|---|---|---|---|---|
| రాముడిని | .... | అడిగాను | .... | } | రాముడినడిగాను<br>రాముడిని అడిగాను |
| రాముణ్ణి | .... | అడిగాను | .... | } | రాముణ్ణడిగాను<br>రాముణ్ణి అడిగాను |
| కృష్ణుణ్ణి | .... | అన్నాను | .... | } | కృష్ణుణ్ణన్నాను<br>కృష్ణుణ్ణి అన్నాను |
| పుస్తకాన్ని | .... | ఇమ్మన్నాడు | .... | } | పుస్తకాన్నిమ్మన్నాడు<br>పుస్తకాన్నియిమ్మన్నాడు |
| గోవును | .... | ఇచ్చాడు | .... | } | గోవునిచ్చాడు<br>గోవును ఇచ్చాడు |
| నాకు | .... | ఆశ | .... | } | నాకాశ<br>నాకు ఆశ |
| నీకు | .... | ఇష్టం | .... | } | నీకిష్టం<br>నీకు ఇష్టం |
| నాయందు | .... | అభిమానం | .... | } | నాయందభిమానం<br>నాయందు అభిమానం |

ఇత్యాద్యుదాహార్యాలు

మనకు ఎన్ని " అప్టిషియన్" చావు తీర్చదేవిరావు ? ఈనాడు మనవుంటే.... [illegible]చేసినావా ? — మా — 29 —చేతికెంతొస్తే — కొ — 24 —ఎందుకలా అడుస్తున్నావ్ ? — కొ — 14 —

అచ్చుతామ్రేడితం పరమైతే సంధి తరచుగా వస్తుంది. ఉ కృత్యాద్యర్థాల్లో పరరూపం ఆమ్రేడితం.

| | | | | |
|---|---|---|---|---|
| అబ్బ | .... | అబ్బ | .... | అబ్బబ్బ |
| ఔర | .... | ఔర | .... | ఔరౌర |

| | | | | |
|---|---|---|---|---|
| ఆహా | .... | ఆహా | .... | ఆహాహా |
| అనగా | .... | అనగా | .... | అనగనగా |
| ఏది | .... | ఏది | .... | ఏదేది |
| ఏమిటి | .... | ఏమిటి | .... | ఏమిటేమిటి |
| అడిగి | .... | అడిగి | .... | అడిగడిగి |
| అరచి | .... | అరచి | .... | అరచరచి |
| ఎట్టా | .... | ఎట్టా | .... | ఎట్టెట్టా |
| ఓహో | .... | ఓహో | .... | ఓహోహో |
| అయ్యో | .... | అయ్యో | .... | అయ్యయ్యో |
| అదిగో | .... | అదిగో | .... | అదిగదిగో- |

మొదలైనవి.

త్ర్యాదిఅనడంచేత అయ్యయ్యయ్యో! - అబ్బబ్బబ్బబ్బ! - ఓహోహోహో - ఓహోహోహోహో. ఇత్యాదులు గ్రాహ్యాలు. తరచుగా అనడంచేత హేళన నిర్లక్ష్యాద్యర్థస్ఫోరక ఆమ్రేడితానికి సంధివైకల్పికం. ఓహో ఓహో యెంతగొప్పవాడండి. ఆహా ఆహా యెంతమంచివిషయం చెప్పారండి. ఏదీ ఏదీ మళ్ళీఅనుఆమాట. ఔర! ఔర! చిన్నా పెద్దా లేకుండా యెంతమాటన్నావురా భడవా? అయ్యో అయ్యో అట్లాకొడతారేమండి? అబ్బ అబ్బ యెంత అందంగా వుంది. ఆహా ఆహా యెంతరుచిగావుంది. మొదలైనవి.

ఆది శబ్దంచేత క్రోధ ఆశ్చర్య కరుణ సంతృప్తి తన్మయత్వ ప్రశంసాదులు గ్రాహ్యాలు. సంధి విధానసామర్థ్యంవల్ల అజాదిపద ఆమ్రేడితాలకే గ్రహణ. సంబోధనాంతాలకు సంధిలేదు కాబట్టి అమ్మా! అమ్మా! అన్నంపెట్టు ఇత్యాదుల్లో సంధి జరుగదు. అన్నా అన్నా యెంతపని చేశాడు - అన్నన్నా యెంతపనిచేశాడు - ఇక్కడ సంబోధన వివక్ష లేనందువల్ల సంధివైకల్పికం - అన్నా! అన్నా! నామాట మన్నించవూ? ఇక్కడ సంబోధన వివక్ష ఉన్నందువల్ల సంధిరాదు.

అబ్బబ్బబ్బబ్బఅని అంటుంది — మా — 114 —

అపదాదిస్వరం పరమైతే అచ్చుకు సంధినిత్యం. ౮

| | | | | |
|---|---|---|---|---|
| మూర | .... | ఎడు | .... | మూరెడు |
| బెత్త | .... | ఎడు | .... | బెత్తెడు |
| వీసె | - | ఎడు | .... | వీసెడు |

| | | | | |
|---|---|---|---|---|
| జాన | .... | ఎడు | .... | జానెడు |
| అర్థ | .... | ఇంచు | .... | అర్థించు |
| నిర్జ | .... | ఇంచు | .... | నిర్జించు |
| రెండు | .... | ఓ | .... | రెండో |
| మూడు | .... | అవ | .... | మూడవ |

రెండవది - రెండోది - మూడవది - మూడోది - నాల్గవవాడు - నాల్గోవాడు - మొదలైనవి. స్వర్గానికి బెత్తెడు ఎడంగా — మూ — 131 — మూడో ప్రశ్నకు జవాబుచెప్పి — మూ — 22 — నాల్గోదానికి ఏలు కలిగించలేదని — మూ — 22 —

సంధిలేనపుడు అచ్చుకు పరమైన అ ఆ ఐ లకు, పూర్వంలో యకారాగమం బహుళంగా వస్తుంది. ౯

| | | | | |
|---|---|---|---|---|
| మా | .... | అమ్మ | .... | మా అమ్మ<br>మా యమ్మ |
| మీ | .... | ఆవిడ | .... | మీ ఆవిడ<br>మీ యావిడ |
| మా | .... | ఆయన | .... | మా ఆయన<br>మా యాయన |
| ఎంతసౌందర్యరాశి.... | | ఐనా | .... | ఎంతసౌందర్యరాశిఐనా<br>ఎంతసౌందర్యరాశియైనా |

ఇత్యాదులు.

మాయమ్మ - మాయక్క-వంటివి కొన్ని తరచుగా అశిష్టజన వ్యవహృతాలు. మీయావిడ - మా యాయన వంటివి శిష్టజన వ్యవహారంలోను ఉన్నాయి - నా నీ శబ్దాలకు అయ్యాదులు పరమైనపుడు యకారాగమంవస్తే దూషణాది దుత్సార్థస్ఫోరకమవుతుంది. కాబట్టి అటువంటిచోట్ల యకారాగమం బాహుళకంచేత నిషిద్ధమైనది.

| | | | | |
|---|---|---|---|---|
| నా | .... | అయ్య | .... | నా అయ్య |
| నా | .... | అమ్మ | .... | నా అమ్మ |
| నా | .... | అక్క | .... | నా అక్క |
| నీ | .... | అయ్య | .... | నీ అయ్య |
| నీ | .... | అమ్మ | .... | నీ అమ్మ |
| నీ | .... | అక్క | .... | నీ అక్క |

ఆమ్ప్రత్యయాలు పరంగాకల నా శబ్దానికి విస్తృత వ్యవహారం లేదు. అనగా శిష్టప్రయోగంలోనే నిషేధగ్రహణం ముఖ్యమని తాత్పర్యం.

అది అవి శబ్దాల అత్వానికి వృత్తిలో పూర్వరూపం నిత్యం. ౧౦

వృత్తిలో అంటే సమాసంలోనని అర్థం. పూర్వరూపం అనగా పూర్వాక్షరానికి పరాక్షరానికి - పూర్వాక్షరం ఒక్కటే - ఆదేశంగా రావడం.

| | | | | |
|---|---|---|---|---|
| నాయొక్క | .... | అది | .. | నాది |
| నాయొక్క | .... | అవి | .... | నావి |
| మాయొక్క | .... | అది | .... | మాది |
| మాయొక్క | .... | అవి | .... | మావి |
| నీయొక్క | .... | అది | .... | నీది |
| నీయొక్క | .... | అవి | .... | నీవి |
| మీయొక్క | .... | అది | .... | మీది |
| మీయొక్క | .... | అవి | .... | మీవి |
| తనయొక్క | .... | అది | .... | తనది |
| తనయొక్క | .... | అవి | .... | తనవి |
| మనయొక్క | .... | అది | .... | మనది |
| మనయొక్క | .... | అవి | .... | మనవి |
| రాముడియొక్క | .... | అది | .... | రాముడిది |
| రాముడియొక్క | .... | అవి | .... | రాముడివి |
| వారియొక్క | .... | అది | .... | వారిది |
| వారియొక్క | .... | అవి | ... | వారివి |
| విఠల్ యొక్క | .... | అది | .... | విఠల్ది |
| విఠల్ యొక్క | .... | అవి | .... | విఠల్వి |
| గఫర్ఖాఁయొక్క | .... | అది | .... | గఫర్ఖాఁది |
| గఫర్ఖాఁయొక్క | .... | అవి | .... | గఫర్ఖాఁవి |
| మోహాఁయొక్క | .... | అది | .... | మోహాఁది |
| జగదీశ్యొక్క | .... | అవి | .... | జగదీశ్వి |
| వచ్చే | .... | అది | .... | వచ్చేది |
| తెచ్చే | .... | అవి | .... | తెచ్చేవి |

రెండో .... అది .... రెండోది

మూడో .... అది .... మూడోది

ఇత్యాదులూహ్యాలు.

సూత్రంలో అచ్చులకు పరమైనప్పుడనిగాని హల్లులకు పరమైనప్పుడనిగాని ప్రత్యేకంగా స్వరహల్‌నిర్దేశం చేయనందువల్ల అజ్ఝల్లులు ఉభయమూలూ సంగృహీతా లయినాయి.

బాహుళకంచేత వచ్చేది-వచ్చేవి-చేసేది-చేసేవి-చూచేది-చూచేవి- ఇత్యాదుల్లోను, తెల్లది-తెల్లవి-కవిది-కవివి-రవిది-రవివి-వాడిది- వాడివి-వానిది - వానివి - వారిది-వారివి-ఎవరిది-ఎవరివి-గట్టిది-గట్టివి-ఓటిది-ఓటివి- ఇత్యాదుల్లోను పూర్వరూపం నిత్యం-

రావు....అది.... } రావుది / రావది

ఆడు....అది.... } ఆడుది / ఆడది

ఇత్యాదుల్లో పూర్వరూపవైకల్పికత్వం బహుళ గ్రహణంచేతనేనని గ్రహించవలెను.

కర్త్రర్థ ఏవర్ణాంతానికి అచ్చుపరమైతే పూర్వరూపం వైకల్పికంగాకనిపిస్తున్నది. ౧౧

వచ్చే .... అప్పుడు .... వచ్చేప్పుడు

తెచ్చే .... అతను .... తెచ్చేతను

వక్ష్యమాణవిధిచేత పాక్షికంగా టవర్ణాగమం.

కర్త్రర్థ ఏవర్ణాంతానికి అచ్చుపరమైతే టవర్ణాగమం విభాషగా కనిపిస్తున్నది. ౧౨

వచ్చేటప్పుడు — వచ్చేప్పుడు

తెచ్చేటప్పుడు — తెచ్చేప్పుడు

కొట్టేటప్పుడు — కొట్టేప్పుడు

ఇల్లుశబ్దంపరమైతే పుట్టినమెట్టినల నవర్ణానికిలోపం వైకల్పికం. ౧౩

లోపపక్షంలో బహుళగ్రహణంచేత ఇత్వసంధి నిత్యం - లోపఅభావ పక్షంలో అత్వసంధి.

| | | | |
|---|---|---|---|
| పుట్టిన .... | ఇల్లు .... | } | పుట్టిల్లు<br>పుట్టినిల్లు |
| మెట్టిన .... | ఇల్లు .... | } | మెట్టిల్లు<br>మెట్టినిల్లు |

అచ్చుపరమైతే కురు చిరు కడు నడు నిడు శబ్దాల రడలకు ద్విరుక్తటకారం ఆదేశమవుతుంది. ౧౪

| | | | | |
|---|---|---|---|---|
| కురు | .... | ఉసురు | .... | కుట్టుసురు |
| చిరు | .... | ఎలుక | .... | చిట్టెలుక |
| కడు | .... | ఎదురు | .... | కట్టెదురు |
| నడు | .... | ఇల్లు | .... | నట్టిల్లు |
| నిడు | .... | ఊరుపు | .... | నిట్టూరుపు |

కురుచ - చిరుత - నిడుదల తుదివర్ణాలు విలుప్తంకాగా ఏర్పడినవి కురు చిరు నిడులు - రడలకు టాదేశమైన తరువాత ఉత్వసంధినిత్యం - చిట్టడవి ఇత్యాదుల్లో చిరుకు మారుగా చిట్టిశబ్దమే పూర్వపదమని కొందరు భావిస్తారు. చిట్టడవి-చిట్టామాదం - చిట్టెలుక - చిట్టుడుకు - చిట్టిచాప - చిట్టితాళం ఇత్యాదుల్లో పూర్వపదం చిట్టిగాకనిపిస్తున్నదని ఉదాహరిస్తారు. చిరుచేను - చిరుతిండి - చిరునవ్వు - చిరుకోపం - చిర్రావూరి - (చిరురావూరి) వంటి చోట్ల చిరుశబ్దంసైతం వ్యవహారంలో ఉన్నది. చిట్టిశబ్దాన్నే పరిగ్రహిస్తే అచ్చుపరమైతే ఇత్వసంధి నిత్యమని గుర్తించాలి. చిరుతిండికోసం యెంత ఆరాటపడతారో - మా - 19 - దోమలు దూరని చిట్టడవులదువెళ్లి - మా 32 - తెలిపోతే నిట్టూర్పు - మా 47 -

ప్రథమమీది కతపలకు గదవలు బహుళం. ౧౫

| | | | |
|---|---|---|---|
| సంపద .... | కల .... | } | సంపదగల<br>సంపదకల |
| అది .... | కాక .... | } | అదిగాక<br>అదికాక |

రూపం .... తాల్చింది .... } రూపందాల్చింది / రూపంతాల్చింది

బుద్ధుడు .... పోలె .... } బుద్ధుడువోలె / బుద్ధుడుపోలె

ఇరు .... పది .... ఇరువది

కొర .... పడు .... కొరవడు

ఈకార్యం క్రియాపదాలమీదసైతం వస్తుంది.

రారు .... కదా .... } రారుగదా / రారుకదా

లేడనరిగదా — మా — 25— కొందరు కలరుగసుకనే — పి — 12— కొరపడిన వారెవరు ? — పి — 18 — రాలుగాయులు — కొ — 55 —

ద్వంద్వంలో పదంమీది క త ల ప గ ద లు విభాషగా వస్తాయి. ౧౬

కూర .... గాయ .... } కూరగాయలు / కూరకాయలు

తల్లి .... తండ్రి .... } తల్లిదండ్రులు / తల్లితండ్రులు

అన్న .... తమ్ముడు .... } అన్నదమ్ములు / అన్నతమ్ములు

మొదలైనవి.

ద్రుతప్రకృతికంమీది పరుషాలకు సరళాలు బహుళం. ౧౭

బాహుళకంచేత యథావ్యవహారంగా గ్రాహ్యాలు. చేసికొ—ప్రభృతుల్లో పరుషానికి సరళం తరచుగా కనిపిస్తున్నది.

పరుషాలకు ఆదేశసరళాలకు ముందున్న ద్రుతానికి లోప బిందువులు బహుళంగా అవుతాయి. ౧౮

బహుళగ్రహణంచేత పరుషాలుపరమైతే లోపమేగాని బిందువులేదు. సరళాలు పరమైనప్పుడుసైతం బిందువు లోకవ్యవహారానుగుణంగా గ్రాహ్యం.

ముంగొంగు — క్రొంబసిడి — పందొమ్మిది — తలంబ్రాలు — అంబోతు — క్రొంజెమట — కెందమ్మి — కెంజాయ — ఇత్యాదుల్లో పూర్ణబిందువు గ్రాహ్యం.

ఒడిప్రాలు - సేసప్రాలు - ఊరబంది - ఊరవిచ్చుక - తోడబుట్టువు - తోబుట్టువు - ఒల్లబాలు - ఒడబాలు - ఇత్యాదుల్లో సరళాదేశం ద్రుతలోపంగా స్వీకరించవలెను. పాక్షికసరళాదేశంకల ఊరపంది - ఊరపిచ్చుక - ఇత్యాదిరూపాలను లోక వ్యవహారాన్ననుసరించి గ్రహించవలెను. కొత్తాస్ రాచుకో - వస్తాఁ చూడు - మొదలైనచోట్ల ద్రుతానికి సంశ్లేషస్థితి కనిపిస్తున్నది. సంశ్లేషమంటే మీది హల్లుతో కలిసి ఉండడం. ఊరపిచ్చుక ఊరపిల్లి అన్నట్లు —పి—73— తోబుట్టువు - రా --60--

ద్రుతానికి పరుష సరళ స్థిరాలు పరమైతే లోపసంశ్లేషలు బహుళం. ౨౯

తెచ్చాన్తే - వస్తాన్తే - తెస్తాతే - వస్తాతే - నేతెచ్చాపుస్తకం - నేతెచ్చాను పుస్తకం. వచ్చానుబండికి - వచ్చాబండికి - దిగాన్బండిలోంచి - ఇత్యాదులు.

ద్విత్వలోప కను చను శబ్దాల ప్రాంతస్థ నకారానికి రేఫం పరమైతే బిందువు కనిపిస్తున్నది. ౩౦

కంరోయి - చంరోయి.

అవసానంలో ద్రుతానికి లోపం బహుళం. ౩౧

నేతెస్తా - నేనుఉంటా - జరుపుతా - మొదలైనవి. బాహుళకంచేత అచ్చు పరమైతే కొన్నిచోట్ల ద్రుతానికి లోపంరాదు. తెస్తానంటే - జరుపుతానంటే - ఉంటానని - కొత్తానని - ఇత్యాదులు.

అచ్చు పరమైతే కొన్నికళలమీద నకారాగమం కనిపిస్తున్నది. ౩౨

వాడు వస్తేనేం రాకపోతేనేం ? - అది యిస్తేనేం యివ్వకపోతేనేం ?

నుడి తొలిహ్రస్వం మీది ద్రుతానికి లోపం లేదు. ౩౩

ముంగొంగు - క్రొంబసిడి.

సమాసంలో ఉత్వాంతాలైన స్త్రీ సమాల పువర్ణాల మీది పరుషాలకు సరళాలు విభాష. ౩౪

సమాసంలో ఉత్వాంతాలైన స్త్రీసమాలమీది పరుషాలకు పువర్ణంమీది పరుషాలకు సరళాలు విభాషగా వస్తాయని తాత్పర్యం.

| | | | | |
|---|---|---|---|---|
| చిగురు | .... | ఆకు | .... | చిగురుటాకు / చిగురాకు |
| పొదరు | .... | ఇల్లు | .... | పొదరుటిల్లు / పొదరిల్లు |

ఇత్యాదుల్లో టువర్ణాగమం వైకల్పికం.

కర్మధారయమ్లో అనే బహువచనప్రయోగంచేత తదితర సమాసాల్లో సైతం కొన్నిచోట్ల ఈ టువర్ణాగమం జరుగుతుంది.

| | | | | |
|---|---|---|---|---|
| పెంకు | .... | ఇల్లు | .... | పెంకుటిల్లు |
| పోతు | .... | ఈగ | .... | పోతుటీగ |
| ముద్దు | .... | ఉంగరం | .... | ముద్దుటుంగరం |

ఇత్యాదులు.

బహుళగ్రహణంచేత ఉత్వవ్యతిరిక్తాలకు సైతం కొన్నిచోట్ల టువర్ణాగమం సాధ్యం.

| | | | | |
|---|---|---|---|---|
| మక్కి | .... | ఎద్దు | .... | మక్కిటెద్దు |
| పడక | .... | ఇల్లు | .... | పడకటిల్లు |
| పక్క | .... | ఎముక | .... | పక్కటెముక |
| కమ్మ | .... | ఊరు | .... | కమ్మటూరు |
| తేనె | .... | ఈగ | .... | తేనెటీగ |
| పల్లె | .... | ఊరు | .... | పల్లెటూరు |

ఇత్యాదులూహ్యాలు.

పల్లెటూరు ఇల్లాలు. కొ — 42 — మదపుటేనుగులాగ — భా — వి — 96 — బొంకరా బొంకరా పోలిగా అంటే టంగుటూరి మిరియాలు తాటికాయలంతేసి అన్నట్లు — మా — 58 — ఒక కమ్మటూరుగుండా తాటాకుగొడుగు వేసుకొని — మా — 83 — నిలువుటద్దం ముందు నిలబడి — పి — 51 —

కర్మధారయంలో పేదాది శబ్దాలకు ఆలు శబ్దం పరమైతే రు వర్ణాగమం వస్తుంది. అలా

| | | | | |
|---|---|---|---|---|
| పేద | .... | ఆలు | .... | పేదరాలు |
| ముద్ద | .... | ఆలు | .... | ముద్దరాలు |
| బీద | .... | ఆలు | .... | బీదరాలు |
| బాలెంత | .... | ఆలు | .... | బాలెంతరాలు |
| జవ | .... | ఆలు | .... | జవరాలు |

| | | | | |
|---|---|---|---|---|
| కొమ | .... | అలు | .... | కొమరాలు |
| మిసిమింత | .... | అలు | .... | మిసిమింతరాలు |
| బసివి | .... | అలు | ... | బసివిరాలు |
| గేస్తు | .... | అలు | .... | గేస్తురాలు |
| గొడ్డు | .... | అలు | .... | గొడ్డురాలు |
| వియ్యపు | .... | అలు | .... | వియ్యపురాలు |
| ముసుమ | .... | అలు | .... | ముసుమురాలు |

ఇత్యాదులూహ్యాలు.

సమాసంలో జప్పని శబ్దం పరార నివర్ణాలు లోపిస్తాయి. గొడ్డురాలు అన్నప్పుడు వక్ష్యమాణవిధిచేత ఉత్వద్విత్వాలకు లోపంవస్తే గొడ్రాలు - పాదశబ్దానికి ఇల్లుపరమైతే నిత్యంగాను, గంగి శబ్దానికి ఎద్దుపరమైతే వికల్పంగాను రువర్ణాగమం కనిపిస్తున్నది - పాదరిల్లు - గంగిరెద్దు - గంగెద్దు - బసివిరాండ్రను వేశ్యలను — అం — 259 — ఒక పాదరిల్లు అవతలనుంచి — పి — 86 — చేతకాని ముద్దరాలు — భా — వి — 7 —

తత్సమాలకు అలు శబ్దం పరమైతే కర్మధారయంలో అత్వానికి ఉత్వం రువర్ణాగమం వస్తుంది. ఉదా

| | | | | |
|---|---|---|---|---|
| గుణవంత | .... | అలు | .... | గుణవంతురాలు |
| ప్రియ | .... | అలు | .... | ప్రియురాలు |
| విద్యావంత | .... | అలు | .... | విద్యావంతురాలు |
| సరస | .... | అలు | .... | సరసురాలు |
| ధీర | .... | అలు | .... | ధీరురాలు |
| సమర్థ | .... | అలు | .... | సమర్థురాలు |
| శ్రీమంత | .... | అలు | .... | శ్రీమంతురాలు |
| మూర్ఖ | .... | అలు | .... | మూర్ఖురాలు |

ఇత్యాదులు.

సమాసంలో అలు శబ్దానికి స్త్రీ అనిమాత్రమే అర్థం. ము లోపమైన నేస్తము పదానికి ఈకార్యం కనిపిస్తున్నది. నేస్తురాలు - విధవశబ్దం అత్వానికి ఉత్వం కనిపించడంలేదు - విధవరాలు - సిరిసంపత్తులుగల విధవరాలుతో స్నేహం — మా — 65 — అల్పభాగ్యురాలనైన — రా — 181 — తన ప్రియురాలికి అందచేయవలసిందిగా — మా — 123 — ఆమె పాత్రురాలు — పి — 19 —

కర్మధారయాల్లో ముపర్ణానికి పువర్ణం బహుళంగా
వస్తుంది. ౩౦

సరసము .... మాట .... సరసపుమాట
విరసము .... పలుకు .... విరసపుపలుకు

కర్మధారయాల్లో అని బహువచన ప్రయోగం చేయడంచేత

గుర్రము .... జీను .... గుర్రపుజీను
కన్నము .... దొంగ .... కన్నపుదొంగ
ఆరాలము .... వాయి .... ఆరాలపువాయి

ఇత్యాదికర్మధారయేతర సమాసాల్లోనైతం పువర్ణం వస్తుంది. ముపర్ణానికి అనడంచేత పాక్షికంగా అనుస్వారంవస్తే పువర్ణంరాదని గ్రహించాలి. గుర్రంజీను - కన్నందొంగ - ఆరాలంవాయి మొదలైనవి. బాహుళకంచేత ఆకు పరమైతే మోదుగు గువర్ణానికి ఆదేశంగాను, తామరకు ఆగమంగాను పువర్ణం వైకల్పికంగా వస్తుంది.

మోదుగు .... ఆకు .... } మోదుపాకు / మోదుగాకు

తామర .... ఆకు .... } తామరపాకు / తామరాకు

వక్ష్యమాణవిధిచేత పువర్ణానికి పరుషం పరమైతే విభాషగా సంధికార్యాలు - సరసపు పలుకులు - సరసప్పలుకులు - గుర్రపుబండి - గుర్రబ్బండి - ఇత్యాదు లూహ్యాలు.

పాతరపుమాట అని ప్రతిపక్షి - పి - 94 -- వేమన బూటకపు యోగులను తీవ్రంగా ఆక్షేపిస్తున్నాడు - అం - 259 - విషపునవ్వునవ్వాడు -- భా -- ది -- 131 - అవంతా బంగారపుముద్ద - రా - ను - 29. చుట్టపుచూపుగా రావడం - మా - 34 - వ్యవహారపటుత్వపు ప్రతిభాతత్త్వవేత్త -- మా - 46 -- సాయం త్రపుపూట కమ్మని టీ ఎవరిస్తారు? - మా - 66. తామరాకుమీదపడిన నీటిచుక్క వలె - మా - 68 - సముద్రంపొడుగున వెళ్లి - పి - 12 -

అత్యంతగుణవాచకాలకు ఉత్వాంత స్త్రీసమాలకు పువర్ణాంతా లకు పరమైన తనంపరుషానికి సరళం బహుళం ౩౧

తెల్ల .... తనం .... } తెల్లదనం / తెల్లతనం

| | | | | |
|---|---|---|---|---|
| ఎఱ్ఱ | .... | తనం | .... | ఎఱ్ఱదనం<br>ఎఱ్ఱతనం |
| సొగసు | .... | తనం | .... | సొగసుదనం<br>సొగసుతనం |
| పడుచు | .... | తనం | .... | పడుచుదనం<br>పడుచుతనం |
| సరసము | ... | తనం | .... | సరసపుదనం<br>సరసపుతనం |

ఇలాగే పుల్ల - కమ్మ - నల్ల - చప్ప - తియ్య - విన్నాదులకు చురుకు - మురుకు - చుడుకు - కరకు ప్రభృతులకు తనం పరమైతే సరళాదేశం గ్రహించవలెను.

సమాసంలో ప్రాతాదుల తొలిఅచ్చుమీది వర్ణాల కన్నింటికి లోపం బహుళం 33

| | | | | |
|---|---|---|---|---|
| ప్రాత | .... | ఇల్లు | .... | ప్రాయిల్లు |
| రాచ | .... | అంచ | .... | రాయంచ |
| లేత | .... | దూడ | .... | లేదూడ |
| పూవు | .... | రెమ్మ | .... | పూరెమ్మ |

మొదలైనవి.

లుప్తశేషాలకు పరుషాలు పరమైతే ద్రుతమైనా రాగమం బహుళంగా వస్తుంది. 33

ద్రుతం ఆగమంగావస్తే పరుషాలకు సరళాలు - హ్రస్వదీర్ఘాలమీద ద్రుత లోపం - మరి తొలిహ్రస్వంమీద ద్రుతలోపం వుండదు కాబట్టి పూర్ణబిందువు.

| | | | | |
|---|---|---|---|---|
| ప్రాత | .... | కెంపు | .... | ప్రాగెంపు |
| లేత | .... | కొమ్మ | .... | లేగొమ్మ |
| లేత | .... | చిగురు | .... | లేజిగురు |
| పూవు | .... | తోట | .... | పూదోట |
| మీదు | .... | కడ | .... | మీగడ |
| కెంపు | .... | చాయ | .... | కెంజాయ |
| కెంపు | .... | తామర | .... | కెందామర |

ముందు .... చేయి .... ముంజేయి

చెన్ను .... తావ .... చెందావ

ఇత్యాదులు.

సమాసంలో చెన్నుశబ్దానికి ఎరుపుఅర్థం - ఇక్కడ బాహుళకంచేత మీదు ప్రభృతుల్లో లోపంనిత్యం. బహుళగ్రహణంచేత ఈద్రుతానికి సంశ్లేషరాదు.

రాచ .... చిలుక .... రాచిలుక

రాచ .... తరుణి .... రాతరుణి

రాచ .... కుమారి .... రాకుమారి

ఇత్యాదుల్లో బాహుళకంచేతనే అగమనకారరాహిత్యం.

కడి ముంజేతిని తాకితే పీడ - మా — 15 — ఏమామిడిగున్న లేజిగుళ్ల మధ్యనో దాగి — పి — 79 —

మీగడ దీర్ఘానికి హ్రస్వం వైకల్పికం ౩౪

హ్రస్వంవస్తే పూర్వోక్తవిధివల్ల నుడి తొలిహ్రస్వంమీద ద్రుతలోపంరాదు కాబట్టి బిందువు నిత్యం. మింగడ.

కెంపు శబ్దానికి ఆద్యక్షర శేషానికి జడధూళులు పరమైతే ద్రుతసకారాగమం కనిపిస్తున్నది. ౩౫

కెంపు .... జడలు .... కెంజడలు

కెంపు .... ధూళి .... కెంధూళి

క్రొత్త శబ్దానికి ఆద్యక్షరశేషానికి కొన్నిచోట్ల ద్రుతసకారాగమం కొన్నిచోట్ల మీదిహల్లుకి ద్విత్వం కనిపిస్తున్నది. ౩౬

క్రొత్త .... చాయ .... క్రొంజాయ

క్రొత్త .... చెమట .... క్రొంజెమట

క్రొత్త .... పసిడి .... క్రొంబసిడి

క్రొత్త .... కారు .... క్రొక్కారు

క్రొత్త .... తావి .... క్రొత్తావి

పరుషేతరాలు పరమైతే ద్రుతసకారాగమం లేకపోవడంచేత వాటికి ద్విత్వం వస్తుంది.

| | | | | |
|---|---|---|---|---|
| క్రొత్త | .... | గండి | .... | క్రొగ్గండి |
| క్రొత్త | .... | నన | .... | క్రొన్నన |
| క్రొత్త | .... | మావి | .... | క్రొమ్మావి |

బాహుళకంచేత క్రొత్తదుండ - క్రొత్తతాత యిత్యాదుల్లో లోపంలేదు. క్రిగడుపు - క్రీగాలు - క్రీదొడ - ఇత్యాదుల్లో లుప్తశేషమైన క్రిందుశబ్దానికి బహుళగ్రహణంచేతనే దీర్ఘమని గ్రహించవలెను. వింజామరలో వెల్లశబ్దం ఎత్వానికి ఇత్వంసైతం బాహుళకంచేతనేనని గ్రహించాలి.

క్రీగంటు కంకభట్టునిచూశాడు. భా — వి — 32 —

ఇతరాలకుసైతం ఈకార్యాలు కొన్నిచోట్ల బహుళంగా కానవస్తున్నాయి. 32

ఈకార్యా లనగా కొన్నిచోట్ల లోప ద్రుతనకారాగమాదులు - కొన్నిచోట్ల లోపద్విత్వాలు అని తాత్పర్యం.

| | | | | |
|---|---|---|---|---|
| పంక | .... | చెరగు | .... | పంచెరగు |
| సగము | .... | కోరు | .... | సంగోరు |
| నిండు | .... | వెర | ... | నివ్వెర |
| నెర | .... | తరి | .... | నెత్తరి |
| నెరి | .... | తరి | .... | నెత్తరి |
| నెర | .... | మది | .... | నెమ్మది |
| నెర | .... | నడుం | .... | నెన్నడుం |
| నెరి | .... | నడుం | .... | నెన్నడుం |
| సద్దు | .... | వడి | .... | సవ్వడి |

ఇత్యాదులూహ్యాలు.

నెర బృహదర్థకం. నెరి రమ్యార్థకం. సందర్భానుగుణంగా నెర నెరులను గ్రహించాలి.

| | | | | |
|---|---|---|---|---|
| రెండు | .... | నాళ్లు | .... | రెన్నాళ్లు |
| మూడు | .... | నాళ్లు | .... | మూన్నాళ్లు |
| వేడి | .... | నీళ్లు | .... | వేన్నీళ్లు |
| చల్లని | .... | నీళ్లు | .... | చన్నీళ్లు |
| రెండు | .... | నెల్లు | .... | రెన్నెల్లు |
| మూడు | .... | నెల్లు | .... | మూన్నెల్లు |

బహుళగ్రహణంచేత ఇకారాంత నకారానికి ణకారం అన్యత్రార్థం. బాహుళకంచేతనే నాలుగు ఉగువర్ణానికి లోపం.

నాలుగు .... నెల్లు .... నాల్నెల్లు

నాలుగు .... నాళ్లు .... నాల్నాళ్లు

హ్రస్వవిధిలో తరచు శబ్దగ్రహణంచేత ద్విత్వంపరమైతే కొన్నిచోట్ల దీర్ఘానికి హ్రస్వంరాదు. కాబట్టి మూన్నాళ్లు ప్రభృతులు రక్షితాలైనాయి - రేఫోష్మలకు తెలుగులో సాధారణంగా సాధ్యద్విత్వం లేదు.

రాజు .... రాజు .... రారాజు

సాధారణశబ్దంచేత ఉష్ - అరి - ఉష్టని ఇత్యాదులు సాధ్యాలు. వేడు - తాడు - చేంతాడు అన్నప్పుడు పరుషాదేశవిధి బాహుళకంచేత సరళంరాదు - ప్రాతాదిసూత్రంలో బహుళగ్రహణంచేత పాక్షికంగా చేంతాడు పదానికి పూ- కారం వస్తుంది. ఇదే అన్యత్రాప్యర్థం -

చేంతాడు - చే ంతాడు - కొంచెపెడచేంతాడుతో పోటీచేస్తున్న —చూ— 35 పరిహద్దులనుంచి వచ్చేసవ్వడి — చూ —97—రారాజులనే చెప్పాలి —చూ 128

కాలవాచియైన నాడు శబ్దయోగంలో అన్ని ప్రభృతుల
ఇత్వానికి లోపం వైకల్పికం. ఉదా

ఇత్వలోపంవస్తే బహూక్తాలైన వ్యంజనాలలో ద్విరుక్తాలవే ఉన్నాయి కాబట్టి ఒకవ్యంజన నకారం లోపిస్తుంది.

అన్ని .... నాళ్లు .... అన్నాళ్లు

ఇన్ని .... నాళ్లు .... ఇన్నాళ్లు

ఎన్ని .... నాళ్లు .... ఎన్నాళ్లు

కొన్ని .... నాళ్లు .... కొన్నాళ్లు

అన్ని - ఇన్ని - ఎన్ని - కొన్ని ఇవి అన్ని ప్రభృతులు.

ఆమ్రేడితం పరమైతే కడాదుల తొలిఅచ్చుమీది వర్ణాలన్నింటికి
అత్వాంతమైన ద్విత్వటకారం వస్తుంది. ఉదా

కడ .... కడ .... కట్టకడ

ఎదురు .... ఎదురు .... ఎట్టయెదురు

కొన .... కొన .... కొట్టకొన

చివర .... చివర .... చిట్టచివర

వేగ .... వేగ .... ) వేవేగ
( వేగవేగ

బహుళగ్రహణంచేత నేడు|రేపుల కీకార్యంలేదు. ముపర్ణకాంత వేగశబ్దం గకారసహిత ము వర్ణకానికి లోపం కనిపిస్తున్నది.

వేగం .... వేగం .... ) వేవేగం
( వేగంవేగం

అక్కడక్కడతిరగవేయడమేతప్ప — మా — ౫౯ — ఇంటింటావాడవాడా — పి — 64 —

అందదుకు ప్రభృతులు వ్యవహారానుగుణంగా గ్రాహ్యాలు. ౪౧

| | | | | |
|---|---|---|---|---|
| అదుకు | .... | అదుకు | .... | అందదుకు |
| ఇంకులు | .... | ఇంకులు | .... | ఇగ్రింకులు |
| చెదరు | .... | చెదరు | .... | చెల్లాచెదరు |
| తుమురు | .... | తుమురు | .... | తుత్తుమురు |
| తునియలు | .... | తునియలు | .... | తుత్తునియలు |
| దాపు | .... | దాపు | .... | దాదాపు |
| మిట్లు | .... | మిట్లు | .... | మిడుమిట్లు |

మొదలైనవి.

దాదాపు లేవనే చెప్పవచ్చునేమో ! — మా — 115 —

చేతవర్ణకం పరమైతే అంద్వాదుల దువర్ణానికిలోపం విభాష. ౪౨

అందు - ఇందు - ఎందు ఇవి అంద్వాదులు.

| | | | | |
|---|---|---|---|---|
| అందు | .... | చేత | .... | అంచేత |
| ఇందు | .... | చేత | .... | ఇంచేత |
| ఎందు | .... | చేత | .... | ఎంచేత |

వ్యవస్థితవిభాషచేత చేత తవర్ణంలోపిస్తే యీ దువర్ణలోపం జరగదు.

అందు .... చే .... అందుచే

అంచేత తనయిచ్చాపూర్తికి దోహదమివ్వగల — మా — 18 —

సమాసంలో చేతతోడల తుది అత్వాని కిత్వం వస్తుంది. ౪౩

| | | | | |
|---|---|---|---|---|
| నీచేత | .... | చలువ | .... | నీచేతిచలువ |
| వాడితోడ | .... | జత | .... | వాడితోడిజత |

సమాసంలో అంద్వాదులకు అలి ఆగమంగా వస్తుంది. ౪౪

| | | | | |
|---|---|---|---|---|
| నాయందు | .... | ప్రేమ | .... | నాయందలిప్రేమ |
| అందు | .... | వారు | .... | అందలివారు |
| ఇందు | .... | వారు | .... | ఇందలివారు |
| ఎందు | .... | వారు | .... | ఎందలివారు |

అనుప్రయుక్తంతాని సహజసప్తమ్యర్థకాలైన అందు ఇందు ఎందుల కీకార్యం చూపబడింది. వీటికి లోకంలో తరచుగా వ్యవహారంలేదు - ఎందుశబ్దానికి మారు ఎక్కడిశబ్దం తరచుగా వినవస్తున్నది. ఎక్కడివారు - ఎక్కడినుంచి - ఇత్యాదులు.

పడ్వాదులు పరమైనప్పుడు కర్మవాచి మువర్ణకానికి లోపం బహుళం. ౪౫

| | | | | |
|---|---|---|---|---|
| భయము | .... | పడ్డాడు | .... | భయపడ్డాడు |
| శ్రమము | .... | పెట్టాడు | .... | శ్రమపెట్టాడు |

పడు - పరచు - పాటు - పట్టు - పెట్టు ఇత్యాదులు పడ్వాదులు - బాహుళకంచేత పరచుపాటులు పరమైతే ములోపం నిత్యం. భయపరచు - భయపాటు బహుళగ్రహణంచేత పంతంపట్టు - అన్నంపెట్టు - ఆయుధంపట్టు - ఇత్యాదుల్లో ములోపంలేదు. కర్మవాచి మువర్ణాని కనడంచేత కర్తృవాచి కీకార్యం జరగదు - అశ్వంపడింది.

ఆధారపడివుంటాయి — మా — 43 —

మధ్యమపురుష మువర్ణకానికి లోపం విభాష. ౪౬

మువర్ణకానికి అచ్చుగాని హల్లుగాని అవసానంగాని యేదిపరమైనా లోపం విభాష అని తాత్పర్యం.

| | | | | |
|---|---|---|---|---|
| చూడుము | .... | నన్ను | .... | చూడునన్ను<br>చూడుమునన్ను |
| చూడుము | .... | అదిగో | .... | చూడదిగో<br>చూడుమదిగో |
| చూడుము | .... | అన్నాడు | .... | చూడన్నాడు<br>చూడుమన్నాడు |

అనుకరణంలో విసర్గ తరచుగా లోపిస్తుంది. ౹౧౦

వర్ధతాం౹శ్రీః .... అన్నారు .... వర్ధతాం౹శ్రీ అన్నారు

తరచుగా అనడంచేత కొన్నిచోట్ల విసర్గకూడా ఉండవచ్చని తాత్పర్యం.

బుద్ధాయనమః .... అన్నాడు .... బుద్ధాయనమఃఅన్నాడు

గతానుగతికోలోకః .... అన్నాడు .... గతానుగతికోలోకఃఅన్నాడు.

ఇత్యాదులూహ్యాలు.

కొపీన సంరక్షణార్థం అయంపటాటోపః అన్నట్టు ఈబాదరబందీయావత్తూ నాకు దేనికి౹ప్రభూ ? — కొ — 419 — భార్యారూపవతీశత్రుః అన్నారుపెద్దలు - పి — 16 —

అనుకరణంలో సమశ్నబ్దం తుది అత్వానికి ఓత్వం విభాష. ౹౧౧

తుభ్యంనమః .... అన్నాడు .... { తుభ్యంనమ అన్నాడు / తుభ్యంనమో అన్నాడు / తుభ్యంనమః అన్నాడు }

పూర్వోక్తవిధిచేత విసర్గకు లోపంరానిపక్షంలో వ్యవస్థితవిభాషచేత అత్వానికి ఓత్వంరాదు. ఒకచోట లోకశబ్దాని కీకార్యం కనిపిస్తున్నది. గతానుగతికోలోకో.

గ్రామ్యత ననుసరించి విసర్గకు కొన్నిచోట్ల రేఫ రావచ్చును. ౹౧౨

అనియతగణైః .... అని .... అనియతగణైరని

ఇత్యాదులు శిష్టజనవ్యవహారవేద్యాలు.

అనుకరణంలో తుది ఐ ఔ లకు అయ్ అవ్‌లు విభాషగా వస్తాయి. ౹౧౩

సద్గుణైః .... అని .... { సద్గుణైరని / సద్గుణైఅని / సద్గుణయ్యని }

రామౌ .... అని .... { రామౌఅని / రామవ్వని }

రామలక్ష్మణౌ.... అని .... { రామలక్ష్మణౌఅని / రామలక్ష్మణవ్వని }

మొదలైనవి.

అయ్ అవ్‌లువస్తే వక్ష్యమాణవిధిచేత ద్విత్వం.

అనుకృతిలో తుదిహల్లుకు ద్విత్వం తరచుగా వస్తుంది. ౫౪

| | | | | |
|---|---|---|---|---|
| కింతత్ | .... | అని | .... | కింతత్తని |
| కర్తవ్యమ్ | .... | అని | .... | కర్తవ్యమ్మని |

మొదలైనవి.

తరచు శబ్దగ్రహణంచేత కింతత్ అని అనికూడా ఉండవచ్చుననితాత్పర్యం

అనుకృతిలో అహమాద్యుల మకారానికి ద్విత్వం బహుళం. ౫౫

దాసోహమ్ .... అని .... { దాసోహమ్మని / దాసోహమని / దాసోహమ్అని

తత్కర్తవ్యమ్ .... అని .... { తత్కర్తవ్యమ్మని / తత్కర్తవ్యమని / తత్కర్తవ్యమ్అని

ఇత్యాదులు.

బాహుళకంచేత - కర్తవ్యమ్మన్నాడు - తత్కిమ్మన్నాడు - ఇత్యాదుల్లో ద్విత్వరహితంగా స్వరమేళనం జరగదు.

అనుకరణంలో ఉకారాంతనామానికి వువర్ణాగమం విభాషగా వస్తుంది. ౫౬

ఇయంధేసుః .... అన్నాడు .... { ఇయంధేసువన్నాడు / ఇయంధేసుః అన్నాడు

భ్రూః .... అన్నాడు .... { భ్రూవన్నాడు / భ్రూఃఅన్నాడు

ఉత్వాంతం అనక ఉకారాంతమనడంచేత దీర్ఘాంతాలు గ్రాహ్యాలయినాయి.

ఏమి మిపర్ణానికి లోపం విభాష. ౫౭

నీరే సుప్పు హాయిగా వున్నావు.

అనరే అతను బాగానే అంటాడు.

పక్షంలో మివర్ణానికి వక్ష్యమాణవిధిచేత బిందువు వస్తుంది.

నీరేం సుప్పు హాయిగా వున్నావు.

అనరేం అతను బాగానే అంటాడు.

ఇత్యాదులు గ్రాహ్యాలు.

6

అనుకృతిలో ధ్వన్యనుకరణశబ్దాలకు కొన్నిచోట్ల ముపర్ణా
గమం వస్తుంది. ౫౮

| | | | | |
|---|---|---|---|---|
| సలసల | .... | అని | .... | సలసలమని |
| పటపట | .... | అని | .... | పటపటమని |
| ఛెళ్లు | .... | అని | .... | ఛెళ్లుమని |
| ధన్ | .... | అని | .... | ధన్మని |
| గుటుక్కు | .... | అని | .... | గుటుక్కుమని |

ఇత్యాదులూహ్యాలు.

రెండుపరకలపప్ప గుటుక్కుమనిపించావు — మా — 129 — యన్ను మన్నాడెందుకో — పి — 41 — కపీమనిరాళ్ళదించి — పి — 89 ..

ధ్వన్యనుకరణశబ్దాలు తరచుగా ద్విరుక్త్యాద్యుక్తాలవుతాయి. ౫౯
గడగడ - దడదడ - ఫెళఫెళ - ధన్ధన్ధన్మని. తరచుగా అనడంచేత ఛామ్మని - ఛామ్మని - ధన్మని - ఇత్యాదులు గ్రాహ్యాలు - అమ్రేడితమైన ధన శబ్దానికి పూర్వానగల ధన్‌కి ధనా కనిపిస్తున్నది. ధనాధన్.

ధ్వన్యాద్యనుకరణ శబ్దాల తుది హ్రస్వానికి దీర్ఘం బహుళం. ౬౦
ధనధనా - ఫెళఫెళా - దడదడా - మొదలైనవి. ధనధనా మోగించి - ఫెళఫెళా విరిగింది - దడదడా కొట్టింది. ఆదిశబ్దంచేత గడగడా - పడపడా ఇత్యాదులుగ్రాహ్యాలు - గడగడా త్రాగాడు - పడపడా పణికాడు - మొదలైనవి. ఘృఘూ మని - హుహూమని - ఇత్యాదివిరావృక్షరాల్లోనైతం కొన్నిచోట్ల ఈకార్యం కని పిస్తున్నది.

చకారం పరమైతే పదం తుది చకారహ్రస్వస్వరానికి లోపం
విభాష. ౬౧

| | | | | |
|---|---|---|---|---|
| చూచి | .... | చూచి | .... | చూచ్చూచి<br>చూచిచూచి |
| లేచి | .... | చక్కగా | .... | లేచ్చక్కగా<br>లేచిచక్కగా |
| నాచు | .... | చెట్టు | .... | నాచ్చెట్టు<br>నాచుచెట్టు |

| | | | | |
|---|---|---|---|---|
| చూచి | .... | చెప్పు | .... | } చూచ్చెప్పు<br>చూచిచెప్పు |

మొదలైనవి.

చకారం పరమైతే పదం తుది జకారహ్రస్వస్వరానికి లోపం జాకు చకారం విభాష. ఉ॥

| | | | | |
|---|---|---|---|---|
| బూజు | .... | చూడు | .... | } బూచ్చూడు<br>బూజుచూడు |
| రాజు | .... | చెప్పాడు | .... | } రాచ్చెప్పాడు<br>రాజుచెప్పాడు |
| జాజి | .... | చెక్క | .... | } జాచ్చెక్క<br>జాజిచెక్క |
| వాజ | .... | చేత | .... | } వాచ్చేత<br>వాజచేత |

మొదలైనవి.

జకారం పరమైతే పదం తుది జకారహ్రస్వస్వరానికి లోపం విభాష. ఉ॥

| | | | | |
|---|---|---|---|---|
| రాజు | .... | జారాడు | .... | } రాజ్జారాడు<br>రాజుజారాడు |
| గాజు | .... | జాడి | .... | } గాజ్జాడి<br>గాజుజాడి |
| రాజి | .... | జడిసింది | .... | } రాజ్జడిసింది<br>రాజిజడిసింది |

ఇత్యాదులు.

జకారం పరమైతే పదం తుది చకారహ్రస్వస్వరానికి లోపం చకారానికి జకారం విభాష. ఉ॥

| | | | | |
|---|---|---|---|---|
| వాచి | .... | జబ్బ | .... | } వాజ్జబ్బ<br>వాచిజబ్బ |
| నాచు | .... | జారింది | .... | } నాజ్జారింది<br>నాచుజారింది |

| | | | | | |
|---|---|---|---|---|---|
| పాచి | .... | జిమ్మింది | .... | } | పాజ్జిమ్మింది<br>పాచిజిమ్మింది |

మొదలైనవి.

తకారం పరమైతే పదం తుది తకార హ్రస్వస్వరానికి లోపం విభాష. ౬౫

| | | | | | |
|---|---|---|---|---|---|
| పాత | .... | తగవు | .... | } | పాత్తగవు<br>పాతతగవు |
| పాత | .... | తట్టి | .... | } | పాత్తట్టి<br>పాతతట్టి |
| మూతి | .... | తిప్పి | ... | } | మూత్తిప్పి<br>మూతితిప్పి |
| నేతి | .... | తెట్టు | .... | } | నేత్తెట్టు<br>నేతితెట్టు |

మొదలైనవి.

తకారం పరమైతే పదం తుది దకారహ్రస్వస్వరానికి లోపం దాకు పరసవర్ణం విభాష. ౬౬

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఎవరిది | ... | తప్పు | .... | } | ఎవరిత్తప్పు<br>ఎవరిదితప్పు |
| నాది | .... | తక్కువ | .... | } | నాత్తక్కువ<br>నాదితక్కువ |
| గేదె | .... | తోలు | .... | } | గేత్తోలు<br>గేదెతోలు |
| పాదు | .... | తవ్వు | .... | } | పాత్తవ్వు<br>పాదుతవ్వు |

ఇత్యాదులు.

దకారం పరమైతే పదం తుది దకారహ్రస్వస్వరానికి లోపం విభాష. ౬౭

| | | | | | |
|---|---|---|---|---|---|
| అది | .... | దండుగ | .... | } | అద్దండుగ<br>అదిదండుగ |

| | | | | |
|---|---|---|---|---|
| పది | .... | వారి | .... | పద్వారి<br>పదివారి |
| పాదు | .... | దగ్గర | .... | పాద్దగ్గర<br>పాదుదగ్గర |
| గేదె | .... | దెబ్బ | .... | గేద్దెబ్బ<br>గేదెదెబ్బ |

మొదలైనవి.

దకారం పరమైతే పదం తుది తకారహ్రస్వస్వరానికి లోపం తాకు పరసవర్ణం విభాష. ఉదా

| | | | | |
|---|---|---|---|---|
| గిత | .... | దగ్గర | .... | గిద్దగ్గర<br>గితదగ్గర |
| చేతి | ... | దారం | .... | చేద్దారం<br>చేతిదారం |
| వాతు | .... | దేనికి | .... | వాద్దేనికి<br>వాతుదేనికి |
| లోతు | .... | దుబ్బు | .... | లోద్దుబ్బు<br>లోతుదుబ్బు |

మొదలైనవి.

చకారం పరమైతే పదం తుది తకారహ్రస్వస్వరానికి లోపం తాకు పరసవర్ణం విభాష. ఉదా

| | | | | |
|---|---|---|---|---|
| పాత | .... | చెంబు | .... | పాచ్చెంబు<br>పాతచెంబు |
| రాతి | .... | చిప్ప | .... | రాచ్చిప్ప<br>రాతిచిప్ప |
| లోతు | .... | చెరువు | .... | లోచ్చెరువు<br>లోతుచెరువు |
| సూతి | .... | చపటా | ... | సూచ్చపటా<br>సూతిచపటా |

మొదలైనవి.

చకారం పరమైతే పదం తుది దకారహ్రస్వస్వరానికి లోపం దాకు చకారం విభాష. ౭౦

| | | | | |
|---|---|---|---|---|
| బాదు | .... | చెక్క | .... | బాచ్చెక్క<br>బాదుచెక్క |
| చాదు | .... | చిప్ప | .... | చాచ్చిప్ప<br>చాదుచిప్ప |
| చాదు | .... | చుక్క | .... | చాచ్చుక్క<br>చాదుచుక్క |
| మాది | .... | చాప | .... | మాచ్చాప<br>మాదిచాప |
| బోదె | .... | చిన్నది | .... | బోచ్చిన్నది<br>బోదెచిన్నది |

ఇత్యాదులు.

జకారం పరమైతే పదం తుది తకారహ్రస్వస్వరానికి లోపం తాకు జకారం విభాష. ౭౧

| | | | | |
|---|---|---|---|---|
| నేతి | .... | జిడ్డు | .... | నేజ్జిడ్డు<br>నేతిజిడ్డు |
| రాతి | .... | జాడి | .... | రాజ్జాడి<br>రాతిజాడి |
| పోతు | .... | జాతర | .... | పోజ్జాతర<br>పోతుజాతర |
| పోతు | .... | జంట | .... | పోజ్జంట<br>పోతుజంట |

మొదలైనవి.

జకారం పరమైతే పదం తుది దకారహ్రస్వస్వరానికి లోపం దాకు జకారం విభాష. ౭౨

| | | | | |
|---|---|---|---|---|
| గేదె | .... | జున్ను | .... | గేజ్జున్ను<br>గేదెజున్ను |
| రాదు | .... | జగడం | .... | రాజ్జగడం<br>రాదుజగడం |

| | | | | |
|---|---|---|---|---|
| పేద | .... | జబ్బు | .... | పేజ్జబ్బు<br>పేదజబ్బు |
| ఏది | .... | జౌకు | .... | ఏజ్జౌకు<br>ఏదిజౌకు |

మొదలైనవి.

పకారం పరమైతే పదం తుది పకారహ్రస్వస్వరానికి లోపం విభాష. ౨౩

| | | | | |
|---|---|---|---|---|
| కోప | .... | పడ్డాడు | .... | కోప్పడ్డాడు<br>కోపపడ్డాడు |
| నాప | .... | పంట | .... | నాప్పంట<br>నాపపంట |
| అపి | .... | పితుకు | .... | అప్పితుకు<br>అపిపితుకు |
| మూపు | .... | పట్టి | .... | మూప్పట్టి<br>మూపుపట్టి |
| సరసపు | .... | పలుకులు | .... | సరసప్పలుకులు<br>సరసపు పలుకులు |

ఇత్యాదులు.

ఎందుకమ్మా కోప్పడతారు ఊరికేను ? — మా — 20.

బకారం పరమైతే పదం తుది పకారహ్రస్వస్వరానికి లోపం పాకు బకారం విభాష. ౨౪

| | | | | |
|---|---|---|---|---|
| పలుపు | .... | బురద | .... | పలుబ్బురద<br>పలుపుబురద |
| నాప | .... | బండ | .... | నాబ్బండ<br>నాపబండ |
| నిలిపి | .... | బండి | .... | నిలిబ్బండి<br>నిలిపిబండి |
| ఒరకపు | .... | బాట | .... | ఒరకబ్బాట<br>ఒరకపు బాట |

మొదలైనవి.

పకారం పరమైతే పదం తుది బకార(హ్రస్వస్వరానికి లోపం బకారానికి పకారం విభాష. ౨౫

| | | | | |
|---|---|---|---|---|
| జలుబు | .... | పోయింది | .... | జలుప్పోయింది<br>జలుబుపోయింది |
| బలుబు | .... | పగిలింది | .... | బలుప్పగిలింది<br>బలుబుపగిలింది |
| తనాబి | .... | పడింది | .... | తనాప్పడింది<br>తనాబిపడింది |
| గూబ | .... | పగిలింది | .... | గూప్పగిలింది<br>గూబపగిలింది |

మొదలైనవి.

బకారం పరమైతే పదం తుది బకార(హ్రస్వస్వరానికి లోపం విభాష. ౨౬

| | | | | |
|---|---|---|---|---|
| బాబు | .... | బండి | .... | బాబ్బండి<br>బాబుబండి |
| జలుబు | .... | బాగైంది | .... | జలుబ్బాగైంది<br>జలుబుబాగైంది |
| బాబు | .... | బాబు | .... | బాబ్బాబు<br>బాబుబాబు |
| ఊబి | .... | బోదె | .... | ఊబ్బోదె<br>ఊబిబోదె |

మొదలైనవి.

మకారం పరమైతే పదం తుది మకార(హ్రస్వస్వరానికి లోపం విభాష. ౨౭

| | | | | |
|---|---|---|---|---|
| పళ్లెము | .... | మీద | .... | పళ్లెమ్మీద<br>పళ్లెంమీద<br>పళ్లెముమీద |
| భూమి | .... | మీద | .... | భూమ్మీద<br>భూమిమీద |

| | | | | |
|---|---|---|---|---|
| ఏమి | .... | మామిడి | .... | ఏమ్మామిడి<br>ఏంమామిడి<br>ఏమిమామిడి |
| పుడమి | .... | మీద | .... | పుడమ్మీద<br>పుడమిమీద |
| రామ | .... | మూర్తి | .... | రామ్మూర్తి<br>రామమూర్తి |
| దోమ | .... | మోత | .... | దోమ్మోత<br>దోమమోత |

ఇత్యాదులు.

కకారం పరమైతే కి కు వర్ణకాల స్వరానికి లోపం విభాష. ఉదా

| | | | | |
|---|---|---|---|---|
| దానికి | .... | కాదు | .... | దానిక్కాదు<br>దానికికాదు |
| వాటికి | .... | కూడ | ... | వాటిక్కూడ<br>వాటికికూడ |
| నాకు | .... | కప్పి | .... | నాక్కప్పి<br>నాకుకప్పి |
| ఆవులకు | .... | కరువు | .... | ఆవులక్కరువు<br>ఆవులకుకరువు |

మొదలైనవి.

గకారం పరమైతే కి కు వర్ణకాల స్వరానికి లోపం కాకు గకారం విభాష. ఉదా

| | | | | |
|---|---|---|---|---|
| దానికి | .... | గడ్డు | .... | దానిగ్గడ్డు<br>దానికిగడ్డు |
| నీకు | .... | గాబరా | .... | నీగ్గాబరా<br>నీకుగాబరా |

మొదలైనవి.

చకారాదులు పరమైనప్పుడు జరిగే హల్ సంధిరూపాలే వ్యవహారంలో ప్రాచుర్యంగావున్నా అవి ప్రయోగదశలో విరళంగా కనిపిస్తున్నాయి - పాక్షికరూపాలకే ప్రయోగాలు తరచు కనిపిస్తున్నవి.

ఉక్తానుక్త సంస్కృత సంధివిశేషాలు వ్యవహారానుగుణంగా పరిగ్రాహ్యాలు. ౮౦

సంస్కృతవ్యాకరణకర్తలు చెప్పిన సంధివిశేషాలు - సంస్కృతవ్యాకరణ కర్తలు చెప్పకుండా కేవలం ఆంధ్రభాషలోమాత్రమే వ్యవహరించబడుతున్న సంధి విశేషాలు - పరిగ్రాహ్యాలని తాత్పర్యం.

అఋలకు అఋలు పరమైతే పూర్వపరస్వరాలకు దీర్ఘాదేశం తరచుగా వస్తుంది. ౮౧

అఋ లనగా అ ఇ ఉ ఋ ఌ. అ ఇ ఉ ఋ లకు క్రమంగా అ ఇ ఉ ఋ లు పరమైతే పూర్వపరస్వరాలకు రెండింటికీ వాటి దీర్ఘస్వరం ఆదేశంగా వస్తుందని తాత్పర్యం - ఇదేసవర్ణదీర్ఘ సంధి.

| | | | | |
|---|---|---|---|---|
| బౌద్ధ | .... | ఆరామం | .... | బౌద్ధారామం |
| లతా | .... | అటవి | .... | లతాటవి |
| కవి | .... | ఇభం | .... | కవీభం |
| ముని | .... | ఈశ్వరుడు | .... | మునీశ్వరుడు |
| మహీ | .... | ఇంద్రుడు | .... | మహీంద్రుడు |
| భాను | .... | ఉదయం | .... | భానూదయం |
| పృథు | .... | ఊరువు | .... | పృథూరువు |
| పితృ | .... | ఋణం | .... | పితౄణం |

ఇత్యాదులు

పితృణం అని పరరూపంసైతం కనిపిస్తున్నది. తరచుగా అనడంచేత ప్రకృతిభావంకలదని తాత్పర్యం. ప్రకృతిభావమంటే సంధి జరగకుండా ఎటువంటి ఆగమాదేశాదులు రాకుండా ఉన్నదున్నట్లే ఉండడం. మహాసంతోష సంభ్రమ ఆశ్చర్యాలు ముప్పిరిగొనగా - అరుణారుణకిరణదేదీప్యమానభాను ఉదయసంధ్యాకాలంలో - మొదలైనవిఉదాహరణలు. ప్రకృతిభావం ద్విత్ర్యాదిపద సంకలితసమాసాల్లోనే తరచు కనిపిస్తున్నది. ఇలాగే మీది అచ్సంధి సూత్రాల్లో తరచు శబ్దంచేత ప్రకృతిభావం పరిగ్రాహ్యం.

ఆకారానికి ఇ ఉ ఋలు పరమైతే పూర్వపరస్వరాలకు
ఏ ఓ అర్‌లు తరచుగా వస్తాయి. ౮౨

ఆకారానికి ఇ ఉ ఋలు పరమైతే పూర్వపరస్వరాలకు ఏకాదేశంగా క్రమంగా అకార ఇకారాలకు ఏకారం - అకార ఉకారాలకు ఓకారం - అకార ఋకారాలకు అర్‌అనేది ఆదేశంగా వస్తుందని తాత్పర్యం - దీనినే గుణసంధి అంటారు.

| | | | | |
|---|---|---|---|---|
| జ్ఞాన | .... | ఇంద్రుడు | .... | జ్ఞానేంద్రుడు |
| మహా | .... | ఈశ్వరుడు | .... | మహేశ్వరుడు |
| చంద్ర | .... | ఉదయం | .... | చంద్రోదయం |
| మహా | .... | ఉదయం | .... | మహోదయం |
| బ్రహ్మ | .... | ఋషి | .... | బ్రహ్మర్షి |
| మహా | .... | ఋషి | .... | మహర్షి |

మొదలైనవి.

అకారానికి ఏ ఐ లు ఓ ఔ లు పరమైతే పూర్వపర
స్వరాలకు ఐ ఔ లు తరచుగా వస్తాయి. ౮౩

అకారానికి ఏ ఐ ఏ పరమైనప్పుడు పూర్వపరస్వరాలకు ఐ కారం - అకారానికి ఓ ఔ లు పరమైనప్పుడు పూర్వపరస్వరాలకు ఔకారం ఆదేశంగా వస్తుందని తాత్పర్యం - ఇదే వృద్ధిసంధి అనబడుతుంది.

| | | | | |
|---|---|---|---|---|
| ఏక | .... | ఏకవీరుడు | .... | ఏకైకవీరుడు |
| సమస్త | .... | ఐశ్వర్యాలు | .... | సమస్తైశ్వర్యాలు |
| మహా | .... | ఓఘం | .... | మహౌఘం |
| గుణ | .... | ఔన్నత్యం | .... | గుణౌన్నత్యం |

మొదలైనవి.

ప్ర-ఋణ-దశలకు ఋణశబ్దం పరమైతే పూర్వపర
స్వరాలకు ఆర్ వస్తుంది. ౮౪

ఇదికూడా వృద్ధిసంధి అనబడుతుంది.

| | | | | |
|---|---|---|---|---|
| ప్ర | .... | ఋణం | .... | ప్రార్ణం |
| ఋణ | .... | ఋణం | .... | ఋణార్ణం |
| దశ | .... | ఋణం | .... | దశార్ణం |

అకారానికి ఓష్ఠాదులు పరమైతే ఔకారాదేశం వికల్పం. ౮౫

అకారానికి ఓష్ఠాదిశబ్దాల ఆదిఓకారం పరమైతే పూర్వపరస్వరాలకు ఔకారం వికల్పంగా ఆదేశమౌతుందని తాత్పర్యం. వృద్ధిరానిపక్షంలో వక్ష్యమాణవిధిచేత పరరూపంవస్తుంది.

| | | | | |
|---|---|---|---|---|
| బింబ | .... | ఓష్ఠం | .... | బింబౌష్ఠం |
| రమా | .... | ఓష్ఠం | .... | రమౌష్ఠం |
| స్థూల | .... | ఓతువు | .... | స్థూలౌతువు |
| మహా | .... | ఓతువు | .... | మహౌతువు |

ఇత్యాదులు.

ఓష్ఠం - ఓతువు - ఇవి ఓష్ఠాదులు.

అకారానికి ఓష్ఠాదులు పరమైతే వృద్ధ్యభావంలో పరరూపం నిత్యం. ౮౬

పూర్వస్వరాలకు పరస్వరం ఏకాదేశం కావడం పరరూపం.

| | | | | |
|---|---|---|---|---|
| బింబ | .... | ఓష్ఠం | .... | బింబోష్ఠం |
| రమా | .... | ఓష్ఠం | .... | రమోష్ఠం |
| స్థూల | .... | ఓతువు | .... | స్థూలోతువు |
| మహా | .... | ఓతువు | .... | మహోతువు |

మొదలైనవి.

ఉపసర్గ తుది అత్వానికి కృదంతధాతువుల ఏ ఓ లు పరమైతే పరరూపం నిత్యం. ౮౭

వృద్ధివిధానానికిది బాధకం.

| | | | | |
|---|---|---|---|---|
| ప్ర | .... | ఏజనం | .... | ప్రేజనం |
| ఉప | .... | ఓషణం | .... | ఉపోషణం |
| ఉప | .... | ఓష్యం | .... | ఉపోష్యం |
| ఉప | .... | ఓషం | .... | ఉపోషం |

ఇత్యాదులు.

ఊహోరాదులు ఊహిని పరమైతే ప్ర స్వలకు అక్షకు వృద్ధి నిత్యం. ౮౮

ఊహ - ఊఢ - ఊఢి - ఇవి ఊహాదులు. ఈర - ఈరి - ఈరిణి - ఇవి ఈరాదులు. ప్ర అనే ఉపసర్గకు ఊహాదులు పరమైనప్పుడు - స్వశబ్దానికి ఈరాదులు పరమైనప్పుడు - అక్షశబ్దానికి ఊహిని పరమైనప్పుడు పూర్వపరస్వరాలకు వృద్ధివస్తుంది. ఈ పరమైతే ఐ - ఊ పరమైతే ఔ -నిత్యంగా ఆదేశమవుతుందని తాత్పర్యం. ఇది విశేషవిధి.

| | | | | |
|---|---|---|---|---|
| ప్ర | .... | ఊహం | .... | ప్రౌహం |
| ప్ర | .... | ఊఢ | .... | ప్రౌఢ |
| ప్ర | .... | ఊఢి | .... | ప్రౌఢి |
| స్వ | .... | ఈరం | .... | స్వైరం |
| స్వ | .... | ఈరి | .... | స్వైరి |
| స్వ | .... | ఈరిణి | .... | స్వైరిణి |
| అక్ష | .... | ఊహిని | .... | అక్షౌహిణి |

ఇక్కడ సంధిలో ఊహినిశబ్ద నకారానికి ణకారం నిత్యం.

కర్కాటులకు అంధ్వాదులు పరమైతే పరరూపం బహుళం. ౮౯

సవర్ణదీర్ఘాదివిధులకు బాధకం.

| | | | | |
|---|---|---|---|---|
| కర్క | .... | అంధువు | .... | కర్కంధువు |
| శక | .... | అంధువు | .... | శకంధువు |
| పృక | .... | అంధువు | .... | పృకంధువు |
| కుల | .... | అట | .... | కులట |
| సార | .... | అంగం | .... | సారంగం |
| సీమ | .... | అంతం | .... | సీమంతం |
| వేద | .... | అండం | .... | వేదండం |
| హల | .... | ఈష | .... | హలీష |
| లాంగల | .... | ఈష | .... | లాంగలీష |
| ఉష్ణ | .... | ఈషం | .... | ఉష్ణీషం |
| మస్త | .... | ఇష్కం | .... | మస్తిష్కం |
| మంజు | .... | ఈరం | .... | మంజీరం |

| | | | | |
|---|---|---|---|---|
| శివాయ | .... | ఓంనమః | .... | శివాయోంనమః |
| పతత్ | .... | అంజలి | .... | పతంజలి |
| మనస్ | .... | ఈష | .... | మనీష |

ఇత్యాదులు.

| | | | | |
|---|---|---|---|---|
| మార్త | .... | అండుడు | .... | మార్తండుడు / మార్తాండుడు |
| మమ | .... | ఏకం | .... | మమేకం / మమైకం |

ఇక్కడ బాహుళకంచేత పరరూపం విభాషగా వస్తుంది. పరరూపం రాని పక్షంలో సవర్ణదీర్ఘవృద్ధి విధులు ప్రవర్తిస్తాయి.

బలిష్ఠమైన అనే అర్థాన్ని వివక్షిస్తున్నప్పుడు సారశబ్దానికి అంగశబ్దం పరమైనా; పరిహద్దు అనే అర్థాన్ని వివక్షిస్తున్నప్పుడు సీమశబ్దానికి అంతశబ్దం పరమైనా బహుళగ్రహణంచేత పరరూపంరాదు. సవర్ణదీర్ఘమే వస్తుంది.

| | | | | |
|---|---|---|---|---|
| సార | .... | అంగం | .... | సారాంగం |
| సీమ | .... | అంతం | .... | సీమాంతం |

సారంగం అంటే తుమ్మెద లేక లేడి - సీమంతం అనగా ఊరు - పాపట - అని అర్థాలు. పతంజలి - మనీష అన్నప్పుడు మధ్యగాలైన తకార సకారాలకు లోపం రావడం బహుళగ్రహణంచేత అన్యకార్యమని గ్రహించాలి.

పదం తుది ఏ ఓ ల మీది అత్వానికి లోపం వస్తుంది. ౬౦

| | | | | |
|---|---|---|---|---|
| విశ్వకర్త్రే | .... | అక్షరుడు | .... | విశ్వకర్త్రేక్షరుడు |
| మనో | .... | అభిలాష | .... | మనోభిలాష |
| దాసో | .... | అహం | .... | దాసోహం |

ఇత్యాదులు.

ఇక్కడ ఏకారంమీది ప్రయోగాలు చాలా అరుదు.

అచ్చు పరమైతే ఓ ఐ ఔ లకు అవాయావ్‌ల ఆదేశం బహుళం. ౬౧

అచ్చుపరమైతే ఓకారానికి అవ్ - ఐకారానికి అయ్ - ఔకారానికి ఆవ్ - అనేవి ఆదేశాలవుతాయని తాత్పర్యం.

| | | | | |
|---|---|---|---|---|
| ద్యో | .... | అధినాథుడు | .... | ద్యవధినాథుడు |
| రై | .... | ఆళ | .... | రాయాళ |
| గ్లౌ | .... | ఉదయం | .... | గ్లావుదయం |

మొదలైనవి.

బహుళగ్రహణంచేత అత్వంపరమైతే గోశబ్ద ఓత్వానికి అవ్‌రాదు. ఆత్వాదులు పరమైతే అవాదేశం వైకల్పికం.

| | | | | |
|---|---|---|---|---|
| గో | .... | ఆలయం | .... | గవాలయం |
| గో | .... | ఇందువు | .... | గవిందువు |
| గో | .... | ఈశుడు | .... | గవీశుడు |

ఇత్యాదు లూహ్యాలు.

అచ్చు పరమైతే గోశబ్దానికి గవ ఆదేశం వైకల్పికం. కాని గవాదేశంవస్తే సవర్ణదీర్ఘాదిసంధులు ప్రవర్తిస్తాయి.

| | | | | |
|---|---|---|---|---|
| గో | .... | అశ్వాలు | .... | గవాశ్వాలు<br>గోశ్వాలు<br>గోఅశ్వాలు |
| గో | .... | ఆలయం | .... | గవాలయం<br>గోఆలయం |
| గో | .... | ఈశ్వరుడు | .... | గవేశ్వరుడు<br>గవీశ్వరుడు<br>గోఈశ్వరుడు |
| గో | .... | ఐశ్వర్యం | .... | గవైశ్వర్యం<br>గోఐశ్వర్యం |
| గో | .... | ఓఘం | .... | గవౌఘం<br>గవోఘం<br>గోఓఘం |
| గో | .... | ఋణం | .... | గవర్ణం<br>గవఋణం<br>గవృణం<br>గోఋణం |

ఇత్యాదులు.

ఇ ఈ ఏ ఉ ఊ ఓ వర్ణాలు పరమైతే గవాదేశ అవాదేశసంధిప్రకృతి భావాలతో మూడురూపాలు — అ ఐ ఔ లు పరమైనప్పుడు గవాదేశ అవాదేశాలువచ్చి

ఒకేవిధమైనరూపం సిద్ధిస్తుంది కాబట్టి ప్రకృతిభావంతో కలిపి రెండు రూపాలు - ఋకారం పరమైనప్పుడు గవాదేశ గుణసంధిరూప ప్రకృతిభావరూపాలు రెండు - అవాదేశ రూపం ఒకటి - గవఅవాదేశాలు రెండూ రాకుండా నిలిచే ప్రకృతిభావ రూపం ఒకటి - మొత్తం నాలుగురూపాలు.

ఇ ఉ ఋల కచ్చు పరమైతే య వ రలు తరచుగా ఆదేశమౌతాయి. ౬౩

| | | | | |
|---|---|---|---|---|
| అతి | .... | అధికం | .... | అత్యధికం |
| గురు | .... | ఆజ్ఞ | .... | గుర్వాజ్ఞ |
| మాతృ | .... | అనుజ్ఞ | .... | మాత్రనుజ్ఞ |

మొదలైనవి.

త్రిశబ్దానికి అంబకశబ్దం పరమైతే యకారాగమం వైకల్పికంగా కనిపిస్తున్నది. త్రియంబకం - యణాదేశంవస్తే త్ర్యంబకం.

అచ్చుకు ఋకారం పరమైతే సంధి వైకల్పికం. ౬౪

సంధి అని సామాన్యంగా చెప్పడంచేత ఇక్కడ ప్రోక్తాలైన అచ్ సంధులన్నీ ఋకారవిషయంలో వైకల్పికప్రవృత్తి కలవని తాత్పర్యం.

| | | | | |
|---|---|---|---|---|
| పితృ | .... | ఋణం | .... | పితృఋణం |
| బ్రహ్మ | .... | ఋషి | .... | బ్రహ్మఋషి |
| మహా | .... | ఋషి | .... | మహాఋషి |
| మహీ | .... | ఋషి | .... | మహీఋషి |

పక్షంలో పిత్రృణం - బ్రహ్మర్షి - మహర్షి - మహ్యృషి - ఇత్యాదులూహ్యాలు.

అ జ ఝల్లులు పరమైతే పరుషాలకు సరళాలు బహుళం. ౬౫

| | | | | |
|---|---|---|---|---|
| వాక్ | .... | ఈశుడు | .... | వాగీశుడు |
| అచ్ | .... | అంతం | .... | అజంతం |
| రాట్ | .... | ఆదులు | .... | రాడాదులు |
| మరుత్ | .... | ఇష్టుడు | .... | మరుదిష్టుడు |
| కకుప్ | .... | అధిపతి | .... | కకుబధిపతి |
| దిక్ | .... | దంతి | .... | దగ్దంతి |

| | | | | |
|---|---|---|---|---|
| అచ్ | .... | భాగం | .... | అజ్భాగం |
| రాట్ | .... | గణం | .... | రాడ్గణం |
| తత్ | .... | దానం | .... | తద్దానం |
| అప్ | .... | రాశి | .... | అబ్రాశి |

ఇత్యాదులు గ్రహించాలి.

బాహుళకంచేత వర్గ ప్రథమద్వితీయవర్ణాలు శ ష స లు పరమైతే యీ కార్యంలేదు.

జ ఝలు డ ఢలు పరమైతే తకారానికి జకారం డకారం వస్తుంది. ౯౬

| | | | | |
|---|---|---|---|---|
| తత్ | .... | జాతి | .... | తజ్జాతి |
| తత్ | .... | ఝరం | .... | తజ్ఝరం |
| తత్ | .... | డమరు | .... | తడ్డమరు |
| తత్ | .... | ఢాంఢమితం | .... | తడ్ఢాంఢమితం |

మొదలైనవి.

యావజ్జీవశిక్ష విధిస్తాను — పి — 47 —

లకారం పరమైతే తకారానికి లకారం నిత్యం. ౯౭

| | | | | |
|---|---|---|---|---|
| తత్ | .... | లీల | .... | తల్లీల |
| సత్ | .... | లలితం | .... | సల్లలితం |

ఇత్యాదులు.

ఈ లాదేశకార్యం వైకల్పికమని సూచిస్తూ అనంతామాత్యుడు తన ఛందో దర్పణంలో తద్లీలశబ్దాన్ని పేర్కొన్నాడు. అది వ్యవహారవిరుద్ధం కాబట్టి నిరాకరం.

పరుషాలకు పరమైన హకారానికి త త్తద్వర్గతురీయాక్షరాలాదేశమౌతాయి. ౯౮

కకారానికి పరమైన హకారానికి ఘకారం-చకారానికి పరమైన హకారానికి ఝకారం - టకారానికిపరమైన హకారానికి ఢకారం - తకారానికి పరమైన హకారానికి ధకారం-పకారానికిపరమైన హకారానికి భకారంవస్తుందనితాత్పర్యం- అజ్ఝల్లులుపరమైతే ఇత్యాది విధిచేత పరుషాలకు సరళాలు.

| | | | | |
|---|---|---|---|---|
| వాక్ | .... | హరి | .... | వాగ్ఘరి |
| అచ్ | .... | హల్లులు | .... | అజ్ఝల్లులు |
| రాట్ | .... | హంత | .... | రాడ్ఢంత |
| జగత్ | .... | హితం | .... | జగద్ధితం |
| కకుప్ | .... | హస్తులు | .... | కకుబ్భస్తులు |

ఇత్యాదులూహ్యాలు.

ఏకపదంలోనే అయినా దుఃఖశబ్దవిషయంలో ఈసంధి వ్యత్యస్తంగా కని పిస్తున్నది. దుఃఖశబ్దం విసర్గకు వక్ష్యమాణవిధిచేత హకారంవచ్చి ఖకారపరక హకారానికి పరసవర్ణమహాప్రాణం ఘకారం కనిపిస్తున్నది. దుఃఖం-దుహ్ఖం-దుఖ్ఘం.

న మలు పరమైతే పరుషాలకు తత్తద్వర్గానునాసికాదేశం బహుళం. ఉదా

| | | | | |
|---|---|---|---|---|
| వాక్ | .... | నైపుణ్యం | .... | వాఙ్నైపుణ్యం |
| వాక్ | .... | మాధుర్యం | .... | వాఙ్మాధుర్యం |
| రాట్ | .... | నిలయం | .... | రాణ్నిలయం |
| విరాట్ | .... | మయం | .... | విరాణ్మయం |
| జగత్ | .... | నాథుడు | .... | జగన్నాథుడు |
| జగత్ | .... | మాత | .... | జగన్మాత |

మొదలైనవి.

బాహుళకంచేత న మలు పరమైతే చ ప లకు అనునాసికాదేశం రాదు. తక్కినచోట్ల అనునాసికాదేశం నిత్యం -

| | | | | |
|---|---|---|---|---|
| అచ్ | .... | నాదం | .... | అజ్నాదం |
| అచ్ | .... | మయం | .... | అజ్మయం |
| అప్ | .... | నాథుడు | .... | అబ్నాథుడు |
| అప్ | .... | మయం | .... | అబ్మయం |

ఇటువంటిచోట్ల అఞ్నాదం - అఞ్మయంవంటి రూపాలు ప్రాచీనశాబ్దిక ప్రోక్తాలే అయినా వ్యవహారంలో శ్రావ్యాలుకావు. వైకల్పికంగా అనునాసిక చెప్పిన ప్రాచీనులు వాగ్నైపుణ్యాది సరళసంయుక్తరూపాలను ఆమోదించారు - కాని అవి వ్యవహారభ్రష్టాలు - ఈషణ్మాత్రం - మృణ్మయం - (షట్ - నవతి)

షణ్ణవతి - ఇత్యాదుల్లో నకారాలకు ణకారం రావడం బాహుళకంచేతనేనని గ్రహించాలి. ఒకచోట తెలుగుపదం పరమైనప్పుడుసైతం ఈ అనునాసికాదేశం కనిపిస్తున్నది.

యావత్ .... మంది .... యావన్మంది

తాము యావన్మందిఖేచరశక్తికలవారు మా – 31 – యావన్మందీ మంచిని చెప్పుకోవడం జరుగదు – మా – 57 –

నమలు పరమైతే కకారానికి బిందుపూర్వక గకారం వైకల్పికం. ౧౦౦

ఇది అనునాసికాదేశవిధికి పాక్షికంగా బాధకం.

| | | | | |
|---|---|---|---|---|
| వాక్ | .... | నైపుణ్యం | .... | వాంగ్నైపుణ్యం |
| వాక్ | .... | నాదం | .... | వాంగ్నాదం |
| వాక్ | .... | మయం | .... | వాంగ్మయం |
| వాక్ | .... | మాధుర్యం | .... | వాంగ్మాధుర్యం |

ఇత్యాదులు గుర్తించాలి.

పక్షంలో పూర్వోక్తవిధిచేత అనునాసికాదేశంనిత్యం. ఈపాక్షికబిందుపూర్వకగకారరూపాలను నిత్యరూపాలుగా గ్రహించి ఒకానొక రచయిత అనునాసికాదేశరూపాలు ప్రయోగయోగ్యాలుకావని పేర్కొన్నారు. అది నిరాకరం.

పరుషాలకు పరమైన శాకు ఛకారం బహుళం. ౧౦౧

| | | | | |
|---|---|---|---|---|
| వాక్ | .... | శరాలు | .... | వాక్ఛరాలు / వాక్శరాలు |
| అచ్ | .... | శుతం | .... | అచ్ఛుతం / అచ్శుతం |
| రాట్ | .... | శాసనం | .... | రాట్ఛాసనం / రాట్శాసనం |
| అప్ | .... | శీకరం | .... | అప్ఛీకరం / అప్శీకరం |
| తత్ | .... | శాస్త్రం | .... | తాచ్ఛాస్త్రం |
| విద్యుత్ | .... | శక్తి | .... | విద్యుచ్ఛక్తి |

ఇత్యాదులూహ్యాలు.

బహుళగ్రహణంచేత తకారంమీది శాకు ఛకారం నిత్యం. తచ్ఛాస్త్రం వంటి చ శల సంయుక్తరూపాలు సులభోచ్చారణ కసాధ్యాలు. కాబట్టి ఇటువంటి చోట్ల ఛకారానికి నిత్యప్రవృత్తి పేర్కొనబడింది.

చ ఛ శలు పరమైతే తకారానికి చకారం వస్తుంది. ౧౦౨

మరుత్ .... చలనం .... మరుచ్చలనం
తత్ .... ఛాగం .... తచ్ఛాగం
లసత్ .... శరం .... లసచ్ఛరం
మొదలైనవి.

ట ఠ లు పరమైతే తకారానికి టకారం వస్తుంది. ౧౦౩

తత్ .... టీక .... తట్టీక
తత్ .... ఠక్కురులు .... తట్ఠక్కురులు
ఇత్యాదులు.
ఠక్కురులంటే దేవతలు.

చ ఛ శలు పరమైతే సకారాంతపదాల తుది సాకు శా వస్తుంది. ౧౦౪

మనస్ .... చలనం .... మనశ్చలనం
దుస్ .... చరిత్ర .... దుశ్చరిత్ర
మనస్ .... ఛిద్రం .... మనశ్ఛిద్రం
దుస్ .... ఛదం .... దుశ్ఛదం
మనస్ .... శాంతి .... మనశ్శాంతి
దోస్ .... శక్తి .... దోశ్శక్తి
మొదలైనవి.

క ఖ ప ఫలు పరమైతే సకారానికి విసర్గ బహుళం. ౧౦౫

మనస్ .... కమలం .... మనఃకమలం
మనస్ .... ఖేదం .... మనఃఖేదం
పయస్ .... పానం .... పయఃపానం
తపస్ .... ఫలం .... తపఃఫలం

ఇత్యాదుల్లో విసర్గనిత్యం - బహుళగ్రహణచేత అనవ్యయసకారానికి పాశాదులు పరమైతే విసర్గరాదు. అది శబ్దంచేత పాశ - కల్ప - క - కామ్యప్రత్యయాలు గ్రాహ్యాలు.

| | | | | |
|---|---|---|---|---|
| పయస్ | .... | పాశం | .... | పయస్పాశం |
| యశస్ | .... | కల్పం | .... | యశస్కల్పం |
| సుయశస్ | .... | క | .... | సుయశస్కుడు |
| యశస్ | .... | కామ్య | .... | యశస్కామ్య |

ఇత్యాదులు.

అనవ్యయ సకారానికి అనడంచేత

| | | | | |
|---|---|---|---|---|
| ప్రాతస్ | .... | కల్పం | .... | ప్రాతఃకల్పం |

ఇత్యాదుల్లో విసర్గ రక్షింపబడింది.

క్షకారం పరమైతే విసర్గకు లోపం వైకల్పికం. ౧౦౬

మనఃక్షోభం - మనక్షోభం - తపఃక్షాంతి - తపక్షాంతి.

ఇత్యాదులూహ్యాలు.

కారాదులు పరమైతే అనవ్యయసకారానికి సద్యస్సకారానికి విసర్గరాదు. ౧౦౭

కార - కామ - కాంత - కుంభ - కర్ణి - కుశ - పాత్రాదులు కారాదులు.

| | | | | |
|---|---|---|---|---|
| అయస్ | .... | కారుడు | .... | అయస్కారుడు |
| సద్యస్ | .... | కం | .... | సద్యస్కం |
| శ్రేయస్ | .... | కాముడు | .... | శ్రేయస్కాముడు |
| అయస్ | .... | కాంతం | .... | అయస్కాంతం |
| పయస్ | .... | కుంభం | .... | పయస్కుంభం |
| అయస్ | .... | పాత్రం | .... | అయస్పాత్రం |
| పయస్ | .... | కుశలు | .... | పయస్కుశలు |
| అయస్ | .... | కర్ణి | .... | అయస్కర్ణి |

ఇత్యాదులు.

అనవ్యయ మనడంచేత

| | | | | |
|---|---|---|---|---|
| స్వస్ | .... | కాముడు | .... | స్వఃకాముడు |

ఇత్యాదుల్లో విసర్గ వస్తుంది.

భాస్సాదుల సకారానికి కకారాదులు పరమైతే విసర్గరాదు. ౧౦౮

| | | | | |
|---|---|---|---|---|
| భాస్ | .... | కరుడు | .... | భాస్కరుడు |
| అహస్ | .... | కరుడు | .... | అహస్కరుడు |
| సద్యస్ | .... | కాలం | .... | సద్యస్కాలం |
| అయస్ | .... | కాంతం | .... | అయస్కాంతం |
| కౌతస్ | .... | కుతుడు | .... | కౌతస్కుతుడు |
| తమస్ | .... | కాండం | .... | తమస్కాండం |
| మేదస్ | .... | పిండం | .... | మేదస్పిండం |
| దివస్ | .... | పతి | .... | దివస్పతి |
| శునస్ | .... | కర్ణం | .... | శునస్కర్ణం |
| తిరస్ | .... | కారం | .... | తిరస్కారం |
| నమస్ | .... | కారం | .... | నమస్కారం |
| పురస్ | .... | కారం | .... | పురస్కారం |

ఇత్యాదులు.

తిరస్ - నమస్ శబ్దాల సకారానికి విసర్గ వైకల్పికమంటారు కాని అది వ్యవహారంలో అప్రసిద్ధం.

సమాసప్రథమాలైన అధస్ - శిరస్ శబ్దాల సకారానికి విసర్గరాదు. ౧౦౯

అధస్పదం - శిరస్పదం - మొదలైనవి.

ప్రథమశబ్దప్రయోగంచేత పరమశిరఃపదం ఇత్యాదుల్లో విసర్గవస్తుంది.

క ఖ ప ఫలు పరమైతే ముహుర్భిస్సు ఇసుసంత శబ్దోపసర్గల సకారానికి షకారం వస్తుంది. ౧౧౦

ఇసుసంతశబ్దోపసర్గల సకారానికి అనగా ఇస్ - ఉస్ - అంతంలోగల శబ్దాలసకారానికి - ఉపసర్గల తుది సకారానికి - అని అర్థం.

| | | | | |
|---|---|---|---|---|
| బహిస్ | .... | కారం | .... | బహిష్కారం |
| సర్పిస్ | .... | కుండిక | .... | సర్పిష్కుండిక |
| సర్పిస్ | .... | కం | .... | సర్పిష్కం |
| సర్పిస్ | .... | కామ్య | .... | సర్పిష్కామ్య |

| | | | | |
|---|---|---|---|---|
| నిస్ | .... | కారణం | .... | నిష్కారణం |
| దుస్ | .... | కరం | .... | దుష్కరం |
| ప్రాదుస్ | .... | కరం | .... | ప్రాదుష్కరం |
| ధనుస్ | .... | కోటి | ... | ధనుష్కోటి |
| ధనుస్ | .... | ఖండం | .... | ధనుష్ఖండం |
| సర్పిస్ | .... | కల్పం | .... | సర్పిష్కల్పం |
| సర్పిస్ | .... | పాశం | .... | సర్పిష్పాశం |
| చతుస్ | .... | పథం | .... | చతుష్పథం |
| చతుస్ | .... | పంచాశత్ | .... | చతుష్పంచాశత్ |
| ధనుస్ | .... | ఫలకం | .... | ధనుష్ఫలకం |

ఇత్యాదులు.

ముహుర్భిన్న శబ్దప్రయోగంచేత ముహుస్ సకారానికి షకారంరాదు

ముహుస్ .... కాముకు .... ముహుఃకాముకు.

అసవ్యయాలై సమాసంలో అనాద్యపదస్థాలైన ఇసుసంత పదాల సకారానికి విసర్గ నిత్యం. ౧౧౧

| | | | | |
|---|---|---|---|---|
| పరమసర్పిస్ | .... | కుండిక | .... | పరమసర్పిఃకుండిక |
| పరమధనుస్ | .... | ఖండం | .... | పరమధనుఃఖండం |

ఇత్యాదులు.

పూర్వోక్తవిధిలోని సర్పిష్కుండికాది షకార ప్రయోగాల ప్రభావంచేత సమాసంలో సైతం పరమసర్పిష్కుండిక ఇత్యాది షత్వరూపాలు సంస్కృత వ్యాకరణానభిజ్ఞులైన శిష్టజనులవ్యవహారంలో సకృత్తుగా కనిపిస్తున్నాయి.

పాశాదులు పరమైతే దోస్ సకారానికి షకారం వస్తుంది. ౧౧౨

పాశ - కల్ప - క - కామ్యప్రత్యయాలు పాశాదులు.

| | | | | |
|---|---|---|---|---|
| దోస్ | .... | పాశం | .... | దోష్పాశం |
| దోస్ | .... | కల్పం | .... | దోష్కల్పం |

మొదలైనవి ఊహ్యాలు.

టఠలు పరమైతే సకారానికి షకారం వస్తుంది. ౧౧౩

| | | | | |
|---|---|---|---|---|
| అయస్ | .... | టంకం | .... | అయష్టంకం |
| మనస్ | .... | షట్పదం | .... | మనష్షట్పదం |

| | | | | |
|---|---|---|---|---|
| చతుస్ | .... | షష్టి | .... | చతుష్షష్టి |

ఇత్యాదులు గ్రాహ్యాలు.

బహిశ్శబ్ద సకారానికి లోపం మీది స్థా సకారానికి షకారం థాకు తా కనిపిస్తున్నది. ౧౧౪

| | | | | |
|---|---|---|---|---|
| బహిస్ | .... | స్థ | .... | బహిష్ఠ |

రజోర్థంలో బహిష్ఠఅత్వానికి ఉత్వం హ థలకు య ట లు నిత్యవిభాషలుగా కనిపిస్తున్నవి. ౧౧౫

అత్వానికి ఉత్వం నిత్యం - హకారానికి యకారం విభాష - థకారానికి టకారంవిబాష అనిఅర్థం. బహిష్ఠు - బహిష్టు - బయిష్ఠు - బయిష్టు - పాక్షికంగా వక్ష్యమాణ విధిచేత అయికి వక్రతమం.బైష్ఠు - బైష్టు.

అత్వ హల్లులు పరమైతే అసంతపదాల సకారానికి లోపం పూర్వమందలి అత్వానికి ఓత్వం బహుళం. ౧౧౬

| | | | | |
|---|---|---|---|---|
| దాసస్ | .... | అహం | .... | దాసోహం |
| మనస్ | .... | అభిలాష | .... | మనోభిలాష |
| మనస్ | .... | గతి | .... | మనోగతి |
| అయస్ | .... | మయం | .... | అయోమయం |
| మనస్ | .... | జవం | .... | మనోజవం |
| సర్వతస్ | .... | ముఖం | .... | సర్వతోముఖం |
| యశస్ | .... | ధనుడు | .... | యశోధనుడు |
| మనస్ | .... | దయితుడు | .... | మనోదయితుడు |
| తపస్ | .... | ధనుడు | .... | తపోధనుడు |
| మనస్ | .... | నేత్రం | .... | మనోనేత్రం |
| తపస్ | .... | బలం | .... | తపోబలం |
| శిరస్ | .... | భారం | .... | శిరోభారం |
| తేజస్ | .... | మూర్తి | .... | తేజోమూర్తి |
| మనస్ | .... | యాత్ర | .... | మనోయాత్ర |
| శ్రేయస్ | .... | రాజ్యం | .... | శ్రేయోరాజ్యం |

| | | | | |
|---|---|---|---|---|
| శ్రేయస్ | .... | లాభం | .... | శ్రేయోలాభం |
| మనస్ | .... | వేగం | .... | మనోవేగం |
| తపస్ | .... | హోమం | .... | తపోహోమం |

ఇత్యాదులూహ్యాలు.

బాహుళకంచేత వర్గప్రథమద్వితీయవర్ణాలు - శ ష స లు - పరమైతే యీ కార్యంరాదు. బహుళగ్రహణంచేతనే ఋభశబ్దం పరమైతే ఉషస్ శబ్దసకారానికి అన్యత్కార్యంగా రేఫ వస్తుంది. ఉషర్బుధుడు. ఇక్కడ సలోప ఓత్వాలురావని గ్రహించాలి. - దుర్వాస శబ్దానికి ఓత్వం వైకల్పికం - సలోపంనిత్యం.

| | | | | |
|---|---|---|---|---|
| దుర్వాసస్ | .... | మహాముని | .... | దుర్వాసమహాముని / దుర్వాసోమహాముని |

బహుళగ్రహణంచేత వంత - పరమైతే సలోపఓత్వాలు వైకల్పికం - వి - వలలు పరమైతే సలోపఓత్వాలు రావు.

| | | | | |
|---|---|---|---|---|
| తేజస్ | .... | వంతుడు | .... | తేజస్వంతుడు / తేజోవంతుడు |
| యశస్ | ... | వతి | .... | యశస్వతి / యశోవతి |
| యశస్ | .... | వి | ... | యశస్వి |
| ఊర్జస్ | .... | వలుడు | .... | ఊర్జస్వలుడు |

అచ్చుపరమైతే మనశ్శబ్దసకారానికి ఒకచోట లోపం పూర్వపరస్వరాలకు గుణం కనిపిస్తున్నది.

| | | | | |
|---|---|---|---|---|
| మనస్ | .... | ఉల్లాసం | .... | మనోల్లాసం |

అజ్ఝల్లులు పరమైతే సకారానికి రేఫ బహుళం. ౧౧౭

బహుళగ్రహణంచేత వర్గ ప్రథమ ద్వితీయవర్ణాలు - శ ష స లు - పరమైతే రేఫరాదు.

| | | | | |
|---|---|---|---|---|
| బహిస్ | .... | అంగం | .... | బహిరంగం |
| ఆశీస్ | .... | అనంతరం | .... | ఆశీరనంతరం |
| దుస్ | .... | అంతం | .... | దురంతం |
| దోస్ | .... | అంతరం | .... | దోరంతరం |
| ఉచ్చైస్ | .... | ఆరావం | .... | ఉచ్చైరారావం |
| బహిస్ | .... | గమనం | .... | బహిర్గమనం |

| | | | | |
|---|---|---|---|---|
| ఉచ్చైస్ | .... | ధ్వని | .... | ఉచ్చైర్ధ్వని |
| దోస్ | .... | బలం | .... | దోర్బలం |
| ధనుస్ | .... | బాణాలు | .... | ధనుర్బాణాలు |
| చతుస్ | .... | ముఖుడు | .... | చతుర్ముఖుడు |
| ఆశీస్ | .... | వాదం | .... | ఆశీర్వాదం |
| జ్యోతిస్ | .... | విదులు | .... | జ్యోతిర్విదులు |
| ఆయుస్ | .... | వేదం | .... | ఆయుర్వేదం |

మొదలైనవి.

పదాంత సకారం అనక సకారం అనడంచేత స్వస్ - అంతస్ - ప్రాతస్-పునస్ - అహస్ - శబ్దాల సకారానికి రేఫ వస్తుంది.

| | | | | |
|---|---|---|---|---|
| స్వస్ | .... | ఆనందం | .... | స్వరానందం |
| అంతస్ | .... | అంగం | .... | అంతరంగం |
| ప్రాతస్ | .... | అశనం | .... | ప్రాతరశనం |
| పునస్ | .... | ఆగమనం | .... | పునరాగమనం |
| అహస్ | .... | అహం | .... | అహరహం |
| అహస్ | .... | గణం | .... | అహర్గణం |
| స్వస్ | .... | గంగ | .... | స్వర్గంగ |
| అంతస్ | .... | భాగం | .... | అంతర్భాగం |
| ప్రాతస్ | .... | యానం | .... | ప్రాతర్యానం |
| పునస్ | .... | మౌనం | .... | పునర్మౌనం |

మొదలైనవి.

బహుళగ్రహణంచేత పతి పుత్ర శబ్దాలు పరమైతే అహశ్శబ్ద సకారానికి రేఫ పాక్షికంగావస్తుంది.

| | | | | |
|---|---|---|---|---|
| అహస్ | .... | పతి | .... | అహర్పతి / అహఃపతి |
| అహస్ | .... | పుత్రుడు | .... | అహర్పుత్రుడు / అహఃపుత్రుడు |

రేఫ పరమైతే సకారానికి లోపం పూర్వస్వరానికి దీర్ఘం

బహుళం. ౧౧౮

| | | | | |
|---|---|---|---|---|
| స్వస్ | .... | రాజ్యం | .... | స్వారాజ్యం |
| ఆశీస్ | .... | రవం | .... | ఆశీరవం |

నిస్ .... రంధ్రం .... నీరంధ్రం

చక్షుస్ .... రాగం .... చక్షూరాగం

ధనుస్ .... రావం .... ధనూరావం

ఇత్యాదులు గుర్తించాలి.

బాహుళకంచేత అంతస్ - రోగం - అంతర్రోగం - పునస్ - రతి - పునర్రతి - ఇత్యాదుల్లో సకారానికి లోపంరాదు - అంతారోగం - పునారతి ఇత్యాదులు వ్యవహారంలో అప్రసిద్ధాలేరాక అన్యార్థద్యోతకాలుకూడా అయినందువల్ల అపరిగ్రాహ్యాలు. అహశ్శబ్దసకారానికి రూపాదులు పరమైతే బహుళ గ్రహణంచేత లోపంరాదు. అత్వం హల్లులు పరమైతే ఇత్యాదిపూర్వోక్తవిధిచేత సలోపం అత్వానికి ఓత్వంవస్తుంది. రూప - రాత్ర - రథంతరాలు రూపాదులు.

అహస్ ... రూపం .... అహోరూపం

అహస్ .... రాత్రాలు .... అహోరాత్రాలు

అహస్ .... రథంతరాలు .... అహోరథంతరాలు

స్వర్ - అంతర్ - పునర్ - ప్రాతర్ - ఈనాలిగింటిని రేఫాంతాలుగాను అహశ్శబ్దాన్ని సకారాంతంగాను సంస్కృత వ్యాకరణకర్తలు పేర్కొన్నా యిక్కడ ప్రక్రియాసౌలభ్యాపేక్షతో సకారాంతాలుగా పఠింపబడ్డాయి.

అచ్చులు అంతస్థలు పరమైన వర్గప్రథమ ద్వితీయవర్ణాలు పరమైతే పుంశ్శబ్దానికి సకారం ఆగమంగా వస్తుంది. ౧౧౯

విధానసామర్థ్యంచేత ఈసకారానికి విసర్గరాదు.

పుం .... కోకిల .... పుంస్కోకిల

పుం .... త్వం .... పుంస్త్వం

పుం .... పికం .... పుంస్పికం

మొదలైనవి ఊహ్యాలు.

అచ్చుకు ఛకారం పరమైతే చకారాగమం బహుళం. ౧౨౦

బాహుళకంచేత హ్రస్వాచ్చుకు ఛకారం పరమైతే చకారాగమంనిత్యం. దీర్ఘాచ్చుకు ఛకారం పరమైతే చకారాగమం వైకల్పికం.

శివ .... ఛాయ .... శివచ్ఛాయ

తరు .... ఛాయ .... తరుచ్ఛాయ

| | | | | |
|---|---|---|---|---|
| శాఖా | .... | ఛాయ | .... | శాఖాఛాయ<br>శాఖాచ్ఛాయ |
| లక్ష్మీ | .... | ఛాయ | .... | లక్ష్మీఛాయ<br>లక్ష్మీచ్ఛాయ |

మొదలైనవి.

పతి పుత్ర శబ్దాలు పరమైతే గిర్ ధూర్‌ల రేఫకు విసర్గ వైకల్పికం. ౧౨౧

| | | | | |
|---|---|---|---|---|
| గిర్ | .... | పతి | .... | గీఃపతి<br>గిర్పతి |
| గిర్ | .... | పుత్రుడు | .... | గీఃపుత్రుడు<br>గిర్పుత్రుడు |
| ధూర్ | .... | పతి | .... | ధూఃపతి<br>ధూర్పతి |
| ధూః | .... | పుత్రుడు | .... | ధూఃపుత్రుడు<br>ధూర్పుత్రుడు |

పతి పుత్ర శబ్దాలు పరమైతే గిర్ రేఫకు షకారం విభాష. ౧౨౨

| | | | | |
|---|---|---|---|---|
| గిర్ | .... | పతి | .... | గిష్పతి |
| గిర్ | .... | పుత్రుడు | .... | గిష్పుత్రుడు |

అచ్చు పరమైతే దివ్ శబ్దానికి అత్వాంతత్వం బహుళం. ౧౨౩

దివ్ శబ్దానికి హ్రస్వాచ్చుపరమైతే అత్వాంతత్వం నిత్యం - దీర్ఘాచ్చుపరమైతే వైకల్పికం.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| దివ్ | .... | అంగన | .... | దివ | .... | అంగన | .... | దివాంగన |
| దివ్ | .... | అధిపతి | .... | దివ | .... | అధిపతి | .... | దివాధిపతి |
| దివ్ | .... | ఈశుడు | .... | దివ<br>దివ్ | .... | ఈశుడు | .... | దివేశుడు<br>దివీశుడు |
| దివ్ | .... | ఊఢ | .... | దివ<br>దివ్ | .... | ఊఢ | .... | దివోఢ<br>దివూఢ |

మొదలైనవి.

ఓకశ్శబ్ద ఓకారం పరమైతే బహుళగ్రహణంచేత అత్వాంతత్వం నిత్యం.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| దివ్ | .... | ఓకసులు | .... | దివ | .... | ఓకసులు | .... | దివౌకసులు |

అజ్ఝల్లులు పరమైతే దివ్ శబ్దానికి ద్యుద్యోల ఆదేశం బహుళం. ౧౩౪

| | | | | |
|---|---|---|---|---|
| ద్యు | .... | ఉద్యానం | .... | ద్యూద్యానం |
| ద్యో | .... | ఉద్యానం | .... | ద్యవుద్యానం |
| దివ్ | .... | ఉద్యానం | .... | దివుద్యానం |
| దివ | .... | ఉద్యానం | .... | దివోద్యానం |

ఇత్యాదులూహ్యాలు.

బహుళగ్రహణంచేత సమాసంలో హల్లు పరమైతే దివ్శబ్దానికి పర్యాయంగా ద్యుద్యోల ఆదేశం నిత్యం. అనగా హల్లుపరమైనప్పుడు సమాసంలో దివ్ రూపం ఉండదని తాత్పర్యం. అచ్చుపరమైతే దివ్ శబ్దానికి ద్యుద్యోల ఆదేశం వైకల్పికం.

| | | | | |
|---|---|---|---|---|
| దివ్ | .... | లోకం | .... | ద్యులోకం<br>ద్యోలోకం |
| దివ్ | .... | మణి | .... | ద్యుమణి<br>ద్యోమణి |
| దివ్ | .... | చరులు | .... | ద్యుచరులు<br>ద్యోచరులు |

మొదలైనవి గ్రాహ్యాలు.

పుష్పాదులకు ధయ పరమైతే బిందువు ఆగమంగా వస్తుంది. ౧౩౫

| | | | | |
|---|---|---|---|---|
| పుష్ప | .... | ధయం | .... | పుష్పంధయం |
| స్తన | .... | ధయం | .... | స్తనంధయం |
| ముష్టి | .... | ధయం | .... | ముష్టింధయం |

కుల ధురలకు ధర పరమైతే బిందువు ఆగమంగా వస్తుంది. ౧౩౬

| | | | | |
|---|---|---|---|---|
| కుల | .... | ధరుడు | .... | కులంధరుడు |
| ధుర | .... | ధరుడు | .... | ధురంధరుడు |

ఘర పరమైతే ఘూర్‌కు ఘురాదేశం వైకల్పికం. ౧౨౭

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఘూర్ | .... | ఘరుడు | .... | ఘురంఘరుడు<br>ఘూర్ఘరుడు |

శివాదులకు కర పరమైతే బింద్వాగమం వైకల్పికం. ౧౨౮

| | | | | |
|---|---|---|---|---|
| శివ | .... | కరుడు | .... | శివంకరుడు<br>శివకరుడు |
| శుభ | .... | కరుడు | .... | శుభంకరుడు<br>శుభకరుడు |
| వశ | .... | కరుడు | .... | వశంకరుడు<br>వశకరుడు |
| నాశ | .... | కరుడు | .... | నాశంకరుడు<br>నాశకరుడు |
| ప్రళయ | .... | కరుడు | .... | ప్రళయంకరుడు<br>ప్రళయకరుడు |

ఇత్యాదులు.

అమహదర్థంలో కర పరమైతే శివంకరం - శివకరం - శుభంకరం - శుభకరం - ఇత్యాది ద్వైరూప్యాన్ని గ్రహించాలి.

సంస్కృతపదం పరమైతే అవశ్యం బిందులోపం వైకల్పికం. ౧౨౯

| | | | | |
|---|---|---|---|---|
| అవశ్యం | .... | తరణీయం | .... | అవశ్యతరణీయం<br>అవశ్యంతరణీయం |
| అవశ్యం | .... | కర్తవ్యం | .... | అవశ్యకర్తవ్యం<br>అవశ్యంకర్తవ్యం |
| అవశ్యం | .... | గ్రాహ్యం | .... | అవశ్యగ్రాహ్యం<br>అవశ్యంగ్రాహ్యం |
| అవశ్యం | .... | గ్రహణీయం | .... | అవశ్యగ్రహణీయం<br>అవశ్యంగ్రహణీయం |

ఇత్యాదులూహ్యాలు

సంస్కృత పదమనడంచేత అవశ్యంచెయ్యాలి - అవశ్యంరావాలి - ఇత్యాదుల్లో బిందులోపం రాదు.

క్షకారం పరమైతే తకారానికి లోపం వైకల్పికం. ౧౩౦

| | | | | |
|---|---|---|---|---|
| తత్ | .... | క్షణం | .... | తత్క్షణం<br>తక్షణం |
| తత్ | .... | క్షుభితత్వం | .... | తత్క్షుభితత్వం<br>తక్షుభితత్వం |
| ఉత్ | .... | క్షేపణం | .... | ఉత్క్షేపణం<br>ఉక్షేపణం |
| మత్ | .... | క్షేమం | .... | మత్క్షేమం<br>మక్షేమం |

ఇత్యాద్యులూహ్యాలు.

తక్షణం ముసోలీనీ నిట్టనిటారుగాలేచి—మా—60—

అకారం మీది విసర్గకు అత్వయుక్త హకారం వైకల్పికం. ౧౩౧

రామః....రామహ

అకారమని సామాన్యంగా చెప్పడంచేత దీర్ఘంమీది విసర్గకుసైతం అత్వయుక్త హకారం వైకల్పికమని గ్రహించాలి - ఈవిధంగానే హ్రస్వదీర్ఘాలను ముందుకూడా గ్రహించాలి.

రామాః....రామాహ

మొదలైనవి.

ఇకార ఐకారాలమీది విసర్గకు ఇత్వయుక్తహకారం వైకల్పికం. ౧౩౨

హరిః....హరిహి

శ్రీః....శ్రీహి

ఇత్యాదులు.

ఉకార ఋకార ఔకారాలమీది విసర్గకు ఉత్వయుక్త హకారం వైకల్పికం. ౧౩౩

గురుః....గురుహు

వధూః....వధూహు

మాతౄః....మాతౄహు

గౌః....గౌహు

ఇది ఆకృతిగణం.

ఏ ఓల మీది విసర్గకు ఏత్వౌత్వయుక్త హకారం
వైకల్పికం. ౧౩౪

ఏత్వ - ఓత్వ - ఏత్వౌత్వ అని విభాగం - ఏకారంమీది విసర్గకు ఏత్వయుక్తహకారం-ఓకారంమీది విసర్గకు ఓత్వయుక్తహకారం వైకల్పికంగా వస్తుందని తాత్పర్యం.

హరేః....హరేహె

గోః....గోహో

ఇత్యాదులు గుర్తించాలి.

క ఖ ప ఫలు పరమైతే విసర్గకు హకారం వైకల్పికం. ౧౩౫

మనఃకమలం - మనహ్కమలం - మనఃఖేదం - మనహ్ఖేదం - దుఃఖం - దుహ్ఖం - దుఖ్ఖం - పయఃపానం - పయహ్పానం - తపఃఫలం - తపహ్ఫలం - మొదలైనవి.

ఈవిధిపంచకంచేత ప్రోక్తాలైన హకారరూపాలు వ్యవహారదశలో - అనగా ఉచ్చారణలో కనిపిస్తున్నవేకాని ప్రయోగదశలో ప్రయుగ్యాలు. మహాప్రాణద్వయంతో దుఖ్ఖశబ్దం ప్రయోగంలో కనిపిస్తున్నది. అనుకృతిలో ఉత్వాంత హకారరూప మొక్కటే ఉచ్చారణలో స్పష్టంగా పరరూపసంధితో సైతం శ్రవణగోచరమవుతున్నది.

గురుహు .... అని .... గురుహని

వధూహు .... అని .... వధూహని

ఇత్యాదులు లోకవ్యవహారానుగుణంగా గుర్తించాలి.

ఇతరాలు సంధి విశేషాలు శిష్టమహాజనవ్యవహారంలోంచి
పరిగ్రాహ్యాలు. ౧౩౬

సంధిపరిచ్ఛేదం

---

# వ్యావహారికభాషా వ్యాకరణం

## శబ్దపరిచ్ఛేదం

డు–ము–వు–లు–ప్రథమ. ౧

నువర్ణంద్వితీయ. ౨

చేత–తోడ–తృతీయ. ౩

కొరకు–కయి–కోసరం–చతుర్థి. ౪

వలన–కన్న–కంటె–పట్టి–పంచమి. ౫

కు–యొక్క–లోపల–షష్ఠి. ౬

అందు–న–సప్తమి. ౭

చేత తోడ లోపల వర్ణకాల ప్రథమాక్షరాలు వైకల్పికంగా శేషిస్తాయి. ౮

బుద్ధుడిచే - బుద్ధుడితో - వనముల్లో.

కోసరం బిందురహితరవర్ణానికి లోపం వైకల్పికం. ౯

ఎవరికోసరం - ఎవరికోసం - దానికోసరం - దానికోసం.

వలన లాత్వానికి లోపం వైకల్పికం. ౧౦

ల - అత్వం - లాత్వం. వలన లకారంలోఉన్న అకారానికి లోపం వైకల్పికమనితాత్పర్యం.

వల్న—వలన

వలన సంయుక్తనకారానికి లకారం వైకల్పికం. ౧౧

వలన—వల్న—వల్ల

డు ము వు న లేకవచనాలు. ౧౨

ఏకత్వసంఖ్యనుబోధించే ప్రత్యయాలు ఏకవచనాలు.

గౌతముడు - వనము - ధేనువు - నట్టనడాన.

లు వర్ణం బహువచనం. ౧౩

బహుత్వసంఖ్యను బోధించే ప్రత్యయం బహువచనం.

గౌతములు - నాగార్జునులు - వనములు - ధేనువులు.

తక్కినవి ఉభయాలు. ౧౪

మిగిలిన ప్రత్యయాలు ఏకత్వబహుత్వాలకు రెండింటికీ బోధకాలనిఅర్థం.

వనమును - వనాలను - వనముచేత - వనంచేత - వనములచేత - వనాలచేత - వనముతో - వనంతో - వనములతో - వనాలతో - వనమువలన - వనంవలన - వనములవలన - వనాలవలన - వనముకంటె - వనంకంటె - వనములకంటె - వనాలకంటె - వనముపట్టి - వనంపట్టి - వనముకు - వనంకు - వనానికి - వనములకు - వనాలకు - వనముయొక్క - వనంయొక్క - వనములయొక్క - వనాలయొక్క - వనములో - వనంలో - వనములలో - వనాలలో - వనముల్లో - వనాల్లో - వనమునందు - వనంనందు - వనమందు. ఇత్యాదు లూహ్యాలు.

ఏయి ఓయి ఓలు ఆమంత్రణంలో వస్తాయి. ౧౫

నీచ స్త్రీ పురుషామంత్రణాల్లో ఓసి ఓరులు విభాషగా వస్తాయి. ౧౬

ఓరి వెధవ! ఓసి దొంగముండ!

ఏయి ఇత్వానికి లోపం నిత్యం. ౧౭

ఏయ్ కృష్ణా యిటురా!

ఓయి ఇత్వానికి లోపం బహుళం. ౧౮

నీకెందుకు నువ్వుఇటురావోయ్! నీకెందుకురోయ్ అగొడవ. లేవోయ్‌లే! బహుళగ్రహణంచేత అర అల్ల ర లకనుప్రయుక్తమైన ఓయిలోని ఇత్వానికి లోపం నిత్యం - మీద ఉదాహరణంమీద స్పష్టపడుతుంది.

ఓరి ఓసులకు హల్లు పరమైతే ఇత్వలోపం వైకల్పికం. ౧౯

ఓరి నీతస్సాదియ్యా! ఓర్నీతస్సాదియ్యా! ఓసి నీదుంపతెగ-ఓస్నీదుంపతెగ.

ఓరి ఓసులు ప్రేమాద్యర్థాల్లోను ఉన్నాయి. ౨౦

ఓరి దొంగవెధవ - ఓసి భడవ - ఆదిశబ్దంచేత సామాన్యార్థంకూడా గ్రాహ్యం. ఒరేయ్ కృష్ణా యిటురా! ఇటువంటిచోట్ల నీచప్రేమాద్యర్థకాలప్రత్యేకత యేమీలేదు.

ఓరి ఓసులకు వికల్పంగా ఏయి అనుప్రయుక్తమవుతుంది. ౨౧

ఏయి పరక ఓరి ఓసుల ఓత్వానికి హ్రస్వఉత్వాలు
పర్యాయంగా వస్తాయి. ౨౨

ఒరేయ్ - ఉరేయ్ - ఒసేయ్ - ఉసేయ్.

ఏయి పరక ఓరి ఓసుల ఓత్వానికి అత్వంకూడా
కనిపిస్తున్నది. ౨౩

ఒరేయ్ - అరేయ్ - ఒసేయ్ - అసేయ్! అశ్చర్యాద్యర్థస్ఫోరకాలౌతున్నప్పుడు ఈఅత్వానికి దీర్ఘంకూడా కనిపిస్తున్నది. ఆరినీతస్సాదియ్యా - ఆసినీఅఘాయిత్యంకాలిపోను - ఆరినీఅమ్మకడుపు బంగారంగాను - ఆసినీతల్లికడుపుచల్లగుండా - ఇత్యాదులు.

అనుప్రయుక్తాలైన ఏయి ఓయిలు ఆద్యక్షరశేషాలు
వికల్పంగా అవుతాయి. ౨౪

ఒరే! ఉరే! అరే! ఒసే! ఉసే! అసే! ఎందుకర్రో! ఎందుకర్రోయ్! ఎందుకల్లో! ఎందుకల్లోయ్!

అనుప్రయుక్తాలై లుప్తశేషాలైన ఏ ఓలకు హ్రస్వం వైకల్పికం. ౨౫

ఒరే - ఒరె - ఉరే - ఉరె - అరే - అరె - ఒసే - ఒసె - ఉసే - ఉసె - అసే - అసె - ఎందుకర్రో - ఎందుకర్రొ - ఎందుకల్లో - ఎందుకల్లొ మొదలైనవి.

నిర్దిష్టస్త్రీప్రశ్నార్థకంలో సంబోధ్యవాచకేతరానికి అనుప్రయుక్త
మైన ఏయ్ యకారానికి వకారం వికల్పం. ౨౬

ఏమేయ్ - ఏమేవ్ - ఎక్కడేయ్ - ఎక్కడేవ్ - పూర్వసూత్రంచేత యలోపంవస్తే ఏమే! ఎక్కడే!

కొన్నిచోట్ల ప్రేమాద్యర్థసూచకమై నిర్దిష్టపురుషప్రశ్నార్థకంలోను సంబోధ్యవాచకేతరానికి అనుప్రయుక్తమైన యకారానికి వకారం వస్తుంది. ౨౭

ఏమిటేవ్ అన్నయ్యా! ఏమిటేవ్ తాతా! వాదేశ అభావంలో య లోపం పర్యాయంగావస్తే ఏమిటేయ్ - ఏమిటే వంటిరూపాలు గ్రాహ్యాలు - మీరంతారండే తాతా! - అవన్నీతీసుకరండే.

స్త్రీ సమూహఉద్దిష్టాలుగా అ్ర-అల్లలు వ్యవహారంలో కనిపిస్తున్నాయి. ౨౮

ఏమిటర్ర - ఏమిటల్ల - తెండర్ర - తెండల్ల.

నీచప్రేమాద్యర్థకమై ఏకబహుత్వాల్లో రవర్ణం అనుప్రయుక్తమవుతుంది. ౨౯

ఏమిటిర! తేర! తెండిర! కొట్టండిర!

అ్ర అల్ల రల తుదిహ్రస్వానికి దీర్ఘం వైకల్పికం. ౩౦

ఏమిటర్రా! ఏమిటల్లా! ఏమిటరా!

అ్ర అల్ల రలకు మధ్యమోత్తమోభయక్రియలకు ఓయి ఏయిలు బహుళంగా అనుప్రయుక్తాలవుతాయి. ౩౧

ఎందుకర్రోయ్ - ఎందుకల్లోయ్ - ఏమిటిరోయ్! చెప్పండ్రోయ్! - ఎందుకర్రా! ఎందుకల్లా - ఏమిటిరా! చెప్పండ్రా - చెప్పుతామోయ్ - చెప్పుదామోయ్ - బహుళగ్రహణంచేత అ్ర అల్ల రలకు ఏయి అనుప్రయుక్తం కాదు - ఓయి మాత్రం అనుప్రయుక్తమవుతుంది.

ఓయి ఏయిలు పరమైతే మధ్యమోత్తమోభయ మువర్ణకమకారానికి వకారం పూర్వఉత్వాని కత్వం బహుళం. ౩౨

కొట్టుమోయ్ - కొట్టవోయ్ - కొట్టవే - కొడదామోయ్ - కొడదావోయ్ - ఇటువంటిచోట్ల ఉత్తమోభయ వకారం అనునాసిక ఉచ్చారణయుక్తమైన వకారంగా కనిపిస్తున్నది. బహుళగ్రహణంచేత ఏయి పరమైతే మధ్యమపురుషమువర్ణ మకారానికి వకారం నిత్యం - కొట్టవే - తిట్టవే - నెట్టవే - అడగవే - మొదలైనవి.

స్త్రీసమవాచకాలమీద నీచప్రేమాద్యర్థకమై ఏకవచనంలో
కాన శబ్దం కనిపిస్తున్నది. ౩౩

వెధవకాన - దొంగకాన - వెధవపీనుక్కాన - ఆవెధవకానతో నీకేంటిరా !

మహద్వాచకాలకు నీచప్రేమాద్యర్థకమై కా ప్రత్యయం
వస్తుంది. ౩౪

స్పష్టం.

నీచప్రేమాద్యర్థకకాప్రత్యయం పరమైతే తరచుగా ఇత్వం
పూర్వాగమం అవుతుంది, ౩౫

ఈ కాప్రత్యయ కకారానికి గకారం నిత్యం - గోపాలిగాడు - బాలిగాడు - చిన్నిగాడు - ఎల్లిగాడు - పుల్లిగాడు - మల్లిగాడు - రామిగాడు - కోటిగాడు - వెంకిగాడు - పిచ్చిగాడు - చిట్టిగాడు - మొదలైనవి. ప్రథమేతరవిభక్తుల్లో గోపాలిగాడిని - గోపాలిగాణ్ని - గోపాలిగానిని - గోపాలగాడితో - గోపాలగానితో - మొదలైనవి.

నీచప్రేమాద్యర్థకకాప్రత్యయంమీది డువర్ణకానికి సంబోధనలో
లోపం వైకల్పికం. ౩౬

గోపాలిగా ! - గోపాలిగాడా ! - గోపాలిగాడూ ! - గోపాలిగాడు ! - చిట్టిగా ! - చిట్టిగాడా ! - చిట్టిగాడూ ! - చిట్టిగాడు ! - మొదలైనవి.

స్త్రీ తిర్యగ్జడభిన్నాలు వాటి విశేషణాలు మహత్తులు. ౩౭

తిర్యక్కు లంటే పశుపక్ష్యాదులు - జడా లంటే అచేతనాలు.

స్త్రీవాచకాలు వాటి విశేషణాలు మహతులు. ౩౮

మహతీవాచకా లనబడతాయని తాత్పర్యం.

మహద్భిన్నా లమహత్తులు. ౩౯

స్త్రీ తిర్యగ్జడా లమహత్తు లనబడతాయి.

మహన్మహతీభిన్నాలు తిర్యగ్జడాలు కేవలామహత్తులు. ౪౦

మహద్వాచక మహతీవాచకాలకు భిన్నాలైన తిర్యగ్వాచకాలు - జడవాచకాలు - కేవలం అమహత్తులని తాత్పర్యం.

మహద్వాచకాలై క్లీబాలైన మిత్రాదులు విభాషగా పుంలింగ తుల్యా లవుతాయి. ౪౧

మిత్రశరణపాత్రాదులు మిత్రాదులు.

డు ప్రత్యయం చేరడానికి యోగ్యమైనది డుమంతం. ౪౨

డు అనే ప్రథమైకవచనప్రత్యయం చేరడానికి అర్హతకలశబ్దాన్ని డుమంతం అంటారని తాత్పర్యం.

పుంలింగమై మహద్వాచకమైన నామం తుది అత్వానికి ఉత్వం బహుళం. ౪౩

నామంఅంటే ప్రాతిపదిక. బుద్ధ - నాగార్జున - రామ-కృష్ణ - ఇటువంటివి ప్రాతిపదికలు - వీటి తుది అత్వానికి ఉత్వంవస్తే - బుద్ధు - నాగార్జును - రాము - కృష్ణు - ఇలాగే తక్కినవి ఊహ్యాలు -

పుంలింగమైన మహద్వాచకానికి డువర్ణకం వస్తుంది. ౪౪

బుద్ధుడు - నాగార్జునుడు - రాముడు - కృష్ణుడు - ఉత్వవిధాన బాహుళకంచేత కొన్నిచోట్ల అత్వానికి ఉత్వంరాకుండానే డువర్ణకం వస్తుంది. సోమడు భీమడు - లింగడు - మొదలైనవి. లింగడు - రామలింగడు - అన్నప్పుడు అత్వానికి ఉత్వం యెప్పుడూ కనిపించడంలేదు - బ్రాహ్మణనారాయణశబ్దాల ణ కారానికి వక్ష్యమాణవిధిచేత లోపంవస్తే బ్రాహ్మడు - నారాయడు - ఉత్వంవస్తే సోముడు - భీముడు - బ్రాహ్మణుడు - నారాయణుడు. నారాయుడు అన్నప్పుడు పాక్షికంగా అత్వానికి ఉత్వం బాహుళకంచేతనేనని గ్రహించాలి - తక్కినచోట్ల అత్వానికి ఉత్వంరాకపోవడం నీచార్థద్యోతకంగా కనిపిస్తున్నది. బ్రాహ్మడు అన్నప్పుడు నీచార్థద్యోతకమేమీ లోకంలో కనిపించడంలేదు. నారాయుడు అని ఉత్వంవచ్చినప్పుడుసైతం ఈశబ్దానికి నీచార్థద్యోతకంగానే వ్యవహారం.

మహత్సంజ్ఞావాచకాలకు కొన్నింటికి ఉత్వ డువర్ణకాలు రావు. ౪౫

నారాయణ - సత్యనారాయణ - కృష్ణ - గోపాలకృష్ణ.

నారాయణాదులకు పూజ్యార్థంలో అన్న అనుప్రయుక్తం
కాదు. ౪౬

నారాయణయ్య - జగన్నాథయ్య - పూజ్యార్థంలో అనడంచేత భ్రాతృవాచకంగా అన్న అనుప్రయుక్తంకావచ్చును - మా నారాయణన్న వచ్చాడు.

కొన్ని మహన్మహతీ సంజ్ఞావాచకాలకు నీచాద్యర్థకమై
ఇత్వం చేరుతున్నది. ౪౭

నారాయణి - వెంకటి - రామి - సోమి. ఆదిశబ్దంచేత కొన్నిచోట్ల మైత్రిలోను ఆదరార్థంలోను ఇత్వం ఉన్నదని గ్రహించాలి.

డువర్ణకంమీద ప్రథమైకేతరప్రత్యయాలు చేరతాయి. ౪౮

డువర్ణకంమీద చేరితే బహుత్వంలో వక్ష్యమాణసూత్రంచేత ఉత్వలోపం నిత్యం - రాముళ్లు - రాములు - బుద్ధుళ్లు - బుద్ధులు - రాముడిని - వక్ష్యమాణ సూత్రంచేత ణకారాదేశం ఇత్వలోపం. రాముణ్ని - రాముళ్ళను - రాములను - పాక్షికంగా లవర్ణ అత్వలోపంమీద నివర్ణకం - రాముల్ని - రాముడికోసం - రామునికోసం - రాముకోసం - ఇలాగే మగడు - మగడులు - మగళ్లు - మగడిని - మగణ్ని - మగళ్ళను - మగల్ని - మగడికోసం - మగనికోసం - మొదలైనవి. వృద్ధాదుల డులోపపక్షంలో యథావిధిగా ప్రథమైకేతర ప్రత్యయాలు చేరతాయి.

ద్వితీయాద్యేకవచసం పరమైతే డువర్ణకఉత్వానికి ఇత్వం
బహుళం. ౪౯

బుద్ధుణ్ని - బుద్ధుడితో - బుద్ధుడుతో - బుద్ధుడివల్ల - బుద్ధుడువల్ల - రాముడందు - రాముడియందు - మొదలైనవి.

ప్రథమైకేతరప్రత్యయం పరమైతే డువర్ణకానికి లోపం
విభాష. ౫౦

రాముడులు - రాములు- రాముడితో - రామునితో - రాముతో - వ్యవస్థిత విభాషచేత దేవశబ్దానికి బహుత్వంలో డు లోపంరాదు - దేవుడు - దేవుళ్లు - బహుత్వంలో అనడంచేత దేవుడితో - దేవునితో - దేవుడికోసం - దేవునికోసం - ఇత్యాదులు.

డుమంతంమీది నువర్ణకం ఉత్వానికి ఇత్వం వస్తుంది. ౯౧

బుద్ధుని - రాముని - కృష్ణుని, - మొదలైనవి - బుద్ధుణ్ని - రాముణ్ని అన్నప్పుడు నువర్ణకఉత్వానికి ఇకారంమీది కు ను వు ఇత్యాది సూత్రంచేత ఇత్వం వస్తుంది.

ఇకారంమీది కు ను వు క్రియావిభక్తుల ఉత్వానికి ఇత్వం వస్తుంది. ౯౨

హరిని - హరికి - శ్రీని - శ్రీకి - వారిని - వారికి -

ఈధాతు నీశబ్దాలమీదివాటి ఉత్వానికి ఇత్వం రాదు. ౯౩

ఈరు - ఈవు - ఈను - ఈము - నీరు - మీరు -

నాటకాదుల్లో తెలుగులో పరిచయం తక్కువకల ముస్లింపాత్రలసంభాషణలో నీ మీ మా శబ్దాలమీది కువర్ణక ఉత్వానికి ఇత్వంవస్తుంది. హరె ! నీకి చెప్పాన్‌గదరా ! నీకిమాకి గడబిడ యెందుకు-భాయ్. మీకీ యేమ్తీతెల్సున్‌హయ్యా ! మొదలైనవి. ఇటువంటివి పూర్వోక్తసూత్రంచేత ఆయాజాతివర్ణనల్లో ప్రయోగార్హాలు.

కువర్ణకం పరమైతే ఉకార ఋకారాలకు నవర్ణాగమం వస్తుంది. ౯౪

రామునకు-బుద్ధునకు - విష్ణునకు - సవితృనకు - విధాతృనకు మొదలైనవి.

ఉకార ఋకారాలకు అందు వర్ణకం పరమైతే నకారాగమం వస్తుంది. ౯౫

బుద్ధునందు - రామునందు - విష్ణునందు - సవితృనందు - విధాతృనందు మొదలైనవి.

మువువర్ణాల కందు వర్ణకం పరమైతే నకారాగమంబహుళం.౯౬

వనమునందు - వనమందు - ధేనువునందు - ధేనువందు మొదలైనవి. మువర్ణానికి అనుస్వారం వచ్చేట్లయితే బహుళగ్రహణంచేత నకారాగమం నిత్యం. వనంనందు - గృహంనందు - ధనంనందు - మొదలైనవి.

ద్వితీయైకవచనం ఉత్తమపురుషనువర్ణకం పరమైతే డువర్ణక డకారానికి ణత్వం వైకల్పికం. ౯౭

ణాదేశభావంలో ఇత్వఅత్వాలకు లోపం నిత్యం. ౫౦

రాముడిని - రాముణ్ని - రాముని - కృష్ణుడిని- కృష్ణుణ్ని - కృష్ణుని - నేను రాముడను - నేను రాముణ్ని - నేను కృష్ణుడను - నేను కృష్ణుణ్ని - వాణ్ని - వీణ్ని - వక్ష్యమాణవిధిచేత ణకారయుక్త నకారానికి ణకారం వైకల్పికం - వాణ్ణి - వీణ్ణి - రాముణ్ణి - ఇత్యాదులూహ్యాలు.

ఆఫీసుకు బయల్దేరినవాణ్ని కూడా ఈమాట తర్వాత ఆగిపోయాను - మూ — 17 — దిగినవాణ్ణి మున్నాడు ముదుసలైన — పి — 24 —

బహుత్వంలో ఉవర్ణకంమీదనే ద్వితీయాది విభక్తులు చేరతాయి. ౫౯

ద్వితీయాదులు పరమైతే ఉవర్ణఉత్వానికి అత్వం బహుళంగా వస్తుంది. ౬౦

బుద్ధులను - రాములను - నాగార్జునులను - ఉవర్ణకంమీద బహుత్వంలో బుద్ధుళ్ళను - రాముళ్ళను - నాగార్జునుళ్ళను - ఇత్యాదులు. రాములకు - ధేనువులకు - రాములను - ధేనువులను - రాముళ్ళను - రాములుచేత - రాములచేత - రాముళ్ళచేత - రాముల్చేత - అదిరాముల్ చేతతెప్పించరా! మొదలైనవి.

వు లు వర్ణాలమీది కు నుల ఉత్వానికి ఇత్వం బహుళం. ౬౧

రాములుకు - రాములుకి - ధేనువులుకు - ధేనువులుకి - ధేనువుకు - ధేనువుకి - ఆవుకి - గోవుకి -

సంబోధనలో ఏకార్థమైనపదం తుది ఉకారానికి అకారం బహుళంగా వస్తుంది. ౬౨

ఓరాముడ! ఓరాముడు! వృక్షమ! వృక్షము! వృక్షం!

సంబోధనంలో పదంతుది అకార ఇకార ఉకారాలకు దీర్ఘం విభాషగా వస్తుంది. ౬౩

రాముడా! రాముడ! అన్నా! అన్న! హరీ! హరి! రాముడూ! రాముడు!

కృతోత్క్రమైన సంస్కృతనామం సంబుద్ధి డువర్ణకానికి లోపం విభాషగా వస్తుంది. ౬౪

ఓరామ ! ఓరాము ! పాక్షికంగా పూర్వసూత్రంచేత దీర్ఘం - రామా ! రామూ ! బహుళగ్రహణంచేత కృష్ణభార్గవాదులకు డువర్ణకలోపస్థితిలో ఉత్వానికి అత్వం నిత్యం - కృష్ణ ! కృష్ణా ! - ఇత్యాదులు కృష్ణూ ! భార్గవూ ! అని వ్యవహారంలేదు. గోవిందు ! ముకుందు ! గోవిందూ ! ముకుందూ ! మొదలైనవి మహాజనవ్యవహారంవల్ల తెల్సుకోవాలి.

ఉత్వాంతసంస్కృతనామంమీది సంబుద్ధి డువర్ణకానికి ఉత్వాదేశం విభాషగా వస్తుంది. ౬౫

ఓవిష్ణు ! ఓశంభు ! ఓవిష్ణూ ! ఓశంభూ ! విష్ణుడా ! శంభుడా ! మొదలైనవి-

ఉత్వాంతసంస్కృతనామాలకు కొన్నిటికి సంబోధనలో ఓత్వాంతత్వం కనిపిస్తున్నది. ౬౬

ప్రభో - శంభో - మొదలైనవి. కొన్నిటికనడంచేత యీకార్యం సార్వత్రికం కాదని సూచింపబడింది. మహాప్రభో అవిరధాలుకావు — భా — వి — 90 —

సంబోధనంలో బహువచనానికి పరంగా ఆర ఆగమం వస్తుంది. ౬౭

రాములార ! రాముల్లార ! కృష్ణులార ! కృష్ణుల్లార ! పూర్వసూత్రంచేత దీర్ఘంపాక్షికంగావస్తుంది. రాములారా ! కృష్ణులారా ! రాముల్లారా ! కృష్ణుల్లారా ! మొదలైనవి.

ఆర ప్రయోగంలో బహువచన లకారానికి ద్విత్వం బహుళంగా వస్తుంది. ౬౮

రాముల్లార ! రాములార ! పిల్లల్లార ! పిల్లలార ! అక్కల్లార ! అక్కలార ! చెట్టుల్లార ! చెట్టులార ! వృక్షముల్లార ! వృక్షములార ! వృక్షాల్లార ! పాక్షికంగా పూర్వసూత్రంచేతదీర్ఘం - రాముల్లారా ! మొదలైనవి. బాహుళకంచేత మువర్ణలోప పూర్వస్వరదీర్ఘంమీది లకారానికి ఆర పరమైతే ద్విత్వంనిత్యం - వృక్షాల్లారా !

మొదలైనవి - రాముళ్లారా ! అనేది యేతత్సూత్రానికి లక్ష్యమైనది కాదు. రాములు - రాముష్లు - రూపంపై అర చేరగా సిద్ధించింది.

మధ్యమపురుషయోగంలో అరాగమం విభాషగా అవుతుంది.ఉదా

బాలకులారావినండి ! బాలకులువినండి. బాలకుల్లారా ! వినండి. కాంతలారా ! వచ్చారా ?- కాంతల్లారా ! వచ్చారా !- కాంతలు ! వచ్చారా !-మొదలైనవి. అమ్మల్లార ! అయ్యల్లార ! అక్కల్లార ! అన్నల్లార ! పిల్లల్లార ! జెల్లల్లార ! ఆలకించండి ! మీరాలకించండి ! ఇటువంటిచోట్ల మధ్యమపురుషయోగంలేదుకాబట్టి అరాగమం నిత్యం.

ఆగమ లు ల ల స్వరానికి ద్వితీయాదులు పరమైతే లోపం విభాష. ౭౦

ధేనువులును - ధేనువుల్ను - ధేనువులను - ధేనువుల్ని ధేనువుల్‌చేత - ధేనువులచేత - ధేనువుల్లో - ధేనువులలో - చెట్టుల్లో - చెట్టులలో -

ముఖ్యంగా జ్ఞాపకంవుంచుకోవలసిన భాగాల్ని మార్పుచేసుకోవచ్చు —మా— 3— చదువుతూవుండగాగా తోచినభావాల్ని మార్జిన్‌లో వ్రాసుకోవచ్చు — మా- 3—

ఆగమ లు ల ల స్వరలోపమైతే నువర్ణం ఉత్వానికి ఇత్వం విభాషగా వస్తుంది. ౭౧

రాముల్ని - రాముల్ను - మిత్రుల్ని - మిత్రుల్ను - మొదలైనవి.

శ్లిష్టబహువచన లకారంమీది లో లకారానికి ద్విత్వం విభాషగా వస్తుంది. ౭౨

చెట్లల్లో - చెట్లలో - దొడ్లల్లో - దొడ్లలో -

అత్వాంతాలైన అమహన్నపుంసకాలకు మువర్ణకం వస్తుంది. ౭౩

వృక్షము - అన్నము - మొదలైనవి. మిత్రాదులకు పాక్షికంగా పుంలింగ తుల్యత్వం పూర్వం ఉక్తమైంది కాబట్టి మిత్రుడు- మిత్రము- శరణుడు- శరణము - మొదలైన ద్వివిధరూపాలను గ్రహించాలి. రామాదులకు వక్ష్యమాణసూత్రం చేత పాక్షిక క్లీబతుల్యత్వం ఉన్నది కాబట్టి రామము - రాముడు - శంకరము - శంకరుడు - మొదలైన ద్వివిధరూపాలను గ్రహించాలి. కమలాదులకు స్త్రీసంజ్ఞా

వివక్షలో క్లీబతుల్యత్వం వక్ష్యమాణసూత్రంచేత విధించబడింది కాబట్టి పాక్షికంగా ముపర్ణకం - కమలం - కమల - మొదలైనవి.

పుంలింగాలు రామాదులకు క్లీబ తుల్యత్వం బహుళం. ౭౪

రాముడు - శంకరము - రాముడు - శంకరుడు. బహుళకంచేత వృష్ణాదులకు లేదు. లక్ష్మీకాంతం - వెంకటరత్నం ప్రభృతుల్లో ముపర్ణాంతత్వమే తరచు కానవస్తున్నది.

స్త్రీ సంజ్ఞావాచకాలైన కమలాదులకు క్లీబతుల్యత్వం బహుళం. ౭౫

కమల - కమలం - వనజ - వనజం - ఇత్యాదులు శిష్టజన వ్యవహారానుగుణంగా గ్రాహ్యాలు.

ముపర్ణకానికి పూర్ణబిందువు బహుళంగా వస్తుంది. ౭౬

వృక్షం - వృక్షము - అన్నం - అన్నము - మిత్రం - మిత్రము - శరణం - శరణము - రామం - రామము - శంకరం - శంకరము - బహుళగ్రహణంచేత రామాదులకు సంబోధనలో బిందువునిత్యం - ఒరేయ్ రామం! యిటురా! సంబోధన అకారం పరమైతే బాహుళకంచేత బిందువురాదు. మిత్రమా!

ముపర్ణకంమీద ప్రథమైకేతరప్రత్యయాలు చేరతాయి. ౭౭

వృక్షములు - వృక్షమును - వృక్షముచేత - ముపర్ణానికి బహుళంగా బిందువు. వృక్షంచేత - వృక్షంకొరకు - బాహుళకంచేత అందు - న - లు - ను - కులు పరమైతే బిందువురాదు. వృక్షముపు - వృక్షముకు-వృక్షములు - వృక్షమునకు - వృక్షములు - వృక్షములను - వృక్షమందు - మొదలైనవి. ములోప పక్షంలో యథావిధిగా ప్రథమైకేతర ప్రత్యయాలు చేరతాయి.

తొలిశైశవంలోకంటే — పి — 11 —

అనుమ్వాదుల ముపర్ణానికి పూర్ణబిందువు వైకల్పికం. ౭౮

అనుం - మినుం - జనుం - కనుం - ఇనుం - నడుం - అన్నెం - పున్నెం - బత్తెం - బల్లెం - ఇత్యాదులు. పక్షంలో అనుము - మినుము - జనుము - మొదలైనవి. నడుంవంగి సులోచనాలు ముక్కుకొనకు — పి — 10 —

అన్యదేశ్యాల తుది వ్యంజనమకారానికి బిందువు తరచుగా వస్తుంది. ౭౯

ముస్లిమ్‌లు - ముస్లింలు - కరీమ్ - కరీం - కరీమ్‌లు - కరీంలు - మొదలైనవి.

మువర్ణానికి లోపం పూర్వస్వరానికి దీర్ఘం మీది ద్వితీయ నువర్ణానికి ద్విత్వయుక్తనివర్ణకం విభాషగా వస్తుంది. ౮౦

లోకమును - లోకాన్ని - పాపమును - పాపాన్ని - అన్నమును - అన్నాన్ని - రామమును - రామాన్ని - శంకరమును - శంకరాన్ని - మొదలైనవి.

పుస్తకాన్ని చదువుతూవుండగా — మా — 3 — ఈప్రశ్నలోని భావాన్ని కాదనలేము — పి — 13 —

ము లు న లు పరమైతే మువర్ణానికిలోపం తత్పూర్వస్వరానికి దీర్ఘం విభాషగా వస్తుంది. ౮౧

వజ్రములు - వజ్రాలు - వజ్రములను - వజ్రాలను - మానమున - మానాన - వాడిమానాన వాడు బ్రతుకుతుంటే మీకేమయ్యింది? ఎవరిమానాన వాళ్లుపోండి. మంచానపడ్డాడు - నయానభయాన యెన్నివిధాలచెప్పినా వినందే యెవరమేంచేస్తాం!

అంతమానాన తగిలినా — పి — 31 —

లుప్తపూర్వమువర్ణక దీర్ఘపూర్వక నవర్ణకానికి ద్విత్వం విభాషగా వస్తుంది. ౮౨

నయాన - నయాన్న - భయాన - భయాన్న - ఇత్యాదులు తెల్సుకోవాలి.

ద్విత్వసహిత నవర్ణకఅత్వానికి ఇత్వం వైకల్పికం. ౮౩

నయాన్న - నయాన్ని - భయాన్న - భయాన్ని - నయాన్ని భయాన్ని యెన్ని విధాల చెప్పానో! ఇత్యాదులు మహాజనవ్యవహారంలోంచి తెల్సుకోవాలి.

మువర్ణం లోపిస్తే కువర్ణపరక నవర్ణఅత్వానికి ఇత్వం వస్తుంది. ౮౪

వజ్రానికి - వజ్రమునకు - ధనానికి - ధనమునకు - రామానికి - రామ

మునకు - శంకరానికి - శంకరమునకు - మొదలైనవి. ఇకారంమీది కుసువు ఇత్యాదిసూత్రంచేత కువర్ణక ఉత్వానికి ఇత్వం -

ఇ గ్లౌ రాయుత్వాగమాంతాల ప్రథమైకవచనానికి లోపం
వస్తుంది. ౮౫

ఇకారాంతాలకు గ్లౌ రై శబ్దాలకు ఉత్వాగమాంతాలకు ప్రథమైకవచనలోపం వస్తుంది. హరి - గిరి - శ్రీ - ధీ - గ్లౌ - రై - దిక్కు - త్వక్కు - రుక్కు - మొదలైనవి.

ఇత్వానికి బహువచనం పరమైతే ఉత్వం ప్రాయికంగా
వస్తుంది. ౮౬

హరులు - గిరులు - కవులు - రవులు - యామినులు - భామినులు - మొదలైనవి. ప్రాయికంగా అనడంచేత రాత్రిళ్లు - రాత్రుళ్లు - ఇత్యాదుల్లో వైకల్పికత్వాన్ని గ్రహించాలి.

ఉకారాంతగోశబ్దాలకంతటా వువర్ణకం వస్తుంది. ౮౭

తరువు - ధేనువు - మధువు - గోవు - అంతటా అనడంచేత ఉకారాంత స్త్రీలింగ పదాలకుసైతం ప్రథమైకవచనలోపం రాకుండా వువర్ణకంవస్తుందని తెల్సుకోవాలి.

ఉకారాంతమైన మహత్తుకే వువర్ణకం బహుళంగా వస్తుంది. ౮౮

విష్ణువు - విష్ణుడు - శంభువు - శంభుడు - వసువు - వసుడు - మనువు - మనుడు - కురువు - కురుడు - రాహువు - రాహుడు మొదలైనవి.

వర్గాదుల తుదిఅత్వాని కుత్వంమీద వువర్ణకం కనిపిస్తున్నది. ౮౯

వర్గ - వర్గము - వర్గం - వర్గువు - వర్గు - అంతరము - అంతరం - అంతరువు - ధర్మము - ధర్మం - ధర్మువు. కవర్గువు - కవర్గు - అంతరువు అని వ్యవహారంలో వర్గ అంతరశబ్దాలకే ఈకార్యం కనిపిస్తున్నది.

ఉకారాంతాలకు గోశబ్దానికి వువర్ణకంమీద ప్రథమైకేతర
ప్రత్యయాలు చేరతాయి. ౯౦

తరువులు - ధేనువులు - విష్ణువులు - గోవులు - వువర్ణకంరాని పక్షంలో మామూలుగా ప్రథమాఏకవచనానికి భిన్నమైన ప్రత్యయాలు చేరతాయి.

ప్రథమైకేతరప్రత్యయం పరమైతే ఉకారాంతాల వువర్ణకానికి
లోపం బహుళం. ౯౧

తరువులు - తరులు - ధేనువులు - ధేనులు - విష్ణువులు - విష్ణులు - మొదలైనవి. గోశబ్దవువర్ణకానికి లోపం చెప్పకపోవడంచేత గోవులు - గోవును - గోవుతో - అని వువర్ణంతోనే వ్యవహారమని గ్రహించాలి.

బాహుప్రభృతుల వువర్ణానికి లోపం విభాష. ౯౨

బాహు - బాహువు - రాహు - రాహువు - కేతు - కేతువు - బిందు - బిందువు - రజ్జు - రజ్జువు - ఇత్యాదులు జనవ్యవహారంనుంచి గ్రాహ్యాలు.

అవ్యయమైన ఆశు శబ్దంమీద వువర్ణకం కనిపిస్తున్నది. ౯౩

ఆశువు - ఆశువును - ఆశువుతో - మొదలైనవి.

నాగమాతార్థంలో కద్రూశబ్ద వువర్ణకఉత్వానికి అత్వం
నిత్యంగా వస్తుంది. ౯౪

కద్రువ - కద్రువను - అత్వవిధిచేత ఇక్కడవువర్ణకలోపంరాదు. అన్యార్థంలో కద్రువు - కద్రువులు - మొదలైనవి.

తాత శబ్దానికి స్త్రీవద్భావం నిత్యం. ౯౫

ఇలా అనడంచేత తుది అత్వానికి ఉత్వంమీద డువర్ణకం నిషేధింపబడింది. తాత - దీనికి తండ్రి అని అర్థం.

ఋకారాంతానికి అత్వం స్త్రీవద్భావం వస్తుంది. ౯౬

భ్రాత - జామాత - కర్త - భర్త - హర్త - ఇత్యాదులూహ్యాలు.

మహత్తులైన విధాతృధాతృదాతృసవితృనేతృ శబ్దాలకు
అత్వ స్త్రీవద్భావాలు విభాషగా అవుతాయి. ౯౭

విధాత - విధాతృడు - ధాత - ధాతృడు - దాత - దాతృడు - సవిత - సవితృడు - నేత - నేతృడు.

నిరాశాదులకు అత్వాంతత్వం నిత్యం. ౯౮

అత్వాంతత్వవిధాన సామర్థ్యంచేతనే స్త్రీతుల్యత్వం వస్తుంది.
నిరాశ - దురాశ - నిర్దయ - ఇత్యాదులు.

బిరుదనామాలు తరచుగా స్త్రీసమాసాలౌతాయి. ౧౦౯

కవితిలక - ఆచార్య - కవిరత్న - కవిశేఖర - కవీశ్వర - కవిసార్వభౌమ - మొదలైనవి. తరచుగా అనడంచేత విభక్త్యంతత్వంకూడా గ్రాహ్యం.

ప్రాతిపదికల తుదిదీర్ఘానికి హ్రస్వం వస్తుంది. ౧౧౦

రమా - రమ - లక్ష్మీ - లక్ష్మి - వనితా - వనిత - విద్యా - విద్య సేనానీ - సేనాని - కృతహ్రస్వాలకు హ్రస్వాంతాలకులాగానే రూపాలవుతాయి.

ఏకాక్షరాలకు హ్రస్వం లేదు. ౧౧౧

క్ష్మా - భా - మా - శ్రీ - స్త్రీ - హ్రీ - ధీ - భీ - భ్రూవు.

వృద్ధాదుల డువర్ణానికి లోపం బహుళం. ౧౧౨

వృద్ధ - వృద్ధుడు - మూర్ఖ - మూర్ఖుడు - నీచ - నీచుడు - గృహస్థ - గృహస్థుడు - చార్వాక - చార్వాకుడు - భ్రష్ట - భ్రష్టుడు - హనుమంత - హనుమంతుడు - బహుళగ్రహణంచేత రామదాసాదుల డువర్ణానికిలోపం తరచుగా వస్తుంది. రామదాసు - శ్రీనివాసు - నన్నయ్యభట్టు - అన్నయ్యభట్టు - మొదలైనవి.

గృహస్థ బాహ్యుడని స్పష్టంగా తెలిసిన — పి — 21 —

స్త్రీలింగాల ప్రథమైకవచనానికి లోపం వస్తుంది. ౧౧౩

రమ - క్షమ - వనిత - ఘనత - విద్య - దేవత - మిననేత్ర మొదలైనవి.

చరిత్రాదుల మువర్ణకానికి లోపం బహుళం. ౧౧౪

చరిత్ర - చరిత్రము - చరిత - చరితం - కోకిల - కోకిలం. చరిత్ర - చరిత - కోకిల - అలక - అభిలాష - అక్షత - ఘోష - తరంగ - భ్రమ - విజృంభణ - వధ - వేగ - స్ఫురణ - హంస - అంశ - అపోహ - అపకర్ష - ఆభాస - రసాభాస - క్షోభ - గద్య - తత్పురుష - కర్మధారయ - విగ్రహ - నిష్కర్ష - పరామర్శ - పరిశ్రమ - ప్రథమపురుష - మధ్యమపురుష - ఉత్తమ పురుష - ప్రశ్న - ప్రయాగ - ప్రాస - అనుప్రాస - ద్విప్రాస - త్రిప్రాస - చతుష్ప్రాస - బోధ - సర్గ - ఉపసర్గ - ప్రతిసర్గ - విసర్గ - విమర్శ - అవమర్శ - శోష - శ్వాస - అంతఃకరణ - ఆకర్షణ - అన్నప్రాశన - అర్పణ - ముద్రణ - ఆవాహన - విసర్జన - ఆచ్ఛాదన - ఆలంబన - అవగాహన - ఆరాధన -

ఆరోపణ - అర్జన - ఆలాపన - ఆలోడన - ఆవేదన - ఆస్వాదన - ఉచ్చాటన - ఉద్ధరణ - సంబోధన - ప్రవర్తన - నిరీక్షణ - ఉద్వాసన - ఉల్లంఘన - ఔపాసన - కుంకుమ - గర్జన - చిహ్న - తర్జన - భర్జన - దూషణ - నిరసన - నిరాకరణ - నిరూపణ - నిర్ధారణ - నివారణ - పారాయణ - బోధన - రక్షణ - వర్షన - వాదన - విజృంభణ - స్థాపన - స్ఫురణ - స్మరణ - ఇత్యాదులు చరిత్రాదులు. బాహుళకంచేత దర్వ్యాదులకు ములోపం నిత్యం - దర్వి - పనస - కుశ - కుశశబ్దానికి ఉదకార్థంలో ముపర్ణకం నిత్యం. కుశము - కుశం - బహుళగ్రహణంచేత శరణశబ్దం ముపర్ణరానికి లోపంవస్తే తుది అత్వానికి ఉత్వం వైకల్పికం - శరణం - శరణ - శరణు - ఉత్వంవస్తే స్త్రీత్వం నిత్యం.

సురాసురశబ్దాలు విభాషగా స్త్రీతుల్యాలవుతాయి. ౧౦౫

సుర - సురుడు - సురలు - సురులు - అసుర - అసురుడు - అసురలు - అసురులు - వ్యవస్థిత విభాషచేత సంస్కృతసమాసంలో స్త్రీతుల్యాలుకావు - నిఖిలసురులు - దానవాసురుడు.ఇత్యాదులు

మాతాదులకు స్త్రీత్వం బహుళంగా అవుతుంది. ౧౦౬

మాత - మాతుడు - యోధ - యోధుడు - శుంఠ - శుంఠుడు - బహుళగ్రహణంచేత అమహత్వంలో స్త్రీత్వంనిత్యం - సింహానికి మాతఅయిన నక్క - మొదలైనవి.

శతభిషేతరనక్షత్రాలకు ప్రభవాది సంవత్సరాలకు
స్త్రీత్వం నిత్యం. ౧౦౭

కృత్తిక - మృగశిర - ఆర్ద్ర - పునర్వసు - ఆశ్లేష - మఖ - హస్త - చిత్ర - విశాఖ - అనూరాధ - మొదలైనవి. ప్రభవ - విభవ - శుక్ల - ప్రమోదూత - ఆంగీరస - శ్రీముఖ - భావ - యువ - ఇత్యాదులు గ్రాహ్యాలు అశ్వన్యాది ప్రజోత్పత్త్యాది ఇకారాంతపదాలకు ఇగ్లొ సూత్రంచేతనే లోపం వస్తుంది. ఇకార భిన్న స్వరాంతాలకు స్త్రీత్వవిధాన నిమిత్తమై ఈసూత్రారంభం - శతభిషము - శతభిషం - శతభిషానికి -

పృథ్వీవాచి భూశబ్దానికి భువి అవుతుంది. ౧౦౮

భువి - భువులు - భువిని - భువులను - భువుల్ని - భువితో - భువికై - భువికంటె - ఇత్యాదులూహ్యాలు.

నౌ శబ్దానికి నావ అవుతుంది. ౧౦౯

నావ - నావలు - మహానావ - నావికాయానం.

ఐకారం ఈతుల్యం. ౧౧౦

ఈతుల్యత్వ విధానంచేత ఇకారంమీది కుసుపు ఇత్యాది సూత్రంచేత రై ప్రభృతులమీది కుసుల ఉత్వానికి ఇత్వం వస్తుంది.

రైని - రైకి - కైని - కైకి - పైని - పైకి - మొదలైనవి.

కంధరాదులు క్లీబతుల్యాలు బహుళంగా అవుతాయి. ౧౧౧

కంధరము - కంధరం - కంధర - విధాశబ్దానికి క్లీబతుల్యత్వంనిత్యం - విధం - కంధరానాసికాదంష్ట్రాగ్రీవాపాదుకోల్కా ప్రభృతులు కంధరాదులు.

విద్వత్త తుదిఅత్వానికి ఉత్వం స్త్రీతుల్యత్వం కనిపిస్తున్నది.౧౧౨

విద్వత్తు.

హలంతం ప్రథమైకవచనాంతతుల్యం తెలుగులో ప్రాతిపదిక. ౧౧౩

రుక్ - రాట్ - మరుత్ - వీరుత్ - కర్మ - పర్మ - మొదలైనవి. శ్వశబ్దం తప్ప నాంతపదాలన్నీ ప్రథమైకవచనాంత తుల్యాలేనని గ్రహించాలి.

దిత్వం ఉత్వంతుదిహల్లుకి వస్తుంది. ౧౧౪

ఉకారాగమాంతాలకు ఇగ్లౌసూత్రంచేత ప్రథమైకవచనలోపం వస్తుంది. రుక్కు - రాట్టు - మరుత్తు - వీరుత్తు - కర్మం - పర్మం - చర్మం - సుధన్వుడు - సుత్రాముడు - ఇత్యాదుల్లో ఉకారాగమంలేదు కాబట్టి అస్త్రీలింగాలపదంచేత ప్రథమైకవచనలోపంలేదు.

దీర్ఘంమీది హల్లుకి ద్విత్వం బహుళంగా వస్తుంది. ౧౧౫

వాక్కు - వాకు - స్వరాట్టు - స్వరాటు మొదలైనవి.

మహద్వాచకాలకు కొన్నిటికి హలంతత్వంకూడా కానవస్తున్నది. ౧౧౬

మోహన్ - హరనాథ్ - దేవినాథ్ - రమేష్ - జగదీష్ - ఇటువంటిచోట్ల హలంతత్వవిధిచేతనే స్త్రీత్వాన్ని గ్రహించి ప్రథమైకవచనలోపాదికంగ్రహించాలి.

రమేష్ ప్రభృతి పదాలు ప్రథమోష్మయుక్తాలే అయినా హిందీభాషాప్రభావంచేత ప్రవేశించిన ద్వితీయోష్మయుక్తవ్యవహారమే గ్రాహ్యంగా లోకంయెంచుతున్నది.

మత్వాదికం ద్వితీయైకవచనాంతతుల్యం ప్రాతిపదిక అవుతుంది. ౧౧౭

శ్రీమంతమ్ - గుణవంతమ్ - విద్వాంసమ్ - అప్సరసమ్ - శ్వానమ్ - మొదలైనవి.

వాని అంతిమ మకారానికి లోపం వస్తుంది. ౧౧౮

శ్రీమంత - గుణవంత - విద్వాంస - శ్వాన మొదలైనవి. డుప్రత్యయాదులు మహదాదివిపక్షలోవస్తాయి. శ్రీమంతుడు - శ్రీమంతము - గుణవంతుడు - గుణవంతము - విద్వాంసుడు - విద్వాంసము - శ్వానము - అప్సరస - స్త్రీత్వంలో మత్వాదులు ఇకారాంతాలే తెలుగులో గ్రాహ్యాలు - శ్రీమతి - గుణవతి - విదుషి - షని. మహతి వాచ్యమవుతుంటే శ్రీమంతురాలు - గుణవంతురాలు - విద్వాంసురాలు - అనికూడా ప్రయోగించవచ్చు.

ముదాదులకు ప్రథమైకవచనలోపం లేదు. ౧౧౯

ముదం - ఉపానహం - స్రజం - ఇవి సంస్కృతంలో స్త్రీలింగశబ్దాలు కావడంచేత లోపం ప్రవృత్తమవుతుంటే యీసూత్రంచేత నిషేధం చెప్పబడింది.

ఋత్విగాదులు ప్రథమైకవచనాంతతుల్యాలు విభాషగా అవుతాయి. ౧౨౦

ఋత్విజుడు - ఋత్విక్కు - నీవృతం - నీవృత్తు మొదలైనవి.

ఆపదాదులు ద్వితీయైకవచనాంతతుల్యాలు విభాషగా అవుతాయి. ౧౨౧

పక్షంలో ప్రథమైకవచనాంత తుల్యత్వం.

ఆపత్తు - ఆపద - తృట్టు - తృష - సంపత్తు - సంపద - క్షుత్తు - క్షుధ - దృక్కు - దృశ - దిక్కు - దిశ - త్విట్టు - త్విష - రుట్టు - రుష - ఇత్యాదులూహ్యాలు.

ద్విత్రిద్వ్యేకవచనాంతతుల్యాలైన ఆపదాదులకు
స్త్రీత్వం నిత్యం. ౧౨౨

ఆపద - త్విష - సంపద - క్షుధ - మొదలైనవి.

ఒకానొకచోట మహత్త్వంలో బిందుపూర్వక మత్వంతతకారానికి
అనాదేశం విభాషగా అవుతుంది. ౧౨౩

హనుమానుడు - హనుమంతుడు - భగవానుడు - భగవంతుడు.

హనుమంత బిందుపూర్వకతకారానికిలోపం స్త్రీవద్భావం
విభాషగా అవుతుంది. ౧౨౪

హనుమ - హనుమానుడు - హనుమంతుడు.

ఆత్మమహిమాదులకు స్త్రీత్వం బహుళం. ౧౨౫

ఆత్మ - ఆత్మము - ఆత్ముడు - విశ్వకర్మ - విశ్వకర్ముడు - కృతవర్మ - కృతవర్ముడు - కృష్ణవర్త్మ - కృష్ణవర్త్ముడు - మిత్రవర్మ - మిత్రవర్ముడు - ఇత్యాదులూహించాలి. మహిమ - మహిమం - గరిమ - గరిమం - అణిమ - అణిమం - లఘిమ - లఘిమం - మొదలైనవి మహిమాదులు - బాహుళకంచేత యువాదుల్లో స్త్రీత్వం నిత్యం - యువ - యజ్వ.

పుంలింగమై మహద్వాచకమైన బ్రహ్మశబ్దానికి స్త్రీత్వం
వస్తుంది. ౧౨౬

బ్రహ్మ - మహద్వాచకమనడంచేత తత్త్వతపోవేద యోగవాచకం అయితే బ్రహ్మము అని మువర్ణాంతత్వంతోనే ప్రయోగం - మువర్ణానికి సున్నా పాక్షికంగా వస్తే బ్రహ్మం.

మహత్త్వంలో స్వార్థపరమైన రాజశబ్దం తుదిఅత్వానికి
ఉత్వం నిత్యం. ౧౨౭

రాజు - ఖగరాజు - అమహత్త్వంలో రాజము - రాజం - పృష్ఠరాజం.

జగదింద్రజిత్తుల తకారానికి లోపం విభాషగా వస్తుంది. ౧౨౮

జగం - జగత్తు - ఇంద్రజి - ఇంద్రజిత్తు - ఋత్విగాదుల్లో పఠించితే ఇంద్రజితుడు.

ఇంద్రజిత్ తకారానికి ద్విత్వంమీద ఉవర్ణకం వికల్పం. ౧౨౯

ఇంద్రజిత్తు - ఇంద్రజిత్తుడు - ఇంద్రజిత్తుఁడు - ఇంద్రజిత్తుణ్ని - ఇంద్రజిత్తుని -

సాంతాల తుదిసకారానికి లోపం బహుళంగా అవుతుంది. ౧౩౦

ఉరం - ఉరస్సు - వక్షం - వక్షస్సు - అర్చి - అర్చిస్సు - ధనుపు - ధనుస్సు - ఆయుపు - ఆయుస్సు - మొదలైనవి. బహుళగ్రహణంచేత పయస్సు మొదలైన వాటిల్లో సకారానికి లోపంలేదు. వయస్సు - పయస్సు - సరస్సు ఇత్యాదులు.

మహద్వాచకాలైన సాంతాలకు అంతలోపంకాని ద్విత్వైక వచనాంతతుల్యత్వంకాని వస్తుంది. ౧౩౧

అంగిరుడు - అంగిరసుడు - ఉగ్రశ్రవుడు - ఉగ్రశ్రవసుడు - ప్రచేతుడు - ప్రచేతసుడు - ఊర్ధ్వరేతుడు - ఊర్ధ్వరేతసుడు మొదలైనవి.

వేధ పురోధ పురోధఃసుడు. ౧౩౨

వేధశ్శబ్దానికి నిత్యంగా పురోధశ్శబ్దానికి వైకల్పికంగా సలోపద్విత్వాభావాలు దీనిచేత కలుగుతాయి.

మనఃప్రభృతుల సకారానికి ద్విత్వం విభాషగా వస్తుంది. ౧౩౩

మనసు - మనస్సు - శిరసు - శిరస్సు - వచసు - వచస్సు - సలోపం జరిగితే - మనము - శిరము - వచము.

ద్యుహృత్‌శబ్దాలకు దివిహృదులవుతాయి. ౧౩౪

దివి - దివులు - హృది - హృదులు.

స్త్రీలింగాలన్ని స్వస్వనియతాలైన స్త్రీప్రత్యయాలతోకూడి తెలుగులో ప్రయోగార్హాలవుతాయి. ౧౩౫

| నామం. | | స్త్రీప్రత్యయాంతం. | | తత్సమం. |
|---|---|---|---|---|
| కర్తృ | .... | కర్త్రీ | .... | కర్త్రి |
| జనయితృ | .... | జనయిత్రీ | .... | జనయిత్రి |
| భాగ్యశాలిన్ | .... | భాగ్యశాలినీ | .... | భాగ్యశాలిని |
| బుద్ధిశాలిన్ | .... | బుద్ధిశాలినీ | .... | బుద్ధిశాలిని |

| నామం. | | స్త్రీప్రత్యయాంతం. | | తత్సమం. |
|---|---|---|---|---|
| మతిమత్ | .... | మతిమతీ | .... | మతిమతి |
| గుణవత్ | .... | గుణవతీ | .... | గుణవతి |
| విద్వస్ | .... | విదుషీ | .... | విదుషి |
| వనజముఖ | .... | వనజముఖీ | .... | వనజముఖి |
| | | వనజముఖా | .... | వనజముఖ |
| మీననేత్ర | .... | మీననేత్రా | .... | మీననేత్ర |
| | | మీననేత్రీ | .... | మీననేత్రి |

ఇత్యాదులూహ్యాలు.

మహతీతరాలైన స్త్రీలింగాల విశేషణాలకు క్లీబత్వం
విభాషగా వస్తుంది. ౧౩౬

పద్మలతమనోహారి - పద్మలతమనోహారిణి - హృద్యమైనవిద్య - హృద్య యైనవిద్య - కపిలవర్షం - కపిలవర్ష.

భవచ్ఛత్రాదులకు తెలుగులో సాధారణంగా
ప్రయోగంలేదు. ౧౩౭

భవత్ మొదలగు హలంత సర్వనామాలను శతృప్రత్యయాంతాలను రేఫాంతాలకు మొదలైనవాటికి తెలుగులో వ్యవహారంలేదని అర్థం. సమాసాల్లో పూర్వావయవాలై చేరి తెలుగులో ప్రయుక్తాలవుతాయి. భవద్గుణాలు-త్వదాశ్రయం-మత్పుత్రాం- లసద్రూపం - భవిష్యత్కాలం - ధూర్వహం - మొదలైనవి గుర్తించాలి - సాధారణ శబ్దప్రయోగంచేత లసత్తు - భవిష్యత్తు - యావన్మంది - మొదలైన ప్రయోగాలు రక్షితాలయ్యాయి.

అన్యత్రాదులు అనుకరణవిరహితంగా సందర్భాను
గుణంగా ప్రయోగయోగ్యాలు ౧౩౮

విభక్తిప్రత్యయాదులుచేరని పూర్వవ్యాకరణకర్తల మతానుసారంగా తెలుగులో ప్రయోగయోగ్యాలుకాని అన్యత్రాదులు ఆయాసందర్భాల కనుగుణంగా అనుకరణవిరహితంగానే ప్రయోగయోగ్యాలని తాత్పర్యం.

అన్యత్ర - అన్యథా - అద్యాపి - అకస్మాత్ - (అకస్మాత్తుగా) - అక్షరశః - అన్యోన్యం - అహోరాత్రం - అథవా - అనేకశః - ఉపరి - ఉభయపక్శలోపరి - ఉభయత్ర - ఏకత్ర - ఏతావతా - ఏవంచ - కదాచిత్ - కశ్చన -

కించ - కించిత్ - క్రమేణ - క్రమేపి - క్వచిత్ - జన్మతః - జన్మనా - తత్రాపి - తదుపరి - తద్వత్ - తు - చ - (తు - చ - తప్పకుండా -) - ద్వారా- నహి- నమః - నమోనమః - పదేపదే - ప్రాయశః - బహుధా - మనసా - యద్యపి - యఃకశ్చన - రూపేణ (అరూపేణ - ఈరూపేణ) - వత్ - (దానివత్తుగా) - వాచా - వినా - వృధా - శిరసా - సదా - సర్వత్ర - సర్వదా - సర్వథా - సర్వాత్మనా - సహ - సహస్రధా - స్వతః - సాక్షాత్తు - సుష్ఠు - ఇత్యాదులు అన్యత్రాదులు - ఇటువంటివి శిష్టమహాజనవ్యవహారానుగుణంగా గ్రాహ్యాలు - హలంతాలకు హలంతశబ్దాలకువలె ద్విత్వాదులు చేయవచ్చును. కాని యిటువంటి స్వతంత్రప్రయోగాల్లో ద్విత్వాదులు తరచుపాక్షికంగా కనిపిస్తున్నాయి - కదాచిత్ - కదాచిత్తు - కించిత్ - కించిత్తు - తరచు శబ్దంచేత అకస్మాత్తుగా ఇత్యాదుల్లో ద్విత్వ ఉత్వాగమాల నిత్యత్వం రక్షింపబడింది. వత్‌కు ఉత్వం వచ్చి ద్విత్వం వైకల్పికంగా కనిపిస్తున్నది. తద్వతుగా - తద్వత్తుగా - తద్వత్‌గా.

దేశభాషాస్వభావ అనుగుణాలై సంస్కృతశబ్దశాసన అనుక్త
విశేష ప్రయోగాలు ప్రయోగార్హాలు. ౧౩౯

అక్షరశః ప్రభృతులవిసర్గకు లోపం పూర్వస్వరానికి
దీర్ఘం విభాష. ౧౪౦

అనుకరణ విరహితంగా శిష్టమహాజనులచేత వ్యవహరింపబడుతున్న అన్యత్రాదుల్లో విసర్గాంతాలైన అక్షరశః ప్రభృతుల విసర్గకులోపం పూర్వస్వరానికి దీర్ఘం విభాషగా వస్తుందని తాత్పర్యం.

అక్షరశః - అక్షరశా - అనేకశః - అనేకశా - జన్మతః - జన్మతా - ప్రాయశః - ప్రాయశా - స్వతః - స్వతా - మొదలైనవి. స్వతః అనేదాని విసర్గకు పూర్వోక్తవిధిచేత హకారం వచ్చి అది దీర్ఘాంతంగా సైతం వ్యవహరింపబడుతున్నది స్వతహాగా. వ్యవస్థితవిభాషచేత - నమః - నమోనమః ఇత్యాదుల్లో ఈకార్యం జరగదు. ఉభయత్రా - క్రమేణా - తత్రాపీ - తూచా - (తూచా తప్పకుండా) సర్వత్రా - సహా - ఇత్యాదుల్లో తుదిదీర్ఘం - సముచ్చయ నువర్ణానికి లోపం రావడంచేతవచ్చినదీర్ఘమని గుర్తించాలి. అత్వాంతాలైన రూపేణ ప్రభృతుల తుదిహ్రస్వానికి స్వార్థంలో దీర్ఘంకూడా కనిపిస్తున్నది. అరూపేణ - అరూపేణా - సహ - సహా - దానితోసహ - దానితోసహా - మొదలైనవి.

వంకరనడక బహుశా సాధ్యపడేదికాదు – పి – 17 – బహుశా ఊళ్ళను ఖాళీచేయించేవాడు – పి – 126 – పాదుకల రూపేణా దాన్ని పరిపాలించ గలిగాడు. – పి – 28 –

థకారానికి ధకారం బహుళంగా వస్తుంది. ౧౪౧

గ్రంథం - గ్రంధం - కథ - కధ - గాథ - గాధ - పథం - పధం - బహుళగ్రహణంచేత సకారయోగంలో థకారానికి ధకారంరాదు. స్థానం - ప్రస్థానం - స్థలం - సకారయోగం అనడంచేత మొదట సకారంవుండి సంధిలో లోపించినప్పుడుసైతం థకారానికి ధకారం రాదనిగ్రహించాలి. ఉత్ + స్థానం - ఉత్థానం - ఉత్ + స్తంభనం - ఉత్థంభనం.

సకారయుక్తమైన థకారానికి తకారం విభాష ౧౪౨

మర్యాదస్థుడు - మర్యాదస్తుడు - మరియాదస్థుడు - మరియాదస్తుడు - కంఠస్థం - కంఠస్తం - సకారయోగమనక సకారయుక్తమనడంచేత సలోప పక్షంలో యీకార్యం జరగదు - ఉత్థానం - ఉత్థంభనం - ఇత్యాదులూహ్యాలు.

యకారం పరమైతే ఐకి అయ్ విభాషగా వస్తుంది. ౧౪౩

నైయాయికుడు - నయ్యాయికుడు - వైయాకరణి - వయ్యాకరణి. మొదలైనవి.

వకారం పరమైతే ఔకు అవ్ విభాషగా వస్తుంది. ౧౪౪

యౌవనం - యవ్వనం - సౌవర్చలుడు - సవ్వర్చలుడు. మొదలైనవి.

ప్రస్తావ దీర్ఘానికి హ్రస్వం వైకల్పికం. ౧౪౫

స్తవం - ప్రస్తావం - ప్రస్తవం.

చిత్రశబ్దానికి కర పరమైతే కకారానికి దీర్ఘం వైకల్పికం. ౧౪౬

చిత్రకరుడు - చిత్రకారుడు.

విస్మృతాదులు కర్తృర్థకాలుకూడా అవుతాయి. ౧౪౭

విస్మృతం - విస్మృతుడు - ఉత్తీర్ణం - ఉత్తీర్ణుడు - సంకీర్ణం - సంకీర్ణుడు - విశీర్ణం - విశీర్ణుడు - విస్మృతమయ్యాడు - విస్మృతుడయ్యాడు - ఉత్తీర్ణ మయ్యాడు - ఉత్తీర్ణుడయ్యాడు - సంకీర్ణమయ్యాడు - సంకీర్ణుడయ్యాడు - విశీర్ణ మయ్యాడు - విశీర్ణుడయ్యాడు మొదలైనవి.

అవతరశబ్ద తకారం దీర్ఘయుక్తమై మూర్త్యాద్యర్థక
మవుతుంది. ౧౪౮

అవతారం - కృష్ణావతారం - బుద్ధావతారం - గాంధీఅవతారం - మొదలైనవి. నీఅవతారమేంరానాయనా! ఇటువంటి సందర్భాల్లో అవతారశబ్దానికిఆకారం అని అర్థం.

రుగ్ణతణకారానికి మకారం తరచుగా వస్తుంది. ౧౪౯

రుగ్మత - తరచుగా అనడంచేత రుగ్ణతఅనే ణకారవ్యవహారం తెలుగులో అరుదని తెల్సుకోవలెను.

మానసికరుగ్మత ప్రవేశించదు — మా — 19 —

అభ్యంజన యోజనల జకారానికి గచలు విభాషగా
వస్తాయి. ౧౫౦

అభ్యంజనం - అభ్యంగనం - యోజన - యోచన.

విభ్రాజమానవివర్ణానికి వ్యతిరేకాద్యర్థ విశేషాల్లో బవర్ణాదేశం
వస్తుంది. ౧౫౧

బభ్రాజమానం - ఆదిశబ్దంచేత హేళనాద్యర్థాలు గ్రాహ్యాలు.

బభ్రాజమానానికి తరుచుగా భజగోవిందం అనుప్రయుక్త
మవుతుంది. ౧౫౨

బభ్రాజమానం భజగోవిదం -

ఘాతక ఘావర్ణానికి హంవికల్పంగా ఆదేశమతుంది. ౧౫౩

ఘాతకుడు - హంతకుడు - ఘాతకి - హంతకి -

హంతక కవర్ణానికిలోపం స్త్రీత్వం విభాష. ౧౫౪

వాడుహంత - ఆమెహంత - వ్యవస్థిత విభాషచేత - కవర్ణలోప అభావంలో స్త్రీత్వంరాదు - హంతకుడు.

మనుష్యశబ్దయలోపం స్త్రీపుంవాచకంగా ఉకార అకారాలకు ఇత్వం విభాషగా వస్తుంది. ౧౫౫

మనుష్యుడు - మనిషి - ఆమనిషెవరు ? వెంకటరావు - ఆమనిషినిపిలువు- ఎవర్ని ? వరలక్ష్మినా ? మగమనిషి - ఆడమనిషి.

స్త్రీప్రమాది నిందాద్యర్థాల్లో విధవఇత్వానికి ఎత్వం బహుళంగా వస్తుంది. ౧౫౬

విధవ - వెధవ - ఏమిటిరావెధవ - ఏమిటేవెధవ - ఓరివెధవ - ఓసివెధవ - బహుళగ్రహణంచేత అలుముండలు పరమైతే ఎత్వంవిభాష - విధవముండ - వెధవముండ - విధవరాలు - వెధవరాలు - ఆదిశబ్దంచేత భర్తృహీనురాలైన స్త్రీ అనే అర్థంలోసైతం ఎత్వం విభాషగా వస్తుంది. నిందార్థంలో ఎత్వం నిత్యం. ఆదిశబ్దంచేత స్త్రీపుంభిన్నాలకుసైతం నిందార్థంలో వెధవశబ్ద ప్రయోగం ఉన్న దని గ్రహించాలి. వెధవకాయలు - వెధవమాటలు - వెధవవేషాలు - వెధవ వాసన - ఇత్యాదులూహ్యాలు -

ఇదేమిబ్రతుకయ్యా వెధవబ్రతుకు — మా — 9 — పిల్లినో విధవనో చూస్తే అశుభం — మా — 14 —

భంగిమిశ్రశబ్దాలకు మవర్ణాగమం వైకల్పికం. ౧౫౭

భంగి - భంగిమం - మిశ్రం - మిశ్రమం - మిశ్రఫలం - మిశ్రమఫలం -

క్షమాపణ ఆకారానికి రేఫాగమం వైకల్పికం. ౧౫౮

క్షమాపణం - క్షమార్పణం.

మహత్ తకారానికిలోపం పూర్వహ్రస్వానికి దీర్ఘంవిభాష. ౧౫౯

మహాగొప్పవాడు - మహాచెప్పావురే - మహచెప్పావులే - మొదలైనవి.

"మామిడిపండును మహమెచ్చుకున్నాడుట" మా — 133 — ఇవంటే నాకు మహాయిష్టం — పి — 30 — మహమజాగా పండిందని మెచ్చుకోవాలి — పి — 83 — ఒకమహామారి కావచ్చు — పి — 34 — సైరంధ్రిని మహరాణీ ! పేరుమాలిని — భా — వి — 28 — ఆమహాదేవి — భా — వి — 29 — మహా బలవంతులైన — భా — వి — 29.

స్వాయంభవ భాత్వానికి ఉత్వం వికల్పంగా వస్తుంది. ౧౬౦

భ + అత్వం - భాత్వం - స్వాయంభవుడు - స్వాయంభువుడు -

ప్రభాతసమ్రాట్ల ఆదిహ్రస్వానికి దీర్ఘం వైకల్పికం. ౧౬౧

ప్రభాతం - ప్రాభాతం - సమ్రాట్ - సామ్రాట్.

సభిక సభ్యులు. ౧౬౨

సభికసభ్యపదాలు పర్యాయపదాలుగా యీసూత్రంచేత నిపతింపబడినాయి - సభికులు - సభ్యులు -

పరిపూర్వక శ్రమశబ్దం వృత్త్యర్థకంకూడా అవుతుంది. ౧౬౩

చేతిపరిశ్రమ - చేతివృత్తి - సముచ్చయార్థకశబ్దప్రయోగంచేత అన్యార్థం కూడావుందనిగ్రహించాలి. వాడు సాహిత్యంలో చాలాపరిశ్రమచేశాడు. ఇటువంటి చోట్ల పరిశ్రమశబ్దానికి కృషిఅనిఅర్థం.

వంశ్యావళి యకారానికి లోపం వైకల్పికం. ౧౬౪

యకారానికనడంచేత ఆత్వానికి లోపంరాదు - వంశ్యావళి - వంశావళి.

ఆయుశ్శబ్దసత్వానికి షత్వం విభాష. ౧౬౫

ఆయుస్సు - ఆయుష్షు.

జాగ్రత్త ద్విత్వంలో ఒకతకారానికి లోపం రేఫకు మీది తకారంతో యోగం విభాష. ౧౬౬

జాగ్రత్త - జాగ్రత - జాగర్త.

భావశబ్దం పరమైతే మూకకవర్ణానికిలోపం దీర్ఘానికి హ్రస్వం విభాష. ౧౬౭

మూకభావం - ముభావం.

సామ్రాజ్యాదుల యకారానికి జకారం విభాష. ౧౬౮

సామ్రాజ్యం - సామ్రాజ్జం - సాయుజ్యం - సాయుజ్జం మొదలైనవి.

అచ్యుతాదుల యకారానికి చకారం విభాష. ౧౯౯

అచ్యుతరామయ్య - అచ్చుతరామయ్య - అప్రాచ్యుడు - అప్రాచ్చుడు మొదలైనవి.

అధిరాజ్యం ఆదిదీర్ఘానికి హ్రస్వం వైకల్పికం. ౧౨౦

ఆధిరాజ్యం - అధిరాజ్యం.

కుటుంబికాదుల ఇత్వానికి దీర్ఘం వైకల్పికం. ౧౨౧

కుటుంబికుడు - కుటుంబీకుడు - ప్రయాణికుడు - ప్రయాణీకుడు - గోత్రికుడు - గోత్రీకుడు.

సగోత్రీకునివలె చీటికీ మాటికీ హరాంచేస్తే గాడిదపుహూడా — మా — 10 — పూర్వీకులపేర్లను — పి — 116 —

కేరలాదుల లకారానికి ళకారం బహుళం. ౧౨౨

కేరలం - కేరళం - బహులం - బహుళం - పింగలం - పింగళం - మృదులం - మృదుళం - దంతావలం - దంతావళం - బహుళగ్రహణంచేత ధారాళాదుల్లో ళకారం నిత్యం - రజస్వలాదుల్లో అప్రవృత్తి -

నాగరక రేఫగత అత్వానికి ఇత్వం వైకల్పికం. ౧౨౩

నాగరకుడు - నాగరికుడు -

ధరణిరేఫగత అత్వానికి ఉత్వం ప్రథమస్వరానికి దీర్ఘం విభాష. ౧౨౪

ధరణి — ధారుణి

స్త్రీత్వవివక్షలో ఇత్రిప్రత్యయం కవిఇత్వానికి అయాదేశం వస్తుంది. ౧౨౫

కవయిత్రి - కవి + ఇత్రి - కవయ్ + ఇత్రి - కవయిత్రి. ఇది కవయితృ శబ్దానికి స్త్రీత్వరూపమే అయినా కవయితృ శబ్దానికి లోకంలో వ్యవహారంలేనందు వల్ల ఈవిధంగా ప్రక్రియ నేర్పరచడం జరిగింది. కవతృడు కవయిత అనే వ్యవహారం తెలుగులో కానరాదు.

స్త్రీత్వంలో పద్మనేత్రాదుల తుదిఅత్వానికి ఇత్వం విభాష. ౧౭౬

పద్మనేత్ర - పద్మనేత్రి - మీననేత్ర - మీననేత్రి - కమలనేత్ర - కమల నేత్రి - సారంగనేత్ర - సారంగనేత్రి మొదలైనవి.

స్త్రీత్వవివక్షలో సోదరాదుల తుదిఅత్వానికి ఇత్వం బహుళం. ౧౭౭

సోదరి - సహోదరి - ఇక్కడ ఇత్వంనిత్యం - బహుళగ్రహణంచేత మనో హరశబ్దం తుదిఅత్వానికి ఇత్వం విభాష - మనోహర - మనోహరి.

క్ష్మాతలాదుల తుదిఅత్వానికి ఇత్వం వైకల్పికం. ౧౭౮

క్ష్మాతలం - క్ష్మాతలి - నిశీథం - నిశీథి.

స్త్రీవాచ్యమయితే కోమలపదం తుదిఅత్వానికి ఇత్వం బహుళంగా వస్తుంది. ౧౭౯

కోమలి - బాహుళకంచేత సుమకోమలి - కుసుమకోమలి - ఇత్యాదుల్లో ఇత్వం వికల్పం - సుమకోమల - కుసుమకోమల -

సమ్ముఖశబ్దం ద్విరుక్తానికి లోపం వైకల్పికం. ౧౮౦

సమ్ముఖం - సముఖం - దివ్యసముఖానికి.

శిలావిశేషార్థంలో పుత్రశబ్ద ఉత్వానికి పర్యాయంగా అత్వఒత్వాలు వస్తాయి. ౧౮౧

పత్రం - పొత్రం - రుబ్బుపత్రం - రుబ్బుపొత్రం - దీనికి ఉత్వంతో వ్యవహారంలేదు - అత్వఒత్వాలతోనే వ్యవహారం.

స్త్రీపుంవివక్షలో క్రూరనిందార్థంలో పిశాచి శబ్దం ప్రయోగార్హం. ౧౮౨

ఓరిపిచాచివెధవ ! - ఓసిపిశాచిముండ - పిశాచిలాగా పట్టావేరానన్ను - పిశాచిలాగాపట్టావేమేనన్ను మొదలైనవి.

వేంకట దీర్ఘానికి హ్రస్వం తరచుగా వస్తుంది. ౧౮౩

వెంకటయ్య - వెంక్రటామయ్య - వెంకటేశ్వరరావు - తరచుగా అనడంచేత సకృత్తుగా దీర్ఘానికికూడా ప్రయోగం ఉన్నదని గ్రహించాలి.

అయ్యాదులు పరమైె దేవశబ్దం అసమర్థార్థకమవుతుంది. ౧౮౪

దేవయ్య - దేవమ్మ - దేవన్న మొదలైనవి - ఓరిదేవయ్యగందరా ! దేవయ్య.

మహదర్థంలో సఖితుడిఇత్వానికి అత్వం వైకల్పికం. ౧౮౫

సఖి - సఖుడు - సఖురాలు.

డువర్ణం పరమైతే బ్రాహ్మణనారాయణాల ణకారానికి లోపం వైకల్పికం. ౧౮౬

బ్రాహ్మడు - బ్రాహ్మణుడు - నారాయడు - నారాయణుడు - డువర్ణం పరమైతే అనడంచేత బ్రాహ్మణ్ణి - బ్రాహ్మడుతో - బ్రాహ్మడికోసం - నారాయణ్ణి - నారాయణునితో - నారాయడితో - నారాయడుతో - నారాయడుకోసం - ఇత్యాదుల్లో డు వర్ణస్థితిలో ణ లోపం వైకల్పికమని గ్రహించాలి. బ్రాహ్మణుని - బ్రాహ్మణునితో - నారాయణుని - నారాయణునితో - ఇత్యాది ని వర్ణాగమం వచ్చిన స్థితిలో ణ లోపం జరగదు. ణ లోపపక్షంలో బాహుళకంచేత బ్రాహ్మణ శబ్దం తుది అత్వానికి ఉత్వంరాదు. - నారాయణశబ్దం తుది అత్వానికి ఉత్వం వైకల్పికం.

బ్రాహ్మడెదురొస్తే కార్యభంగం — మా — 15 —

సుబ్రహ్మణ్యాదుల్లో హకారానికి లోపం మకారానికి ద్విత్వం బహుళం. ౧౮౭

సుబ్రహ్మణ్యం - సుబ్రమణ్యం - సుబ్రమ్మణ్యం - బహుళగ్రహణంచేత దీర్ఘంమీది హకారంలోపిస్తే మకారానికి ద్విత్వం నిత్యం - బ్రాహ్మణుడు - బ్రామ్మణుడు - బ్రామ్మడు - సుబ్రహ్మణ్యాదుల యాకు ణకారం తుదిఅత్వానికి ఎత్వం కనిపిస్తున్నది. సుబ్రహ్మణ్ణెం - సుబ్రమణ్ణెం - సుబ్రమ్మణ్ణెం.

మధ్యాహ్నాదుల హకారానికి నకారం బహుళం. ౧౮౮

మధ్యాహ్నం - మధ్యాన్నం - బహుళగ్రహణంచేత ర వర్ణంమీది హకారానికి మూర్ధన్య సంపర్కంచేత ణకారం వస్తే అపరాహ్ణం - అపరాణ్ణం - ఇత్యాదులూహ్యాలు.

జేయం శక్యార్థకం. ౧౮౯

జేయం - అజేయం - జేయుడు - అజేయుడు.

న్యాయ్యాదుల ద్విత్వయకారానికి లోపం విభాష. ౧౯౦

న్యాయ్యం - న్యాయం - సాహాయ్యం - సాహాయం - ధాయ్యం - ధాయం - హేయ్యం - హేయం - నికాయ్యం - నికాయం - సంచాయ్యం - సంచాయం - పాయ్యం - పాయం - ఇత్యాదులూహ్యాలు.

పానీయాదుల యకారానికి ద్విత్వం విభాష. ౧౯౧

పానీయం - పానీయ్యం - పీయూషం - పీయ్యూషం - తదీయం - తదీయ్యం - త్వదీయం - త్వదీయ్యం - స్వకీయం - స్వకీయ్యం - అస్మదీయం - అస్మదీయ్యం - యుష్మదీయం - యుష్మదీయ్యం - భవదీయం - భవదీయ్యం - కమనీయం - కమనీయ్యం - తపనీయం - తపనీయ్యం - గణనీయం - గణనీయ్యం - ఇత్యాదులూహ్యాలు.

నిమేషం ఏత్వానికి ఇత్వం వైకల్పికం. ౧౯౨

నిమేషం - నిమిషం.

ఋకారానికి రుకారాదేశం విభాష. ౧౯౩

ఋణం - రుణం - కృష్ణుడు - క్రుష్ణుడు - పృథివి - ప్రుథివి - పితౄణం - పిత్రూణం - వ్యవస్థిత విభాషచేత ఋ - రి యతిలో రు వర్ణాదేశంరాదు. ఋ - రు యతిలో వికల్పం.

కృష్ణ క్రిష్ణ క్రుష్ణులు. ౧౯౪

కృష్ణశబ్దంలో ఋకారానికి వికల్పంగా రి ఆదేశం పక్షంలో రు ఆదేశం దీనిచేత నిపతింపబడ్డాయి.

కృష్ణుడు - క్రిష్ణుడు - క్రుష్ణుడు.

ఋకారాదేశ రువర్ణసంయుక్తానికి పూర్వహ్రస్వం గురువుకాదు. ౧౯౫

సవిత్రుడు - ఇటువంటిచోట్ల త్రుకారాన్ని తేల్చిపలకాలి.

పదాద్యమైన ఋకారం రకారతుల్యం. ౧౯౬

తెలుగులో రు వర్ణాదేశం రానిపక్షంలోసైతం ఋకారానికి రేఫతుల్యత్వం వచ్చి స్వరసంధ్యభావాదికార్యాలు జరుగుతాయని తాత్పర్యం - అతనుఋషి - ఇక్కడ సంధిరాదు. ద్రుతానికి ఋ పరమైతే లోపంవిభాష.

సంస్కృతసమేతరమైన మనభాష అచ్చతెలుగు. ౧౯౭

స్పష్టం.

అచ్చతెలుగు పదాలన్నీ తరచుగా స్త్రీసమాలు క్లీబసమాలు అవుతాయి. ౧౯౮

స్త్రీసమత్వంచెప్పడంచేత ప్రథమైకవచన లోపాదులు. క్లీ బ సమత్వంచెప్పడం చేత మువర్ణకాదులు వస్తాయి. అన్న - మిన్న - గద్ద - ముద్ద - జాణ - రాణ- ఓడ - గోడ - ఇత్యాదులు స్త్రీ సమాలు. బియ్యం - నెయ్యం - అల్లం - బెల్లం - సున్నం - సన్నం - మొదలైనవి క్లీబ సమాలు. తరచుగా అనడంచేత పుంలింగ తుల్యాలుకూడా కొద్దిగావున్నాయని గుర్తించాలి. చందురుడు - కొమరుడు - జముడు.

బల్లిదాదులు సంస్కృతతుల్యాలు. ౧౯౯

మహత్వంలో వీటికి ఉత్వ డువర్ణకాదులు - అమహత్వంలో ముపర్ణ కాదులు - స్త్రీత్వంలో ఆలుశబ్దంతో సమాసం అవుతుందని తాత్పర్యం.

బల్లిదుడు - బల్లిదము - బల్లిదురాలు. బల్లిద - అక్కజ - రావల - బెట్టిద - బెడిద ఇత్యాదులు బల్లిదాదులు.

మహత్తులైన మగాదులకు డువర్ణకం వస్తుంది. ఉత్వం రాదు. ౨౦౦

మగడు - మనుమడు - మగ - మనుమ - రాయ - పాప - ప్రే - రే - అ - ఈ - కాప్రత్యయాంతాదులు మగాదులు - ఉత్వవిధాన అప్రవృత్తిలోసైతం నిషేధంచేయడంచేత కొన్నిచోట్ల వ్యవహారంలో ఉత్వంవున్నదని గ్రహించాలి. మగడు - మొగుడు - మకారం ఓష్ఠ్యస్వరసహితం కావడంతో మీదిగకారంసైతం సౌలభ్యార్థం ఓష్ఠ్యస్వరసహితమైనది. ఇటువంటివి వ్యవహారవశాన గుర్తించాలి.

తా ప్రత్యయంమీది బహువచన లకారానికి రేఫాదేశం నిత్యం. ౨౦౧

వేటకారు - విలుకారు - మొదలైనవి.

పగతాదుల బహువచన లకారానికి రేఫ విభాషగా వస్తుంది. ౨౦౨

పగతురు - నెయ్యురు - బలియురు - మార్తురు. - అల్లురు - పగతుల్లు - నెయ్యుల్లు - బలియుళ్లు - మార్తుల్లు - అల్లుళ్లు - చెయువురు - చెయువుల్లు - చెయువులు మొదలైనవి.

బహువచన లకారం పరమైతే కొన్ని డువర్ణకాలకు పూర్వాన పూర్ణబిందువు విభాషగా వస్తుంది. ౨౦౩

గండండ్రు - గండల్లు - మిండండ్రు - మిండళ్లు - మొదలైనవి.

బహువచన లకారం పరమైతే తా ప్రత్యయంమీది డువర్ణకానికి పూర్వాన పూర్ణబిందువు వైకల్పికంగా వస్తుంది. ౨౦౪

విలుకాండ్రు - విలుకారు - వేటకాండ్రు - వేటకారు - వేడుకకాండ్రు - వేడుకకారు మొదలైనవి.

పూర్ణబిందుపూర్వక డువర్ణక ఉత్వానికిలోపం మీది బహువచన లకారానికి రేఫ నిత్యం-రే ప్రభృతులకు రాదు. ౨౦౫

వేటకాండ్రు - గండండ్రు - మిండండ్రు - రేడులు - రేండ్లు - రేళ్లు.

బహువచనం పరమైతే రే ప్రభృతుల డువర్ణానికి లోపం రాదు. ౨౦౬

లోపవిధికిది బాధకం.

రేడులు.

బహువచన శ్లిష్టాలైన రే ప్రభృతుల డువర్ణకానికి ముందు పూర్ణబిందువు విభాషగా వస్తుంది. ౨౦౭

రేడులు - రేండ్లు - పూర్ణబిందువురాకపోతే ఉత్వలోపంవస్తే వక్ష్యమాణ సూత్రంచేత ళాదేశం నిత్యం - రేళ్లు.

మగ శబ్దం ప్రథమ ద్వితీయ అత్వాలకు ఒత్వఉత్వాలు
విభాషగా వస్తాయి. ౨౦౮

మొగుడు - మగడు - వ్యవస్థితవిభాషచేత పురుషవాచకమై విశేషణమైనపుడు అత్వానికి ఉత్వంరాదు. ఒత్వం వికల్పం - మొగవాడు - మగవాడు - మొగమనిషి - మగమనిషి - వాడు వలోపం జరిగితే మగాడు - మొగాడు - పూర్వోక్త విధిచేత ఉత్వం నిత్యంగా వస్తుంటే పాక్షికవిధానార్థం యీవిధి ప్రారంభించబడింది.

మనుమ తుదిమకారానికి వకారం సుపర్ణఉత్వానికి అత్వం
విభాషగా వస్తుంది. ౨౦౯

మనుమడు - మనువడు - మనవడు - మనుమరాలు - మనువరాలు - మనవరాలు - మొదలైనవి.

కూతు శబ్దం ప్రథమైకవచనానికి రువర్ణం వస్తుంది. ౨౧౦
కూతురు

కూతురు ప్రథమైకవచనంమీదనే ప్రథమాబహుత్వాదులు. ౨౧౧

కూతురులు - కూతుర్లు - కూతుళ్లు - కూతురును - కూతురిని - కూతుర్ను - కూతుర్ని - కూతుళ్లను.

చెలియలాదుల బహువచన లకారానికి రేఫం ముందరి లువర్ణానికి
బిందుపూర్వక డకారం విభాషగా వస్తుంది. ౨౧౨

చెలియలు - చెలియండ్రు - చెలియండ్రను. చెలియలు - చెల్లెలు - మరదలు - ఆలు - మొదలైనవి చెలియలాదులు.

చెలియలాదుల లకారానికి బహువచనం పరమైతే ళకారం
ఉత్వలోపం విభాషగా వస్తుంది. ౨౧౩

చెలియలు - చెలియళ్లు - చెల్లెలు - చెల్లెళ్లు - కోడలు - కోడళ్లు - మరదలు - మరదళ్లు - వ్యవస్థిత విభాషచేత ఆలుశబ్దానికి ఈకార్యంరాదు. ఆలులు - పక్షంలో పూర్ణబిందుపూర్వక డకారం లకారానికి రేఫం - చెలియండ్రు - ఆండ్రు మొదలైనవి.

వార్వాదులు పరమైతే స్త్రీవాచకమైన ఆడుశబ్దం ఉత్వానికి
అత్వం తరచుగా వస్తుంది. ౨౧౪

ఆడవారు - ఆడమనిషి - ఆడఆమె - ఆడామె - ఆడది. ఆడుది - ఆడువారు - ఆడుమనిషి ఇత్యాదుల్లో ఉత్వం అంత ప్రశస్తంకాదు.

బహువచనం పరమైతే దేవర రవర్ణానికి ళాదేశం అత్వానికి
లోపం విభాష. ౨౧౫

దేవరలు - దేవళ్లు - దేవరలచేత - దేవళ్లచేత.

అప్పాదులకు మహత్సంజ్ఞావివక్షలో డువర్ణకం బహుళం. ౨౧౬

అప్పడు - అన్నడు - అయ్యడు - మొదలైనవి జనవ్యవహారాన్ననుసరించి గ్రహించాలి. అయ్యాదుల కైన డువర్ణకం ప్రశస్తంకాదు.

అమ్మ శబ్దానికి స్త్రీత్వవివక్షలో ప్రేమసూచకంగా డువర్ణకం
కనిపిస్తున్నది. ౨౧౭

అమ్మడు - అమ్మణ్ణి - అమ్మడూ (అమ్మా) యిటురా! మొదలైనవి వ్యావహారికప్రయోగాలు.

అయ్యాదులకు మహన్మహతీసంజ్ఞావివక్షలో అయ్యాదులు
బహుళంగా అనుప్రయుక్తాలవుతాయి. ౨౧౮

బాహుళకంచేత ఏశబ్దానికి ఆశబ్దమే అనుప్రయుక్తంకాదని గ్రహించాలి. అనగా అయ్య శబ్దానికి అయ్య శబ్దం - అమ్మ శబ్దానికి అమ్మ శబ్దం సంజ్ఞావివక్షలో అనుప్రయుక్తంకాదని తాత్పర్యం. ఇలా అనడంచేత బంధుత్వార్థంలో అమ్మమ్మ ఇత్యాదులు రక్షితాలయ్యాయి.

అయ్యప్ప - అప్పయ్య - అక్కయ్య - అన్నయ్య - అమ్మయ్య అయ్యమ్మ - అప్పమ్మ - అక్కమ్మ - అన్నమ్మ - ఇత్యాదులు మహాజనవ్యవహారానుగుణంగా గ్రాహ్యాలు.

బహువచనం పరమైతే డ ల ట రల ఉత్వానికి
లోపం బహుళం. ౨౧౯

గుండ్లు - గుండులు - గిండ్లు - గిండులు - కాళ్లు - కాలులు - మొసళ్లు - మొసలులు - గొంట్లు - గొంటులు - తుంట్లు - తుంటులు - గోర్లు -

గోరులు - చీపుళ్ళు - చీపురులు - బాహుళకంచేత విల్లులు - పిల్లులు - పులులు ఇత్యాదుల్లో లోపంరాదు. రాముడులు - మగడులు - ఇత్యాది డు వర్ణాల ఉత్వానికి లోపం నిత్యం - రాముళ్ళు - మగళ్ళు - పర్యాయ పూర్ణబిందు రూపాలకు బిందువస్తేనే ఉత్వలోపం - అనంటులు - అనంట్లు - అరంటులు - అరంట్లు - మొదలైనవి. ఏడులు - కాడులు - గోటులు - తేటులు - ఇత్యాదుల్లో ఉత్వ లోపిస్తే బాహుళకంచేతనే అన్యత్కార్యంగా పూర్ణబిందువాగమాన్ని గ్రహించాలి. ఏండ్లు - కాండ్లు - గోండ్లు - తేండ్లు - ఇలాగే - వాండ్రు - వీండ్రు - ఇత్యాదులు గ్రాహ్యాలు - తత్సమపదాలైన కోటిపిప్పలిశబ్దాలకు ఈ ఉత్వలోపం కనిపిస్తున్నది - కోటులు - కోట్లు - పిప్పలులు - పిప్పళ్లు.

బహువచనం పరమైతే శబ్దాలైన అసంయుక్తాలయిన ఉత్వాంతాలైన డ-ల-ర లకు ళకారం బహుళంగా వస్తుంది. - ౨౦

తాడులు - తాళులు - గుమ్మడులు - గుమ్మళులు - మొగిలులు - మొగిళులు - పిడికిలులు - పిడికిళులు - ఊరులు - ఊళులు - ఊళ్లు - పందిరులు - పందిళులు - పందిళ్లు - పేరులు - పేళులు - పేళ్లు - పేండ్లు - ఏరులు - ఏళ్లు - ఏళ్లు - కాడులు - కాళులు - కాళ్లు - కాండ్లు - వాలులు - వాళులు - వాళ్లు - శాబ్దికశబ్దప్రయోగంచేత రాముడులు మొదలైనవాటిల్లో అసంయుక్తావస్థలో ళాదేశం రాదు - రాముళ్లు.

బహువచన శిష్టాలై అద్విరుక్తాలైన డకార లకారాలకు ళకారం నిత్యంగా వస్తుంది. - ౨౧

తాళ్లు - గుమ్మళ్లు - మొగిళ్లు - విళ్లు - ముళ్లు - నిళ్లు - రాముళ్లు - రాముళ్లతో - వాళ్లు - వాళ్లతో - వీళ్లు - వీళ్లతో.

కొత్తగా యీప్రపంచంలోకి వచ్చినవాళ్ల కథక — మూ — 18 —

ఔపవిభక్తికాలైన లివర్ణ సలలువర్ణాలకు బహువచనం పరమైతే పూర్ణబిందు పూర్వకమైన డువర్ణం బహుళంగా వస్తుంది. ౨౨

కొడవలి - కొడవండులు - ఉత్వలోపం - కొడవండ్లు - కొడవళులు - కొడవళ్లు - కొడవలులు - రోకలి - రోకండులు - రోకండ్లు - రోకళ్లు - రోకళులు -

రోకలులు - ఇల్లు - ఇలుదులు - ఇండ్లు - ఇళ్లు - కల్లు - కలుదులు - కండ్లు - కళ్లు - పల్లు - పలుదులు - పండ్లు - పళ్లు - ముల్లు - ములుదులు - ముండ్లు - ముళ్లు - విల్లు - విలుదులు - విండ్లు - విళ్లు - మొదలైనవి.

మధ్యనియమ్యార్థకాలైన కల్లుపల్లులు అనౌపవిభక్తికాలు కావడంచేత వాటికి ఈకార్యం రాదు. ఇల్లు ప్రభృతులు అనౌపవిభక్తికాలవడంచేత వాటికి యీ కార్యంలేదు.

ఔపవిభక్తిక పూర్ణబిందుపూర్వక డువర్ణానికి ళకారం బహుళంగా వస్తుంది. ౨-౨౩

ఇల్లు - ఇండ్లు - ఇళ్ళు - కల్లు - కండ్లు - కళ్ళు - ముల్లు - ముండ్లు - ముళ్ళు - విల్లు - విండ్లు - విళ్ళు - విల్లులు - ప్రథమేతరాల్లో - ఇళ్ళను - ఇండ్లను - ఇళ్ళతో - ఇండ్లతో - ఇత్యాదులూహ్యాలు. వక్ష్యమాణ సూత్రంచేత బహువచన లకారానికి సైతం పాక్షికంగా ళకారం.

ఇళ్ళపరసలో తమిది పదమూడవది - మా - 16 -

పల్లు పన్ను. ౨-౨౪

దంతార్థకమైన పల్లు శబ్దానికి పన్ను ఏకవచన రూపంగా ఈసూత్రంచేత నిపతించబడింది.

కన్ను పన్నులు పల్లువంటివి. ౨-౨౫

వ్యాకరణ కార్యంలో కన్ను పన్నులు పల్లు వంటివని అర్థం.

కన్ను - కండ్లు - కళ్లు - కన్నులు - పన్ను - పండ్లు - పళ్లు - పన్నులు - ఈపన్ను దంతపర్యాయమేగాని కప్పానికి పర్యాయంకాదు. కండ్లలో - కళ్ళలో - కన్నులలో - కన్నుల్లో - పండ్లలో - పళ్ళలో - పన్నులలో - పన్నుల్లో.

కలన్నాదుల సువర్ణానికి కు వర్ణం విభాషగా వస్తుంది. ౨-౨౬

కలను - కలకు - కలనులు - కలకులు - కొలను - కొలకు - కొలనులు - కొలకులు - నెరసు - నెరకు - నెరసులు - నెరకులు - క్రమాసు - క్రమాకు - మాసులు - క్రమాకులు - మొదలైనవి.

రేను గోను శబ్దాల నువర్ణానికి గు వర్ణం బహుళంగా
వస్తుంది. — ౨౨౭

రేను - రేగు - గోను - గోగు - బహుళగ్రహణంచేత బహుత్వంలో గు వర్ణం నిత్యం. రేగులు - గోగులు - బాహుళకంచేతనే సమాసంలో సంచి పరమైతే గు వర్ణంరాదు. గోనిసంచి - సంచి పరమైతే అనడంచేత గోగునార ఇత్యాదుల్లో గు వర్ణం నిత్యంగా వస్తుంది.

ఆడు ప్రభృతులు పరమైతే లు ప్రత్యయపరక మాటాడుల
టకార అత్వానికి లోపం వైకల్పికం. — ౨౨౮

మాటలాడు - మాట్లాడు - తాటలాడు - తాట్లాడు - మొదలైనవి.

బహువచనం పరమైతే చేను పేను మీనుల నువర్ణం
విభాషగా లోపిస్తుంది. — ౨౨౯

చేను - చేలు - చేనులు - పేను - పేలు - పేనులు - మీను - మీలు - మీనులు.

బహువచనం పరమైతే రేయి ప్రభృతుల తుది అక్షరం
బహుళంగా లోపిస్తుంది. — ౨౩౦

రేయి - రేలు - రేయులు - రాయి - రాలు - వేయి - వేలు - వేయులు - వ్రాయి - వ్రాలు - ఈలోపం సమాసంలోనూవుంది. రేరాజు - ముగరాపతకం - వేవెలుగు.

కొన్నిచోట్ల బహువచనంమీద బహువచనం కనిపిస్తున్నది.—౨౩౧

రాలు - రాళ్లు.

ఇటువంటికార్యం సంస్కృత సమాల్లోనూ కనిపిస్తున్నది. రాత్రులు - రాత్రుళ్ళు - రాత్రిళ్ళు.

బహువచనం పరమైతే ఆవు ప్రభృతుల తుదిఅక్షరానికి
లోపం విభాష. — ౨౩౨

ఆవు - ఆలు - ఆవులు - జాము - జాలు - జాములు - వ్యస్తంలో అక్షర లోపరూపాలు అంతప్రచురంగాలేవు. కాని ఆలమంద వంటిచోట్ల సమాసంలో ఈలోపకార్యం కనిపిస్తున్నది.

బహువచనం పరమైతే ఎడ్డుశబ్దం డకారానికి
డకారం విభాష. ౨౩౩

ఎడ్డులు - ఎడ్డులు - ఉత్వలోపం. ఎడ్లు - ఎడ్డులను - ఎడ్డులను - ఎడ్లను.

సమేతరాల్లో ఇత్వాంతాల ఉపోత్తమ ఇత్వానికి బహువచనం
పరమైతే ఉత్వం వస్తుంది. ౨౩౪

రెండింటికిమించినవర్ణాలుకల పదంలో చివరిఅక్షరం ఉత్తమం - దాని పూర్వాక్షరం ఉపోత్తమం - ఉపోత్తమాక్షరగతమైన ఇత్వం ఉపోత్తమ ఇత్వం.

కలికి - కలుకులు - ములికి - ములుకులు - చెలిమి - చెలుములు - బలిమి - బలుములు - ఉపోత్తమ ఇత్వానికి అనడంచేత జిగి - నిసి - ఇత్యాదుల్లో ఉత్వంలేదు. జిగులు - నిసులు - ఇత్వాంతాలనడంచేత ఈకారాంతాలైన కిటికీలు - విరికీలు - ఇత్యాదుల్లో ఉత్వంరాదు.

ర ల లోపధ సవార్ధాదుల ఉపోత్తమ ఇత్వానికి
ఉత్వం రాదు. ౨౩౫

ఉపధఅంటే చివరిఅక్షరానికి పూర్వాక్షరం - పందిరి - పందిరులు - పిడికిలి - పిడికిళ్లు - దాపిడి - దాపిళ్లు - తొమ్మిది - తొమ్మిదులు - మొదలైనవి. నెత్తుటికి - నుదుటికి - నడపుదుటిపి(్రాజు ఇత్యాదుల్లో మూలపదం రోపధంకావడం చేతనే ఉత్వంలేదని గుర్తించాలి. నుదురు - నెత్తురు - నడపుదురు - మొదలైనవి.

పుట్టుపు ప్రభృతుల పువర్ణానికి లోపం వైకల్పికం. ౨౩౬

పుట్టు - పుట్టుపు - చట్టు - చట్టువు - తట్టు - తట్టుపు - పూ - పూపు - ఇత్యాదులు జనవ్యవహారానుగుణపరిగ్రాహ్యాలు. దానిపుట్టు నాకుతెలుసు - సిగపూ నలిగింది.

ఇయకు మారుగా నామాంతానికి ఎత్వం బహుళంగా
వస్తుంది. ౨౩౭

కన్నియ - కన్నె - జన్నియ - జన్నె - పన్నియ - పన్నె - కొంచియం - కొంచెం - కౌండియం - కొండెం - మొదలైనవి ఊహ్యాలు. బాహుళకంచేత సందియం - కారియం - మొదలైనచోట్ల ఎత్వంలేదు.

ముత్తియాదుల ఇత్వానికి లోపం విభాష. ౨౩౯

ముత్తియం - ముత్యం - కల్లియం - కళ్యం - కన్నియ - కన్య - పల్లియం - పళ్యం - వ్యవస్థితవిభాషచేత ఇన్నియాదుల్లో ఇత్వలోపంరాదు.

ద్విరుక్తం అన్యహల్ సంయుక్తమయితే ద్విత్వానికి
లోపం నిత్యం. ౨౩౯

ముత్యం - ఎద్దు - తిట్లు - కొట్లు - ఇత్యాదులూహ్యాలు.

అన్ని ప్రభృతులు సర్వనామాలు. ౨౪౦

అన్ని - ఇన్ని - ఎన్ని - కొన్ని - పెక్కు - పలు - ఆ - ఈ - ఏ
నీ-నా-మన-తా- సంఖ్యావాచకాలు అన్ని ప్రభృతులు.

సంఖ్యకు పూరణార్థంలో అవ అగమంగా వస్తుంది. ౨౪౧
రెండవవాడు - మూడవవాడు మొదలైనవి.

అవకు ఓత్వం విభాష. ౨౪౨

రెండోవాడు - మూడోవాడు - నాల్గోవాడు - రెండోది - మూడోది - నాల్గోది - అయిదోది - మొదలైనవి. పక్షంలో రెండవవాడు - రెండవది - ఇత్యాదులు.

సర్వనామ క్రియాపదాల బహువచనం మహత్తుకి లాగానే
మహతికవుతుంది. ౨౪౩

వారిద్దరూ రుక్మిణీసత్యభామలు - వీళ్ళు ముగ్గురూ శ్రీ భూ నీళలు.

గకారం వకారం. ౨౪౪

అపదాద్యమై అసంయుక్తమైన గకారానికి వకారం వకారానికి గకారం బహుళంగావస్తుందని తాత్పర్యం.

గవలు : పగలు - పవలు - పలుగుడు - పలువురు - తొగ - తొవ
అగు - అవు - తగు - తవు.

వగలు : పవడం - పగడం - నవ్వు - నవు - నగు. బాహుళకంచేత కొన్నిచోట్ల వకారంనిత్యం - అవుతున్నది - అవుతాడు.

అచ్చతెలుగు పదాల్లో ఉత్తమాలైన రు లు డుల పూర్వ మందున్న ఏత్వానికి హ్రస్వం విభాష. ౨౮౫

నల్లేరు - నల్లెరు - పల్లేరు - పల్లెరు - పెన్నేరు - పెన్నెరు - మానేరు - మానెరు - కుందేలు - కుందెలు - నేరేడు - నేరెడు - తంగేడు - తంగెడు మొదలైనవి - వీటిల్లో హ్రస్వరూపాలు కొన్ని ప్రాంతీయాలు.

క్రొత్తాదుల రేఫకు లోపం బహుళంగా వస్తుంది. ౨౮౬

క్రొత్త - కొత్త - ప్రాత - పాత - గ్రుడ్డి - గుడ్డి - గ్రుద్దు - గుద్దు - బహుళగ్రహణంచేత అనడంచేత అద్వ్యక్షరాలు లుప్తశేషాలయినప్పుడు రేఫకు లోపంలేదు ప్రాయిల్లు - క్రొంజెమట - క్రొంబసిడి - మొదలైనవి. క్రొత్తశబ్దం ద్విరుక్తమై అద్వ్యక్షరశేషమైతే బాహుళకంచేత రేఫకులోపం వైకల్పికం - క్రొంగ్రొత్త - కొంగ్రొత్త - క్రొంగొత్త - కొంగొత్త - రేఫలోపతార్యం సంస్కృత సమాల్లో శ్రోత్రియశబ్దానికి కనిపిస్తున్నది. శ్రోత్రియుడు - శోత్రియుడు.

వ్రాయు వ్రేపల్లెల ఆదిహల్లు వికల్పంగా లోపిస్తుంది. ౨౮౭

వ్రాయడం - రాయడం - వ్రాత - రాత - వ్రేపల్లె - రేపల్లె.

ఊయేల ఊయాలల దీర్ఘానికి హ్రస్వం వైకల్పికం. ౨౮౮

ఊయేల - ఉయేల - ఊయెల - ఉయెల - ఊయాల - ఊయల - ఉయాల - ఉయల.

ఊయేలాదుల్లో తొలి అచ్చుమీది హల్లుకి ద్విత్వం వికల్పంగా వస్తుంది. ౨౮౯

ఊయెల - ఉయ్యేల - ఊయేల - ఉయ్యేల - ఊయాల - ఉయ్యాల - ఏలిదం - ఎల్లిదం - కోపు - కొప్పు - తేప - తెప్పు - జాజర - జజ్జర - తీయం - తియ్యం - తోయలి - తొయ్యలి - దీవియ - దివ్వియ - నూవు - నువ్వు - నోవి - నొవ్వి - నోపు - నొవ్వు - పూవు - పువ్వు - పేయ - పెయ్య - మోక - మొక్క - మోటిక - మొట్టిక - వీయం - వియ్యం - మొదలైనవి.

గోయి ప్రభృతుల తుదివర్ణానికి ద్విత్వం విభాషగా వస్తుంది. ౨౫౦

గోయి - గొయ్యి - నూయి - నుయ్యి - నేయి - నెయ్యి - చేయి - చెయ్యి - వ్యవస్థిత విభాషచేత వాయి ప్రభృతుల కీకార్యంలేదు. వక్ష్యమాణసూత్రంచేత ద్విత్వం పరమైతే దీర్ఘానికి హ్రస్వం.

రకారంక్రిందిరకారానికి తుది ను లుల క్రింది న ల లకు లోపం బహుళం. ౨౫౧

అర్రు - అరు - గొర్రియ - గొరియ - కన్ను - కను - మిన్ను - మిను - పల్లు - పలు. అరువాపు - గొరిపోతు - కనుచూపుమేర - మినురూపు - పలు వరుస - మొదలైనవి ప్రయోగాలు.

అక్కటాదుల జడ్డకు లోపం బహుళం. ౨౫౨

అక్కట - అకట - చెవ్వు - చెవు - చెవ్వి - చెవి. అక్కట - చెవ్వు - చెవ్వి - అయ్యో - ఉమ్మ - ఎక్కసక్కియం - ఎమ్మెక - కట్టా - కట్టిక - కప్పురం - కమ్మతం - కొట్టిక - కొయ్యగూర - గయ్యాళి - గిజ్జిగాడు - గుజ్జ రాతి - చిట్టి - చిన్న - చిమ్మట - చెన్నటి - చెమ్మట - జెర్రిపోతు - జవ్వాజి - జాబిల్లి - తెల్ల - దివ్వియ - నువ్వు - నిద్దుర - నివ్వాళి - పవ్వళించు - పువ్వు - పెద్ద - బొమ్మ - బొమ్మిడికం - మల్లారం - అట్టు - ఇట్టు - ఎట్టు - అప్పుడు - ఇప్పుడు-ఎప్పుడు - అచ్చట - ఇచ్చట - ఎచ్చట - ముక్కు దూలం - గగ్గురు - దిగ్గవిడుచు - కచ్చేరి - మెట్టిక - కొత్తిమిరి - తల్లక్రిందులు- పల్లెవాటు - చెల్లియలు - దివ్విటీ - నివ్వరి - తాయెత్తు - దిస్స - నెర్ర - తొర్ర - తొల్లి - ఇత్యాదులూహ్యాలు. బహుళగ్రహణంచేత అటెళ్లాడు - ఇటొచ్చాడు - ఎటెళ్లాడు - ఎటుపోయాడు - వంటిచోట్ల లోపం నిత్యం.

జడ్డక్కరంతో పదాదిస్వరం కూడితే జడ్డకు తరచుగా లోపం రాదు. ౨౫౩

అర్రెత్తింది - కన్నదిరింది - మొదలైనవి. తరచుగా అనడంచేత ఒకంత - అటెళ్లు మొదలైనవి రక్షితాలయినాయి.

పదాది ఇకార ఎకారాలకు బహుళంగా యకారం
పూర్వాగమం అవుతుంది. ౨౫౪

ఇక్కడ - యిక్కడ - ఇందుమతి - యిందుమతి - ఈశ్వరుడు - యీశ్వరుడు - ఎక్కడ - యెక్కడ - ఎల్లయ్య - యెల్లయ్య - ఏమి - యేమి - ఏభై - యేభై - ఏర్లగడ్డ - యేర్లగడ్డ.

పదాది ఉకార ఒకారాలకు బహుళంగా వకారం
పూర్వాగమం అవుతుంది. ౨౫౫

ఉండు - వుండు - ఉరం - వురం - ఊర్వశి - వూర్వశి - ఓదనం - వోదనం - ఓడ - వోడ - బహుళగ్రహణంచేత వకారం పరమైతే ఈకార్యంరాదు. ఉవిద - వువిదకాదు.

యకారమిళితమైన ఎకారం కొన్నిచోట్ల అకారం
అవుతుంది. ౨౫౬

యెవడు - యవడు - యెండ - యండ - యెల్లయ్య - యల్లయ్య - యేభై- యాభై - యేర్లగడ్డ - యార్లగడ్డ - ఇటువంటి ప్రయోగాలు చాలాఅరుదు. యాభై ప్రభృతులకు ప్రయోగం తరచుగా కనిపిస్తున్నది.

అతడు యల్లయ్య అని తప్ప మనకు తెలిసేదికాని — పి — 45 —

వకార మిళితమైన ఒకారం కొన్నిచోట్ల అకారం
అవుతుంది. ౨౫౭

ఒద్ద - వొద్ద - వద్ద - ఒయ్యారం - వొయ్యారం - వయ్యారం - ఒంగు - వొంగు - వంగు - ఒంతు - వొంతు - వంతు - ఒదరు - వొదరు - వదరు - ఇత్యాదులు వ్యవహారానుగుణంగా గ్రాహ్యాలు.

పదాది వవర్ణం ఒకారసహితమై అజాదిపదంకూడా
అవుతుంది. ౨౫౮

వలదు - వద్దు - వొద్దు - ఒద్దు - పదాది యవర్ణంపట్ల ఇలాగే ఎకారంగా వర్తించడంవుందిగాని అది శిష్టవ్యావహారికంకాదు - యముడు - యెముడు - ఎముడు - యీళ్ళొక యెములోళ్ళాగ వుండా(్రా - అని పామరవ్యవహారం.

పకారం ఒకారంగా మారడమైనా క్రియల తాదిలో సంధిలో తరచు కనిపిస్తున్నవి - అపొచ్చింది - ఏఒొచ్చింది మొదలైనవి.

మొగం ఖ హ. ౨౫౯

మొగంఅనే పదంలోని గకారానికి ఖకారం హకారం పర్యాయంగా వస్తాయని తాత్పర్యం - మొగం - మొఖం - మొహం - ఈకార్యం ఇక ఒక శబ్దాల కకారానికి కనిపిస్తున్నది. ఇక - ఇఖ - ఇహ - ఒకటి - ఒఖటి - ఒహటి.

నిర్మొగమోటనికానుగసుక — మా — 8 —

స్వార్థాతిశయంలో కొన్నిపదాల పరుషసరళాలకు మహా

ప్రాణాలు వైకల్పికంగా వస్తాయి. ౨౬౦

అక్కరలేదు - అఖ్ఖరలేదు - లెక్క - లెఖ్ఖ - పట్టి - పఠ్ఠి - పెద్దది - పెద్ధది - చాలా - ఛాలా - చస్తే - ఛస్తే - జడుసుకొన్నాడు - ఝడుసుకొన్నాడు - మొదలైనవి.

ఆరాటాదుల్లో ప్రథమేతరదీర్ఘానికి హ్రస్వం విభాషగా

వస్తుంది. ౨౬౧

ఆరాటం - ఆరటం - కక్కూరితి - కక్కురితి - కొమారుడు - కొమరుడు - కొమారిత - కొమరిత - పెండారం - పెండరం - ఇత్యాదులూహ్యాలు.

ఓయారాదుల్లో తొలిదీర్ఘానికి హ్రస్వం విభాషగా వస్తుంది. ౨౬౨

ఓయారం - ఒయారం - గూడారం - గుడారం - జోహారు - జొహారు - వీడియం - విడియం - మారు - మరు - మూలుగు - ములుగు - మోరపు - మొరపు - వీడియం - విడియం - మొదలైనవి ఊహ్యాలు.

అడగ్వాదుల్లో డాకు ణకారం విభాషగా వస్తుంది. ౨౬౩

అడగు - అణగు - కడగు - కణగు - నాడెం - నాణెం - పోడిమి - పోణిమి - మిడుగురు - మిణుగురు - వడపు - వణపు - మొదలైనవి.

దొప్పాదుల్లో దాకు డకారం విభాషగా వస్తుంది. ౨౬౪

దొప్ప - డొప్ప - దిగు - డిగు - దెందం - డెందం - దెప్పరం - డెప్పరం - డాదేశరూపాలు - వ్యవహారంలో పరిమితంగానేవున్నాయి.

జాది ప్రభృతుల దకారానికి జకారం విభాష. ౨౬౫

జాది - జాజి - జవాది - జవాజి - జూదం - జూజం - జాదర - జాజర - మొదలైనవి.

ఏతాదులకు ఉవర్ణకం పరమైతే దీర్ఘం విభాష. ౨౬౬

ఏతం - ఏతాం - కళ్లం - కళ్లాం - గాలం - గాలాం - గడ్డం - గడ్డాం - గోణం - గోణాం - గోతం - గోతాం - జోతం జోతాం - బొంతం - బొంతాం - పెండ్లం - పెండ్లాం - మొదలైనవి.

లు ల నలు పరమైతే ఉవర్ణానికి లోపం పూర్వఎత్వానికి ఓత్వాదేశం విభాషగా వస్తుంది. ౨౬౭

ముత్తెములు - ముత్తోలు - పళ్లెములు - పళ్లోలు - పందెములు - పందోలు - జందెములు - జందోలు మొదలైనవి.

పదాంతాలై అసంయుక్తాలైన నులురుల ఉత్వానికి లోపం బహుళం. ౨౬౮

ప్రమాను - పడు - ప్రమాన్పడు - ప్రమాన్పడు - కను-చెదురు - కన్చెదురు - పరుల్ చూచి - పురుల్ దోచి - హాహార్ - వస్తార్లే - తెస్తార్లే - పేర్కొను - మొదలైనవి.

లకారం పరమైతే డువర్ణ డకారానికి ళకారం కొన్నిచోట్ల వస్తుంది. ౨౬౯

వాచ్చాళ్లె - తెచ్చాళ్లె - వెళ్లాళ్లోపలికి - వస్తాళ్లాకాడికి - ఇత్యాదులూహ్యాలు.

హల్లు పరమైతే డు రు వు ను ఉల ఉత్వానికి లోపం తరచుగా కనిపిస్తున్నది. ౨౭౦

వచ్చాడ్రా - వచ్చాడురా - తెచ్చార్లే - తెచ్చారులే - కొట్టావ్‌చాల్లే - కొట్టావుచాల్లే - తిట్టావ్‌లేమొగాడివి - తిట్టావులేమొగాడివి - విన్లే - వినులే - తిన్రా - తినురా - చాల్రా - చాలురా - వెళ్రా - వెళ్లురా - మొదలైనవి.

అచ్చికాల్లో పదమధ్యంలో స ల ళ రల ఉత్వానికి
లోపం బహుళం. ౨౭౧

కినుక - కిన్క - కానుక - కాన్క - అలుక - అల్క - చిలుక - చిల్క - కాలువ - కాల్వ - కడుగు - కడ్గు - పిడుగు - పిడ్గు - తరుగు - తర్గు - కూరుకు - కూర్కు - మొదలైనవి.

ఇతర అచ్చులకు సైతం కొన్నిచోట్ల లోపం కనిపిస్తున్నది. ౨౭౨

కలికి - కల్కి - పొలితి - పొల్తి - ములికి - ముల్కి.

అబ్బురాదుల్లో ఉత్వలోపం విభాష. ౨౭౩

అబ్బురం - అబ్రం - అప్పుడు - అప్డు - ఇప్పుడు - ఇప్డు - ఎప్పుడు - ఎప్డు - చప్పుడు - చప్డు - నెత్తురు - నెత్రు - మొదలైనవి - ఇప్డిప్డేవెళ్లాడు - నెత్రొచ్చింది - ఇత్యాదులు వ్యవహారాలు.

ఎ పోది క్రియల ఆదిహల్లుకి లోపం బహుళం. ౨౭౪

అటెళ్లు - అటువెళ్లు - నన్నెక్కిరించాడు - నన్నువెక్కిరించాడు - అక్కడెట్టపోయ్ - మొదలైనవి. బాహుళకంచేత యథావ్యవహారంగా గ్రహించాలి.

నిందలో ఆమ్రేడితం ఆద్యక్షరాలైన హ్రస్వదీర్ఘాలకు
గి గీలు వస్తాయి. ౨౭౫

కొంటె - గింటె - కోణంగి - గీణంగి - కొట్టాడా - గిట్టాడా ? - మొదలైనవి.

పదాది సహజ గి గీ లకు బొ బోలు వస్తాయి. ౨౭౬

పదాదిసహజ గి గీలు కల ఆమ్రేడితం ఆదిహ్రస్వాక్షరానికి బొవర్ణం దీర్ఘాక్షరానికి బోవర్ణం ఆదేశంగా వస్తుందని తాత్పర్యం.

గిన్ని - బొన్ని - గీర - బోర - గీత - బోత.

విశేష్యాలు విశేషణాలు అని శబ్దాలు రెండువిధాలు. ౨౭౭

అమ్మ - అక్క - అన్న - మొదలైనవి విశేష్యాలు - మిగిలినవి విశేషణాలు.

గుణాదివిశేషాలను చెప్పేది విశేషణం. ౨౭౮

గుణం మొదలైన విశేషాలను చెప్పేది విశేషణమని తాత్పర్యం.

విశేషణం చెప్పే విశేషం కలది విశేష్యం. ౨౭౯

విశేషణంచేత తెల్పబడే విశేషంకలది విశేష్యమని తాత్పర్యం.

గుణాదిభేదాలతో విశేషణం ఆరు విధాలు. ౨౮౦

గుణాదివాచక విశేషణాలు - ద్రవ్యవాచక విశేషణాలు - క్రియావాచక విశేషణాలు - క్రియాజన్య విశేషణాలు - క్రియావిశేషణాలు - సంఖ్యావాచక విశేషణాలు - అని విశేషణాలు ఆరు విధాలు - వివరణలోఉన్న గుణాది ఆదిశబ్దం చేత స్వభావం - అవస్థ - సామ్యం - శక్తి - మొదలైనవి గ్రాహ్యాలు.

ప్రియ — ప్రియుడు — ప్రియం —
సుందరి — సుందరుడు — సుందరం
నేర్పరి — వన్నెలాడి
అందగాడు — అందకత్తె

ఇత్యాదులు గుణాది వాచక విశేషణములు.

ధనవంతుడు — ఆయుధపాణి
నెలతాల్పు — ముక్కంటి

ఇత్యాదులు ద్రవ్యవాచక విశేషణములు.

క్షేమంకరం — కృతజ్ఞుడు
చూపుడువ్రేలు — పంటకాపు

మొదలైనవి క్రియావాచకవిశేషణాలు.

వచ్చినవాడు — తెచ్చినవాడు
కొట్టనిచెట్టు — చెప్పనిమాట
చేస్తున్నపని — కొడుతున్నచెట్టు
కొట్టేచెయ్యి — తిట్టేనోరు

మొదలైనవి క్రియాజన్య విశేషణాలు.

ఎంతోమేలు — త్వరగావచ్చాడు
బాగాచూచాడు — చాలాతిన్నాడు

ఇత్యాదులు క్రియావిశేషణాలు.

ద్వితీయం — తృతీయం
తురీయం — చతుర్థి

రెండో — మూడో
నాల్గవ — ఆరవ
ఇత్యాదులు సంఖ్యావాచక విశేషణాలు.

అమహద్విశేష్యాంకల ఏకాంత తదంశాంతసంఖ్యాప్రయుక్తవిశే
షణం సమాసఅసమాసాల్లో పూర్వపరాల్లో ప్రయోగించ
బడుతుంది. —౨౮౧

అమహద్విశేష్యాంకల ఏకాంతసంఖ్యాప్రయుక్తవిశేషణంసమాసా
సమాసాల్లో పూర్వపరాల్లో ప్రయోగింపబడుతుంది. —౨౮-౨

అమహద్వాచకం విశేష్యంగాకలిగి ఒక్కశబ్దం అంతంలోకల సంఖ్యాప్రయుక్తవిశేషణం సమాసంలో పూర్వపదంగాను అసమాసంలో ఉత్తరపదంగాను ప్రయోగింపబడుతుందని తాత్పర్యం.

మహదమహద్విశేష్యాంకల ఏకాంశాంతసంఖ్యాప్రయుక్తవిశేషణం
సమాసఅసమాసాల్లో పూర్వపరాల్లో ప్రయోగించ
బడుతుంది. —౨౮౩

మహద్వాచకంగాని అమహద్వాచకంగాని విశేష్యంగాఉంటె అర - పాతిక - మొదలైన ఏకాంశం అంతమందున్న సంఖ్యాప్రయుక్త విశేషణం సమాసంలో పూర్వంలోను అసమాసంలోపరంలోను ప్రయోగించబడుతుందని తాత్పర్యం.

ఏకాంత తదంశాంతసంఖ్యా ప్రయుక్త విశేషణంకల
వ్యస్తసమాసపదాల్లో విశేష్యం పూర్వోత్తరపదమై
బహ్వేకవచనాంత మవుతుంది. —౨౮౪

ఒకశబ్దంకాని ఉపాదులు కాని తుదినికల సంఖ్యాప్రయుక్త విశేషణంవున్న అసమాసంలో విశేష్యం పూర్వపదమై బహువచనాంతంగాను - సమాసంలో విశేష్యం ఉత్తరపదమై ఏకవచనాంతంగాను వుంటుందని తాత్పర్యం.

అరవైయొక్కరథం - రథాలు అరవైయొకటి - రెండున్నర మనిషి - మనుషులు రెండున్నర - రెండున్నరరూపాయి - రూపాయిలు రెండున్నర - ఒకానొకచోట వ్యవహారంలో సమాసంలో విశేష్యానికి బహుత్వం కనిపిస్తున్నది. రెండున్నర మనుషులు - రెండున్నరరూపాయలు - ఇత్యాదులూహ్యాలు.

విశేష్యం ప్రధానం ౨౮౫

విశేష్యం ముఖ్యమని విశేషణం అముఖ్యమని తాత్పర్యం.

ప్రధానం పశ్చాద్వాచ్య మౌతుంది. ౨౮౬

అన్వయక్రమంలో విశేషణాలను ముందుగాచెప్పి చివర విశేష్యాన్ని చెప్పాలని భావం.

కొన్నిచోట్ల విశేషణాలు విశేష్యాలవుతాయి. ౨౮౭

వాడుబీద - ఆమెపేద - ఆమె బాలెంత - అతనుగేస్తు - ఇతనునేస్తం - అత్తడుఇట్లాఅన్నాడు - మొదలైనవి.

తెలుగులో కొన్నిశబ్దాలు విశేషణవిశేష్యాలు. ౨౮౮

కొన్నిశబ్దాలు విశేషణాలు విశేష్యాలు రెండూనని తాత్పర్యం.

అవి కీడు మొదలైనవి - నల్ల మొదలైనవి.

విశేష్యార్థ బోధకం విశేషణం. ౨౮౯

కొన్నికొన్నిచోట్ల విశేషణం విశేష్యార్థాన్ని బోధిస్తుందని తాత్పర్యం.

అయిష్టం చెయ్యవద్దు - అయిష్టమైనపని చెయ్యవద్దు - బూతులుపలకవద్దు - బూతుమాటలు పలకవద్దు - ఇత్యాదులూహ్యాలు.

అక్కడాదులు నిత్యైకవచనాంతాలు. ౨౯౦

అక్కడ - ఇక్కడ - ఎక్కడ - అచ్చట - ఇచ్చట - ఎచ్చట - మొదలైనవి.

సస్యవాచకాలు నిత్యైకవచనాంతాలు. ౨౯౧

వరి - కంది - పెసర - మినుము - ఉలవ - ఇత్యాదులు.

ఇంగువాదులు నిత్యైకవచనాంతాలు. ౨౯౨

ఇంగువ - ఆముదం - ఉప్పు - కారం - చింతపండు - చమురు - నూనె - పసుపు - ముగ్గు (ద్రవ్యవాచకం) - మొదలైనవి.

లోహవాచకాలు నిత్యైకవచనాంతాలు. ౨౯౩

ఇత్తడి - ఇనుం - కంచు - బంగారం - వెండి - రాగి - మొదలైనవి.

సమానార్థకపదాలు నిత్యైకవచనాంతాలు. ౨౯౪

సమానం - ప్రతి - ఈడు - సరి - సాటి - ఎన - ఇత్యాదులు.

గుణరసవాచకాలైన విశేషణశబ్దాలు నిత్యైక వచనాంతాలు. ౨౯౫

తెలుపు - ఎరుపు - తీపు - తీపి - పులుపు - పీతం - శుక్లం - ఇత్యాదులూహ్యాలు.

కొన్ని నామవాచకాలు నిత్యైక వచనాంతాలు. ౨౯౬

రేపు - ఎల్లుండి - మొన్న - నిన్న - మొదలైనవి. వాక్యవిశేషంలో బహువచనాంతాలవుతాయి - ఎన్ని రేపులు గడిపావురా ! ఎన్ని యెల్లుండ్లనియెగ్గొట్టావురా ! అని వ్యవహారం.

కొన్ని నామవాచకాలు ఏకత్వంలో కూడా బహువచనాంతాలవుతాయి. ౨౯౭

రాములు - సోములు - రాయలు - వెంకులు- మొదలైనవి.

అందర్వాదులు నిత్యబహువచనాంతాలు. ౨౯౮

అందరు - ఇందరు - ఎందరు - కొందరు - పెక్కురు - పలువురు - బహుత్వవాచకమైన మందికి ఏకత్వంలోనే ప్రయోగం - అనేకమంది - ఎక్కువమంది.

అదరులులోనైనవి నిత్యబహువచనాంతాలు. ౨౯౯

అదరులు - అరువుళ్లు - మిణుగురులు ఇవి సమాసంలో ఏకవచనాంతాలు - మిణుగురుపురుగు - మిణుగురుపురుగులు - అదరుటగ్గి - మొదలైనవి.

తరచుగా ధాన్యవాచకాలు నిత్యబహువచనాంతాలు. ౩౦౦

ఆళ్లు - చోళ్లు - వడ్లు - కందులు - పెసలు - మినుములు. తరచుగా అనడంచేత బియ్యం - జీలకర్ర ఇత్యాదులు నిత్యైకవచనాంతాలు.

క్రీడావిశేషవాచకాలు తరచుగా నిత్యబహువచనాంతాలు. ౩౦౧

అచ్చనగాయలు - ఓమనగుంటలు - గుజ్జనగూళ్లు - బిల్లంగోళ్లు - తరచు శబ్దప్రయోగంచేత - చెమ్మచెక్క - బిల్లంగోడు - కోతికొమ్మచ్చి - ఇత్యాదులు గ్రాహ్యాలు.

అవ్యయాలు కొన్ని బహువచనాంతతుల్యా లవుతాయి. ౩౦౨

అట్లు - ఇట్లు - ఎట్లు - నిచ్చలు.

అట్లాదుల టకారానికి లోపం లకారానికి ద్విత్వంవిభాష. ౩౦౩

అల్లా - అలా -. ఇల్లా - ఇలా - ఎల్లా - ఎలా - అట్లా - ఇట్లా - ఎట్లా - అట్టా - ఇట్టా - ఎట్టా.

అట్లుమొదలైనవి అర్థవిశేషాల్లో ఆకారాంతాలు
బహుళంగా అవుతాయి. ౩౦౪

అట్టా - అట్లా - అల్లా - టలోపంవస్తే ఆత్వం నిత్యం - అల్లా - అలా - టద్విత్వలోపంవస్తే ఆత్వంరాదు - అటు - ఇటు - ఎటు - ఆవిధంగా - ఆవైపు - మొదలైనవిక్కడ అర్థవిశేషాలు.

అట్టుఇట్టుఎట్టుల దిత్వానికి లోపంవైకల్పికం-లోపం
వస్తే వువర్ణం విభాష. ౩౦౫

అటు - అటువు - ఇటు - ఇటువు - ఎటు - ఎటువు - ఇక్కడ అట్టుప్రభృతులకు అవైపు - ఈవైపు - ఏవైపు - అనే అర్థం.

అలా అద్యచ్చుకి లోపంవచ్చి అనుప్రయుక్తమై
ఇవార్థకమవుతుంది. ౩౦౬

అలా - దానిలా - దీనిలా - దేనిలా మొదలైనవి.

అనుప్రయుక్తమైన ఇవార్థకలాకు అన్నంతఅగు ధాతువు
విభాషగా అనుప్రయుక్తమవుతుంది. ౩౦౭

అలాగ - ఇలాగ - ఎలాగ - దానిలాగ - దానిలాగా - మొదలైనవి.

లామీది అన్నాంత అగు ధాతుగకార అత్వానికి ఉత్వం విభాష. ౩౦౮

అలాగ - అలాగు - ఇలాగ - ఇలాగు - ఎలాగ - ఎలాగు - దానిలాగ - దానిలాగు - మొదలైనవి.

తత్సమదేశ్యశబ్దాలచివర పూజ్యతలో తరచుగా ఏకత్వంలో గారు శబ్దం వస్తుంది. ౩౦౯

అయ్యగారు - అమ్మగారు - రాజుగారు - నాయుడుగారు - రాముడుగారు - దేవిగారు - పాత్రుడుగారు - రామంగారు - సోమంగారు - తరచుగా అనడంచేత రాములుగారు ఇత్యాదుల్లో ఏకవ్యక్తినిర్దేశంలో బహుత్వంవచ్చినాగారుశబ్దంవస్తుంది.

ద్వితీయాదుల్లో గారు ఉత్వానికి ఇత్వం వస్తుంది. ౩౧౦

అయ్యగారిని - అయ్యగారితో - అయ్యగారికి - దేవిగారిని - దేవిగారితో - దేవిగారికి - మొదలైనవి.

ని-కి-వర్ణకాలు పరమైతే గారుఇత్వానికి లోపం వైకల్పికం. ౩౧౧

అయ్యగార్ని - అయ్యగారిని - అయ్యగార్కి - అయ్యగారికి.

తత్సమాది శబ్దాలకు కొన్నిటికి పూజ్యతలో బహుత్వంమీది గారు గకారానికి వకారం బహుళంగా వస్తుంది. ౩౧౨

రాములువారు - స్వాములువారు - రాయలువారు - సీతమ్మగారు - సీతమ్మవారు - రాములవారు - స్వాములవారు - బహుత్వంమీదిఅనడంచేత లు వర్ణక లవర్ణాలు రెండూ గ్రాహ్యాలే - బాహుళకంచేత లవర్ణంమీది గకారానికి వకారం నిత్యం - రాయలవారు - స్వాములవారు.

అర్థవిశేషంలో ఏకత్వంమీది గకారానికి సైతం వకారం కొన్నిచోట్ల కనిపిస్తున్నది. ౩౧౩

అయ్యవారు (ఉపాధ్యాయుడు) - అమ్మవారు (ఉపాధ్యాయురాలు పూజ్యురాలైన స్త్రీ - స్త్రీదేవత).

వారు గారులు పరమైతే నిత్యవైకల్పికంగా రాజుశబ్దం
ఆకారాంత మవుతుంది. ౩౦౭

రాజావారు - రాజాగారు - రాజుగారు - వారు పరమైతే నిత్యంగాను గారు పరమైతే వైకల్పికంగాను రాజుశబ్దం ఆకారాంతమవుతుందని తాత్పర్యం.

సంబోధ్యవాచకం బహుత్వంలోవున్నా క్రియలమీది అమ్మాదు
లకు ఏకవచనమే వస్తుంది. ౩౦౮

మనకెందుకు మనం వెళ్లొద్దాంరండమ్మ - మీరంతా చూచారటగదమ్మ.

పూజ్యతాధిక్యంలో మీరుకు మారుగా తాము తమరులు
ప్రయుక్తాలవుతాయి. ౩౦౯

అయ్యా! తాము తప్పకుండా రావాలండి - తమరు తప్పక రావాలండి.

సామాన్యసంబంధంలో నానీలకు మామీలు కొన్నిచోట్ల
వస్తాయి. ౩౧౦

మాయిల్లు - మీయిల్లు - మావాడు - మీవాడు.

అజ్ఞాతస్త్రీపురుషోద్దేశ్యప్రశ్నలోను-నిర్దిష్టస్త్రీపురుషాన్యతర
ప్రశ్నలోను తరచుగా ఎవరు ప్రయుక్తమవుతుంది. ౩౧౧

ఎవరక్కడ - వాళ్లిద్దరిలో ఎవరు గొప్పవారు - సుందరీనందుల్లో ఎవరు సౌందర్యవంతులు.

నిర్దిష్టస్త్రీపురుషగ్రహణలోను అనిర్దిష్టస్త్రీపురుషోద్దేశ్య వ్యాహారం
లోను ఒకరు తరచుగా ప్రయుక్తమవుతుంది. ౩౧౨

ఆస్త్రీపురుషులిద్దర్లో ఒకరికివ్వు - ఒకరిమాట ఒకరికి గిట్టదాయె - వారొకరే వచ్చారు.

అంతశబ్దం పరమైతే ఈ ఏ లకు హ్రస్వం అకారానికి
లోపం వస్తుంది. ౩౧౩

ఇంత - ఎంత.

అంతశబ్దం పరమైతే ఒకకు కొ వర్ణాదేశం అకారానికి
లోపం ప్రాయికంగా అవుతుంది. ౩౨౧

ఒక + అంత - కొంత - ప్రాయికంగా అనడంచేత అర్థవిశేషంలో ఒకంత అని కూడా వాడవచ్చునని తాత్పర్యం.

సముదాయార్థమైతే అమహదర్థబహుత్వంలో అంతాదుల
సబిందుతకారానికి ద్విత్వనివర్ణం వస్తుంది. ౩౨౨

అన్ని - ఇన్ని - ఎన్ని - కొన్ని.

ఆ ఈ శబ్దాలకు మహదర్థంలో వకారం
పూర్వాగమంగా వస్తుంది. ౩౨౩

వాడు - వారు - వాళ్లు - వీడు - వీరు - వీళ్లు - ఎవడుశబ్దబహుత్వంలో ఎవరు - ఎవళ్లు - రెండూ శిష్టవ్యావహారికాలు - వాడు - వీడులకు ఆది హల్లోపం జరిగితే ఆడు - ఈడు వంటి రూపాలవుతాయి. యిటువంటి లోపరూపాలు కొన్ని చోట్ల సంధిలో కనిపిస్తున్నాయి. దానికాడేమన్నాడు - ఆడు - ఈడు - అళ్లు - ఈళ్లు.

అమహదర్థద్వితీయాద్యేక బహువచనాల్లో త్రికానికి
దవలు క్రమంగా పూర్వాగమాలవుతాయి. ౩౨౪

దానిని - దాన్ని - వాటిని - దీనిని - దీన్ని - వీటిని - దేనిని - దేన్ని - వేటిని - దానిచేత - వాటిచేత.

మహదర్థంలో ఏ శబ్దానికి ఏకబహుత్వాల్లో వాడు
వారులు అనుప్రయుక్తాలవుతాయి. ౩౨౫

ఏవాడు - ఏవారు - యివి ప్రయోగ యోగ్యాలుకావు.

ఏ వా లకు హ్రస్వం వకారానికి ద్విత్వం
నిత్యవైకల్పికాలుగా వస్తాయి. ౩౨౬

ఎవ్వడు - ఎవడు - ఎవ్వరు - ఎవరు.

త్రికానికి మర్యాదలో మహదేకవచనంలో
తవర్ణాగమం వస్తుంది. ౩౨౭

అతడు - ఈతడు - ఏతడు.

తవర్ణపరకత్రికానికి హ్రస్వం వైకల్పికం, ౩౨౮

అతడు - ఇతడు - ఎతడు.

హ్రస్వత్రికపూర్వకతవర్ణంమీది డువర్ణకానికి నువర్ణకం
విభాషగా వస్తుంది. ౩౨౯

అతడు - అతను - ఇతడు - ఇతను - ఎతడు - ఎతను.

హ్రస్వత్రికంమీది తకారంపైన అర్థవిశేషంలో కా ప్రత్యయం
కూడా కనిపిస్తున్నది. ౩౩౦

ఈకకారానికి గకారంనిత్యం - అతగాడు - ఇతగాడు - ఎతగాడు.

ఎవ డెవ రే దేవులకు అర్థవిశేషంలో ఇకారం వస్తుంది. ౩౩౧

విశేషార్థ ఇకారం పరమైతే ఎవ డెవరుల వవర్ణానికి లోపం
పూర్వస్వరానికి దీర్ఘం నిత్యం. ౩౩౨

ఏడి - ఏడీ - ఏరి - ఏరీ - ఏది - ఏదీ - ఏవి - ఏవీ - ఎక్కడ
వున్నాడు - ఎక్కడవున్నారు - ఎక్కడవున్నది - ఎక్కడవున్నవి.

నిర్దేశార్థవిశేషంలో ఏ కో లనుప్రయుక్తాలైతే అతడు ఇతడుల
తవర్ణానికి లోపం వస్తుంది. ౩౩౩

అడే - ఇడే - అడుగో - ఇడుగో - అడే - అక్కడవున్నాడు -
అక్కడేవున్నాడు - ఇడే - ఇడుగో - ఇక్కడవున్నాడు - ఇక్కడేవున్నాడు -
అని అర్థం. ఇలాగే అదే - ఇదే - ఇత్యాదులకు గ్రహించాలి. అదే - ఇదే -
అదిగో - ఇదిగో - అరే - ఇరే - అరుగో - ఇరుగో మొదలైనవి.

మహత్యేకవచనంలో త్రికానికి అక అప అములు
అనుప్రయుక్తాలవుతాయి. ౩౩౪

త్రికానుప్రయుక్తాలైన అక అప అమల ఆద్యంతాకారాలకు
లోప ఏత్వాలు నిత్యం. ౩౩౫

ఆ + అక - ఆకె - ఆ + అప - ఆపె - ఆ + అమ - ఆమె - ఈకె - ఈపె - ఈమె - ఏకె - ఏపె - ఏమె - అక అప ప్రయోగా లప్రసిద్ధాలు.

త్రికానికి అమహదర్థప్రథమైక బహువచనాల్లో
దివి వర్ణకాలు వస్తాయి. ౩౩౬
దివివర్ణకాలు పరమైతే ఆ ఈ లకు ఏకారానికి హ్రస్వం
నిత్యవైకల్పికాలుగా వస్తుంది. ౩౩౭

అది- ఇది - అవి - ఇవి - ఏది - ఎది - ఏవి - ఎవి.

త్రికహ్రస్వంమీది దివులకు ద్విత్వం విభాషగా వస్తుంది. ౩౩౮

అది - అద్ది - అవి - అవ్వి - ఇది - ఇద్ది - ఇవి - ఇవ్వి - ఎది - ఎద్ది - ఎవి - ఎవ్వి - అద్దిగో - ఇద్దిగో - అవిగో - ఇదిగో. అదిగద్దివ్యవహారం - అని వాడుక.

ప్రథమేతరవిభక్తి పరమైతే అమహదర్థత్రికానికి ఏక
బహుత్వాల్లో ని టి వర్ణా లాగమంగా వస్తాయి. ౩౩౯

దానిని - వాటిని - దానితో - వాటితో - దీనిని - వీటిని - దీనితో - వీటితో - అమహదర్థబహుత్వంలోకూడా నివర్ణాగమం కొందరు చేస్తారు కాని అది వ్యవహార విరుద్ధం. వానిని - వానితో - వానికోసం - ఇత్యాదులు వ్యావహారికంలో మహదర్థస్ఫోరకాలుగా రూఢాలైనాయి.

వాటిని ఆపాదమస్తకంచూస్తే — పి — 46 — వీటిని అవిష్కరిస్తున్న వారికి — పి 47 — తుచ్ఛసంతృప్తులను వేటినో ఆశించి — పి — 29 —

ప్రత్యయం పరమైతే అమహదర్థత్రికంమీది ఆగమ నివర్ణ
స్వరానికి లోపం విభాషగా వస్తుంది. ౩౪౦

దానిని - దాన్ని - దానితో - దాన్తో - దీన్ని - దీనిని - దీన్తో - దేనిని- దేన్ని - దేన్తో - వ్యవస్థిత విభాషచేత వలన - కంటె - కి - యొక్క-లు పరమైతే

స్వరలోపంరాదు - దానివలన - దానికంటె దానికి - దానియొక్క - తక్కిన చోట్ల వైకల్పికం.

తో వర్ణకం పరమైతే లుప్తస్వరనకారానికి
పూర్ణబిందువు వైకల్పికం. ౩౪౧

దానితో - దాన్తో - దాంతో - దీనితో - దీన్తో - దీంతో - దేనితో - దేన్తో దేంతో.

అమహదర్థత్రికానికి పరమైన టివర్ణంమీది లోవర్ణానికి
ద్విత్వం వికల్పం. ౩౪౨

వాటిల్లో - వాటిలో - వీటిల్లో - వీటిలో - వేటిల్లో - వేటిలో.

ఏకార్థకంమీద సమాసగతషష్ఠ్యంతాలైన ఎవ్వరొక్కరులమీద
ఏకవచనంలో ప్రకృత్యర్థకతవర్ణకం వస్తుంది. ౩౪౩

ఎవ్వరిత - ఒక్కరిత - ఒకరిత.

తవర్ణకఅత్వానికి ఇత్వఎత్వాలు విభాషగా వస్తాయి. ౩౪౪

ఎవ్వరితి - ఎవరితి - ఎవరితె - ఎవ్వరితె - ఒకరితి - ఒక్కరితి - ఒక్కరితె - ఒకరితె.

తవర్ణకం పరమైతే రేఫమీది ఇత్వానికి లోపం విభాష. ౩౪౫

ఒకరిత - ఒకర్త - ఒకర్తి - ఒకర్తె - ఎవర్తి - ఎవర్తె.

రేఫయుక్తమైతే ఒక్కొక శబ్దాలమీది తవర్ణం అత్వానికి ఉత్వం
విభాషగా వస్తుంది. ౩౪౬

ఒక్కర్తు - ఒక్కర్త - ఒకర్తు - ఒకర్త.

ఒక్కశబ్దానికి ఓత్వాదేశం బహుళం. ౩౪౭

ఒకర్తు - ఓర్తు - ఒకర్తి - ఓర్తి - ఒకమనిషి - ఓమనిషి - ఒకనాడు - ఓనాడు - ఒకసారి - ఓసారి ఇత్యాదులూహ్యాలు.

ఓరుషిదగ్గిర సమంత్రకంగా సాకల్యంగా — భా— వి— 91 రథాలతోరథాలుతలపడ్డాయి మరోదగ్గిర — భా — వి - 94

ఎవ్వరితాదుల్లో రివర్ణానికి లోపం విభాష. ౩౮౭

ఎవ్వరితె - ఎవ్వతె - ఎవ్వరితి - ఎవ్వతి - ఎపరితి - ఎపతి - ఒకరితె - ఒకతె - ఒక్కరితె - ఒక్కతె - ఒహరితె - ఒహతె -

రివర్ణం లోపిస్తే తవర్ణకానికి ద్విత్వం బహుళంగా వస్తుంది. ౩౮౭

ఎవత్తి - ఎవత్తె -ఒకత్తె ఒహత్తె - అవధారణార్థక ఏకారం పరమైతే కకారంమీది తకారానికి ద్విత్వం వికల్పం - ఒక్కతే - ఒక్కత్తే - ఒకతే - ఒకత్తే

నీ శబ్దం ఈత్వానికి ఉత్వం–మీది వువర్ణకానికి ద్విత్వం విభాషగా వస్తుంది. ౩౯౦

నీవు - నువ్వు - నువు - వ్యవస్థిత విభాషచేత ఉత్వం రానప్పుడు ద్విత్వంరాదు.

నిన్ను మిమ్ము ప్రభృతుల ద్విత్వనములకు లోపం విభాష. ౩౯౧

నిన్ను - నిను - నన్ను - నను - తన్ను - తను - మిమ్ము - మిము - మమ్ము - మము - తమ్ము - తము - మిమ్మల్ని - మిమల్ని - మమ్మల్ని - మమల్ని - మిమ్ముల్ని - మిముల్ని -

నీ శబ్దానికి నే తాలకు ప్రథమైకవచనంలో క్రమంగా వు నువర్ణకాలవుతాయి. ౩౯౨

నీవు - నేను - తాను.

ప్రథమ నువర్ణకం పరమైతే తా శబ్దానికి హ్రస్వం వైకల్పికం. ౩౯౩

తాను - తను - తనన్నాడు - తనుచెప్పాడు - తను ఎన్నున్నా అన్నాడు.

బహుత్వంలో నీ నే తనల నకారానికి మకారం ఆదేశంగా వస్తుంది. ౩౯౪

ప్రథమాబహుత్వంలో మీ తా శబ్దాలకు మే తా మనలకు
రు ము వర్ణకాలు వస్తాయి. ౩౫౫

మీరు - తమరు - మేము - తాము - మనము.

ద్వితీయాదులు పరమైతే నే మే ల ఏత్వానికి అత్వం
వస్తుంది. ౩౫౬

తా శబ్దానికి తృతీయాది విభక్తి యోగంలేదు. ౩౫౭

ఇలా అనడంచేత తాదేశమైన తన తమలకే విభక్తియోగం వున్నదని గ్రహించాలి.

విభక్తి పరమైతే తా శబ్దానికి ఏకబహుత్వాల్లో తన
తమాదేశాలు బహుళంగా వస్తాయి. ౩౫౮

తాను - తాము - తమరు - తనను - తన్ను - తమను - తమరిని - తనతో - తమతో - తమరితో - తనకై - తమకై - తమరికై - బాహుళకంచేత ప్రథమ సు ము వర్ణకాలుపరమైతే తనతమాదేశాలురావు - ద్వితీయైకవచనంలోను కూర్చి, గురించి, పట్టివర్ణకాలు పరమైనా తన తమాదేశాలు వికల్పాలు. తనను - తన్ను - తమను - తమ్ము - తమరిని - తననుబట్టి - తన్నుబట్టి - తమనుబట్టి తమ్ముబట్టి - తమరినిబట్టి - తననుగూర్చి - తన్నుగూర్చి - తమనుగూర్చి - తమ్ముగూర్చి - తమరినిగూర్చి - తననుగురించి - తన్నుగురించి - తమను గురించి - తమ్ముగురించి - తమరినిగురించి - ప్రథమరువర్ణకంపరమైనా తక్కిన విభక్తి ప్రత్యయాలుపరమైనా తా శబ్దానికి ఏకబహుత్వాల్లో తనతమాదేశాలు నిత్యం అని గ్రహించాలి.

కూర్చి గురించి పట్టి నులు పరమైతే నా నీ తా మా మీ తాలకు
ఏకబహుత్వాల్లో ద్విరుక్తాలైన ను ము లు క్రమంగా
ఆగమాలౌతాయి. ౩౫౯

ఆగమద్విరుక్త ను ము ల మీది నువర్ణకానికి లోపం
ప్రాయికంగా వస్తుంది. ౩౬౦

నన్ను - నిన్ను - తన్ను - మమ్ము - మిమ్ము - తమ్ము - వక్ష్యమాణ సూత్రంచేత ను ము లు లోపిస్తే నాబట్టి - నీబట్టి - తనబట్టి - తననుబట్టి-మాబట్టి-

మీబట్టి - తమబట్టి - తమనుబట్టి - తమర్నిబట్టి ఇత్యాదులు. ద్విత్వనుములు తన తమాదేశాలు రానప్పుడేవస్తాయి.

కూర్చి గురించి పట్టులు పరమైతే నా ని మా మీ ల మీది ఆగమద్విత్వ ను ము లకు ప్రత్యయ సహితంగా లోపం విభాష. ౬౯-౧

నాగూర్చి - నన్నుగూర్చి - నాగురించి - నన్నుగురించి - నాబట్టి-నన్ను బట్టి - నీగూర్చి - నిన్నుగూర్చి - నీగురించి - నిన్నుగురించి - నీబట్టి - నిన్ను బట్టి - మాగూర్చి - మమ్ముగూర్చి - మాగురించి - మమ్ముగురించి - మాబట్టి మమ్ముబట్టి - మీగూర్చి - మిమ్ముగూర్చి - మీగురించి - మిమ్ముగురించి - మీబట్టి - మిమ్ముబట్టి - ఆగమాలు నిత్యంగాచెప్పి ప్రత్యయసహితలోపం సాక్షికంగాచెప్పడంవల్ల నా నీ వంటి దీర్ఘాలు పట్టి కూర్చులకు సరళాద్యత్వం సంపాదింపబడింది.

కూర్చి గురించి పట్టి నులు పరమైతే మా మీల మీది ఆగమ ముపర్ణం మీద లవర్ణాగమం వికల్పంగా వస్తుంది. ౬౯-౨

మమ్ముగూర్చి - మమ్ములగూర్చి - మమ్ముగురించి - మమ్ములగురించి - మమ్ముబట్టి - మమ్ములబట్టి - మమ్మును - మమ్ములను - మిమ్ముగూర్చి - మిమ్ములగూర్చి - మిమ్ముగురించి - మిమ్ములగురించి - మిమ్ముబట్టి - మిమ్ముల బట్టి - మిమ్మును - మిమ్ములను.

మన తమలకు ద్వితీయాదులు పరమైతే ల రి వర్ణాలు విభాషగా ఆగమాలౌతాయి. ౬౯-౩

మనను - మనలను - మనచేత - మనలచేత - మనతో - మనలతో - మనకొరకు - మనలకొరకు - మనకై - మనలకై - మనవల్ల - మనలవల్ల - మనకంటె - మనలకంటె - మనబట్టి - మనలబట్టి - మనకు - మనలకు - మనయొక్క - మనలయొక్క - మనయందు - మనలయందు - తమను - తమరిని - తమచేత - తమరిచేత - తమతో - తమరితో - తమకొరకు - తమరికొరకు - తమకై - తమరికై - తమవలన - తమరివలన - తమకంటె - తమరికంటె - తమబట్టి - తమర్నిబట్టి - తమకు - తమరికి- తమయందు - తమరియందు

ఆగమ ల రి వర్ణాల స్వరానికి విభక్తిపరమైతే లోపం
బహుళం. ౩౬౪

మనల్ని - తమర్ని - ఒకర్ని.

ద్వితీయాదులు పరమైతే తన మనల నవర్ణ అత్వానికి లోపం
బహుళం. ౩౬౫

తనను - తన్ను - మనను - మన్ని - తన్తో - మన్తో - మన్నిచూచి - మన్నిబట్టి.

మమ్ము మిమ్ముల మీది లవర్ణస్వరానికి లోపంవస్తుంది. వస్తే
పూర్వ ఉకారానికి అకారం వైకల్పికం. ౩౬౬

మమ్ములను - మమ్మల్ని - మమ్ముల్ని - మిమ్ములను - మిమ్మల్ని - మిమ్ముల్ని.

నన్ను మమ్ము ప్రభృతుల నుముల ద్విత్వానికి లోపం
వైకల్పికం. ౩౬౭

నన్ను - నను - నిన్ను - నిను - తన్ను - తను - మమ్ము - మము మిమ్ము - మిము - తమ్ము - తము.

కర్తృబహుత్వంలో తనకు తమ కూడా వస్తుంది. ౩౬౮

పంచవర్షప్రణాళిక విజయవంతంచెయ్యడం ఎవరికివాళ్లే తమబాధ్యతగా భారతీయులు భావించారు. ఎవరికివారే తమనిశ్చయాన్ని ప్రకటించారు.

అమహదర్థంలో ఒక్క శబ్దానికి టి వర్ణం వస్తుంది. ౩౬౯

ఒక్కటి - ఒకటి - ఒకానొకటి.

ఒకశబ్దం అల్ప పరార్థకంకూడా అవుతుంది. ౩౭౦

ఒక్కైదురూపాయలివ్వండి - ఇక్కడ అల్పార్థకం - ఒకడిసంగతి మన కెందుకు? ఇక్కడ పరార్థకం.

అనిర్దిష్టార్థంలో ఒకశబ్దానికి ఒక శబ్దం పూర్వాగమం
అవుతుంది. ౩౭౧

ఒకానొక - ఒకానొకడు - ఒకానొకతె - ఒకానొకటి - అత్వసంధిలో బహుళగ్రహణంచేత అన్యత్కార్యంగా ఆన్ వస్తుంది.

మహదర్థంలో సర్వనామాల బహువచన లకారానికి రేఫ బహుళంగా వస్తుంది. ౩౭౨

ఎల్లరు - వారు - వీరు - ఎవరు - బహుళగ్రహణంచేత వాడు వీడులకు తప్ప తక్కినవాటిపన్న దువర్ణకంమీది లు ల లకు, మమ్ములను - మిమ్ములను - మనలను ఇత్యాదుల్లో లకారానికి రేఫరాదు - వాడు వీడుల బహువచన లకారానికి రేఫ వికల్పం - రేఫవస్తే పూర్వసూత్రంచేత ఉత్వలోపం అన్యత్కార్యంగా పూర్ణబిందువు - వాండ్రు - వీండ్రు - వాళ్లు - వీళ్లు - వారు - వీరు.

అంతాదులకు వారు పరమైతే వాకు లోపం తకారానికి దకారం వస్తుంది. ౩౭౩

అందరు - ఇందరు - ఎందరు - కొందరు.

అంతకు పరమైన వారు తొలిస్వరంతక్క తక్కినవాటికి లోపం వైకల్పికం. ౩౭౪

అంత + వారు - అంతా - పక్షంలో అందరు.

మహన్మహత్త్యర్థాల్లో అంతాదులకు సంఖ్యావాచకాలకు బహుత్వంలో మంది బహుళంగా అనుప్రయుక్తమవుతుంది. ౩౭౫

అంతమంది - ఇంతమంది - ఎంతమంది - కొంతమంది - ఎనిమిది మంది - తొమ్మిదిమంది - పదిమంది - పక్షంలో అందరు - ఇందరు- ఎందరు- కొందరు - ఎనమండుగురు - తొమ్మండుగురు - పదుగురు మొదలైనవి. బహుళగ్రహణంచేత రెండుమంది - మూడుమంది ఇత్యాదిగా రెండుమొదలు ఏడువరకూ మందిప్రయోగం గ్రాహ్యంకాదు. వీటికి వ్యవహారం కొన్నిప్రాంతాల్లో వున్నదిగాని అది శిష్టనసజమ్మతం కాదు.

ద్వితీయాదుల్లో రువర్ణఉత్వానికి ఇత్వం బహుళంగా వస్తుంది. ౩౭౬

వారిని - వీరిని - ఎవరిని - ఒకరిని - బహుళగ్రహణంచేత ఇద్దరను - ముగ్గురను ఇత్యాదిఅత్వస్థితిలో ఇత్వంరాదు. అత్వంపాక్షికం కాబట్టి ఇత్వం

వస్తే ఇద్దరిని - ముగ్గురిని - మొదలైనవి. వాస్ల - వీస్ల - ఎవస్ల - ఒకళ్లు - వాళ్లతో - వీళ్లతో ఇత్యాదిరూపాలు డువర్ణకాంతాలమీద వైకల్పికంగా సిద్ధిస్తాయి.

బహువచన రురలుపరమైతే సంఖ్యావాచకాలకు గువర్ణాగమం
బహుళంగా వస్తుంది. ౩౨౭

ఇరుగురు - నలుగురు - ఐదుగురు - ఆరుగురు - ఏడుగురు- పదుగురు- మొదలైనవి. బాహుళకంచేత ఇద్దరు - ఎనమండ్రు - తొమ్మండ్రు ఇత్యాదుల్లో గు వర్ణాగమంరాదని గ్రహించాలి. అసంయుక్తావస్థలో ఎనమండుగురు - తొమ్మం డుగురు రూపాలు.

బహువచన రు రలు పరమైతే పలు శబ్దానికి
గు వర్ణాగమం వస్తుంది. ౩౨౮

పలుగురు - పలుగురను. గరారానికి వకారం - పలువురు - పలువురను. మొదలైనవి.

విభక్తి పరమైతే సంఖ్యాపదాల అంత్యవర్ణాలకు లోపం
బహుళం ౩౨౯

ముగ్గురు - నలుగురు - ఎనమండ్రు - తొమ్మండ్రు- బహుళగ్రహణంచేత ఆరుగురు - ఏడుగురు - ఇత్యాదుల్లో లోపంలేదు - వర్ణాలకు అని బహువచన ప్రయోగం చేయడంచేత ఎనమండ్రు ఇత్యాదుల్లో ఉపాంత్యవర్ణానికికూడాలోపం.

బహువచన రు రలు పరమైతే సంఖ్యాపదాలకు అండు
ఆగమం బహుళంగా వస్తుంది. ౩౩౦

ఎనమండ్రు - తొమ్మండ్రు - ఎనమండ్రను-తొమ్మండ్రను - ముప్పండ్రు- ముప్పండ్రను - బహువచన రు ర లు పరమైతే అండు డువర్ణ ఉత్వానికి "బహు వచనం పరమైతే డ ల ట రల ఉత్వానికి" ఇత్యాదిసూత్రంచేత లోపం నిత్యం - రు ర లు పరమైతే గువర్ణాగమం బహుళంకాబట్టి అందు పైన గువర్ణాగ మంవస్తే ఎనమండుగురు - తొమ్మండుగురు - ఇత్యాదిరూపాలు. అండు అపదం కాబట్టి సంధినిత్యం.

ముదుసలి దువర్ణానికి లోపం వైకల్పికం ౩౩౧
ముసలి - ముదుసలి - ముసలివాడు - ముసలిది.

విభక్తిపరమైతే నాలుగు దీర్ఘానికి హ్రస్వం వస్తుంది. ౩౼౬

నలుగురు.

మూ డేలమీది హల్లుకి ద్విత్వం వస్తుంది. ౩౼౭

ద్విరుక్తమైన హల్లు పరమైతే ఇత్యాదిసూత్రంచేత హ్రస్వం. ముగ్గురు - డెబ్భై.

విభక్తిపరమైతే పది యెనిమిదుల దినుల ఇత్వానికి ఉత్వాత్వాలు క్రమంగా వస్తాయి. ౩౼౮

పది దివర్ణఇత్వానికి - ఉత్వం - ఎనిమిది నివర్ణఇత్వానికి అత్వం వస్తుందని తాత్పర్యం.

పదుగురు - ఎనమండ్రు - ఎనమండుగురు.

మహత్సమూహ బహుత్వంలో సంఖ్యాపదాలకు ఆమహత్కార్యం విభాషగా వస్తుంది. ౩౼౯

స్వతంత్రభారతసైనికులు ముప్పైమూడుకోట్లు - ఆవూరు జనాభా యెనిమిదివేలు - పక్షంలో ముప్పైమూడుకోట్లమంది - యెనిమిదివేలమంది.

తన తమ పూర్వకాలై ద్రుతాంతాలైన అంత అంతట శబ్దాలు స్వయమర్థకా లవుతాయి. ౩౼౧౦

తనంతతానువచ్చాడు- తనంతటతాను వచ్చాడు - తమంతతామువచ్చారు- తమంతటతామువచ్చారు. అన్యత్రద్రుతలోపం నిత్యంగా కనిపిస్తున్నా, అవధారణార్థకం పరమైతే ద్రుతస్థితివైకల్పికం - తనంతనే తను వచ్చాడు - తనంతే తను వచ్చాడు - తనంతటనే తనువచ్చాడు. తనంతటే తనువచ్చాడు - తనంత తనే వచ్చాడు - తనంతట తనేవచ్చాడు.

స్వయమర్థంలో ప్రథమాంతతదాది శబ్దాలకు అవధారణార్థకం బహుళంగా చేరుతుంది. ౩౼౧౧

వాడికి వాడే వచ్చాడు. వాడికి వాడు వచ్చాడు. వాడు - వీడు - నీవు - నేను - తాను - వారు ఇత్యాదులు తదాదులు. బహుళగ్రహణంచేత కుషష్ఠ్యంత తదాది పూర్వకాలైతే అవధారణార్థకం విభాషగా చేరుతుంది. షష్ఠ్యంతపూర్వకం కాకపోతే నిత్యంగా చేరుతుంది. వాడేవచ్చాడు.

స్వయమర్థంలో ప్రథమాంత తదాది శబ్దాలు కుషష్ఠ్యంత తదాది పూర్వకాలు విభాషగా అవుతాయి. ౩౫౮

తదాదిగణం పూర్వమే ఉక్తమైంది. వాడికివాడే వచ్చాడు. నీకు నీవేవచ్చావు-నాకు నేనే వచ్చాను - మొదలైనవి.

స్వయమర్థంలో ప్రథమాకుషష్ఠ్యంత తదాదులకు అయిశబ్దం వైకల్పికంగా అను ప్రయుక్త మవుతుంది. ౩౫౯

వాడికై వాడే వచ్చాడు - వాడికై వాడు వచ్చాడు - వాడికి వాడై వచ్చాడు-వాడికి వాడే వచ్చాడు మొదలైనవి.

పృథగ్స్వయమర్థాల్లో యొక్కాంత తదాదులకు ద్రుతాంతమైన అంతట శబ్దం అనుప్రయుక్త మవుతుంది. ౩౬౦

వాడంతట (వాడియొక్క) వాడున్నాడు - నాయంతట నేనున్నాను-అన్యత్రద్రుతలోపం నిత్యమైనా అవధారణార్థకం పరమైతే ద్రుతలోపం నిత్యంగా జరగదు. నాయంతటనే నేనున్నాను. నాయంతటే నేనున్నాను.

తన తమ పూర్వకమైతే అంతట టవర్ణానికి లోపం విభాష. ౩౬౧

తనంత తనున్నాడు - తనంతట తనున్నాడు.

ఆదరార్థంలో ద్విరుక్తి వస్తుంది. ౩౬౨

హరిహరి - కృష్ణకృష్ణ.

అధికార్థంలో ద్విరుక్తి వస్తుంది. ౩౬౩

చూచిచూచి - వినివిని - తినితిని.

త్వరితార్థంలో ద్విరుక్తి వస్తుంది. ౩౬౪

లేలే త్వరగావెళ్లు - రారావేగంరా

అనాదరార్థంలో ద్విరుక్తి వస్తుంది. ౩౬౫

ఛీఛీ - లేలే - ఫోఫో.

క్రమార్థంలో ద్విరుక్తి వస్తుంది. ౩౬౬

ఒండొండు - ఒకటొకటి - ఒక్కరొక్కరే - ఒక్కటొక్కటే.

పృథగర్థంలో ద్విరుక్తి వస్తుంది. ౩౯౭

ఒక్కటొక్కటె యివ్వు - రెండురెండు తీసుకురా.

తరచుగా ధ్వన్యాద్యనుకరణలో ద్విరుక్తి వస్తుంది. ౩౯౮

తళతళ - ధనధన - తరచుగా అనడంచేత కొన్నిచోట్ల బహూక్తాలుకూడా గ్రాహ్యాలు - ఏకోక్తంకూడా గ్రాహ్యం - ధన ధన ధన ధన మని - గుభుల్ గుభుల్ గుభులని - ఢామ్మని - భామ్మని - ఠప్‌మని.

ఆమ్రేడితం తుదిహ్రస్వానికి దీర్ఘం విభాష. ౩౯౯

కృష్ణకృష్ణా - హరిహరీ - వినివినీ - తినితినీ - ఒకటొకటీ - ఒక్కొక్కరూ - తళతళా - ధనధనా - వ్యవస్థిత విభాషచేత ఒండొండు - రెండు రెండు - ఇత్యాదుల్లో దీర్ఘంరాదు.

కొన్నిచోట్ల అనుకరణ పదాల ఆమ్రేడితం ఆది హల్లుకి ద్విత్వం వికల్పంగా వస్తుంది. ౪౦౦

తళత్తళ - ధగద్ధగ.

ధగద్ధగాయమానంగావుంది. రా — 28.

కొన్ని చోట్ల అనుధాతువు పరమైతే అంత్యహల్లుకి ద్విత్వం కనిపిస్తున్నది. ౪౦౧

తళుక్కుమని - గతుక్కుమని - గుబుక్కుమని.

అనుకరణ శబ్దాలు విశేషణాలైతే నివర్ణాగమం కొన్నిచోట్ల కనిపిస్తున్నది. ౪౦౨

నిగనిగనిచాయ - పెళపెళనిచీర - మొదలైనవి.

దేశ్యాలైన నవలాదుల తుది దీర్ఘానికి హ్రస్వం అరుదుగా వస్తుంది. ౪౦౩

నవలా - నవల - నేజా - నేజ - లకోరీ - లోకోరి - తేజీ - తేజి - మొదలైనవి నవలాదులు.

సంఖ్యావాచకాలు భృశార్థంలో ద్విరుక్తాలైతే పూర్వ పదానికి లవర్ణ పూర్వక కువర్ణం విభాషగా వస్తుంది. ౪౦౪

కోట్లకు కోట్లు - కోట్లు కోట్లు - లక్షలకు లక్షలు - లక్షలు లక్షలు - వేలకువేలు - వేలువేలు - వందలకు వందలు - వందలువందలు - మొదలైనవి.

ఆమ్రేడితం పరమైతే కోటిశబ్దం ఇత్వానికి అనాదేశం విభాషగా వస్తుంది. ౪౦౫

కోటానకోట్లు - పక్షంలో కోట్లకుకోట్లు - కోట్లుకోట్లు.

అయ్యాదులు నామపదాలకు పరమై ప్రశ్నార్థకాలై వ్యతిరేకార్థకా లౌతాయి. ౪౦౬

ఇదినీకు న్యాయమటయ్య ? - న్యాయంకాదు. ధర్మమయ్య ? - ధర్మం కాదు - అయ్య - అమ్మ - అన్న - అక్క - మొదలైనవి అయ్యాదులు.

నామాదులకు సముచ్చయ అర్థవిశేషాల్లో ను శబ్దం వస్తుంది. ౪౦౭

నుశబ్దానికి లోపం పూర్వస్వరానికి దీర్ఘం బహుళం. ౪౦౮

అన్నాతమ్ముడూ - వాడూవీడూ - ఎన్నేవన్నే - నన్నూనిన్నూ - తనచేతా మనచేతా - చెప్పకాచెయ్యకా - పోసితీసి - కొట్టీతిట్టీ - తల్లీతండ్రి - వాడూచాలడు - ఎవ్వడూలేడు - అంతాబాగుంది - ఇదంతానేలపాలే - అందరూ బాగున్నారు - బహుళగ్రహణంచేత ఎంత ఎందరు లకు పరమైన ను శబ్దానికి లోపం పూర్వస్వరానికి ఓత్వం వస్తుంది-ఎంతో బాగుంది - ఎంతో చెప్పాను - ఎందరో వచ్చారు - ఎందరో తిన్నారు.

అపదమైన అచ్చు పరమైతే చాలాదులు ద్రుతాంతా లవుతాయి. ౪౦౯

చాలానే యిచ్చాడు - కూడానే తెచ్చాడు - ఇంకానా ? అందాకానా ? ఇందాకానా ? ఎందాకానో.

చాలు కూడులు అధికార్థంలోను అనుసరణ సముచ్చయా
ర్థాల్లోను ఆకారాంతాలవుతాయి ౪౧౦

చాలా తిన్నాడు - వాడి కూడా రా - అదికూడా తే.

అవధారణార్థకమైన ఏను అనుప్రయుక్తమయితే ఆకారాద్యం
తమై ప్రశ్నార్థక మవుతుంది. ౪౧౧

అంతేనా ? ఇంతేనా ? అదేనా ? రాముడేనా ? నాగేశ్వర్రావేనా ? అది శబ్దంచేత ఏకారాంతంకూడా కావచ్చునని తాత్పర్యం - అంతేనే ? - ఇంతేనే ? అదేనే ? ఇదేనే ? మొదలైనవి. ఏను అవధారణార్థకమనడానికి ఉదాహరణ.

కొద్దిబుద్ధికలవారేనని — పి — 15.

తలకు కువర్ణానికి లోపం పూర్వస్వరానికి దీర్ఘం
విభాష. ౪౧౨

తల కొకటి - తలా ఒకటి - తలకు నాలుగు - తలా నాలుగు - ఒక అనుప్రయుక్తమయితే తలొకనాలుగు.

ద్రుతానికి లోపం పూర్వస్వరానికి దీర్ఘం బహుళంగా
వస్తుంది. ౪౧౩

ఇంకా - అందాకా - చూచినా - వచ్చినా - అయినా - అంతా - (అంతయు.)

ఎల్లాదుల కనుప్రయుక్తమయిన అప్పుడు విశేషార్థదాయక
మవుతుంది. ౪౧౪

ఎల్లప్పుడు - అన్నప్పుడు - విన్నప్పుడు - తెచ్చినప్పుడు.

సర్వపర్యాయమైన ఎల్ల అమహదర్థకం. ౪౧౫

ఎల్లవిషయాలు - ఎల్లరూపాలు.

ఎల్లకు మహదర్థంలో బహువచనం చేరి లకారానికి రేఫ
వస్తుంది. ౪౧౬

ఎల్లరు - ఎల్లరిని - ఎల్లరను - ఎల్లరితో.

అల్ల అనేకార్థాల్లో అనుప్రయుక్త మవుతుంది.. ౪౧౭

దీనికిదీర్ఘాంతత్వం కూడావుంది. వచ్చినప్పుడల్లా గోలే- ప్రతీసారీ అని అర్థం. తెచ్చిందల్లా నీకే - ప్రతీదీ అని అర్థం. వాడల్లా చెప్పేదేమిటంటే - వాడుమాత్రం అని అర్థం. వాడుచెప్పిం దల్లా ఏమిటంటే - వాడుచెప్పిందంతా ఏమిటంటే అని అర్థం. ఇలా సందర్భానుగుణంగా అనేకార్థాలు గ్రాహ్యాలు.

ఆ ఈ ల కర్థవిశేషాల్లో అనుప్రయుక్తమైన వలను
నువర్ణానికి లోపంవస్తుంది. ౪౧౮

ఆవల - ఈవల.

వల పూర్వకాలైన ఆ ఈ లకు హ్రస్వం వైకల్పికం. ౪౧౯

అవల - ఆవల - - ఇవల - ఈవల.

కృతహ్రస్వాలైన అ ఈ ల మీది వల వ వర్ణానికి పరంగా
తవర్ణాగమం వైకల్పికం. ౪౨౦

అవతల - ఇవతల - అవల - ఇవల - ఆవల - ఈవల.

తవర్ణపరకమైన వల వకారం ఉత్వయుక్తం వికల్పంగా
అవుతుంది. ౪౨౧

అవతల - అవుతల - ఇవతల -ఇవుతల - అవుకు ఔ విభాష - ఔతల.

అవ్యయాలు కొన్ని సంధ్యాదికార్యాల్లో నామతుల్యా
లవుతాయి. ౪౨౨

ఇచ్చినతరువాత - వచ్చినప్పుడు - తెచ్చినప్పుడు - అవలికథ - తరువాతి కథ - తరువాతకథ - వెనుకటికథ - వెనకటికథ - వెనకకథ - అవతలిమాట - తోడుకోడలు - తోడికోడలు - తోటికోడలు.

చూడుముకు అర్థవిశేషంలో ఆ ఈ లు అను
ప్రయుక్తాలవుతాయి. ౪౨౩

ఆ ఈ లు పరమైతే అర్థవిశేషంలో చూడుము డువర్ణానికి
లోపం చకారానికి సకారం దీర్ఘానికి హ్రస్వం నిత్యం. ౪౨౪

సుమా - సుమీ.

సుమా సుమీల మకారానికి అరుదుగా ద్విత్వం వస్తుంది. ౪–౨౧

సుమ్మా - సుమ్మీ.

పరిగ్రహణ ప్రార్థనార్థాల్లో ఇది తొలిస్వరం మీద బిందుపు
టుడి ఇత్వానికి అత్వం నిత్యం. ౪–౨౩

ఇంద - దీనికి మధ్యమపురుషలోనే ప్రయోగం - బహువచనంలో అండి చేరితే ఇందండి - ఇదిగో తీసికోండి అని అర్థం.

అర్థవిశేషంలో ఆకు పరమైన వెనుక వేకు లోపం సు క వర్ణాల
ఉత్వ అత్వాల కిత్వం వస్తుంది. ౪–౨౪

ఆనిక - కొంతకాలం గడచిన తరువాత అని అర్థం - వెనుక ఉకారానికి పాక్షికంగా అత్వంవస్తే ఈసూత్రంలో ఇత్వవిధానం వర్తించదు. వేవర్ణలోపం మాత్రం వస్తుంది. అనక.

అనికి కకారానికి ద్విత్వం విభాష. ౪–౨౫

అనికి - అనిక్కి.

అర్థవిశేషాల్లో వాక పరమైతే అంతాయుల తవర్ణానికి లోపం
బహుళం. ౪–౨౬

అంత + వాక - అందాక - ఇంత + వాక - ఇందాక - ఎంత + వాక ఎందాక - బహుళగ్రహణంచేత కొంత కీకార్యంరాదు - కొంతదాక.

అర్థవిశేషంలో ఎల్లికి క్త్వార్థకమైన ఉండు ధాతు వనుప్రయుక్త
మవుతుంది. ౪–౨౭

ఎల్లి+ఉండి - ఎల్లుండి - రాబోవు రోజుకు తరువాతిరోజు అని అర్థం.

లకారం పరమైతే కొన్ని పదమధ్య డ ర ల అత్వానికి లోపం
డ ర లకు ళకారం బహుళం. ౪–౨౮

ఒడలు - ఒళ్లు - వెడలు - వెళ్లు - సడలు - సళ్లు - మరలు - మళ్లు - మర్లు - బహుళగ్రహణంచేత మళ్లోడు - మర్లోడు ఇత్యాదుల్లో ళాదేశంవైకల్పికం - పొరలు ప్రభృతులకు ళాదేశం రాదు. దొరలు - దొర్లు - పొరలు - పొర్లు - కెరలు - కెర్లు - తరలు - తర్లు - మొదలైనవి.

బహువచనం పరమైతే పెండ్లి శబ్దానికి బిందుపూర్వక డువర్ణం ఆగమంగావస్తుంది. ౪౩౨

పెండ్లిండులు - ఉత్వలోపం - పెండిండ్లు - దాసు ళా దేశం బిందు లోపం - పెండ్లిళ్లు - పెండిండ్లతో - పెండ్లిళ్లతో - పెండ్లిండ్లలో - పెండ్లిళ్లలో.

పెండ్లి డాకు ళాదేశం విభాష. ౪౩౩

పెండ్లి - పెళ్లి - ళాదేశావస్థలో బిందులోపం నిత్యం - పెళ్లిళ్లు.

కోమటి మవర్ణానికి బిందువు కొన్నిచోట్ల తరచుగా కనిపిస్తున్నది. ౪౩౪

కోమటిశబ్దానికి అచ్చుపరమైతేనే బిందువు తరచుగా కనిపిస్తున్నది - కోంటింటికెళ్లాను - తరచుగా అనడంచేత "ఏంటె - కోంటె - కొత్తబెల్లం - తింటే తీపి - " ఇత్యాదుల్లో బిందువు రక్షింపబడింది - కొన్నిచోట్ల అనడంచేత ఈకార్యం సార్వత్రికం కాదని గ్రహించాలి.

ఏమి మివర్ణానికి బిందువు విభాష. ౪౩౫

ఏం ? - ఏమి ? ఏంటి ? ఏమిటి ? ఏం చెప్పాడు - ఏమిచెప్పాడు - వ్యవస్థితవిభాషచేత అచ్చుపరమైతే తరచుగా మన్నారాడు - ఏమన్నాడు.

వైపు ఐత్వానికి ఏత్వం వైకల్పికం. ౪౩౬

వైపు - వేపు - అవైపు - అవేపు - కొన్నిచోట్ల సంధిలో వేపు వ లోపం కనిపిస్తున్నది - ఇంటేపుకెళ్లాడు.

ణ ళ సంయుక్తాలైన నలలకు పూర్వసవర్ణం వైకల్పికంగా వస్తుంది. ౪౩౭

వాణ్ని - వాణ్ణి - రాముణ్ని - రాముణ్ణి - వేణ్నీళ్లు - వేణ్ణీళ్లు-వేన్నీళ్లు - రెణ్నాళు - రెణ్ణాళ్లు - ఏళ్లు - ఏళ్ళు - వాళ్లు - వాళ్ళు - కళ్లెం - కళ్ళెం-గొళ్లెం - గొళ్ళెం - మొదలైనవి.

వచ్చినవాళ్లకనుక — మా — 18 — వాళ్లకుతెలియకుండానే వాళ్ళలో వుండే జ్ఞానతృష్ణసయితం వాళ్లువేసే ప్రశ్నపరంపరకు కారణమౌతుంది—మా—18.

సవర్ణాదులు పరమైతే తీయు యకారానికి ద్విత్వం విభాషగా వస్తుంది. ౨౩౭

తీయన - తియ్యన - తీయగా - తియ్యగా - తీయదనం - తియ్యదనం.

కొన్ని నుడుల ఆదిమధ్యమాంతాల అత్వానికి ఇత్వం బహుళంగా వస్తుంది. ౨౩౯

ఆది :— దబ్బడ - దిబ్బడ - టంగణా - టింగణా.

మధ్య :— తడక - తడిక - నరయు - నరియు - నెరయు - నెరియు - లోగలి - లోగిలి.

అంతం:— చిన్న - చిన్ని - పోలిక - పోలికి.

కొన్ని నుడులకు మధ్యమాంతాల్లో అత్వానికి ఉత్వం బహుళం. ౨౪౦

మధ్య :- నడచు - నడుచు - నడవడి - నడువడి - చదను - చదును - చలవ - చలువ - నలగు - నలుగు - నలగుడు - నలుగుడు - తరచు - తరుచు - అదరు - అదురు - వెదకు - వెదుకు - వెతకు - వెతుకు - వెనకు - వెనుకు - అణగు - అణుగు - అడచు - అడుచు.

అంతం :— పండుగ - పండుగు - పండువు - దండుగ - దండుగు.

ఒకరుచెప్పినట్టు నడచుకోవడమేతప్పు — పి — 27 — నడిపించే ప్రవృత్తికల వారు — పి — 28 — నడిచేవారికి నడిపించేవారికి — పి — 26.

కొన్ని పదాది మధ్యమాల్లో అత్వానికి ఎత్వం బహుళం. ౨౪౧

ఆది :— గడ - గెడ - గడ్డ - గెడ్డ - గంతులు - గెంతులు - నమలి నెమలి - నమిలి - నెమిలి - మట్టె - మెట్టె - మయివడి - మెయివడి - రక్కొను - రెక్కొను.

మధ్య :— చిట్టం - చిట్టెం - దీవన - దీవెన - గోరంక - గోరెంక - వడ్డన - వడ్డెన.

కొన్నిచోట్ల పదాంత ఇత్వానికి దీర్ఘం బహుళం. ౨౪౨

కడ్డి - కడ్డీ - కాని - కానీ - గారడి - గారడీ - తివాసి - తివాసీ - దివిటి - దివిటీ - దుప్పటి - దుప్పటీ - ఫిరంగి - ఫిరంగీ - మొదలైనవి. ఏకత్వం

లో హ్రస్వ దీర్ఘాంతాలుగా రెండువిధాలా ప్రయోగంవున్నా బాహుళకంచేత బహుత్వంలో కొన్ని హ్రస్వాంతాలు కొన్ని దీర్ఘాంతాలు కొన్ని ఉభయాలూ అవుతాయని గ్రహించాలి. దుప్పట్లు - ఫిరంగులు మొదలైనవాటికి హ్రస్వాంతంగానే బహుత్వంలో ప్రయోగం - దుప్పటీలు - ఫిరంగీలుకావు. కడ్డీలు - దివిటీలు మొదలైన వాటికి బహుత్వంలో దీర్ఘాంతత్వమే - కడ్లు - దివిటులు అనికావు. కానీలు - కానులు - తివాసీలు-తివాసులు ఇత్యాదులలో హ్రస్వదీర్ఘాంతాలు రెండూగ్రాహ్యాలు.

కొన్ని చోట్ల పదాది మధ్య మాంతాల్లో ఇత్వానికి ఉత్వం బహుళం. ౪౪౩

ఆది :— ఇసుక్లు - ఉసుళ్లు - ఇసుక - ఉసుక.

మధ్య :— మొగిలి - మొగులు - మొయిలు - మొయులు - అరిది - అరుదు - అలికిడి - అలుకుడు - కానిక - కానుక - పుత్తిక - పుత్తుక-నాలిక-నాలుక - పిచ్చిక - పిచ్చుక.

అంతం :— అరిది - అరుదు - జవాది - జవాదు - తెల్లమి - తెల్లము - తెల్లం - బుడిగి - బుడుగు - రద్ది - రద్దు - వేరమి - వేరము - వేరం.

కొన్నిచోట్ల పదమధ్య ఉత్వానికి అత్వం బహుళం. ౪౪౪

కనుక - కనక - వెనుక - వెనక - నడుము - నడము. ఇత్యాదులూహ్యాలు. నడుము అంటే ఒక శరీరావయవం అని యిక్కడ అర్థం కాదు. నడిమిభాగం అని మాత్రమే అర్థం.

పదాంత ఎత్వాని కిత్వం కొన్నిచోట్ల అరుదుగావస్తుంది. ౪౪౫

సంపంగె - సంపంగి - కొండె - కొండి - గోనె - గోని - మిద్దె - మిద్ది - పెట్టె - పెట్టి - సూనె - సూని - మల్లె - మల్లి.

అదిమధ్యమల్లో కొన్నిపదాల ఉకారానికి దీర్ఘం బహుళం.౪౪౬

అది :— చురకత్తి - చూరకత్తి - నురిపిడి - నూరిపిడి.

మధ్యం :— కప్పురం - కప్పూరం.

పదాదిమధ్యమల్లో కొన్నిటి ఎకారానికి దీర్ఘం బహుళం. ౪౪౭

ఆది :— బెహారం - బేహారం - నెవం - నేవం - సెబాసు - సేబాసు.

మధ్య :— కోనెరు - కోనేరు - పెండెరం - పెండేరం.
దీర్ఘ మధ్యమాలకే ప్రస్తుతం విస్తృత వ్యవహారం.

ఉంగరాదుల మధ్య అత్వానికి లోపం బహుళం. ౪౪౭

ఉంగరం - ఉంగ్రం - కట్టనం - కట్నం - పట్టనం - పట్నం - రాటన - రాట్నం - నిట్టరాడు - నిట్రాడు - మంతరసాని - మంత్రసాని - నడుమంతరం - నడుమంత్రం - సీదరం - సీద్రం - చప్పరం - చప్రం - సెబ్బర - సెబ్ర - సంబరం - సంబ్రం - చరలాడు - చర్లాడు - చరనాకోలు - చర్నాకోలు - దొరలు - దొర్లు - పొరలు - పొర్లు - తారకాణం - తార్కాణం - తరలు - తర్లు - మరలు - మర్లు - మెలత - మెత్త - మొలచు - మొల్చు - మొలక - మొల్క - వెలనాడు - వెల్నాడు - పలనాడు - పల్నాడు - నులక - నుల్క - తొలకరి - తొల్కరి. ఇత్యాదులూహ్యాలు.

చలిదీత్యాదుల మధ్య ఇకారానికి లోపం బహుళం. ౪౪౮

చలిది - చల్ది - చెలిది - చెల్ది - బలిమి - బల్మి - దిమిదిమి - దిమ్దిమి - పేరిమి - పేర్మి - వెలితి - వెల్తి - కోరికి - కోర్కి - పెండిలి - పెండ్లి - కత్తిరించు - కత్రించు.

చలిది ప్రభృతుల లకారానికి దకారం స్వరానికి లోపం విభాష. ౪౫౦

చలిది - చద్ది - వలదు - వద్దు - కలదు - కద్దు.

కొన్నిపదమధ్య ట డ ద నల ఉత్వానికి లోపం బహుళం. ౪౫౧

ట - పోట్లాడు - కాట్లాడు - కొట్లాడు.
డ - చిముడ్చు - పూడ్చు - గాడ్చు.
ద - చంద్రకావి - చిద్రుపలు.
న - కాన్క - త్రేన్చు - పూన్చు.
ఇత్యాదులూహ్యాలు.

కొన్నిపదాలమధ్య ర లల ఉత్వానికి లోపం బహుళం. ४११-౨

ర :— చెమరుచు - చెమర్చు - గగురుపాటు - గగుర్పాటు - కూరుపరి - కూర్పరి - చేరుచుక్క - చేర్చుక్క - వారుపు - వార్పు - పేరుపు - పేర్పు - తూరుపు - తూర్పు - ఊరుపు - ఊర్పు - మారుమాట - మార్మాట.

ల :— మరలుచు - మరల్చు - విలుతుడు - విల్తుడు - పిలుచు - పిల్చు - పాలుపడు - పాల్పడు - పాలుగొను - పాల్గొను - విదలుచు - విదల్చు - మిగులుచు - మిగుల్చు - మూలుగు - మూల్గు - మేలుకొను - మేల్కొను - వెలుతురు - వెల్తురు - పొలుపు - పొల్పు - మొదలైనవి.

హాదుల తొలిహల్లుకి నీలుగు ప్రభృతుల తొలి హల్లుకి లోపం బహుళం. ४११३

హడపం - అడపం - హరిదళం - అరిదళం - హారతి - ఆరతి - నీలుగు - ఈలుగు - నెలుగు - ఎలుగు - నర్మిలి - అర్మిలి - నిట్టలం - ఇట్టలం - నెగయు - ఎగయు - నీరెండ - ఈరెండ - మొదలైనవి.

ఆది హల్లులైన చ పలకు లోపం బహుళం. ४११४

చిగురు - ఇగురు - పూను - ఊను - పొందు - ఒందు - పొదవు - ఒదవు - పొనరు - ఒనరు - పొసగు - ఒసగు - ఇత్యాదులూహ్యాలు.

పద్య మధ్య డ రలకు లోపం సకృత్తుగా కనిపిస్తున్నది. ४११५

డ - తోడ్తెచ్చు - తోతెచ్చు - వీడుజోడు - విజ్జోడు.

ర - గరిటె - గంటె - మొరిటె - మొంటె - అరటి - అంటి - చెరగు - చెంగు - గరిటె ప్రభృతులు ప్రాచీనకాలంలో పూర్ణబిందుసహితరూపాలు - ఆబిందువు వుచ్చారణలో ప్రభ్రష్టమైనది. అట ఇకల్లో తప్ప ఆదిహ్రస్వంమీద నిండుసున్నకు లోపంరాదు కాబట్టి సున్నా తప్పనిసరిగా వుండాలి.

సమాసాసమాసాలు రెంటిలోను కొన్నిచోట్ల ప్రాణ్యాగమ లోపాలు కనిపిస్తున్నవి. ४११६

నడిరేయి - నడికిరేయి - పితలాటం - పితలాటకం - చిటిర్రేలు - చిటికెనర్రేలు - నూదోస - నూగుదోస - నాగసాని - నాగపసాని - వఙ్రం - వఙ్రంగం - వేబోక - వేగుబోక - మొగుడుచు - మొగుచు - వెడలుపు - వెలుపు -

దివ్వెకోల - దివ్వెనకోల - గంగనమ్మ - గంగానమ్మ - పొటనవ్రేలు - పొటమన వ్రేలు - చెలికత్తె - చెలిమికత్తె - మొక్కపోవు - మొక్కలుపోవు - తటాన - తటాలున - గరుటామంతుడు - గరుటాలమంతుడు - నిక్కం - నిక్కపం - నిలబడు - నిలువబడు - వత్రుసుడి - వత్రువసుడి - నడపడి - నడపడిక - దప్పి - దప్పిక - పొత్తు - పొత్తుక - దాపు - దాపురె - పంక - పంకర - చిత్తరు - చిత్తరువు - కొట్టరు - కొట్టరువు - ఇత్యాదులూహ్యాలు.

కొన్నిచోట్ల అపవాద్యమైన గకారానికి యకారం బహుళంగా వస్తుంది. ౪౫౭

మొగులు - మొయులు - మొగిలు - మొయిలు - కాగితం - కాయితం - ఓగిరం - ఓయిరం - వాగించు - వాయించు - వీణాదుల్ని వాయించడమనే అర్థంలో గకారానికి యకారంనిత్యం - అన్యార్థంలో యకారంరాదు - ఇలాగే ఒక అర్థంలో వేగించు గకారానికె యకారంవస్తుంది - వేరొకఅర్థంలోరాదు - వేగించు - వేయించు.

తరాజు ఆద్యచ్చుకి లోపం జకారానికి సకారం విభాష. ౪౫౮

తరాజు - త్రాసు.

కొన్నిచోట్ల మకారానికి అనునాసిక వకారం విభాషగా వస్తున్నది. ౪౫౯

మామిడి - మావిడి - చలిమిడి - చలివిడి - నెమిలి - నెవిలి - తమిదలు - తవిదలు - రమణ - రవణ - ఏమిటె - ఏవిటె-మొదలైనవి. ఇటువంటిచోట్ల అను నాసికోచ్చారణచిహ్నంగా అరసున్నాగుర్తును కొందరుంచుతున్నారు. ఏవిఁటె - రవఁణ - మొదలైనవి - ఈ అర్థానుస్వారం కొన్ని అనునాసిక స్వరాలపైనైతం వ్యవహరింపబడుతున్నది.

కొన్నిపదాలకు అక్షరవ్యత్యస్తం జరుగుతున్నది. ౪౬౦

తుకతుక - కుతకుత - నవులాటకు - నవుటాలకు - పిచ్చిలు - చిప్పిలు - తవర - వతర. ఇత్యాదులూహ్యాలు.

బ్రతుకు ప్రభృతుల తకారానికి దకారం బహుళం. ౪౬౧

బ్రతుకు - బ్రదుకు - అతుకు - అదుకు - ముతుక - ముదుక - వెతుకు - వెదుకు - చతికిలపడు - చదికిలపడు - మొదలైనవి. బాహుళకంచేత మెత్తు - మొత్తు మొదలైనవాటి తకారానికి దకారంవస్తే ద్విత్వానికిలోపం పూర్వ స్వరానికి దీర్ఘంవస్తుంది - మెత్తు - మేదు - మొత్తు - మోదు మొదలైనవి.

ఆశ్చర్యాంగీకారాది అర్థవిశేషాల్లో అశబ్ద ఉశబ్దాలు ప్రయోగ యోగ్యాలు. ౪౬౨

ఇవి దీర్ఘయుక్తాలుకూడా కావచ్చును.

అ - అట్లాగే - అ - అట్లాగా ? అ ! ఏమన్నావు ? మళ్లీచెప్పు - అ ! నిజ మేనా ? అ - అవును - ఉ - సరే ! ఊ - ఏమిటీ ? అట్లాచేశాడా ? అన్నాడా - భద్రం - నిరుత్సాహం - నిస్పృహ - ఆయాసం - సంతృప్తి - అసంతృప్తి - వింటున్నాను - తరువాతచెప్పు - ఇత్యాద్యర్థాలు అనేకం లోకంలో మహాజన వ్యవహారాన్ననుసరించి గ్రహించాలి.

ఇ-టి-తి వర్ణాలు వక్ష్యమాణాలు ఔపవిభక్తికాలు. ౪౬౩

విభక్తి నిమిత్తకాలై ఆదేశ ఆగమాత్మకంగా వచ్చే ఇ - టి - తి అనే వర్ణాలు ఔపవిభక్తికాలు.

ద్వితీయాద్యేకవచనాలు పరమైతే ఇ టి తు లు కొన్ని ప్రాతి పదికలకు బహుళంగా వస్తాయి. ౪౬౪

కాలు - కాలిని - కాలును - కాలిచే - కాలుచే - కాలితో - కాలుతో - నాగలి - నాగలిని - నాగటిని - నాగలిచేత - నాగటిచేత - నేయి - నేతిని - నేతిచే.

ఊరు మొదలైన వాటికి ఇత్వం విభాషగా వస్తుంది. ౪౬౫

ఊరు - ఊరును - ఊరిని - కాలు - కాలును - కాలిని - మ్రాను - మ్రానును - మ్రానిని - నోరు-నోరిని - నోరును - చోటు - చోటును - చోటిని.

టి వర్ణం కొన్నిటి అంతాక్షరానికి ఆదేశంగాను కొన్నిటికి అంతాగమంగాను కొన్నిటికి పర్యాయంగా రెండు విధాల బహుళంగా అవుతుంది. ౪౬౬

ఆదేశం :— తాడు - తాటిని - తాడును - కాడును - కాటిని - నోరును - నోటిని - ఏడును - ఏటిని.

ఆగమం :— అన్నిటిని - ఎనిమిదిటిని - వేయిని - వేయిటిని.

ఉభయం :— పగలు - పగలిని - పగటిని - పగలిటిని - పగలును - మొదలు - మొదటిని - మొదలిటిని - రెంటిని - రెండిటిని - మూడిటిని - మూటిని - నూటిని - నూరిటిని - ఇంతవాడు - ఇంతటివాడు - ఎంతవాడు - ఎంతటివాడు - అంతవాడు - అంతటివాడు. ఇత్యాదులూహ్యాలు.

హ్రస్వంమీది టివర్ణానికి ముందు పూర్ణబిందువు బహుళంగా అవుతుంది. ౪౬౭

అన్నిటిని - అన్నింటిని - ఎనిమిదిటిని - ఎనిమిదింటిని - మూడిటిని - మూడింటిని - బహుళగ్రహణంచేత పద్యాదమైన హ్రస్వంమీది టి వర్ణానికి ముందు పూర్ణబిందువు నిత్యం - కంటిని - మింటిని - ఇంటిని - వంటిని - టివర్ణ అభావంలో కన్నును - మిన్నును - ఇల్లును - పన్నును - పల్లును - కన్నుతో - కంటితో మొదలైనవి.

అఱ్ఱు మొదలైన పదాలకంతాగమంగా తివర్ణం ఒకరేఫకు లోపం విభాషగా వస్తుంది. ౪౬౮

అఱ్ఱు - అఱితిని - అఱ్ఱును - అఱ్ఱు - కఱ్ఱు - గొఱ్ఱు - మిఱ్ఱు - వఱ్ఱు మొదలైనవి.

విభక్తి పరమైతే గోయి ప్రభృతుల తుదివర్ణం తివర్ణం బహుళంగా అవుతుంది. ౪౬౯

గోయి - గోతులు - గోతిని - గోతులను - గోతుల్ని - గోయి - చేయి - నూయి - వాయి - రోయి మొదలైనవి గోయి ప్రభృతులు. బాహుళకంచేత గొయ్యి

ప్రభృతులకు తివర్ణం రాదు - గొయ్యిని - నుయ్యిని - చెయ్యిని - కొన్నిచోట్ల తివర్ణం వికల్పం.

టి–తి వర్ణాలు పరమైతే ఉత్వానికి ఇత్వం వస్తుంది. ४२०

రెండిటికి - మూడిటికి - నాలుగిటికి - ఇత్వంకూడితే అనాద్యమైన ఉత్వానికి ఇత్వం విభాష - నాలిగిటికి.

రువర్ణాదేశ టివర్ణం పరమైతే ఉత్వానికి ఇత్వం రాదు. ४२१

నెత్తురు - నెత్తుటికి - నుదురు - నుదుటికి - నడకుదురు - నడకుదుటి నడకుదుటి వీర్రాజు పంతులు అని వ్యవహారం.

టివర్ణం పరమైతే ద్విత్వోపధల ఉత్వానికి ఇత్వం రాదు. ४२२

పొద్దుటికి

టివర్ణం పరమైతే క్రింద మీదు ముందు పు వర్ణాల కత్వం వస్తుంది. ४२३

కిందటికి - మీదటికి - ముందటికి - మాపటికి - అప్పటికి - ఇప్పటికి - ఎప్పటికి.

లోపల వర్ణకం పరమైతే దాని దీని దేనుల నివర్ణానికి బిందుపూర్వక టివర్ణం విభాషగా వస్తుంది. ४२४

దానిలో - దాంట్లో - దీనిలో - దీంట్లో - దేనిలో - దేంట్లో - టివర్ణం వస్తే వక్ష్యమాణవిధిచేత ఇత్వలోపం నిత్యం.

లోవర్ణకం పరమైతే ఔప విభక్తి కటివర్ణకం ఇత్వానికి లోపం బహుళం ४२५

అంగటిలో - అంగట్లో - కొడపటిలో - కొడవట్లో - మొదటిలో - మొదట్లో - ఇంటిలో - ఇంట్లో - కంటిలో - కంట్లో - వంటిలో - వంట్లో - పంటిలో - పంట్లో - ఏటిలో - ఏట్లో - కాడు - కాటిలో - కాట్లో - బాహుళకంచేత - దాంట్లో - దీంట్లో - దేంట్లో - ఇత్యాదుల్లో ఇత్వలోపంనిత్యం.

ఇత్వలోపమైతే ఔపవిభక్తిక టివర్ణ సంయుక్త లో వర్ణక
లకారానికి టకారం విభాష. ౪౩౬

అంగటిలో - అంగట్లో - అంగట్టో - కొడవటిలో - కొడవట్లో - కొడవట్టో - మొదటిలో - మొదట్లో - మొదట్టో - ఏరు - ఏటిలో - ఏట్లో - ఏట్టో - కాడు - కాటిలో - కాట్లో - కాట్టో - కోడు - కోటిలో - కోట్లో - కోట్టో.

ఇత్వలోపమైతే బిందుపూర్వకమైన ఔపవిభక్తిక టివర్ణ
సంయుక్త లోషష్ఠి లకారానికి లోపం వైకల్పికం. ౪౩౭

ఇంటిలో - ఇంట్లో - ఇంటో - కంటిలో - కంట్లో - కంటో - పంటిలో - పంట్లో - పంటో - వంటిలో - వంట్లో - వంటో - దానిలో - దాంట్లో - దాంటో - దీనిలో - దీంట్లో - దీంటో - దేనిలో - దేంట్లో - దేంటో - మొదలైనవి.

ఔపవిభక్తికాల తృతీయాసప్తములకు అత్వాదేశం
బహుళంగా వస్తుంది. ౪౩౮

ఊరపంది - ఊరపిచ్చుక - గోరగీరాడు - ఎదట - బయట - నోట - ఇత్యాదులు.

ఎదటపడినప్పుడు — పి — 50 — ఆకాఫీహోటల్‌నుంచి బయటపడ్డాను — పి — 49 — ఆడవారినోటనే వినవస్తుంది — పి — 17.

సాంస్కృతి కాచ్ఛిక కృతకభాష నింద్యం. ౪౩౯

ధూమశకటం - మండలకరగ్రాహకుడు - వంటి సంస్కృతసమ కృతక పదాలు - ఇనుపదారి - నాలుగుమోముల వేలుపు - వంటి ఆచ్ఛిక కృతక పదాలు నింద్యాలు నిరాకరాలు అని తాత్పర్యం.

అశేషాలు తత్సమాంధ్ర శబ్దవిశేషాలు మహాజనవ్యవహారంలోంచి
గ్రహించాలి. ౪౪౦

శబ్దపరిచ్ఛేదం

---

# వ్యావహారికభాషా వ్యాకరణం

## కారక పరిచ్ఛేదం

కారకాలంటే కర్మాదులు. ౧

క్రియాన్వయం కలది క్రియను పుట్టించేది కారకం. ౨

కర్మాది భేదాలతో కారకం షడ్విధం. ౩

కర్మకారకం - కర్తృకారకం - కరణకారకం - సంప్రదానకారకం - అపాదానకారకం - అధికరణకారకం - అని కారకాలు ఆరు విధాలు.

ప్రాతిపదికార్థంలో ప్రథమ వస్తుంది. ౪

నియతోపస్థితికం ప్రాతిపదికార్థం - నియతమైన స్ఫురణకలది లేదా నిత్యమైన ఉనికికలది నియతోపస్థితికం - అదే ప్రాతిపదికార్థం. ఏ పదానికి యే అర్థం వున్నదో ఆ అర్థంలోనే ప్రథమావిభక్తిగా - డు - ము - వు - అనేవి వస్తాయని తాత్పర్యం - బుద్ధుడు - వనము - వనం - ధేనువు - భృగువు - మొదలైనవి. హరి - శ్రీ - గిరి - అమ్మ - అక్క - అన్న - కూతురు - కొడుకు - పేద - బీద - మొదలైనవాటికి దీనిచేత ప్రథమవచ్చి లోపించిందని గ్రహించాలి.

సంబోధనార్థంలో క్రియాన్వయ రహితంగా ప్రథమ వస్తుంది. ౫

బుద్ధుడా! ఆదరించు - సిద్ధుడా! దయదలచు - ఇత్యాదుల్లో అధ్యాహార్యమైన నీవు అనేది క్రియతో అన్వయిస్తుంది. అదే కర్తఅవుతుంది. లేని పదాన్ని తెచ్చుకొనడం అధ్యాహార్యం అనబడుతుంది.

ఉక్తార్థంలో ప్రథమ వస్తుంది. ౬

ఉక్తమంటే చెప్పబడింది. క్రియా పదోక్త మైన కర్తకుగాని కర్మకుగాని ప్రథమవస్తుందనితాత్పర్యం. బుద్ధుడు హింసను మాన్పాడు-మహాత్ముడు దాస్యాన్ని

పోగొట్టాడు. ఇక్కడ ఆఖ్యాతం కర్తను చెప్పింది కాబట్టి బుద్ధుడు - మహాత్ముడు అన్నప్పుడు ప్రథమవచ్చింది. ఎవడు మానేశాడు ? ఎవడు పోగొట్టాడు ? అని ప్రశ్నిస్తే బుద్ధుడు - మహాత్ముడు - అని సమాధానం వస్తుంది. కాబట్టి యివి క్రియాపదోక్తాలైనాయి. హింసమాన్పింది బుద్ధుడు - దాస్యాన్ని పోగొట్టింది మహాత్ముడు. కాబట్టి బుద్ధుడు మహాత్ముడు కర్తలయ్యారు. అందువల్ల యిది ఉక్తార్థమయ్యింది. కాబట్టి ప్రథమవచ్చింది. బుద్ధుడిచేత అహింసాసిద్ధాంతం ప్రవేశపెట్టబడింది - మహాత్ముడిచే స్వాతంత్ర్యోద్యమం నడిపించబడింది - అన్నప్పుడు ఆఖ్యాతం కర్మను చెప్పింది కాబట్టి అహింసాసిద్ధాంతం - స్వాతంత్ర్యోద్యమం అన్నప్పుడు ప్రథమవచ్చింది. ఏమి ప్రవేశపెట్టబడింది ? ఏమి నడిపించబడింది ? అన్న ప్రశ్నలకు అహింసాసిద్ధాంతం - స్వాతంత్ర్యోద్యమం అని సమాధానం వస్తుంది కాబట్టి యివి క్రియాపదోక్తాలవుతున్నాయి - క్రియాఫలం అహింసాసిద్ధాంతం - స్వాతంత్ర్యోద్యమం అనేవాటిని పొందుతున్నది. కాబట్టి యివి కర్మలయ్యాయి. అందువల్ల యివి ఉక్తార్థాలైనాయి. ఆకారణంచేత ప్రథమవచ్చింది. అసమాపక క్రియోక్తం అయినప్పుడు సైతం కొన్నిచోట్ల కర్తకు ప్రథమ కనిపిస్తున్నది. వర్షాలు కురిసి చెరువులు నిండాయి - వాడు రాకుండా నేను రాను - నువ్వు చెప్పితే నేను విన్నాను - మొదలైనవి.

భావార్థకాదుల కర్తకు ప్రథమ వస్తుంది. ౭

వాడు తేవడం చూచాను - అతనుండగా నీకేం ? - సిద్ధార్థుడు దయ దలిస్తే అదే పదివేలు - మొదలైనవి.

పరిమాణార్థంలో ప్రథమ వస్తుంది. ౮

తట్టెడు గోధుమలు - సోలెడు పంచదార - నెయ్యి రెండు సోలలు - తేనె వీసెడు. మొదలైనవి.

విశేషణానికి అగు ధాతు వస్నుప్రయుక్తమైతే ప్రథమ వస్తుంది. ౯

అహింసావీరు డైన బుద్ధుణ్ని ఆరాధిస్తాను. సిద్ధార్థు డైన బుద్ధుడితో నడుస్తాను. ప్రియకాంతాలోలు డైనటువంటి నందునిలో మార్పు వచ్చింది. ఇత్యాదు లూహ్యాలు.

అగుధాతుయుక్త విశేషణానికి పూర్వంలో ఉన్న విశేషణా
లన్నిటికి అయిపదం బహుళంగా అనుప్రయుక్త
మవుతుంది. ౧౦

అనన్యశక్తియుక్తుడై అసమాన ధైర్యశాలై అహింసాపరుడౌ మనిషే మహాత్ముడు.

అయి పదానుప్రయోగం లేకపోతే తుది విశేషణానిగ్గాని
విశేషణాలన్నింటి గ్గాని మీఁద సముచ్చయార్థకం విభాషగా
వస్తుంది. ౧౧

సత్యవ్రతుడు అహింసాపరుడూ అయిన మహాత్ముడు. సత్యవ్రతుడూ అహింసాపరుడూ అయిన మహాత్ముడు. సత్యవ్రతుడు అహింసాపరుడైన మహాత్ముడు. మొదలైనవి.

ధాతుజవిశేషణ వ్యవధానంలో విశేషణా లన్నిటికి అయి పదం
అనుప్రయుక్త మవుతుంది. ౧౨

అనన్యశక్తియుక్తుడై అసమానధైర్యశాలై అహింసాపరుడై నెగడిన మహాత్ముణ్ని అభినుతిస్తాను. ఇటువంటి ప్రయోగవిశేషాలు వ్యవహారవశాన గుర్తించాలి.

ధాతుజవిశేషణవ్యవధానంలో విశేషణాలన్నిటికిగాని తుదిదానికి
గాని అన్నంత అగుధాతువు విభాషగా అనుప్రయుక్త
మవుతుంది. ౧౩

అనన్యశక్తియుక్తుడుగా అసమానధైర్యశాలిగా అహింసాపరుడుగా నెగడిన మహాత్ముణ్ని అభినుతిస్తాను. అనన్యశక్తియుక్తుడై అసమానధైర్యశాలై అహింసాపరుడుగా నెగడిన మహాత్ముణ్ని అభినుతిస్తాను. ఇత్యాదులూహ్యాలు. అగుధాతువు అనుప్రయుక్తంకానిపక్షంలో పూర్వోక్తవిధిచేత అయి పదం అనుప్రయుక్త మౌతుంది.

కాలాధ్వవాచకాలకు ప్రథమ బహుళం. ౧౪

కాలవాచకాలకు - అధ్వవాచకాలకు ప్రథమ బహుళంగా వస్తుం దని తాత్పర్యం. అధ్వమంటే మార్గం. నిన్నవచ్చాను - మొన్నవెళ్లాడు - మూడేళ్లు

చూచాను - అపూరు నాలుగుమైళ్లు - మేం అనుతవెళ్లాం - బాహుళకంచేత ప్రొద్దుట వెళ్లాను. రాత్రివేళ వచ్చాను ఇత్యాదుల్లో వక్ష్యమాణవిధిచేత పాక్షికంగా సప్తమి వస్తుంది.

### కర్మపదాలకు ప్రథమ బహుళం. ౧౫

ధాత్వర్థ ఫలానికి ఆశ్రయమైంది కర్మ - ఆ కర్మవాచకానికి ప్రథమ బహుళంగా వస్తుందని తాత్పర్యం - బుద్ధుడు తపస్సు చేశాడు. మహాత్ముడు త్యాగం చేశాడు - బుద్ధుడు ఫలాలు ఆరగించాడు - మొదలైనవి. ప్రథమ కానిపక్షంలో వక్ష్యమాణవిధిచేత ద్వితీయ వస్తుంది. కాని నిత్యవ్యవహారంలో ప్రథమావిభక్తే తరచు ప్రయోగం కనిపిస్తున్నది. బహుళగ్రహణంచేత అమహదర్థకాలైన ఆ ఈ ఏ ల ద్వితీయకు ప్రథమరాదు. కూర్చి గురించి లు అనుప్రయుక్తమైన మహన్మహతీ వాచకాల ద్వితీయకు ప్రథమ వైకల్పికంగా కనిపిస్తున్నది. బుద్ధుణ్ని గూర్చి - బుద్ధుడు గూర్చి - మహాత్ముణ్ని గురించి - మహాత్ముడు గురించి - చెట్టుగురించి - చెట్టును గురించి ఇత్యాదులూహ్యాలు. వాన్ని గురించి - దీన్ని గురించి - దేన్ని గురించి - ఇత్యాదులు.

### కర్మార్థంలో ద్వితీయ వస్తుంది. ౧౬

బుద్ధుడు నందుణ్ని చేరదీశాడు. ఇక్కడ చేరదీయడమనే ఫలాన్ని పొందినవాడు నందుడుకాబట్టి నందశబ్దానికి ద్వితీయ వచ్చింది. ఇది క్రియాపదోక్తం కాదు. ఇలాగే మహాత్ముడు దేశాన్ని ఉద్ధరించాడు ఇత్యాదులూహ్యాలు.

### కోరు ప్రభృతుల కర్మపద సంబంధ వాచకాలకు ద్వితీయ వస్తుంది. ౧౭

కోరు - అడుగు - యాచించు - పితుకు - కోయు - ఇత్యాదులు కోరు ప్రభృతులు - మహాత్ముడు ప్రజలను శాంతంగా ఉండవలసిందని కోరాడు - వాడు ఆవును పాలు పితికాడు - మొదలైనవి.

### ఉద్దేశార్థంలో ద్వితీయకు కూర్చి గురించి లు అనుప్రయుక్తాలవుతాయి. ౧౮

దేశక్షేమాన్ని గూర్చి మహాత్ముడు నిరశనవ్రతం చేశాడు - విశ్వశాంతిని గురించి ప్రజలు తపస్సు చేస్తున్నారు. పూర్వోక్తవిధిచేత కూర్చిగురించు లు పరమైతే

వాని దీని దేను లను తప్ప తక్కిన అన్నిచోట్లా ద్వితీయకు ప్రథమ పాక్షికంగా వస్తుంది.

వచ్యర్థకాల అముఖ్య కర్మకు కొన్నిచోట్ల ద్వితీయ వస్తుంది. ౧౯

వచించు - భాషించు - అను - పలుకు - చెప్పు - విన్నవించు - మొదలైనవి వచ్యర్థకాలు.

మహాత్ముణ్ణి అలా అడిగారు - వాణ్ని ఇలా అన్నారు - మొదలైనవి.

ఉద్దేశార్థంలో కొన్నిచోట్ల కర్మవాచకానికి ద్వితీయ కనిపిస్తున్నది. ౨౦

అతణ్ణి అడిగారు - వాణ్ని అన్నారు - మొదలైనవి - అతణ్ని ఉద్దేశించి - వాణ్ని ఉద్దేశించి - అని అర్థం.

కర్త్రర్థ ప్రయోగంలో కరణానికి తృతీయ వస్తుంది. ౨౧

క్రియాసిద్ధిలో బాగా ఉపకరించేది కరణం - ఆ కరణవాచకానికి తృతీయ వస్తుంది. దీన్నే కరణకారకం అంటారు. తృతీయవస్తుందనడంచేత చేత తోడ వర్ణకాలు రెండూ గ్రాహ్యాలు. మహాత్ముడహింసాపూరితమైన సత్యాగ్రహంచేత తెల్లవాళ్ళను జయించాడు - మహాత్ముడహింసాపూరితమైన సత్యాగ్రహంతో తెల్లవాళ్ళను జయించాడు. ఉపవాసంచేత ఆత్మపారిశుధ్యాన్ని సంపాదించాడు. ఉపవాసంతో ఆత్మపారిశుద్ధ్యాన్ని సంపాదించాడు - మొదలైనవి. వ్యవహారానుగుణంగా చేత తోడలు పరిగ్రాహ్యాలు.

సహార్థంలో తోడ వర్ణకం వస్తుంది. ౨౨

బుద్ధుడు శిష్యులతో పర్యటించాడు - మహాత్ముడు ప్రజలతో ముందుకు నడిచాడు. శిష్యులతోసహా పర్యటించాడు. ప్రజలతోసహా నడిచాడు అని అర్థం.

అనుసరణార్థంలో తోడవర్ణకం వస్తుంది. ౨౩

మహాత్మునితో ప్రజలు నడిచారు - మహాత్ముణ్ని అనుసరించి - మహాత్మునితోపాటు - మహాత్మునివెంట అని అర్థం. ఇలాగే నాతోవచ్చాడు - నీతో వస్తాను. - ఇత్యాదిప్రయోగాలు లోకవ్యవహారానుగుణంగా గ్రాహ్యాలు.

తుల్యార్థయోగంలో తోడ వర్ణకం వస్తుంది. ౨౪

బుద్ధునితో మహాత్ముడు తుల్యుడు - శాంతితో పంచశీల సాటి - వాటితో అదే దీటు వస్తుంది. మొదలైనవి వక్ష్యమాణవిధిచేత కు వర్ణకం పాక్షికంగావస్తుంది. బుద్ధునికి మహాత్ముడు తుల్యుడు - శాంతికి పంచశీల సాటి - దాని కదే దీటు వస్తుంది - ఇత్యాదులూహ్యాలు.

వచ్యర్థకాల అముఖ్య కర్మకు తోడ కు వర్ణకాలు బహుళంగా వస్తాయి. ౨౫

మహాత్ముడు ప్రజలతో యిలాఅన్నాడు-మహాత్ముడు ప్రజల కిట్లా చెప్పాడు-మొదలైనవి.

వచ్యర్థకాలయోగంలో ఉద్దేశార్థంలో కర్మవాచకాలకు తోడ కు వర్ణకాలు బహుళంగా వస్తాయి. ౨౬

ప్రజలతోచెప్పాడు - ప్రజలకుచెప్పాడు - వాడితోఅన్నాడు - మహాత్మునితో విన్నవించారు - మహాత్మునికి విన్నవించారు - మొదలైనవి - బహుళగ్రహణంచేత భాషించు - అను - పలుకు క్రియలయోగంలో కు వర్ణకంరాదు.

అఖ్యాతకు ఉపయోగంలో వలన వర్ణకం బహుళంగా వస్తుంది. ౨౭

ఉపయోగమంటే నియమపూర్వకమైన విద్యాభ్యాసం - అఖ్యాత అంటే చెప్పేవాడు అని అర్థం. మహాత్మునివల్ల అహింసాపాఠం నేర్చుకున్నాము - మొదలైనవి - పక్షంలో వక్ష్యమాణవిధులచేత మూలాదులయోగంలో యొక్క-షష్ఠి ప్రథమలు పర్యాయంగా వస్తాయి.

అన్యార్థాది సంబంధంలో కంటె కన్నవర్ణకాలు బహుళంగా వస్తాయి. ౨౮

బలంలో అతనికంటె అన్యు డెవడూ లేడు. పౌరుషంలో భారతీయులకన్నా గొప్పవారు లేరు. మొదలైనవి. ఆదిశబ్దంచేత ఇతరం - పరం - వేరు - దక్షిణం - ఉత్తరం - తూర్పు - పడమర - దవ్వు - సమీపం - గొప్ప - తప్పు - మొదలైనవి గ్రాహ్యాలు.

నిర్ధారణార్థంలో కంటె కన్న వర్ణకాలు వస్తాయి. ౨౯

ఉన్నలోభికంటే లేనివాతే గొప్పవాడు-రాజ్యంకన్నా కవిత్వం గొప్పది - యాగంకంటే త్యాగం గొప్పది - భోగ రాగాలకన్నా యోగం గొప్పది - నాగరకుల కన్న జానపదులు నిష్కల్మష హృదయులు.

హేతువులైన గుణక్రియలకు పట్టివర్ణకం వస్తుంది. ౩౦

హేతువులైన గుణవాచకాలకు - హేతువులైన క్రియావాచకాలకు పట్టి వర్ణకం వస్తుందని తాత్పర్యం. జ్ఞానంబట్టి ముక్తుడయ్యాడు-రావడంబట్టి బాగైంది మొదలైనవి - ఇక్కడ చేత తోడ వలన వర్ణకాలూ వస్తాయి - జ్ఞానంచేత ముక్తుడ య్యాడు - మొదలైనవి. అనుప్రయుక్తమైన పట్టి పరమైతే కొన్నిచోట్ల ద్వితీయకు ప్రథమ కనిపిస్తున్నది. తెలివితేటలుపట్టి - జ్ఞానంపట్టి మొదలైనవి. వాడి తెలివి తేటలుపట్టి వాడి కాస్థాయి వచ్చింది. ఎవరి జ్ఞానంపట్టి యిలా అయ్యావు ? ఇత్యా దులు వ్యవహారంలో అరుదుగా కనిపిస్తున్నాయి.

హేత్వర్థంలో అన్నంత క్రియలకు పట్టి అనుప్రయుక్త మౌతుంది. ౩౧

అనబట్టి - ఉండబట్టి - కనబట్టి - తినబట్టి - వినబట్టి - చూడబట్టి - చేయబట్టి - రాబట్టి - పోబట్టి - రాబట్టి - తేబట్టి - తేవబట్టి - కొట్టబట్టి - మొదలైనవి.

సంప్రదానానికి కువర్ణకం వస్తుంది. ౩౨

దానం యెవరి కివ్వాలనుకుంటామో వారు సంప్రదానం-భావేకు స్వాగతం యిచ్చాము - ప్రజలకు భూమి నిచ్చాను. వారికి ధన మిచ్చాను. మొదలైనవి.

ఉద్దేశ్యమాత్రానికి కువర్ణకం వస్తుంది. ౩౩

పురోభివృద్ధికి ప్రయత్నించాలి - విశ్వశాంతికి కృషిచెయ్యాలి. మొదలైనవి.

నిమిత్తార్థంలో కువర్ణకం వస్తుంది. ౩౪

వాళ్లకు పంపాను - అతనికి పళ్లిచ్చాను- నా కిచ్చారు-మొదలైనవి. ఇక్కడ వాళ్ల నిమిత్తం - అతని నిమిత్తం - నా నిమిత్తం అని అర్థం.

కర్మపద యోగంలో నిమిత్తార్థంలో కువర్ణకం వస్తుంది. ౩౫

పువ్వులకు కొమ్మ వంచాడు - కాయలకు చెట్టెక్కాడు మొదలైనవి.

అపాయ గ్రహణ త్రాణ విరామ వారణాల అవధికి ద్వితీయ బహుళంగా వస్తుంది. ౩౬

అపాయ మంటే ఎడబాటు - గ్రహణ మంటే తీసుకొనడం - తెలుసుకొనడం - వినడం - మొదలైనవి. త్రాణం అంటే రక్షించడం - విరామం అంటే విరమించడం - వారణం అంటే వారించడం - వ్యక్ష్యమాణవిధిచేత ఉంచి ఉండు లను ప్రయుక్తాలవుతాయి - అపాయానికి - చాంకైషెక్ రాజ్యంనుంచి భ్రష్టు డయ్యాడు. రాజ్యంనుండి భ్రష్టు డయ్యాడు - గ్రహణానికి - కృష్ణ దగ్గరనుంచి పుస్తకం తీసుకున్నారు. కృష్ణ దగ్గరనుండి పుస్తకం తీసుకున్నారు. త్రాణానికి - ఆపదనుంచి రక్షించాడు. ఆపదనుండి రక్షించాడు. విరామానికి-భోగాలనుంచి విరమించాడు - భోగాలనుండి విరమించాడు - వారణానికి - దుఃఖంనుంచి వారించాడు - దుఃఖం నుండి వారించాడు.

అపాయ గ్రహణ త్రాణ విరామ వారణ పరాజయ ప్రమాదాల అవధికి లోపల వర్ణకం బహుళంగా వస్తుంది. ౩౭

అపాయానికి-కారులోంచి పడ్డాడు - కారునుంచి పడ్డాడు - గ్రహణానికి - బ్యాంకిలోనుంచి డబ్బులీసుకున్నారు - బ్యాంకినుండి డబ్బుతీసుకున్నారు. త్రాణానికి-సముద్రంలోంచి రక్షించారు - సముద్రంనుంచి రక్షించారు. విరామానికి - సౌఖ్యాల్లోంచి విరమించాడు - సౌఖ్యాలనుండి విరమించాడు. వారణానికి - శోకంలోంచి వారించారు - శోకంనుండి వారించారు. పరాజయానికి - అధ్యయనంలో ఓడిపోయాడు. ప్రమాదానికి - న్యాయాన్యాయ విచక్షణలో పొరపడ్డాడు. మొదలైనవి. బహుళగ్రహణంచేత ఏకత్వంలో మహద్వాచకాల గ్రహణత్రాణాల అవధికి లోపల వర్ణకంరాదు. ఏకత్వంలో అనడంచేత బహుత్వార్థకాలకు- సమూహవాచకాలకు- లోపలవర్ణకంవస్తుంది. వారిలోంచి తీసుకునివచ్చాడు - జనంలోంచి రక్షించాడు - మొదలైనవి.

విరామ వారణాల అవధికి ప్రథమ కొన్నిచోట్ల కనిపిస్తున్నది. ౩౮

సుఖాలు విరమించాడు - సుఖాలు మానాడు - భోగాలు విడిచాడు - శోకం వారించాడు - ఏడుపు ఆపాడు - మొదలైనవి.

భయ జుగుప్సా పరాజయ ప్రమాద భవనాల అవధికి కువర్ణకం బహుళంగా వస్తుంది. ౩౯

భయానికి - దొంగకు భయపడ్డాడు - శత్రువుకు వెరచాడు - యుద్ధానికి జంకారు. జుగుప్సకు - హింసాచర్యలకు ఏవగించారు - క్రూరత్వానికి అసహ్యించుకొన్నారు. పరాజయానికి - అధ్యయనానికి అలిశాడు - విప్పి చెప్పడానికి చాలలేదు. ప్రమాదానికి - న్యాయానికి పొరపడ్డాడు. భవనానికి - శుద్ధోదనుడికి బుద్ధుడు పుట్టాడు. ఇత్యాదులూహ్యాలు.

భయ పరాజయ భవనాంతర్ధుల అవధికి వలన వర్ణకం బహుళంగా వస్తుంది. ౪౦

భయానికి - దొంగవల్లభయపడ్డాడు. పరాజయానికి - యుద్ధంవల్ల అలిశారు. భవనానికి - శుద్ధోదనునివల్ల బుద్ధుడు పుట్టాడు. అంతర్ధికి - తల్లివల్ల దాక్కొన్నాడు - మొదలైనవి.

పరాజయానికి తృతీయ వైకల్పికంగా వస్తుంది. ౪౧

అధ్యయనంచేత అలిశాడు - అధ్యయనంతో అలిశాడు. మొదలైనవి.

హేత్వర్థగ్రహ్యాది యోగాల్లో వలన వర్ణకం వస్తుంది. ౪౨

శాంతివల్ల సౌఖ్యంకలుగుతుంది - బుద్ధునివల్ల శాంతి లభించింది - అతనివల్ల డబ్బుదొరికింది - ఆవిషయం నీవల్ల తెల్సుకున్నాను - ఈరహస్యం గురువువల్ల గ్రహించాను - ఇత్యాదులూహ్యాలు.

దిగ్దూరాది వాచకాల యోగంలో కువర్ణకం వస్తుంది. ౪౩

దానికి తూర్పుప్రక్కన - ఆయింటిదాపులో - తోటకుదగ్గర - మొదలైనవి.

వీప్సలోను కాలపరిమితిలోను కువర్ణకం వస్తుంది. ౪౪

ఇంటింటికి - ఊరూరుకి - దేశదేశానికి - శాంతిసందేశం అందించాలి - చెట్టుచెట్టుకు - ఇంటికి ఇంటికి - ఊరుకీ ఊరుకీ - దేశానికి దేశానికి - చెట్టుకీ చెట్టుకీ - కొంతకాలానికి - గంటసేపటికి - నెలకు - రెణ్నెల్లకు - ఆర్నెల్లకు - ఏడాదికి - మొదలైనవి.

సంబంధార్థంలో యొక్కవర్ణకం వస్తుంది. ౪౫

దీన్నే శేషషష్ఠి అంటారు. శేషమంటే సంబంధం. సంబంధమనగా -

స్వస్వామిభావం - జన్యజనకభావం - గుణగుణిభావం - ఇత్యాదులు - పదాలను విభజించి చెప్పేటప్పుడే యొుప్రత్యయం ఉంటుంది. బుద్ధుని - యొక్క - శిష్యుడు - బుద్ధునిశిష్యుడు - నా - యొక్క - అది - నాది - మొదలైనవి.

సంబధార్థంలో కువర్ణకం అరుదుగా వస్తుంది. ౪౬

వాడికి తమ్ముడు-నాకు మిత్రుడు - నీకు బావ-నాకు మామ - మొదలైనవి.

సంబంధ షష్ఠికి తరచుగా కారకత్వంలేదు. ౪౭

సంబంధార్థంలో వచ్చే యొక్క-కు కు వర్ణకానికి తరచుగా కారకత్వంలేదని తాత్పర్యం - తరచుశబ్దంచేత - వాడి కిల్లుంది - యుద్ధోన్మాదులకు జ్ఞానంవుండదు. శాంతివాదులకు విజయం లభిస్తుంది - ఇత్యాదుల్లో కారకత్వం రక్షించబడింది.

నిర్ధారణార్థంలో లోపలవర్ణకం వస్తుంది. ౪౮

మానవుల్లో మహాత్ముడు గొప్పవాడు - జ్ఞానుల్లో బుద్ధుడు మహాజ్ఞాని - కళల్లో కవిత్వం గొప్పది - మొదలైనవి.

అధికరణ వాచకానికి లోపల వర్ణకం బహుళం. ౪౯

అధికరణ మంటే ఆధారం.

ఔపశ్లేషికాది భేదాలతో అధికరణం త్రివిధం. ౫౦

ఔపశ్లేషికం - వైషయికం - అభివ్యాపకం - అని అధికరణం మూడు విధాలు - సమీపసంబంధానికి ఔపశ్లేషిక మని పేరు - విషయసంబంధం కలది వైషయికం - విషయ మంటే పదార్థం - అభివ్యాపక మంటే ఒకవస్తువుకి సర్వాధార పదార్థం - చెరువులో నీరుంది - దాంట్లో కోరికుంది - సర్వంలోను దేవుడున్నాడు - మొదలైనవి.

దూరాద్యర్థాల్లో లోపల వర్ణకం వస్తుంది. ౫౧

దానికి దూరంలో ఏముంది ? దగ్గరలో ఏముంది - తూర్పులో ఉంది - దక్షిణంలో ఏముంది ? మొదలైనవి.

ఉత్వాంత జడవాచకానికి నవర్ణకం వస్తుంది. ౫౨

తూర్పున - దక్షిణాన - నడాన - నట్టనడాన - మూనాన - ఎవరిమానాన వారుపోండి - మొదలైనవి.

విశేషణాల షష్ఠికి ప్రథమ బహుళం. ౫౩

అహింసావీరుడు బుద్ధుడికి నమస్సులు - అహింసావీరుడికి బుద్ధుడికి నమ

స్సులు - మొదలైనవి - బహుళగ్రహణంచేత విశేష్యంషష్ఠి సమాసగతమై ఉండగా దానివిశేషణాల షష్ఠికి ప్రథమ నిత్యంగా వస్తుంది. అహింసావీరుడు మహాత్ముని సత్యాగ్రహం - సత్యవ్రతుడు మహాత్ముని నిరశనవ్రతం - అగు ధాతు వను ప్రయుక్తమైతే - అహింసావీరుడైన మహాత్ముని సత్యాగ్రహం - సత్యవ్రతుడైన మహాత్ముని నిరశనవ్రతం - మొదలైనవి ఊహ్యాలు.

కాలాధ్వవాచకాల ప్రథమకు సప్తమి బహుళం. ౨౪

ప్రొద్దుటవెళ్ళాడు - ఆవేళవచ్చాడు - మార్గమందు కలిశాడు - ఆ మార్గాన పోతుంటే - మొదలైనవి.

ఇతర విభక్త్యర్థాల్లో అమహద్వాచకాలకు కొన్నిచోట్ల ప్రథమ కనిపిస్తున్నది. ౨౫

వాడు గుఱ్ఱందిగాడు - నేను మేడెక్కాను - అతను వేటెళ్లాడు - అది తూర్పుగావుంది - ఇల్లుచేరాడు - మొదలైనవి - పక్షంలో గుఱ్ఱంనుంచి దిగాడు - మేడ నెక్కాను - వేటకు వెళ్లాడు - తూర్పులో వుంది - ఇంటిని చేరాడు - మొదలైనవి వ్యవహారవశాన గ్రహించాలి.

సర్వనామ విశేష్యాల్లోను సంఖ్యావాచక విశేష్యాల్లోను మొదట ప్రయుక్తమైనదాని ద్వితీయాదులకు ప్రథమ బహుళం. ౨౬

అన్ని దేశాలకు - దేశా లన్నిటికి - అందరు ప్రజలతో-ప్రజ లందరితో - రెండు దేశాలకు - దేశాలకు రెండింటికి - లక్ష సైన్యానికి - సైన్యంలక్షకు-మొదలైనవి - బహుళగ్రహణంచేత కొన్నిచోట్ల ప్రథమేతరవిభక్తిసైతం పూర్వోక్తపదానికి వస్తుందని గ్రహించాలి. విదేశాల కన్నిటికి వ్రాశారు - మనిషి కొక్కటికి రూపాయి - తల కొక్కటికి రెండు రూపాయలు - ఇంటి కొక్కటికి నాల్గు రూపాయలు - మొదలైనవి - బాహుళకంచేత అన్నిటికి దేశాలకు - రెంటికిదేశాలకు - అందరితో ప్రజలతో ఇత్యాది అప్రశస్తప్రయోగాలు అపరిగ్రాహ్యాలు.

జడానికి సప్తమ్యర్థంలో ప్రథమ కనిపిస్తున్నది. ౨౭

తీర్థమాడి - తీర్థాలాడి - తీర్థమందాడి-తీర్థాలందు ఆడి - అనిఅర్థం. ఇక్కడ తీర్థంలో ఆడి తీర్థాల్లో ఆడి అని లోపలవర్ణకంసైతంవుంది. ఇలాగే నీళ్లాడి మొదలైనవి.

విశేష్యం ద్వితీయాంతమైనా అన్వంత అగుధాత్వాదు
అనుప్రయుక్తమైన విశేషణం కొన్నిచోట్ల ప్రథమాంతం
కూడా అవుతుంది. ౫౮

బుద్ధుణ్ని దేవుడుగా భావించారు - గాంధీని మహాత్ముడని వర్ణించారు - వాణ్ని మంచివాడనే విన్నాను - మొదలైనవి - పక్షంలో బుద్ధుణ్ని దేవుణ్నిగా భావించారు - గాంధీని మహాత్మునిగా వర్ణించారు - వాణ్ని మంచివాణ్నిగా విన్నాను - ఇత్యాదిగా ద్వితీయ యథావిధిగా వస్తుంది.

విధేయవిశేషణం ద్వితీయకు ప్రథమ బహుళం. ౫౯

అకల్మషహృదయం కలవాణ్ని నాయకుడుగా యెన్నుకోవాలి - అకల్మష హృదయంకలవాణ్ని నాయకుణ్నిగా యెన్నుకోవాలి - మొదలైనవి - బాహుళకం చేత అనుధాతుయోగంలో ప్రథమనిత్యం - శాంతికాముకులను మంచివాళ్లని తెల్సుకో - ఇత్యాదులూహ్యాలు.

విశేషణాల ద్వితీయాదులకి ప్రథమ వస్తుంది. ౬౦

శాంతికాముకులు వాళ్ళను అభినందించు - శాంతికాముకులు వాళ్ళతో స్నేహం చెయ్యి - శాంతికాముకులు వాళ్ళకోసం యెదురుచూడు - శాంతికాముకులు వాళ్లవల్ల చాలామేలు జరుగుతుంది - శాంతికాముకులు వాళ్లకు స్వాగతం చెప్పు - శాంతికాముకులు వాళ్లల్లోచేరు - శాంతికాముకులు వాళ్లయందు ఏదోషమూ లేదు - ఇత్యాదులూహ్యాలు.

జడం సప్తమికి ద్వితీయ బహుళం. ౬౧

వాడు నేలకూలాడు - అది తూర్పునుంది - యిదిఉత్తరము నుంది- ఉత్తరం నుంది - మొదలైనవి - పక్షంలో నేలయందు - తూర్పున - ఉత్తరమున - ఉత్తరాన - ఇత్యాదులూహ్యాలు - బాహుళకంచేత సప్తమికి ద్వితీయ విరళమని గ్రహించాలి.

హేతు పంచమికి గ్రహ్యాది యోగజమైన పంచమికి చేత
వర్ణకం బహుళంగా వస్తుంది. ౬౨

ఫలాన్నిసాధించడానికి యోగ్యమైనపదార్థం హేతువు. ఆ హేతుపంచమికి చేతవర్ణకం వస్తుందనితాత్పర్యం - గ్రహించడం - తెల్సుకొనడం - వినుకొనడం - పుచ్చుకొనడం - వినడం - మొదలైన అర్థాల్లో వచ్చేపంచమిని గ్రహ్యాదియోగజమైన పంచమి అంటారు. ఆ పంచమికికూడా చేతవర్ణకంవస్తుందనిభావం. హేతు

పంచమికి - శాంతిచేత సౌఖ్యంకలుగుతుంది - పంచశీలచేత శాంతికలుగుతుంది - మొదలైనవి - గ్రహ్యాదియోగజమైన పంచమికి - ఈసంగతినీచేత తెల్సుకున్నాను - అది వాడిచేతగ్రహించాను - మొదలైనవి - ఈతృతీయప్రయోగం తెలుగుక స్వాభావికం అయినందువల్ల అంతప్రశస్తంకాదు. ఇటువంటిచోట్ల కొన్నిటికి వలన వర్ణకం - కొన్నిటికి ఉంచియుక్తమైన ద్వితీయ స్వాభావికం.

క్రియాపదోక్తం కాని కర్తకు చేతవర్ణకం వస్తుంది. ౬౩

క్రియాపదంచేత చెప్పబడని కర్తృవాచకానికి చేత అనే ప్రత్యయంవస్తుంది. దీన్నే కర్తృకారకం అంటారు. ధాత్వర్థవ్యాపారానికి ఆశ్రయమైనది కర్త-క్రియా పదోక్తమైన కర్మకు పూర్వోక్తవిధిచేత ప్రథమవస్తుంది. కాబట్టి దీన్నికర్మార్థక ప్రయోగంఅని వ్యవహరిస్తారు. మహాత్మునిచేత నిరశనవ్రతం చెయ్యబడింది. నిరశనవ్రతంచేయడానికి ఆశ్రయుడైనందువల్ల మహాత్ముడు కర్త అయ్యాడు. కాబట్టి మహాత్మశబ్దానికి చేతవర్ణకంవచ్చింది. ఈ కర్మార్థకప్రయోగం తెలుగుకి అస్వాభావికం. మహాత్ముడు నిరశనవ్రతంచేశాడు - మహాత్ముడు నిరశనవ్రతాన్ని చేశాడు - అని అనడమే స్వాభావికం.

ఉపయోగంలో ఆఖ్యాత పంచమికి మారు వద్దాదు
లనుప్రయుక్తా లౌతాయి. ౬౪

మహాత్మునివద్ద అహింసాపాఠంనేర్చుకున్నాను. మొదలైనవి. వద్ద - దగ్గర - ఇత్యాదులు వద్దాదులు - వద్ద దగ్గరలకు ద్వితీయవస్తే ఉంచి ఉండు లను ప్రయుక్తా లౌతాయి - మహాత్మునివద్దనుంచి - మహాత్మునిదగ్గరనుంచి.

మూలాదుల యోగంలో పంచమికి ప్రథమా యొక్కషష్ఠులు
పర్యాయంగా వస్తాయి. ౬౫

మహాత్మునిమూలంగా నేర్చుకున్నాను - మహాత్ముడిమూలంగా నేర్చుకు న్నాను - మహాత్ముడు మూలంగా నేర్చుకున్నాను - మహాత్మునివల్ల నేర్చు కున్నాను - మొదలైనవి - యొక్కకు వక్ష్యమాణవిధిచేత లోపం - యిక్కడ మూలాదులకు ప్రయోగదశలో అన్నంత అగు ధాతువు నిత్యంగా అనుప్రయుక్త మౌతుంది. మూల - కారణ - ప్రయత్నాదులు మూలాదులు - మూలాదుల యోగంలో పంచమి రాదని తాత్పర్యం.

సంప్రదానషష్ఠికి చతుర్థి బహుళంగా వస్తుంది. ౬౬

భావేకొరకు దానమిచ్చాము - ప్రజలకై భూమి యిచ్చాము - వారికోసం

యిచ్చాను - అతనికోసం యిచ్చాను - ఇత్యాదులూహ్యాలు - కొరకుప్రయోగం వ్యవహారంలో అప్రశస్తం - కై కోసంలు వ్యవహారంలో విరళంగా కనిపిస్తున్నాయి - ఇక్కడ కుషష్ఠి తెలుగుకు స్వాభావికం.

ఉద్దేశ్య మాత్ర షష్ఠికి చతుర్థి బహుళంగా వస్తుంది. ౬౭

పురోభివృద్ధికోసం ప్రయత్నించాలి - విశ్వశాంతికోసం కృషిచెయ్యాలి - పురోభివృద్ధికై ప్రయత్నించాలి - విశ్వశాంతికై కృషిచెయ్యాలి మొదలైనవి.

నిమిత్తార్థంలో షష్ఠికి చతుర్థి బహుళం. ౬౮

వాళ్లకొరకు పంపాను - అతనికోసం పట్టిచ్చాను - నాకై యిచ్చాడు-మొదలైనవి - ఇక్కడ వాళ్లనిమిత్తం వాళ్లప్రయోజనంకోసం - అతనినిమిత్తం అతని ప్రయోజనంకోసం - నానిమిత్తం నాప్రయోజనంకోసం అని అర్థం - ఇలాగే - దానికోసం - నాకోసం - నాకొరకు - దానికై - దీనికై - ఇత్యాదులూహ్యాలు.

కర్మపదయోగంలో నిమిత్తార్థంలో షష్ఠికి చతుర్థి బహుళం. ౬౯

పువ్వులకొరకు కొమ్మవంచాడు - పువ్వులకోసం కొమ్మవంచాడు - పువ్వులకై కొమ్మవంచాడు - మొదలైనవి.

కువర్ణకానికి చతుర్థికి క్త్వాంతమైన అను ధాతువు బహుళంగా అనుప్రయుక్త మౌతుంది. ౭౦

నాకని - దానికని - దానికొరకని - దానికోసమని - దానికైయని - ఇత్యాదులూహ్యాలు - నాకోస మనితెచ్చారు - నా కనియిచ్చాడు - వంటివి వ్యవహారప్రయోగాలు.

దిగ్దూరాదివాచకాల యోగంలో కువర్ణకానికి యొక్క బహుళంగా వస్తుంది. ౭౧

దాని (యొక్క) తూర్పుప్రక్కన - ఆయింటి (యొక్క) దాపులో - తోట (యొక్క) దగ్గర - మొదలైనవి.

లోపల వల్ల నువర్ణకాలకు ఉంచి ఉండులు బహుళంగా అనుప్రయుక్తా లౌతాయి. ౭౨

దానిలోపలనుంచి - దానిలోపలనుండి - దానిలోనుంచి - దానిలోనుండి - దానివల్లునుంచి - దానివల్లనుంచి - దాన్నుంచి - మొదలైనవి - బాహుళకంచేత పరాజయ ప్రమాదాదులకు ఉంచి ఉండులు అనుప్రయుక్తాలుకావు - అధ్యయ

నంలో డక్కాడు - న్యాయంలో పొరపడ్డాడు - మొదలైనవి - ఇలాగే వల్ల - ను వర్ణకాలకు ఉంచి ఉండుల అననుప్రయుక్తత్వం వ్యవహారానుగుణంగా గ్రహించాలి - వలన గ్రహించక వల్ల గ్రహించడంచేత వల్ల వల్లలకేగాని వలనకు ఉంచి ఉండులు ప్రయోగం వ్యవహారంలోలేదని గుర్తించాలి. ఉంచి ప్రయోగం బహుళంగా ఉండి ప్రయోగం విరళంగాను లోకంలో కనిపిస్తున్నది.

అందు న వర్ణకాలకు ఒకానొకచోట ఉంచి ఉండులు అను ప్రయుక్తా లౌతున్నాయి. ౨౩

నాకలోకంనందుంచి - నాకలోకంనందుండి - నడానసుంచి - నడాన సుండి - నడాన్నుంచి - నడాన్నుండి - మొదలైనవి

లోపల లో వర్ణంమీది ఉంచి ఉత్వానికి లోపం వైకల్పికం. ౨౪

అందులోంచి - అందులోనుంచి - దానిలోంచి - దానిలోనుంచి - మొదలైనవి.

లోపలకు అర్థవిశేషంలో గుండా బహుళంగా అనుప్రయుక్త మౌతుంది. ౨౫

దానిలోపలగుండా - దానిలోగుండా - గుహలోపలగుండా - గుహలో గుండా - సొరంగంలోపలగుండా - సొరంగంలోగుండా - మొదలైనవి - లోపల వర్ణకానికి అనక లోపలకు అనడంచేత అనుప్రయుక్తంకాని లోపలకు సైతం గుండా అనుప్రయుక్తమౌతుందని గ్రహించాలి. లోపలగుండా - పక్షంలో ఉంచి ఉండులు ఈఅర్థవిశేషంలో పర్యాయంగా అనుప్రయుక్తా లౌతాయి.

గుండా పరమైతే లోపల వర్ణాకానికి లోపం వైకల్పికం. ౨౬

దానిగుండా - గుహగుండా - సొరంగంగుండా - మొదలైనవి. వర్ణకానికి అనడంచేత అనుప్రయుక్తంకాని లోపలకు లోపంరాదు - లోపలగుండా.

నిర్ధారణార్థంలో షష్ఠికి అందువర్ణకం అరుదుగా కనిపిస్తున్నది. ౨౭

మానవులందు మహాత్ముడు గొప్పవాడు - జ్ఞానులందు బుద్ధుడుమహాజ్ఞాని మొదలైనవి.

అధికరణవాచకానికి అందు వర్ణకం బహుళం. ౨౮

దానియందు వాంఛవుంది - అందుకుమారు కొన్నిచోట్ల మీదాదిశబ్దాలు అనుప్రయుక్తా లవుతున్నాయి - దానిమీద వుంది - దానిపైని కోరికవుంది-అధికర

ణార్థంలో యొక్క-షష్ఠిమీద మీదాదు లనుప్రయుక్త మౌతున్నాయి - మేదమీద - మేడయొక్క-మీద అనిఅర్థం.

దూరాద్యర్థాల్లో లోపలకు అందువర్ణకం అరుదుగా వస్తుంది. ౭౯

దూరమందున్నది - తూర్పునందుంది - అరుదుగా అనడంచేత వ్యవహారంలో ప్రయోగవైరళ్యం సూచించబడింది.

ఉత్వాంతజడంతృతీయకు నవర్ణకం కొన్నిచోట్ల కనిపిస్తున్నది. ౮౦

ఒక్కపెట్టున వచ్చాడు - ఒక్క-పెట్టుతో వచ్చాడు - నిట్టనిలువునా కూలాడు-నిట్టనిలువుతో కూలాడు - మొదలైనవి. పక్షంలో ప్రథమవస్తే ఒక్కపెట్టుగా వచ్చాడు - నిట్టనిలువుగా వచ్చాడు - మొదలైనవి.

క్రియాన్వయంలో పదద్వయానికి స్వస్వామి సంబంధం వుంటే సంబంధి పదం షష్ఠికి ద్వితీయ వైకల్పికంగా వస్తుంది. ౮౧

నన్నుచెట్టపట్టాడు - నాచెట్టపట్టాడు - సత్యాగ్రహం చేసినవారిని చేతులు కట్టారు - సత్యాగ్రహం చేసినవారి చేతులు కట్టారు - యుద్ధోన్మాదుల్ని గుండెలు చీల్చిచెండాడాలి - యుద్ధోన్మాదులగుండెలు చీల్చి చెండాడాలి - మొదలైనవి.

యొక్కకు లోపం బహుళం. ౮౨

వారివి - మీవి - నాది - బుద్ధునిది - మేడమీద - మేడపైని - మొదలైనవి.

అప్రేరణ కర్తృకాలకు ప్రేరణంలో చేత తోడ కు ను వర్ణకాలు బహుళంగా కొన్నిచోట్ల వస్తాయి. ౮౩

పిల్లవాడు అన్నంతిన్నాడు - పిల్లవాడిచేత అన్నంతినిపించారు - పిల్లవాడితో అన్నంతినిపించారు - పిల్లవాడికి అన్నంతినిపించారు - పిల్లవాణ్ని అన్నం తినిపించారు. ఇత్యాదులు వ్యవహారవశాన గుర్తించాలి. బాహుళకంచేత కొన్నిచోట్ల చేత తోడలు - మరికొన్నిచోట్ల చేత తోడ కు వర్ణకాలు - యింకా కొన్నిచోట్ల ద్వితీయసైతం వస్తుందని గ్రహించాలి.

ప్రథమాంతాలైన నీ నేల విశేషణాల కేకత్వంలో వు ను వర్ణాలంతాగమా లౌతాయి. ౮౪

ప్రథమాంతాలైన మే మనల విశేషణాలకు బహుత్వంలో
ముపర్ణం అంతాగమం అవుతుంది. ౮౫

ఈ ఆగమాలు పరమైతే ఉత్వానికి అత్వంవస్తుంది. ౮౬

నీవు ధన్యుడవు - నువ్వుధన్యుడవు - నేను ధన్యుడను - మీరు ధన్యులు - మేం ధన్యులం - మనం ధన్యులం - మొదలైనవి.

ఈ వు ను లు పరమైతే అత్వానికిత్వం పర్యాయంగా
కనిపిస్తున్నది. ౮౭

నీవు ధన్యుడవు - నీవు ధన్యుడివి - నేను ధన్యుడను - నేను ధన్యుడిని - నేను ధన్యుణ్ని - మొదలైనవి. ఇకారంమీది కు ను వు ఇత్యాదిసూత్రంచేత వు ను ల ఉత్వానికి ఇత్వం.

వు ను లు సంబోధనార్థం పరమైనప్పుడు అది శబ్దానికి
దాన ఆదేశ మౌతుంది. ౮౮

నువ్వుచిన్నదానవు - నేనుపెద్దదానను - పూర్వసూత్రంచేత పాక్షికంగా అత్వానికి ఇత్వంవస్తే చిన్నదానివి-పెద్దదానిని - ఇత్వలోపంవస్తే పెద్దవాన్ని - ఓచిన్నదానా - ఇత్యాదులు గ్రహించాలి.

ప్రథమమధ్య మోత్తమ పురుష కార్యాల్లో ఉత్తమం
బలీయం. ౮౯

వాసు మేము వచ్చాం - మీరు మేము వెళ్లాం - వారు మీరు మేము అనుకొన్నాం - మొదలైనవి. మధ్యమోత్తమ పురుషలు కలిస్తే యేర్పడిందే ఉభయ వాచకంకాబట్టి - ఉభయవాచకంలో ఉత్తమపురుష అంతర్గతమై ఉన్నందువల్ల ప్రథమపురుషకంటే ఉభయపురుషవాచకం బలీయమైనదని గ్రహించాలి. వారు మనం వెళ్లాం. ఇత్యాదులూహ్యాలు.

ఏకవాక్యంలో సర్వపదాలు క్రమ నిరపేక్షతో బహుళంగా
ప్రయోగ్యయోగ్యా లౌతాయి. ౯౦

గాలి చల్లగా వీచింది - చల్లగా గాలి వీచింది - వీచింది చల్లగా గాలి - వీచింది గాలి చల్లగా - చల్లగా వీచింది గాలి - గాలి వీచింది చల్లగా - మొదలైనవి. ఏనుగూ గుర్రంపడింది - గుర్రం ఏనుగూపడింది - పడింది ఏనుగూ గుర్రం - పడింది గుర్రం ఏనుగూ-అని ప్రయోగించవచ్చుగాని బహుళగ్రహణం

చేత ఏనుగుపడింది గుర్రం అనికాని గుర్రంపడింది ఏనుగు అనికాని ప్రయోగించ రాదని గ్రహించాలి. పూర్వపరపదప్రయోగాలు మహాజనవ్యవహారానుసారంగా చెయ్యాలని తాత్పర్యం.

విశేష్యానికిలాగానే విశేషణానికి లింగవిభక్తి వచనా లౌతాయి. ౯౧

అహింసావీరుడు బుద్ధుడు ఆరాధనీయుడు - శాంతినేతల్ని నెహ్రూ కృష్ణ మీనన్ చౌఎన్‌లై నాజర్ ప్రభృతుల్ని అభినందిస్తాను - భువనవంద్యను భారత మాతను ప్రస్తుతిస్తాను. మొదలైనవి.

అది శబ్దయుక్తమైన క్రియాజన్య విశేషణం కొన్నిచోట్ల ఏక బహుత్వాల్లో మహదర్థక మౌతుంది. అయితే కర్తృ వాచకం వాక్యాంతపద మౌతుంది. ౯౨

అహింసాసిద్ధాంతాన్ని ప్రతిపాదించింది బుద్ధుడు - స్వాతంత్ర్యోద్యమానికి సరైన రూప మిచ్చింది అసలు మహాత్ముడు - త్యాగంచేసింది ప్రజలు - యుద్ధవాదుల కోరలు పీకింది శాంతివాదులు - మొదలైనవిగ్రాహ్యాలు.

మువర్ణకాంత స్త్రీసమవిశేషణాల బహువచనానికి ఏకవచనం బహుళం. ౯౩

మాటలు పెక్కులేల - మాటలు పెక్కేల - ఇష్టాలైన పదార్థాలు - ఇష్ట మైన పదార్థాలు.

విధేయ విశేషణం ఒక్కటే ఏకబహువచనాంతమై పెక్కు విశేష్యాలతో అన్వయిస్తుంది. ౯౪

ఇది శాంతివాదులుకి ఇది అహింసాపరులుకి ఇది పరదాస్యబంధవిముక్తులుకి ఇది దేశసేవాధురీణులుకి కానుక - ఇది శాంతివాదులుకి - ఇది అహింసాపరులుకి - ఇది పరదాస్యబంధవిముక్తులుకి - ఇదిదేశసేవాధురీణులుకి కానుకలు. మొదలైనవి. ఇది శాంతివాదులుకి కానుక అని యిలా ప్రతిదానికీ కానుక చేరవచ్చును.

ఇతరాలు విభక్తి ప్రయోగ విశేషాలు శిష్టవ్యవహారానుగుణ గ్రాహ్యాలు. ౯౫

కారకపరిచ్ఛేదం

---

# వ్యావహారికభాషా వ్యాకరణం

## సమాస పరిచ్ఛేదం

సమర్థాలైన పదాలు ఏకపదమవ్వడం సమాసం. ౧

భిన్నభిన్న అర్థాల్లో స్థిరపడివున్న రెండుపదాలుగాని అంతకన్నా ఎక్కువ పదాలుగాని ఒకేఅర్థాన్ని బోధిస్తూ ఒక్కపదంగా రూపొందడాన్ని సమాసం అంటారు.

సాంస్కృతిక ఆచ్ఛికాన్యదేశ్య మిశ్రభేదాలతో సమాసం చతుర్విధం. ౨

సాంస్కృతికసమాసం - ఆచ్ఛికసమాసం - అన్యదేశ్యపదాల సమాసం - మిశ్రసమాసం - అని సమాసం నాల్గు విధాలని తాత్పర్యం.

సిద్ధ సాధ్య భేదాలతో సాంస్కృతిక సమాసం ద్వివిధం. ౩

సిద్ధసమాసమని - సాధ్యసమాసమని సాంస్కృతికసమాసం రెండు విధాలని భావం.

సంస్కృతం నుంచి తెలుగులో ప్రవేశించిన సమాసం సిద్ధ సమాసం. ౪

సంస్కృత వ్యాకరణానుగుణంగా సంస్కృతంలోనే సమాసమై ఆ సమాసం తుదినున్న విభక్త్యాదుల మార్పుతో తెలుగులో వ్యవహరించితే అది సిద్ధసమాసమనబడుతుంది. ప్రజానాయకుడు - శాంత్యహింసా సిద్ధాంత తత్త్వజ్ఞుడు - మొదలైనవి ఉదాహరణలు.

సంస్కృతసమాల సమాసం సాధ్యసమాసం. ౫

సంస్కృత సమపదాలకు సమాసం జరిగితే సాధ్యసమాసమంటారు. ప్రతినిధులసభ - స్వాతంత్ర్యప్రియుల సమావేశం - శాంతికాముకుల సందేశం - మొదలైనవి.

దేశ్యతద్భవాల సమాసం ఆచ్ఛికం. ౬

దేశ్యపదంతో తద్భవపదానికి - తద్భవపదంతో దేశ్యపదానికి - దేశ్యపదంతో దేశ్యపదానికి - తద్భవపదంతో తద్భవపదానికి సమాసమైతే అది ఆచ్ఛిక సమాసం అనబడుతుంది. నలుదెసలు - నీళ్లమడుగు - నామాట - సిరిసుకం - మొదలైనవి.

కేవలం అన్యదేశ్యపదాల సమాసం అన్యదేశ్యసమాసం. ౭

ఆచ్ఛికపదాలకులాగానే అన్యదేశ్యాలకుసైతం తెలుగు సమాసత్వాన్ని గ్రహించాలి. సంస్కృతాంధ్రపదా లేవీలేకుండా తెలుగులో వ్యవహరించబడుతున్న కేవల ఇంగ్లీషు - హిందీ మొదలైన భాషలపదాలకు సమాసంజరిగితే అది అన్య దేశ్యసమాసం అవుతుంది. కాలేజీహాలు - కోర్టుజవాను - గవర్నరుదర్బా - గ్రాంఫోనుప్లేటు - పోష్టాఫీసు - మున్సబుకచేరి - రైల్వేస్టేషన్ - హెడ్‌గుమాస్తా - హైకోర్టు - హైదరాబాద్ - మొదలైనవి.

సిద్ధాదిభేదాలతో మిశ్రసమాసం త్రివిధం. ౮

సిద్ధమిశ్రం - సాధ్యమిశ్రం - ఆచ్ఛికమిశ్రం - అని మిశ్రసమాసం మూడు విధాలని తాత్పర్యం.

సిద్ధమిశ్రం లోకవ్యవహారానుగుణగ్రాహ్యం. ౯

ఇలా అనడంచేత వ్యవహారంలోవున్నవాటినే గ్రహించాలిగాని స్వేచ్ఛగా సమాసకల్పన చేయరాదని తాత్పర్యం.

సంస్కృతపదంతో ఆచ్ఛికాన్యదేశ్యపదాలు సమసిస్తే సిద్ధ మిశ్రం. ౧౦

కేవలసంస్కృతపదంతో అచ్చతెలుగుపదంకాని అన్యదేశ్యపదంకాని పూర్వ పరాల్లో యెక్కడవుండిసమసించినా అది సిద్ధమిశ్రసమాసం అనబడుతుంది. కర కంజడు - చౌపదం - చౌదంతి - చౌషష్ఠి - దినవెచ్చం - దినబత్తెం - కపిల కన్నులు - కపిలజడలు - కపిలగడ్డం - కపిలఅవు - జీవగర్ర - ప్రాణగొడ్డం - నిత్యపడి - ఉత్తరజందేలు - అపదూరు - అపరేతిరి - అపనమ్మకం - పంచ వన్నెలు - పంచరంగులు - వీరమద్దెల - నాగబెత్తం - నాగపడగలు - నాగ గన్నేరు - నాగదొండ - నాగమల్లి - నాగముస్తె - నాగవాసం - నాగసరులు - గరుడపచ్చలు - అతివస - అపసిరి - మూలదుంప - లింగకాయ - లింగదొండ -

రంగపొట్లు - లింగబలిజులు - వజ్రగార - వీరభద్రపళ్లెం - సహాయుస్తె - పవ పత్తెం - దీపకంబం - కంఠసరులు - శుద్ధతప్పు - శుద్ధదంతుగ - శుద్ధదొంగ - గజదొంగ - అనేకసార్లు - అనేకమార్లు - అనేకమంది - అల్పసెరి - పరలవాటు - మస్పలహా - జగన్నాథరావు - కృష్ణదేవరాయలు - సింహాద్రిఅప్పన్న - ఇత్యాదులు సంస్కృతాచ్ఛికాలు కూడిన మిశ్రసమాసాలు. పబ్లిక్‌పరీక్ష - యూనివర్సిటీ ప్రశ్నపత్రం - కాలేజీభవనం - సీనియర్‌పండితుడు - గ్రాంఫోనుసంగీతం - ఎలక్ట్రిక్‌దీపం - హిందీభాష - బేమర్యాద - మున్సబుఉద్యోగం - జరూరుకార్యం - ప్రథమపటర్లలిష్టు - దక్షిణరైల్వే - దక్షిణరష్యా - ఉత్తరరష్యా - ఉత్తర అమెరికా - దక్షిణఅమెరికా - ఉత్తరాఫ్రికా - దక్షిణాఫ్రికా - సరస్వతీ పవర్ ప్రెస్ - నలందాప్రింటర్సు - కవిరాజా పబ్లిషర్సు - అతిజరూరు - పండితదర్జా - మంత్రిహోదా - మొదలైనవి సంస్కృతాన్యదేశ్య మిశ్రసమాసాలు.

సంస్కృతసమపదంతో ఆచ్ఛికాన్యదేశ్యపదాలు సమసిస్తే సాధ్యమిశ్రం. ౧౧

సంస్కృతసమపదంతో అచ్చతెలుగుపదంకాని అన్యదేశ్యపదంకాని యథేచ్ఛగా సమసిస్తుంది. ఇదే సాధ్యమిశ్రం. సాధ్యమిశ్రసమాసాల్ని యిష్టంవచ్చినట్లు కల్పించవచ్చు.

ఆచ్ఛికపదంతో అన్యదేశ్యపదం సమసిస్తే ఆచ్ఛికమిశ్రం. ౧౨

దేశ్యపదంతోకాని తద్భవపదంతో కాని అన్యదేశ్యపదం సమసిస్తే అది ఆచ్ఛికమిశ్రం అనబడుతుంది.

రేడియోపాట - సెకండ్రీతరగతి - హోటల్‌కూడు - హోటల్‌తిండి - గార్డుపెట్టె - పాస్లైసుగుడ్డ - ఖజానాగది - సామానుబండి - కాపలామనిషి - కలంపోటు - జరూర్‌పని - మేజాబల్ల - అప్పారావుమాష్టర్‌గారు - తెలుగుడాక్టర్ - అంగడిసామాను - బంగారుమొలాం - మొదలైనవి ఊహ్యాలు.

శుద్ధాదులు తెలుగు తిథి వాచకాలతో సమసిస్తాయి. ౧౩

శుద్ధపాడ్యమి - శుక్లపాడ్యమి - బహుళపాడ్యమి - కృష్ణపాడ్యమి - శుద్ధవిదియ - శుక్లవిదియ - బహుళవిదియ - కృష్ణవిదియ - శుద్ధతదియ - శుక్లతదియ - బహుళతదియ - కృష్ణతదియ - చవుతి - చవితి - శుద్ధచవుతి - శుద్ధచవితి - శుక్లచవుతి - శుక్లచవితి - బహుళచవుతి - బహుళచవితి - కృష్ణచవుతి - కృష్ణచవితి - శుద్ధపున్నమ - శుక్లపున్నమ - బహుళపున్నమ - కృష్ణపున్నమ-ఆదిశబ్దప్రయోగం

వల్ల సంవత్సరాదిపాడ్యమి - గౌరీపున్నమ - ఇత్యాదులు శిష్టవ్యవహారాన్ననుసరించి గ్రాహ్యాలు.

తెలుగు నక్షత్రవాచకాలతో నక్షత్రశబ్దం సమసిస్తుంది. ౧౪

ఈ సమాసాలు సిద్ధసమాసాలవంటివి. పుబ్బానక్షత్రం - చిత్తానక్షత్రం - సిద్ధసమాసాలవంటి వనడంచేత పుబ్బా చిత్తాల దీర్ఘత్వం రక్షించబడింది.

అరజాతిప్రభృతు లనేక మిశ్రసమాసాలు ప్రయోగార్హాలు. ౧౫

అరజాతి - ఎత్తుభారం - ఒరబీజం - కటికదరిద్రుడు - కటికహృదయం - కొరప్రాణం - కొనప్రాణం - అరకొరజ్ఞానం - తిరుచూర్ణం - తిరుపతి - తిరుమజ్జనం - తిరుమణి - తిరువారాధనం - తిరుమంత్రం - పట్టివర్ధనం - పంగనామాలు - పెద్దరోగం - మిట్టమధ్యాహ్నం - ముక్కోపం - పసనాభి - తిమ్మసముద్రం - మచిలీపట్టణం - బరంపురం - బేస్తవారం - ఇత్యాదులు లూహ్యాలు.

తత్పురుషాది భేదాలతో సమాసం త్రివిధం. ౧౬

తత్పురుషం - బహువ్రీహి - ద్వంద్వం - అని సమాసం మూడు విధాలు.

ఉత్తరపదార్థప్రధానం తత్పురుషం. ౧౭

ఉత్తరపదార్థానికి ( శబ్దార్థానికి ) ప్రాధాన్యంకల సమాసం తత్పురుషమని తాత్పర్యం.

ఇతరపదార్థప్రధానం బహువ్రీహి. ౧౮

పూర్వోత్తరపదార్థాల్లో దేనికీ ప్రాధాన్యం లేకుండా ఇతరపదార్థానికి ప్రాధాన్యం కల సమాసం బహువ్రీహి - నలువ - ముక్కంటి - వేగంటి - వేడివెలుగు - చలివెలుగు - మొదలైనవి.

ప్రతిపదార్థప్రధానం ద్వంద్వం. ౧౯

ఉభయపదార్థ ప్రధానం అనక ప్రతిపదార్థ ప్రధానం అనడంచేత ద్విపద ద్వంద్వాలేకాక అనేక పద ద్వంద్వాలు సైతం పరిగ్రాహ్యాలయ్యాయి.

శాంత్యహింసలు - శాంత్యభ్యుదయాలు - అహింసాభ్యుదయాలు - కష్టసుఖాలు - సుఖదుఃఖాలు - వెలుగునీడలు - ఊరుపేరులు - చావుబ్రతుకులు - కాలుచేతులు - ఊరుపల్లెలు - మేలుకీళ్లు - పగలురేలు - వెన్నెలచీకట్లు - డాలుడమాలు - ధర్మార్థకామమోక్షాలు - అన్నఅక్కచెల్లితమ్ముళ్లు - మొదలైనవి.

ఈ ద్వంద్వం క్రియాపదాల్లో సైతం కనిపిస్తున్నది - వస్తూపోతూ - వచ్చేపోయే - వస్తున్నపోతున్న - వచ్చిరాని - తెచ్చీతేని - వినీవినని -నమ్మీనమ్మక - చెప్పీ చెప్పక - కొట్టీకొట్టక - మొదలైనవి.

వ్యధికరణ సమానాధికరణ భేదాలతో తత్పురుషం ద్వివిధం. ౨౦

వ్యధికరణం - సమానాధికరణం - అని తత్పురుషసమాసం రెండు విధాలని తాత్పర్యం.

ద్వితీయాదులుకి మీదిపదంతో సమాసమైతే వ్యధికరణం. ౨౧

ద్వితీయమొదలైన విభక్తులు కల పదాలకు మీది పదంతో సమాసంజరిగితే వ్యధికరణతత్పురుషసమాసం అంటారు.

నెలతక్కువ్వాడు - మాటనేర్పరి - దొంగభయం మొదలైనవి.

విశేషణానికి విశేష్యంతో సమాసమైతే సమానాధికరణం. ౨౨

దీన్నే కర్మధారయ సమాసమని వ్యవహరిస్తారు. సరసపుమాటలు - మంచి మాటలు - మొదలైనవి.

కర్మధారయంలో పూర్వపదం సంఖ్యావాచకమైతే ద్విగువు. ౨౩

కర్మధారయ సమాసంలో పూర్వపదం సంఖ్యావాచకంగనుక అయితే దాన్ని ద్విగు సమాసంగా పేర్కొంటారని తాత్పర్యం.

ముక్కాక - ఇరుగడ - ఇరుమేను - ముచ్చిచ్చు - ముప్పొద్దు - ముమ్మంక - ముమ్మన్నె - నల్గడలు - మొదలైనవి.

ద్వితీయావిభక్త్యంత పదానికి మీదిపదంతో సమాసమయితే ద్వితీయా తత్పురుషం. ౨౪

పడగతాల్పు - నెలతాల్పు - తేనెతిండి - బుద్ధాశ్రితుడు - జనాశ్రితుడు - లోకాతీతుడు - మొదలైనవి.

తృతీయావిభక్త్యంత పదానికి మీది పదంతో సమాసమయితే తృతీయాతత్పురుషం. ౨౫

ఉలితునక - నెలతక్కువబిడ్డ - గురుతుల్యుడు-వాక్కలహం- మొదలైనవి.

చతుర్థీవిభక్త్యంత పదానికి మీది పదంతో సమాసమయితే చతుర్థీతత్పురుషం. ౨౬

దేవరమేలు - సేమేలు - గొడ్లమేత - భూతబలి - లోకహితం మొదలైనవి.

పంచమీవిభక్త్యంత పదానికి మీదిపదంతో సమాసమైతే పంచమీ తత్పురుషం. ౨౭

దొంగభయం - ధనగర్వం - పాపభీతి - పాడివెరపు-మొదలైనవి.

షష్ఠీవిభక్త్యంత పదానికి మీది పదంతో సమాసమయితే షష్ఠీతత్పురుషం. ౨౮

తేటిపిల్ల - మల్లెపూవు - జాబిల్లి వెన్నెల-నేతిముంత-వానకాలం - చెట్టు నీడ - తల్లిఆదరం-బుద్ధునాజ్ఞ - మహాత్మునాదరం-మొదలైనవి.

సప్తమీవిభక్త్యంత పదానికి మీదిపదంతో సమాసమైతే సప్తమీ తత్పురుషం. ౨౯

మాటనేర్పు - పనినేర్పు - దానకర్ణుడు - శాంతివీరుడు - యుద్ధధీరుడు - మొదలైనవి.

సంస్కృతంలో నవర్ణంతో సమాసాన్ని నఞ్సమాస మంటారు. ౩౦

దీన్నే నఞ్తత్పురుష అనడం కూడా కద్దు.

అజ్ఝలులు పరమైతే నవర్ణ నకారానికి లోపం బహుళంగా వస్తుంది. ౩౧

న + భేదం - అభేదం - న + బుద్ధుడు - అబుద్ధుడు. న + శాంతి - అశాంతి - మొదలైనవి. బాహుళకంచేత నభ్రాజం - నపాదం - నాసత్యం - నముచి - నకులం - నఖం - నపుంసకం - నక్షత్రం-నక్రం - నాకం - అనే సమాసాల్లో న లోపం జరగదు.

నఞ్సమాస నవర్ణానికి అచ్చుపరమైతే నకారం ఆగమంగా వస్తుంది. ౩౨

న + ఐక్యం - అనైక్యం - న + ఆదరం - అనాదరం. న + అంతం - అనంతం-మొదలైనవి. నవర్ణంలోని నకార వ్యంజనానికి పూర్వోక్తవిధిచేత లోపం.

ఉపమానవాచకం పూర్వపదమై సమసిస్తే ఉపమానపూర్వపద కర్మధారయం. ౩౩

పండువంటిమోవి - పండుమోవి; తమ్మివంటి కేలు - తమ్మి కేలు; తీగవంటికౌను - తీగకౌను; కెంపువంటిమోవి - కెమ్మోవి; చిగురువంటి కేలు - చిగురు కేలు; జున్నువంటిమోవి - జంటిమోవి; తేనెవంటి మాటలు - తేనె మాటలు ;మొదలైనవి.

సాధారణ ధర్మవాచకపదంతో ఉపమానపదం సమసిస్తే ఉపమానపూర్వపదకర్మధారయం. ౩౪

నైల్యం - శౌర్యం - సౌందర్యం - ఇత్యాదులు సాధారణధర్మాలు - వీటిని తెల్పేపదాలు సాధారణ ధర్మవాచకాలు. వ్యాఘ్రంవలే శూరుడు-వ్యాఘ్రశూరుడు - చంద్రునివలె సుందరమైనది- చంద్రసుందరం - నీలమేఘంవలే శ్యాముడు - నీలమేఘశ్యాముడు - మొదలైనవి.

ఉపమానవాచకం ఉత్తరపదమై సమసిస్తే ఉపమానోత్తర పదకర్మధారయం. ౩౫

దీన్నే ఉపమితసమాసం అని కూడా అంటారు.

తమ్మివంటి కేలు - కేలుతమ్మి; చిగురువంటి కై - కైచిగురు; తామర వంటి మోము - మోముతామర; పండువంటి మోవి - మోవిపండు; తీగవంటి మెయి - మెయితీగ; అద్దంవంటి చెక్కు - చెక్కుటద్దం; కలువవంటి కన్ను - కన్నుకలువ; తీగవంటి కౌను - కౌతీగ; పద్మంవంటి ముఖం - ముఖపద్మం; కమలంవంటి చరణం - చరణకమలం; పల్లవంవంటి హస్తం - హస్తపల్లవం; మొదలైనవి వూహ్యాలు.

అత్యంతసన్నిహిత సంబంధార్థ నిర్దేశంలో ఉపమేయంతో ఉపమానానికి అభిన్నత్వం వస్తుంది. ౩౬

అతను పులి - ఇతను పిడుగు - అతను దున్నపోతు - అదివిషం - ఆ పిల్లకేం బంగారం - ఆమెకోతి-ఇత్యాదులూహ్యాలు - అతను పులివంటివాడు - ఇతను పిడుగువంటివాడు - అతను దున్నపోతువంటివాడు - అదివిషంవంటిది - ఆపిల్లకేంబంగారంవంటిది - ఆమెకోతివంటిది - అని అర్థం.

సంజ్ఞావాచకం పూర్వపదమై సామాన్యనామవాచకం ఉత్తర పదమై సమసిస్తే సంభావనాపూర్వపదకర్మధారయం. ౩౭

ఈసమాసం చేస్తున్నప్పుడు అను అనే పదంచేరి సమసించేప్పుడు లోపిస్తుంది.

వింధ్య మనే పర్వతం - వింధ్యపర్వతం - మఱ్ఱి అనే చెట్టు - మఱ్ఱిచెట్టు - నన్నెచోడు డనే మహాకవి - నన్నెచోడమహాకవి - సర్ప మనే భ్రాంతి - సర్ప భ్రాంతి - మొదలైనవి.

మధ్యమపదలోపసమాసాలు యథావ్యవహారంగా గ్రాహ్యాలు. ౩౮

గాజు లమ్మే సెట్టి - గాజులుసెట్టి - జవ్వాజి అమ్మే సెట్టి - జవ్వాజిసెట్టి - పచ్చళ్లు పెట్టే జాడి - పచ్చళ్లజాడి - తావి కల మొల్ల - తావిమొల్ల - పూలు కల నీళ్లు - పూలనీళ్లు - వెన్నెల కల రాత్రి - వెన్నెలరాత్రి - తావి కల పూవు - తావిపూవు - చారలుకలపులి - చార్లపులి - పిల్లలుకలతల్లి - పిల్లలతల్లి - పిల్లలు కలపిల్లి - పిల్లలపిల్లి - తిక్కనరచించిన భారతం - తిక్కన భారతం - వేమన రచించినపద్యాలు - వేమనపద్యాలు - నార్లవారు రచించినపద్యాలు - నార్లవారి పద్యాలు - మొదలైనవి.

పూర్వపదార్థంలో ఉత్తరపదార్థ ధర్మారోపణం జరిగితే రూపక సమాసం. ౩౯

ఉత్తరపదార్థధర్మాన్ని పూర్వపదార్థంలో ఆరోపిస్తే దాన్ని రూపకసమాస మంటారు.

కౌనుమిన్ను - మోముచందురుడు - సంసారసాగరం - పండితద్వీపం, - మొదలైనవి.

పూర్వపదార్థం ఉత్తరపదార్థ భాగమైతే ఏకదేశిసమాసం. ౪౦

కాయంయొక్కపూర్వభాగం - పూర్వకాయం - కాయంయొక్కఉత్తర భాగం - ఉత్తరకాయం - కంటియొక్కఅరభాగం - అరగన్ను - కంటియొక్క క్రిందుభాగం - క్రీగన్ను - మేనుయొక్కసగభాగం - సామేను - చేయి యొక్కకొన భాగం - కొనచేయి - తలయొక్కపెడభాగం - పెడతల - మొదలైనవి ఊహ్యాలు.

అర్ధశబ్దాన్ని రేఫమీది అహ్నా సకారానికి ణకారం వస్తుంది. ౪౧

పూర్వాహ్ణం - అపరాహ్ణం - ఉత్తరాహ్ణం - మొదలైనవి - అర్ధశబ్దాన్ని మనదంచేత అర్ధాహ్నం అన్నప్పుడు ణత్వంరాదు.

రూఢినామాంతాల ఫలాదులమీద ఫలాద్యర్థక పదాలు
పునరుక్తా లౌతాయి. ౪౨

సీతాఫలప్పండు - రామాఫలప్పండు - రాయలచెరువుచెరువు - పెనుగొండ కొండ - మంగళగిరికొండ - మంగళగిరిపర్వతం - శ్రీశైలంకొండ - శ్రీశైల పర్వతం - సింహాచలంకొండ - మొదలైనవి.

నిత్యవ్యవహారంలో ఏకబహువచనాంతాలై ద్వంద్వా లనేకాలు
అర్థవిశేషాల్లో ప్రయుక్తా లవుతున్నాయి. ౪౩

కొన్నిచోట్ల ఏకార్థభావంపుండి - మరికొన్నిచోట్ల అర్థభేదంవుండి ద్వంద్వ సమాసాలు కొన్ని ఏకవచనాంతాలుగాను - మరికొన్ని బహువచనాంతాలుగాను - మరికొన్ని ఉభయాలుగాను పలురకాలుగా ప్రయోగించబడుతున్నాయనితాత్పర్యం.

అగ్గిబుగ్గి - అంటుసొంటు - అడపాడ - అడ్డందిడ్డం - అడ్డదిడ్డం - అందంచందం - అందచందం - అన్నెంపున్నెం-అన్నెపున్నెం - అప్పూసప్పూ - ఆహూఅలం - ఆటాపాటా - ఆస్తిపాస్తి - ఇంటావంటా - అంతోఇంతో - ఇల్లూవాకలి - ఉచ్చంనీచం - ఉత్తరంపత్తరం - ఉప్పూకారం - ఊరూవాడా - ఊరూపేరూ - ఊళ్లూపూళ్లూ - ఎక్కాతక్కా - ఎగుడుదిగుడు - కూరానారా - కారాలు మిరియాలు - కాయాకసరూ - మొదలైనవి.

తరచుగా అచ్ఛికంలో స్త్రీసమం ద్వంద్వ మవుతుంది, ౪౪

అన్నదమ్ములు - అక్కచెల్లెళ్లు - ఆలుమగలు - ఊరువాడలు - తల్లిదండ్రులు - మొదలైనవి. తరచుశబ్దంచేత అడ్డదిడ్డాలు అందచందాలు - ఉచ్చనీచాలు - జీతనాతాలు - వెచ్చనచ్చాలు - ఇత్యాది ము వర్ణాంతపదయుక్తాలు - అవసరమక్కరలు ఇత్యాది మిశ్రసమాసాలు గ్రాహ్యాలు.

సంఖ్యావాచక ద్వంద్వానికి ఏకత్వం నిత్యం. ౪౫

ఇరవైయొకటి - నలభైరెండు - అరవైనాలుగు - మొదలైనవి.

ద్వంద్వం అప్రాణివాచక కృదంతశబ్ద ఘటితం ఏకవచనాంతం
కూడా అవుతుంది. ౪౬

కూడుగుడ్డ - కూరగాయ - దరిదాపు - మొదలైనవి.

భావద్వంద్వంలో తొలిపదం మువర్ణాంత అడపర్ణకం
కొన్నిచోట్ల లోపిస్తున్నది. ౪౭

భోగాములు - చెల్లువెల్లములు.

ద్వంద్వంలో పూర్వపదాంత్యావయవానికి లోపం
వైకల్పికం. ౪౮

వచ్చేపోయేవాళ్లు - విన్నకన్నది - పక్షంలో వచ్చేవాళ్లు పోయేవాళ్లు - విన్నది కన్నది.

ద్వంద్వంలో ఋకారానికి రవర్ణం విభాషగా వస్తుంది. ౪౯

మాత్రపితలు - మాతాపితలు - మొదలైనవి.

జాయాపతిశబ్దాలు ద్వంద్వమైతే జాయా యావర్ణానికి బిందుపు
జాకు పర్యాయంగా దకారం జాదీర్ఘానికి హ్రస్వం
బహుళం. ౫౦

జాయాపతులు - జంపతులు - దంపతులు - యాకు బిందువువచ్చినప్పుడే జకారానికి పాక్షికంగా దకారం - బిందువురానప్పుడు బహుళగ్రహణంచేత దకార హ్రస్వాలురావు - బిందువువస్తే జా దీర్ఘానికి హ్రస్వం నిత్యం.

త్రిక స్త్రీసమ మువర్ణాంత ధాతుజవిశేషణాలు పూర్వంలో
కలది కర్మధారయం. ౫౧

ఆ విధం - ఈ విధం - ఏ విధం - వాడిమాట - పోడిమాట - సరసపు మాట - వచ్చేశాంతిసేన - మొదలైనవి.

అవ్యయమైన అట్లుతో ధాతుజవిశేషణాలు సమసించి కర్మ
ధారయ మవుతుంది. ౫౨

వాళ్లు చేసినట్లు - మేంచదివినట్లు - వారు వెళ్లినట్లు - మొదలైనవి.

ఆ ఈ ఏ శబ్దాలు సమాసఘటితమై కొన్నిచోట్ల సూచనార్థకా
లవుతాయి. ౫౩

ఆ వెళ్లిన వెంకటరావు - ఈ వచ్చిన నారాయణరావు - ఏ తెచ్చినవెంకట రావు - మొదలైనవి.

బిరుదాద్యుత్తర పదమైన కర్మధారయం సిద్ధసమాసం వంటిదే అవుతుంది. ౫౪

ఇలా అనడంచేత పూర్వపదంవిభక్తిలోపించి వికృతినిపొందదని తాత్పర్యం. కృష్ణరాయుడు - రామారావు.

బిరుదాది పదం పరమైతే కర్మధారయంలో స్త్రీ పుం సంజ్ఞా వాచకమైన ద్వ్యక్షరపదం తుది అత్వానికి దీర్ఘం బహుళం. ౫౫

రామాశాస్త్రి - సుబ్బాశాస్త్రి - రామానాయుడు - సుబ్బానాయుడు - రామారెడ్డి - కృష్ణారెడ్డి - సుబ్బారెడ్డి - ఎల్లాసెట్టి - వీరాసెట్టి - వీరాసామి - రామారాయుడు - సుబ్బారాయుడు - రామారావు - సుబ్బారావు - ఎఱ్ఱాప్రెగ్గడ - చిన్నాదేవి మొదలైనవి. బహుళగ్రహణంచేత రామరాయుడు - సుబ్బరాయుడు - ఎఱ్ఱప్రెగ్గడ - ఇత్యాదుల్లో వైకల్పికం - కృష్ణశాస్త్రి - నారాయణరావు - వెంకటరావు - మొదలైనవాటిల్లో దీర్ఘంలేదు.

బిరుదాదిపదం పరమైతే కర్మధారయంలో పూర్వపదం తుది అత్వానికి ఇత్వం బహుళం. ౫౬

సుబ్బినాయుడు - ఎల్లిసెట్టి - రామిసెట్టి - సుబ్బిసెట్టి - పెద్దిరాజు - పెద్దిభట్టు - చిక్కిరెడ్డి - బాహుళకంచేత సుబ్బిసెట్టి ఇత్యాదుల్లో ఇత్వం నిత్యం.

బిరుదాదిపదం పరమైతే పూర్వపదానికి అయ్యాదులు బహుళంగా అనుప్రయుక్తాలవుతాయి. ౫౭

నన్నయ్యభట్టు-తిక్కన్న సోమయాజి - కృష్ణమ్మనాయుడు. అక్కాటాదుల జడ్డకు ఇత్యాదిసూత్రంచేత ద్విత్వలోపంవస్తే నన్నయభట్టు - తిక్కనసోమయాజి - కృష్ణమనాయుడు - నన్నపార్యుడు - మొదలైనవి. బాహుళకంచేత నన్నపార్యుడు అన్నప్పుడు ద్విత్వలోపం నిత్యం. రామన్నసెట్టి - తిమ్మప్ప నాయుడు - కృష్ణమ్మ చౌదరి - మల్లయ్య పంతులు - రామనసెట్టి - తిమ్మప నాయుడు - కృష్ణమచౌదరి - మల్లయపంతులు.

రేఫ పరమైతే అసంయుక్త ట ర ల అత్వానికి లోపం బహుళం. ౫౮

వెంకటరావు - వెంకట్రావు - వెంకటరామయ్య - వెంకట్రామయ్య -

వెంకటేశ్వరరావు - వెంకటేశ్వ్రరావు - చంద్రశేఖరరావు - చంద్రశేఖ్రరావు - అసంయుక్తమనడంచేత రామచంద్రరావు వంటి చోట్ల అత్వలోపంరాదు - రామ చంద్రావు కాదని తాత్పర్యం.

రేఫ పరమైతే ఆతి స్వరానికైనా సైతం లోపం కొన్నిచోట్ల కనిపిస్తున్నది. ౯౯

శేషగిరిరావు - శేషగిర్రావు - నరహరిరావు - నరహర్రావు.

రేఫ పరమైతే చంద్రాదుల తుది అచ్చు సంయుక్త పూర్వ హల్ గతం పర్యాయంగా అవుతుంది. ౬౦

రామచంద్రరావు - రామచందర్రావు - ఉపేంద్రరావు - ఉపేందర్రావు - మొదలైనవి.

ణ బ ల అత్వాని కొకచోట రేఫ పరమైతే లోపం కని పిస్తున్నది. ౬౧

నారాయణ్రావు - నారాయణరావు - సుబ్రావు - సుబ్బారావు.

కర్మధారయంలో గుణవచనాలైన నల్లాదులకు నివర్ణాగమం బహుళం. ౬౨

నల్లని గుర్రం - నల్ల గుర్రం - మొదలైనవి. నల్ల- తెల్ల - పచ్చ - ఎర్ర - చామ - తియ్య - కమ్మ - పుల్ల - చిన్న - తిన్న - అల్ల - ఇత్యాదులు నల్లాదులు. బాహుళకంచేత ద్విత్వం లోపిస్తే నివర్ణంరాదు.

కర్మధారయంలో గుణవచనాలైన నల్లాదులుకి టివర్ణాగమం బహుళం. ౬౩

నల్లటిగుర్రం - నల్లగుర్రం - తెల్లటిమచ్చ - తెల్లమచ్చ - తెల్లటిపాలు - తెల్లపాలు - పచ్చటిరంగు - పచ్చరంగు - మొదలైనవి ఊహ్యాలు. ద్విత్వం లోపిస్తే బాహుళకంచేత టి వర్ణం రాదు.

సమాసంలో ద్విత్వరహితాలైన తెల్లాదుల తుది అత్వాని కిత్వం నిత్యం. ౬౪

తెలివెలుగు - వెలివెలుగు - పులినీరు-చలివెలుగు - మొదలైనవి ఊహ్యాలు.

ద్విరుక్తమైన హల్లు పరమైతే అచ్చికమైన దీర్ఘానికి హ్రస్వం బహుళంగా వస్తుంది. ౬౫

త్రికంమీది అసంయుక్త హల్లుకి ద్విత్వం బహుళం ౬౬

ఆకన్య - అక్కన్య - ఈకాలం - ఇక్కాలం - ఏలోకం - ఎల్లోకం - మొదలైనవి. బాహుళకంచేత అక్కడ - ఇక్కడ - ఎక్కడ ఇత్యాదుల్లో ద్విత్వం నిత్యం - బహుళగ్రహణంచేతనే శ - ష - స - హ - ర - లకు నాడు - నీరు - ప్రభృతుల నకారానికి ద్విత్వంరాదు. ఆశక్తి - అషరాయి - ఈసంబరం - ఏహద్దు - అరాత్రి - ఆనాడు - ఈనీరు - మొదలైనవి.

ద్విరుక్తాలైన మహాప్రాణాల తొలిహల్లుకి అల్పప్రాణం బహుళం. ౬౭

అధ్ధరణి - అద్ధరణి - పఝ్ఝుల - వజ్ఝుల - డెభ్భై - డెబ్భై - మొదలైనవి. బహుళగ్రహణంవల్ల లెఖ్ఖ - అఖ్ఖర్లేదు - వఠ్ఠిది - ఇత్యాదుల్లో తొలిహల్లుకి - అల్పప్రాణంరాదు. వఝ్ఝుల అనేది సంస్కృతపదమనీ అక్కడ "అనచిచ" అనే సంస్కృతవ్యాకరణ సూత్రంచేత పాక్షికంగా ద్విత్వం వచ్చిందనీ భావించి కొందరు దానికి రూపాంతరంగా వఝుల ద్విత్వరహితరూపాన్ని వ్రాస్తారు. అది నిరాకరం. ఉపాధ్యాయశబ్దానికి ప్రాకృతరూపం ఓఝా-తెలుగులో తుది దీర్ఘానికి హ్రస్వం ఝకారానికి ద్విత్వం తొలిదీర్ఘానికి హ్రస్వంవస్తే ఒఝ్ఝు. ఒద్ద - వొద్ద - వద్దల వచ్చే ఒఝ్ఝు ఒకారానికి పూర్వాన వకారాగమంవచ్చి తర్వాత ఒత్వానికి అత్వం వచ్చి వొఝ్ఝు - వఝ్ఝు - అవుతుంది - సంబంధషష్ఠి బహుత్వలవర్ణం వస్తే వఝ్ఝుల - వఝ్ఝులవారు - అని గ్రహించాలి.

మహాప్రాణం పరమైతే అల్పప్రాణానికి మహాప్రాణం విభాష. ౬౮

జగద్ధితం - జగధ్ధితం - పద్ధెనిమిది - పధ్ధెనిమిది - మొదలైనవి. ఇక్కడి అల్పప్రాణం పూర్వోక్తవిధిచేత మహాప్రాణానికి ఆదేశంగావచ్చిన అల్పప్రాణంరాదు.

ఖ ద్విత్వంలో తుది హల్లుకి కాదేశం వైకల్పికం. ౬౯

లెక్క - లెఖ్ఖ - లెఖ్క - అక్కర్లేదు - అఖ్ఖర్లేదు - అఖ్కర్లేదు - ఒక్కటి - ఒఖ్ఖటి - ఒఖ్కటి - దుఃఖం - దుఖ్ఖం - దుఖ్కం - ఇత్యాదులూహ్యాలు.

సప్తమీద్వితీయల్లో కృత హ్రస్వమైన త్రికం మీది చోటుశబ్దం ఓత్వానికి అత్వం నిత్యం. ౨౦

అచ్చట - ఇచ్చట - ఎచ్చట - అచ్చటనుంచి - ఇచ్చటనుంచి - ఎచ్చటనుంచి మొదలైనవి. అక్కటాదుల జడ్డకు ఇత్యాదివిధిచేత ద్విత్వలోపంవస్తే అచట - ఇచట - ఎచట - కృతహ్రస్వమైన త్రికంమీది అనడంచేత ఆచోటు - ఈచోటు - ఏచోటు - ఇత్యాదుల్లో ఓత్వానికి అత్వంరాదు.

త్రికాదులమీది కడశబ్దం కవర్ణానికి లోపం పూర్వహ్రస్వానికి దీర్ఘం బహుళం. ౨౧

ఆ - కడ - ఆడ - అక్కడ; ఈ - కడ - ఈడ - ఇక్కడ; ఏ - కడ - ఏడ - ఎక్కడ; ఆదిశబ్దంచేత పెందల + కడ - పెందలాడ, పెందలకడ; తల + కడ - తలాడ, తలగడ; ఇత్యాదులు గ్రాహ్యాలు.

సమాసంలో నామ్వాదుల ముపర్ణానికి ప వర్ణం బహుళం. ౨౨

నాపచేను - నాముచేను - పాపజాతి - పాముజాతి - పేపబెత్తం - పేముబెత్తం - మొదలైనవి. ముపర్ణానికి బిందువువస్తే నాంచేను - పాంజాతి - పేంబెత్తం - మొదలైనవి. నాము - పాము - ప్రేము - పేము - వేము - అమ్ము - దమ్ము - కనుము - ఇనుము - ఉడుము - ఎనుము - జనుము - మినుము - మొదలైనవి నామ్వాదులు. బాహుళకంచేత అమ్ము - దమ్ముల ముపర్ణానికి పవర్ణం వస్తే పూర్వమకారానికి బిందువు అన్యత్కార్యం - అంపపొది - అంపశయ్య - దంపనాగలి - దంపచేను - వేపచెట్టు - అన్నప్పుడు ప వర్ణం నిత్యం.

తమ్మికుర్ర లిత్యాదులు విశేష్య పూర్వపద కర్మధారయలు. ౨౩

తమ్మికుర్రలు - తమ్మిగుర్రలు - చిలుకమొకరి - మొదలైనవి.

ఆయీత్యాది ఘటితాలు విశేషణోభయపదకర్మధారయలు. ౨౪

ఆయీమాటలు - ఈయావూరు - ఎత్తినపెంచినవారు - పెట్టినతిట్టినవారు - ఉన్నలేనిదోషాలు - విన్నకన్నవన్నీచెప్పారు - పండితకవి - ఎత్తుపల్లం - మొదలైనవి.

విశేషణోభయపదాలు త్రిక క్రియాజన్య విశేషణఘటితాలు సందర్భయోగ్యపద వ్యవహితాలౌతాయి. ౭౫

ఈకళ్లు తెరవని కుర్రవెధవ యింతపని చేశావా ?

అలరుబోడి ఇత్యాదు లుపమాన పూర్వపదకర్మధారయాలు. ౭౬

అలరుబోడి - తియ్యబోడి - ననబోడి - విరిబోడి - ఇగురుబోడి - చిగురుబోడి - తలిరుబోడి - పూవుబోడి - పువ్వుబోడి - పువుబోడి - పూబోడి - ఇత్యాదులూహ్యాలు.

ఉపమాన పూర్వపద కర్మధారయంలో బోడి పకారానికి బకారం బహుళం. ౭౭

అలరుబోడి - ననబోడి - పూబోడి - విరిబోడి - మొదలైనవి.

ఆమ్రేడితమైన ఆత్వానికి యి వర్ణం విభాషగా అనుప్రయుక్త మౌతుంది. ౭౮

యి వర్ణం పరమైతే ఆమ్రేడితమైన ఆత్వానికి హ్రస్వం విభాష. ౭౯

ఆయాయికాలం - అయయికాలం - ఆయైకాలం - అయ్యాయికాలం - అయ్యయికాలం - అయ్యైకాలం - ఆయాకాలం - అయ్యాకాలం - అయక్కాలం - అయ్యక్కాలం - మొదలైనవి.

తచ్ఛబ్దార్థకంతో సర్వశబ్దాలు సంబంధార్థంలో సమసిస్తాయి. ౮౦

నా వాడు - మా వాళ్లు - నాది - ఇంటివాడు - ఇంటిది - మొదలైనవి.

విభక్తిని వివక్షిస్తే ధాతుజ విశేషణాలకు తచ్ఛబ్దార్థకం అనుప్రయుక్త మవుతుంది. ౮౧

వచ్చినవాడు - వచ్చినది - రానివాడు - రానిది - మొదలైనవి.

ధాతుజ విశేషణాల కన్నిచోట్ల అటువంటి అనే పదం విభాషగా అనుప్రయుక్త మవుతుంది. ౮౨

వచ్చినటువంటిబుద్ధుడు - వచ్చినబుద్ధుడు - వచ్చేటువంటి బుద్ధుడు - వచ్చేబుద్ధుడు - వచ్చుబుద్ధుడు - మొదలైనవి.

ధాతుజవిశేషణాలు కర్తతోలాగా ప్రాధాన్య వివక్ష వచ్చినపుడు కర్మాదులతో సమసిస్తాయి. ౮౩

బుద్ధుడు చేరదీసిన హింసాపరుడు - బుద్ధుడు నందుడికి చేసినధర్మబోధ - బుద్ధుడు ఆశ్రయ మిచ్చిన మనిషి - మహాత్ముడు వెళ్లినదేశం - మహాత్ము డున్న యిల్లు - మహాత్ము డున్నచోటు - మొదలైనవి.

సమానాధికరణమైన ఉత్తరపదం పరమైతే మూడుశబ్దం డువర్ణానికి లోపం మీది హల్లుకి ద్విత్వం బహుళం. ౮౪

మూడుజగాలు - ముజ్జగాలు - మూడులోకాలు - ముల్లోకాలు - ముయ్యేళ్ల సార్లు - మూడేళ్లసార్లు - ముయ్యార్లు - మూడార్లు - మొదలైనవి.

అమిశ్రంలో ద్విగువు కేకవచనం తరచుగా వస్తుంది. ౮౫

ముక్కారు - ముప్పాతిక - ముక్కారులు - ముప్విధాలు - మొదలైనవి.

అద్విరుక్తాలైన తడవాదులు ప్రాయికంగా సంఖ్యాపూర్వకాలౌతాయి. ౮౬

ఒకతడవ - రెండుతడవలు - మొదలైనవి. తడవ - తూరి - తేప - సారి - మారు ఇత్యాదులు తడవాదులు.

అవికృతమైన పదికి పరమైన ఒకటికి కొండు ఆదేశం నిత్యం ౮౭

పదకొండు - నూటపదకొండు - పది వికారంచెందితే కొండు ఆదేశంరాదు. ఇరవైయొకటి - ముప్పైయొకటి.

ఒకటి ప్రభృతులు పరమైతే పది ఇత్వాని కత్వం బహుళం. ౮౮

పదకొండు - పదకొండుగురు - పదమూడు - పదముగ్గురు - పదహారు - బహుళశబ్దంచేత పదిహేను - పదిహేడు అన్నప్పుడు ఇత్వానికి అత్వంరాదు.

రెండుపరమైతే పది దివర్ణానికి బిందుపూర్వక డకారం
వైకల్పికం. ౮౯

పండ్రెండు.

రెండు పరమైతే పది ఇత్వానికి లోపం ద ర లకు ద్విత్వనకారం
వస్తుంది. ౯౦

పది - రెండు - పన్నెండు - పండ్రెండు.

పన్నెండు ఎత్వానికి ఇత్వం వైకల్పికం. ౯౧

పన్నిండు.

ఇరు శబ్దం పరమైతే పది దివర్ణానికి ద్విత్వనకారం కొన్నిచోట్ల
కనిపిస్తున్నది. ౯౨

పన్నిరుగురు - పన్నిరువురు - పన్నిద్దరు.

పది పూర్వకాలైన సంఖ్యావాచకాల ఆద్యచ్చుకి పూర్వంలో
హకారాగమం బహుళం. ౯౩

పదిహేను - పదహారు - పదిహేడు.

ఐదుకి ఏనాదేశం బహుళం. ౯౪

అవికృతమైన పదికి పరమైన ఐదుకి ఏను ఆదేశం నిత్యం అని అర్థం
వికృతత్వం పొందితే పదికి పరమైన ఐదుకి ఏనాదేశం బాహుళకంచేత రాదు.
పదిహేను - నూటపదిహేను - ఇరవైఐదు - ముప్ఫైయైదు - మొదలైనవి.

పది పరమైతే ఐదుకి ఏనాదేశం నిత్యం. ౯౫

ఏభై - ఏభైయొకటి - ఏభైరెండు - యాభై - యాభై యొకటి - యాభై
వొకటి - యాభై రెండు - నూటయాభైరెండు - మొదలైనవి.

నాలుగు ఎనిమిదులు పరమైతే పది ఇత్వానికి లోపం
నిత్యం. ౯౬

నాలుగు పరమైతే పది పకారానికి పదికి పరమైన ఎనిమిది హకారానికి ధకారం నిత్యం. ౯౭

పధ్నాలుగు - పద్దెనిమిది - ఒకానొకచోట ఊష్మకారానికి దకారం కనిపిస్తున్నది. పద్నాలుగు - పద్దెనిమిది.

పందొమ్మిది పంధొమ్మిది. ౯౮

ఈసూత్రంచేత పందొమ్మిది ప్రథమ దకారానికి ధకారం పాక్షికంగా నిషేధించబడింది.

పది పరమైతే ఇరు నాలుగు ఆరు ఎనుల ఉత్వ ఇత్వాలకు అత్వం బహుళంగా వస్తుంది. ౯౯

ఇరవై - నలభై - అరవై - ఎనభై.

వికృతమైన పది పరమైతే ఇరు అరుల ఉత్వానికి లోపం విభాష. ౧౦౦

ఇర్వై - అర్వై - ఇరవై - అరవై - అవికృతమైన పదిపరమైతే ఇరువది - అరువది.

సంఖ్యావాచకాలకు పరమైన పది పకారానికి యకారం బహుళం. ౧౦౧

ప్రథమమీది క త ప లకు గ డ బ లిత్యాది సూత్రంచేత ఇరు అరు నలుల మీది పది పకారానికి వకారం నిత్యం - ఇరవయి - అరవయి - ముప్పయి - నలభయి - యాభయి - డెబ్బయి - ఎనభయి - తొంభయి. వక్ష్యమాణవిధిచేత అయికి పాక్షికంగా వక్రతమంవస్తే ఇరవై - అరవై - ముప్పై - నలభై - యాభై - డెబ్బై - ఎనభై - తొంభై - యకారం రానిపక్షంలో ఇరువది - అరువది - నలువది - మొదలైనవి.

పది పరమైతే అరు నాలుగుల దీర్ఘానికి హ్రస్వం వస్తుంది. ౧౦౨

అరవై - నలభై.

పది పరమైతే ఏను తొమ్ముల నుమ్ములకు లోప బిందువులు వస్తాయి. ౧౦౩

ను వర్ణానికి లోపం - మ్మ వర్ణానికి బిందువు వస్తుందని గ్రహించాలి. యాభై - తొంభై.

పది పరమైతే ఏడుకు వర్ణవ్యత్యయం నిత్యం. ౧౦౪

వర్ణవ్యత్యయమంటే అక్షరాలు తారుమారవ్వటం. డెబ్బై.

సంఖ్యావాచకాలకు పరమైన పది పకారానికి ఫకారం బహుళం. ౧౦౫

ముప్పై - ముఫ్ఫై - నలభై - యాభై - ఎనభై - మొదలైనవి. బాహుళకంచేత నూటపది - ఇరవై - అరవై - మొదలైనచోట్ల ఫకారం రాదు.

పది వాదేశమైన ఫకారానికి ఫ్ఫ భలు బహుళంగా వస్తాయి. ౧౦౬

నలఫై - నలఫ్ఫై - నలభై - యాఫై - యాఫ్ఫై - యాభై - ఎనఫై - ఎనఫ్ఫై - ఎనభై - మొదలైనవి. బాహుళకంచేత డెబ్భై - తొంభైలకు ఫ్ఫకారాదేశంరాదు. ముప్పై అన్నప్పుడు ఫకారానికి ఫ్ఫ భ లు రావు - ఫకారం ఫ్ఫకారాలు రాకపోతే కొన్నిటికి పకారరూపాలు కనిపిస్తున్నాయి.

ఫాదేశమైన భకారానికి బకారం వైకల్పికం. ౧౦౭

నలభై - నలబై - యాభై - యాబై - డెబ్భై - డెబ్బై - ఎనభై - ఎనబై - తొంభై - తొంబై.

బహువ్రీహి తరచుగా స్త్రీసమశుఃటితమై కనిపిస్తున్నది. ౧౦౮

ముక్కంటి - చలివెలుగు - వేవెలుగు - వేగంటి - మోటుబరి - మొదలైనవి - తరచుగా అనడంచేత కరకంఠుడు ఇత్యాదులు రక్షితాలయ్యాయి.

కరకంఠుడు మిశ్ర బహువ్రీహి. ౧౦౯

కరకంటుడు టకారయుక్తమని ఒకరుపేర్కొన్నారు. ప్రాచీన లక్షణ లక్ష్య విరుద్ధమూ, వ్యావహారిక విరుద్ధమూ అయినందువల్ల అది నిరాకరం.

బహువ్రీహిలో సమాసాంత కార్యాలు కనిపిస్తున్నాయి. ౧౧౦

ముక్కంటి - నలువ - పూవిల్తుడు - మొదలైనవి.

నిక్కలాదులు వ్యవహారానుగుణంగా గ్రాహ్యాలు. ౧౧౧

నిండు - కల - నిక్కల; నిజము - కల - నిక్కల; కవ - వడి - కవ్వడి; పువు - విలుకాడు - పువ్విలుకాడు - మొదలైనవి ఊహ్యాలు.

కొన్నిచోట్ల సమాసగత పూర్వపదం వ్యవహితోత్తర పదాలతో అన్వయిస్తుంది. ౧౧౨

వాడి కత్తి విరిగి ముక్క కింపడింది. ఒక్కొక్క పళ్లెం గ్లాసు చెంబు యిచ్చారు - పరుల ధనానికి విద్యకు కీర్తికి మేధాశక్తికి ఈర్ష్య పడేవాడు బాగుపడడు.

సమాసంలో విభక్తికి లోపం బహుళం. ౧౧౩

ఇది లుక్సమాసవిషయం - బహుళగ్రహణంచేత ప్రత్యయంపరమైన ప్రథమకు లోపంలేదు. బుద్ధునిబోధలు - బుద్ధుడిబోధలు - బుద్ధుడుబోధలు - సుబ్బారాయుడిషష్ఠి - సుబ్బారాయుడుషష్ఠి - కర్మధారయంలో ము వర్ణం లోపించదు. మిశ్రద్వంద్వంలో ఒకచోట ము వర్ణానికి లోపం కనిపించడంలేదు. అవసర మక్కరలు - కొన్నిచోట్లలోపం - అందచందాలు - వెచ్చసచ్చములు - ఇత్యాదులు - సరసపు పలుకులు - ఇత్యాదుల్లో ము వర్ణంమీది ప్రథమాబహువచనానికి ఈసూత్రంచేతనే లోపం.

అచ్చికసమాసాల్లో వర్ణలోపాగమాదేశాదులు బహుళంగా కనిపిస్తున్నాయి. ౧౧౪

ఇరు + పంది - ఇబ్బంది - ఉద్ద + దరి - ఉద్దరి - ఎడమ + పంక - ఎడవంక - వలమ + వంక - వలవంక - ఎగువ + దల - ఎగుదల - దిగువ + దల - దిగుదల - చిత్తరువు + బొమ్మ - చిత్తరుబొమ్మ - తెగువ + దారి - తెగుదారి - దొంతి + తరగ - దొంతర - పసిమి + పట్టు - పసిపట్టు - బాపు + పురె - బాపురె - పెద్ద + పులి - బెబ్బులి - బొంత + దళం - బొందళం - ఇత్యాదులు మహాజనవ్యవహారంలోంచి గ్రహించాలి.

అట్లు వలె ప్రభృతులు పోలికను తెలిపేవి. ౧౧౫

ప్రభృతిశబ్దంచేత లాగ - లాగా - లాగు - పోలె - ఓలె - పోలె మొదలైనవి గ్రాహ్యాలు.

ఉపమేయం ప్రథమాంతమైనప్పు డట్లు ప్రభృతులు పరమైతే ఉపమానార్థైన ఆ – నా – నీ – తా శబ్దాలకు నామవాచకాలకు నిత్య వైకల్పికంగా షష్ఠి వస్తుంది. ౧౧౬

వాడియట్లు - వాడిలాగా - వాడివలె - వాడిపోలె - నాయట్లు - నాలాగ - నావలె - నాపోలె - నీయట్లు - నీలాగ - నీవలె - నీపోలె - తనయట్లు - తన

లాగ - తనవలె - తనవోలె - మొదలైనవి. నామవాచకాలకు - బుద్ధుడులాగా - బుద్ధునిలాగా - బుద్ధుడువోలె - బుద్ధుడివోలె - బుద్ధునివోలె - మొదలైనవి. ఆశబ్దం ఈ ఏ లకు ఉపలక్షణం - ఇలాగే ముందుసూత్రాల్లోకూడా గ్రహించాలి.

ఉపమేయం ప్రథమాంతమైనప్పుడు అట్లు ప్రభుతులు పరమైతే ఉపమానాలైన నామవాచకాలకు ప్రథమ బహుళంగా వస్తుంది. ౧౧౭

బుద్ధుడట్లు - బుద్ధుడులాగ - బుద్ధుడువలె - బుద్ధుడువోలె - బుద్ధుడుపోలె - మొదలైనవి.

ఉపమేయం ద్వితీయాద్యంతమైనప్పుడు అట్లు ప్రభృతులు పరమైతే ఉపమేయ విభక్తులే ఉపమానవాచకాల కవుతాయి. ౧౧౮

శాంతికాముకుల్నిలాగా మమ్ముల్నిపూజించారు - బుద్ధునితోలాగా మహాత్మునితో నడిస్తే మంచిదే - బుద్ధుడికివలే మహాత్ముడికి గొప్పగొప్ప శక్తులున్నాయి - మొదలైనవి.

కొన్నిచోట్ల ఉపమానా లనేకం వుంటే అట్లు ప్రభృతులు తుది దాని కొకదాని కొకటై కనిపిస్తున్నవి. ౧౧౯

వాళ్లు: వీళ్లులాగ - అల్లరి చిల్లరి వాళ్లవలె - మొదలైనవి.

తుమున్నంత క్రియలకు — ప్రథమాది విభక్త్యంత నామాలకు పరమైన వలెప్రభృతులు కొన్నిచోట్ల ఉత్ప్రేక్షాద్యోతకా లౌతాయి. ౧౨౦

ధర్మచక్రంవలె - ధర్మచక్రమో అన్నట్లు - విమానంలాగా యెగిరింది - విమానమో అన్నట్లు ఎగిరింది - ఇత్యాదులూహ్యాలు.

కొన్నిచోట్ల ప్రథమాది విభక్త్యంత నామాల కనుప్రయుక్తాలైన వలె ప్రభృతులు తథార్థకా లౌతాయి. ౧౨౧

ఇప్పుల్లాగా - ఇప్పటివిధంగా - మునుపటివలె - మునుపటివిధంగా - మొదలైనవి గ్రాహ్యాలు.

అట్టి వంటి బోటి మోస్తరు ప్రభృతులు మాదిరి
అరకాలు. ౧౨౨

అట్టిప్రభృతుల యోగంలో అ – నా – నీ – తా శబ్దాలకు
నామవాచకాలకు నిత్యవైకల్పికంగా షష్ఠి వస్తుంది. ౧౨౩

వానియట్టి - నాయట్టి - నీయట్టి - తనయట్టి - వానివంటి - నావంటి - నీవంటి - తనవంటి - వాడిబోటి - నాబోటి - నీబోటి - తనబోటి - వాడిమోస్తరు - నామోస్తరు - నీమోస్తరు - తనమోస్తరు - వాడిమాదిరి - నామాదిరి - నీమాదిరి - తనమాదిరి - బుద్ధుడివంటి - బుద్ధుడిబోటి - బుద్ధుడిమోస్తరు - బుద్ధుడిమాదిరి - మొదలైనవి. నామవాచకాలకు అట్టి ప్రయోగం వ్యవహారంలో లేదు.

వంటి ప్రభృతుల యోగంలో నామవాచకాలకు ప్రథమ
బహుళంగా వస్తుంది. ౧౨౪

బుద్ధుడువంటి - బుద్ధుడివంటి - బుద్ధునివంటి - బుద్ధుడుబోటి - బుద్ధుడిబోటి - బుద్ధునిబోటి - బుద్ధుడుమోస్తరు - బుద్ధుడిమోస్తరు - బుద్ధునిమోస్తరు - మొదలైనవి - ఈకార్యం అశబ్దానికిసైతం కనిపిస్తున్నది. వాడువంటి - వాడుబోటి - వాడుమోస్తరు - మొదలైనవి.

దేశభాషాస్వభావ అనుగుణాలైె సంస్కృతశబ్దకాసక అనుక్త
సమాస విశేషప్రయోగాలు ప్రయోగార్హాలు. ౧౨౫

స్వర్గీయాదుల కనుప్రయుక్తమైన అగుధాతువుకి లోపం
వైకల్పికం. ౧౨౬

స్వర్గీయులైన గిడుగు రామమూర్తిగారు - స్వర్గీయులు గిడుగు రామమూర్తిగారు - స్వర్గీయ - వంగీయ - నాటకీయ - ఇత్యాదు లాదిశబ్దగ్రాహ్యాలు.

స్వర్గీయాదుల కనుప్రయుక్తమైన అగుధాతువు లోపిస్తే విభక్తి
ప్రత్యయాదులకు లోపం వైకల్పికం. ౧౨౭

స్వర్గీయ గిడుగు రామమూర్తిగారు - స్వర్గీయులు గిడుగు రామమూర్తిగారు - ఆదిశబ్దంచేత ఉత్వలోపం.

దేశ శబ్దం పరమైతే భరత శబ్దం తొలి హ్రస్వానికి దీర్ఘం వైకల్పికం. ౧౨౮

భారతదేశం - భరతదేశం.

కర్మధారయాల మీద మత్వర్థకంకూడా వస్తుంది. ౧౨౯

దీర్ఘాయుష్మంతుడు - సుందరరూపి - సురూపి - నిగర్వి - శతావధాని - మొదలైనవి.

న్యస్తాక్షరాదుల తుది అత్వానికి ఇత్వం వైకల్పికం. ౧౩౦

న్యస్తాక్షరం - న్యస్తాక్షరి - వ్యస్తాక్షరం - వ్యస్తాక్షరి - నిషిద్ధాక్షరం - నిషిద్ధాక్షరి - దత్తాక్షరం - దత్తాక్షరి - దత్తపదం - దత్తపది - మొదలైనవి.

స్త్రీ వివక్షలో సమాసోత్తరపదమైన పతి శబ్దం ఇత్వానికి పూర్వంలో నకారాగమం నిత్యం. ౧౩౧

గృహపత్ని - దృఢపత్ని - అపత్ని - మొదలైనవి. గృహపతి - దృఢపతి వంటి నకారరహితరూపాలు స్త్రీ వివక్షలో సంస్కృతంలో వున్నాయి - ఇటువంటివి ఆంధ్రభాషావ్యవహారంలో అప్రసిద్ధాలు.

నాథాదులు పరమైతే రతిశబ్ద ఇత్వానికి దీర్ఘం వైకల్పికం. ౧౩౨

రతినాథుడు - రతీనాథుడు - రతిమన్మథులు - రతీమన్మథులు - మొదలైనవి.

పటల శబ్దం పరమైతే భస్మ శబ్దం తుది అత్వానికి ఈత్వం విభాషగా వస్తుంది. ౧౩౩

భస్మపటలం - భస్మీపటలం.

వ్యస్తంలో సహాశబ్దం విభక్తిమీద ప్రయోగయోగ్యం. ౧౩౪

పరివారంతోసహా - కుటుంబంతోసహా - దాన్నిసహా - వారిచేతసహా - మొదలైనవి - సమస్తమైతే సకుటుంబంగా - సపరివారంగా - మొదలైనవి.

సహా శబ్దం తుది అత్వానికి దీర్ఘం వైకల్పికం. ౧౩౫

పరివారంతోసహా - కుటుంబంతోసహా - దాన్నిసహా - వారిచేతసహా - మొదలైనవి.

వీప్సలో సర్వత్ర పూర్వాన ప్రతి ప్రయోగం బహుళం. ౧౩౬

ప్రతిగృహానికి - ప్రతిసతికీ - ప్రతిహింసకూ - మొదలైనవి - సర్వత్ర అనడంచేత తెలుగుపదాలకు పూర్వంలోసైతం ప్రతి ప్రయోగయోగ్య మవుతుంది- ప్రతియింటికి - ప్రతివాడికి - ప్రతిదానికి - మొదలైనవి - ప్రతి రానిపక్షంలో పూర్వోక్తవిధిచేత వీప్సలో ద్విరుక్తివస్తే - గృహానికి గృహానికి - గృహ గృహానికి - ఇత్యాదులూహ్యాలు.

ప్రతి తుది ఇత్వానికి దీర్ఘం వైకల్పికం. ౧౩౭

ప్రతివాడికి - ప్రతీవాడికి - ప్రతిదానికి - ప్రతీదానికి - ప్రతిగృహానికి - ప్రతీగృహానికి - మొదలైనవి.

వీప్సలో మహన్మహత్యర్థక తచ్ఛబ్దాదులకు ద్విరుక్తి రాదు. ౧౩౮

ప్రతివాడికి - ప్రతీఆమెకు - అని ప్రతిప్రయోగం చెయ్యాలేగాని వీప్సలో దిరుక్తప్రయోగం చెయ్యరాదని తాత్పర్యం - వీప్సలో అనడంచేత అర్థవిశేషంలో ద్విరుక్తి రావచ్చునని తాత్పర్యం - వాడికి వాడికి యిచ్చి కాళ్లారజాపుకుని కూర్చున్నాడు - ఆమెకు ఆమెకు పెట్టి నోరువెళ్లబెట్టింది - ఇత్యాదులూహ్యాలు.

కీక శబ్దం గాఢార్థంలో అరణ్యాదులకు పూర్వ ప్రయోజ్యం. ౧౩౯

కీకారణ్యం - కీకాటవి.

కాష్ఠగోష్ఠులు పరమైతే పరఇష్టల తుది అత్వానికి దీర్ఘం వస్తుంది. ౧౪౦

పరాకాష్ఠ - ఇష్టాగోష్ఠి.

మతల్లికాదులు స్త్రీ మాత్రపరాలు. ౧౪౧

కాంతామతల్లిక - కాంతామచర్చిక - మొదలైనవి.

సమాసంలో భ్రూశబ్దానికి హ్రస్వం కొన్నిచోట్ల వైకల్పికంగా కనిపిస్తున్నది. ౧౪౨

భ్రూకుటి - భ్రుకుటి - భ్రూకుంసుడు - భ్రుకుంసుడు - ఇత్యాదులు.

భిన్నశబ్దం పరమైతే ఛిన్నశబ్దం తుది అత్వానికి దీర్ఘం వస్తుంది. ౧౪౩

ఛిన్నాభిన్నం.

కర్మధారయాదుల్లో ఉత్తరపదం పరమైతే మహత్ శబ్ద తకారానికి అకారం బహుళం. ౧౪౪

మహాకవి - మహాపండితుడు - మహారాజు - బాహుళకంచేత అజాదిపదం పరమైతే తకారానికి ఆత్వం వైకల్పికం - మహానందం - మహదానందం - మొదలైనవి.

నిందార్థంలోనే బ్రాహ్మణాదులకు మహత్ పదప్రయోగం. ౧౪౫

మహాబ్రాహ్మణుడు - మహావైద్యుడు - మొదలైనవాటిల్లో మహచ్ఛబ్దం ఉత్కృష్టార్థకం కాదనడం. లోకంలో కొన్ని సందర్భాల్లో నిందార్థంలోకూడా మహచ్ఛబ్దప్రయోగం ప్రతిపదానికీ కనిపిస్తున్నది. మహాపండితుడు - మహాధైర్యశాలి - మొదలైనవి. ఆ! మహాపండితుడు వచ్చాడండి! - ఓహోహో! యెంత గొప్ప ధైర్యశాలండి! ఇత్యాదులు వ్యవహారప్రయోగాలు.

అల్పార్థంలో గ్రామశబ్దానికి పూర్వంలో కు శబ్దం ప్రయుక్తమౌతుంది. ౧౪౬

కుగ్రామం - చిన్నగ్రామం అని అర్థం.

శతజన్మాదులకు వ్యస్త ప్రయోగం లేదు. ౧౪౭

శతజన్మలు - నవబ్రాహ్మణులు - మొదలైనవి. వీటికి సమస్తంగానే ప్రయోగమని తాత్పర్యం.

దివాదులకు గత శబ్దం పరమైతే బిందువు ఆగమంగా వస్తుంది. ౧౪౮

దివంగతుడు - పారంగతుడు - వశంగతుడు - మొదలైనవి.

కరశబ్దం పరమైతే తీర్థశబ్దానికి బింద్వాగమం వైకల్పికం ౧౪౯

తీర్థకరుడు - తీర్థంకరుడు.

కార పరమైతే బలశబ్దంతుది అత్వానికి తకారాంతమైన
అత్వం వస్తుంది. ౧౫౦

అత్వానికి అత్ అనేది ఆదేశమౌతుందని తాత్పర్యం - బలాత్కారం.

విరుడును వివక్షిస్తుంటే ప్రియశబ్దం పరంలోకల దేవ శబ్దం
తుది అత్వానికి గౌరవార్థంలో ఆనాం వస్తుంది. ౧౫౧

దేవానాంప్రియుడు - అనగా అశోకుడు.

కంఠేకాలాదుల ఏత్వానికి అత్వంవైకల్పికం. ౧౫౨

కంఠేకాలుడు - కంఠకాలుడు - అపాంగేనేత్రం - అపాంగనేత్రం - ఇత్యాదులూహ్యాలు.

అవ్యయ నశబ్ద యుక్త నఞ్ సమాసాలు అనాద్యాదులు. ౧౫౩

న + ఆది = నాది - న + నాది = అనాది - అనాది అంటే ఆది అని అర్థం - అనాదినుంచి అనగా ఆదినుంచి అని అర్థం-ఇలాగే న + ఏకం - నైకం- న + ఏకాంతం - నైకాంతం - మొదలైనవి గ్రాహ్యాలు.

కాలశబ్దం పరమైతే వేసవి వాన శబ్దాల సంధుల అత్వానికి
దీర్ఘం బహుళం. ౧౫౪

. వేసాకాలం - వేసవికాలం - వానాకాలం - బహుళగ్రహణంచేత వేసవి విసర్గలోపపక్షంలో దీర్ఘంనిత్యం - విసర్గలోపంరాకపోతే దీర్ఘంరాదు.

కాలశబ్దం పరమైతే వేసవి విసర్గానికి లోపం వైకల్పికం. ౧౫౫
మర్యాదాస్థ దాదీర్ఘానికి హ్రస్వం నిత్యం ౧౫౬

మర్యాదస్థుడు.

స్థ శబ్దం పరమైతే మర్యాద రేఫకు పరంలో ఇత్వాగమం
వైకల్పికం ౧౫౭

మర్యాదస్థుడు - మరియాదస్థుడు.

పుష్పాది శబ్దాలు పరమైతే సుగంధి ఇత్వానికి అత్వం వైకల్పికం. ౧౫౮

సుగంధిపుష్పం - సుగంధపుష్పం - సుగంధిద్రవ్యం - సుగంధద్రవ్యం - మొదలైనవి.

నామశబ్దానికి మత్వర్థంలో కప్రత్యయం వస్తుంది. ౧౫౯

నామకుడు - అనామకుడు - అనామకుడంటే ఊరూపేరూ లేనివాడనిఅర్థం.

అనర్థక క ప్రత్యయానికి లోపం వైకల్పికం. ౧౬౦

అనర్థకం - అనర్థం - నువ్వుఏపనిచేసినా అనర్థమౌతోంది - ఇత్యాదులు వ్యావహారికాలు.

అనిష్టం అరిష్టం. ౧౬౧

అనిష్టశబ్దం అరిష్టశబ్దార్థకంకూడా అవుతుందని తాత్పర్యం.

మిత్రశ్రీ ప్రభృతుల కప్రత్యయానికి లోపం తరచుగా వస్తుంది. ౧౬౨

మిత్రశ్రీ రామచంద్రగారికి - బ్రహ్మశ్రీ వెంకటేశ్వర్రావుగారికి - తరచుగా అనడంచేత మిత్రశ్రీకులు బ్రహ్మశ్రీకులు అని కూడా ప్రయోగించవచ్చని తాత్పర్యం.

నీచార్థంలో సాంగశబ్దం గ్రంథశబ్దానికి పరమై సమసిస్తుంది. ౧౬౩

గ్రంథసాంగుడు - గ్రంథకర్తృ శబ్దానికిసైతం కొన్నిచోట్ల నీచార్థం కనిపిస్తున్నది. వాడూ గ్రంథకర్త అయ్యాడురోయ్ - ఇత్యాదులు వ్యావహారికాలు.

వ్యాపార వినిమయంలో పూర్వపద ముష్టి ఈత్వానికి ఆత్వం వైకల్పికం. ౧౬౪

ముష్టీముష్టి - ముష్టాముష్టి.

వ్యాపార వినిమయ అభావంలో సైతం పూర్వపరకర్త్రాది
పదాంతాలకు అత్వ ఇత్వా లౌతాయి. ౧౬౫

పూర్వంలో ప్రయోగించబడిన కర్త్రాదుల తుదిని అత్వం - పరంలో ప్రయోగించబడ్డ కర్త్రాదుల తుదిని ఇత్వంచేరుతుందని తాత్పర్యం.

కర్త్రాకర్త్రిగా - ముఖాముఖి - మొదలైనవి. ఈకార్యం హోరాహోరి - ఎకాఎకి - అన్నప్పుడు కనిపిస్తున్నది.

గోత్రాదులు పరమైతే సమానశబ్దానికి సాదేశం బహుళం. ౧౬౬
స - ఆదేశం - సాదేశం.

సమానగోత్రికుడు - సగోత్రికుడు - సమానపక్షం - సపక్షం - సమానజాతీయం - సజాతీయం - సమానవర్ణుడు - సవర్ణుడు - సమానరూపం - సరూపం - సమానధర్ముడు - సధర్ముడు - మొదలైనవి. బాహుళకంచేత మాన శబ్దం పరమైతే సాదేశం నిత్యం - సమానుడు.

ఇతరాలు సంస్కృతాంధ్ర సమాస విశేషాలు శిష్టజన వ్యవహారవేద్యాలు. ౧౬౭

సమాసపరిచ్ఛేదం

---

# వ్యావహారికభాషా వ్యాకరణం

## తద్ధిత పరిచ్ఛేదం

భావాద్యర్థాల్లో విశేష్య విశేషణాలకు చేరే ప్రత్యయాలు తద్ధిత ప్రత్యయాలు. ౧

తద్ధితప్రత్యయాలు పరమైతే విభక్తి ప్రత్యయాలకు లోపం బహుళం. ౨

బహుళగ్రహణంవల్ల రాముడుతనం - రాముడితనం - ఇత్యాదుల్లో డువర్ణం మీది షష్ఠ్యర్థకప్రత్యయం లోపించింది కాబట్టి డువర్ణంలోపించదు - ప్రత్యయం మీద ప్రత్యయాలున్నప్పుడు పరప్రత్యయాలకేగాని పూర్వప్రత్యయాలకు లోపం రాదు.

భావంలో తన వర్ణకం వస్తుంది. ౩

రాముడుతనం - రాముడితనం - రామునితనం - మనుమడుతనం - మనుమడితనం - మనుమనితనం - మనవడుతనం - మనవడితనం - మనవనితనం- సీతతనం - గొప్పతనం - నల్లదనం - పుల్లదనం - చిన్నతనం మొదలైనవి.

చిన్నాదులకు అరికవర్ణకం కూడా వస్తుంది. ౪

చిన్నరికం - కన్నెరికం - చుట్టరికం - దొంగరికం - పేదరికం - లంజెరికం - లంజరికం - తొత్తరికం - చిన్న, కుఱ్ఱమొదలైనవాటికి తనవర్ణకమే అర్థవంతంగా ఉన్నది. చిన్నతనం - కుఱ్ఱతనం - అరికవర్ణకం రానిపక్షంలో తన వర్ణకం అన్నిటికీ వస్తుంది. చుట్టం పదానికి తనవర్ణకం చేరదు. చుట్టరికం అనే గాని చుట్టపుదనం అని వ్యవహారం కనపడదు.

పేర్వాదులకు ఇమి వర్ణకం కూడా వస్తుంది. ౫

పేరిమి - కడిమి - చెలిమి - పోడిమి - వాడిమి - వేడిమి - మొదలైనవి. పక్షంలో తనవర్ణకం కొన్నిటికి వస్తుంది - ముచ్చదనం - చెలితనం-వాడితనం - మొదలైనవి.

గుణవాచకాలైన నల్లాదులకు నవర్ణం కూడా వస్తుంది. ౬

నల్లన - తెల్లన - పచ్చన - వెచ్చన - ఎఱ్ఱన - చామన - తియ్యన - కమ్మన - పుల్లన - చప్పన - తిన్నన - పక్షంలో తన వర్ణకం - నల్లదనం - పుల్లదనం - చామ శబ్దానికి తనవర్ణకం చేరదు.

ద్విత్వరహితాలైన నల్లాదులకు నవర్ణం రాదు. ౭

ద్విత్వరహితాలైన తెల్లాదులకి కొన్నిటికి పూర్వోక్తవిధిచేత తద్ధితవృత్తిలో సైతం ఇత్వం వస్తుంది. వృత్తి అంటే సమాసం - తెలితనం - వెలితనం.

అగ్గలాదులకు ఇక వర్ణకం కూడా వస్తుంది. ౮

అగ్గలిక - ఒమ్మిక - పక్షంలో తనవర్ణకం.

యథావ్యవహారంగా మగటిమ్యాదులు గ్రాహ్యాలు. ౯

మగటిమి - పేదరిమి - ఒజ్జనం - కోటరం - కోడంట్రం - కోడంట్రికం - కోడరికం - కోమలికం - చెలికారం - తెలుపు - ఎరుపు - పసుపు - నలుపు.

తనవర్ణకం పరమైతే పూర్వపదాంత్య తచ్ఛబ్దార్ధానికి లోపం వైకల్పికం. ౧౦

ఓర్వలేనితనం - ఓర్వలేనివాడితనం.

స్వార్థంలో అరమరాదులకు ఇక వర్ణకం వస్తుంది. ౧౧

అరమరిక - ఆమిక - అల్లిబిల్లిక - నడవడిక - నివ్వాళిక - పూనిక - మెలిక - వాలిక.

అరమర మీది ఇకకు లోపం వైకల్పికం. ౧౨

అరమరం - అరమరిక.

అరమర అటమటలకు స్వార్థంలో అప్రత్యయం వైకల్పికంగా వస్తుంది. ౧౩

అరమర - అటమట.

చిరుతాదులకు స్వార్థంలో ఉకవర్ణకం వస్తుంది. ౧౪

చిరుతుక - నాతుక - నెలతుక. చిరుత - నాతి - నెలత - మెలత -

పడతి - పొలతి - వెలది - నిప్పు - ఎమ్ము - ఉకవర్ణకంచేరితే ఎమ్ము మద్విత్వ లోపం విభాషగా అవుతుంది - ఎమ్ముక - ఎముక.

ఆటాదులకు పుంలింగ స్త్రీలింగాల్లో కా కత్తియ వర్ణకాలు మత్వర్థంలో వస్తాయి. ౧౫

ఆటకాడు - ఆటకత్తియ - మొదలైనవి. ఆట - చెలిమి - చొరవ - జట్టి - కటారి - ఇత్యాదు లాటాదులు.

కా కత్తియల కకారానికి గకారం కొన్నిచోట్ల వస్తుంది. ౧౬

అందగాడు - కొండెగాడు - కోడెగాడు - పనిగాడు - బేరగాడు - బేరకత్తె - బేరగత్తె - అందకత్తె - అందగత్తె - పనికత్తె - మొదలైనవి.

కొన్నితత్సమాలమీద సైతం కా కత్తియలు కనిపిస్తున్నాయి. ౧౭

హాస్యగాడు - హాస్యకత్తె - కోపగాడు - కోపకత్తె.

కా కత్తియలు కొన్నిచోట్ల స్వార్థంలోనూ వస్తాయి. ౧౮

చెలికాడు - చెలికత్తె - హెగ్గడికాడు - హెగ్గడికత్తె.

కాప్రత్యయం ఏకార్థక బహువచనంకల నామాలకూ కూడా వస్తుంది. ౧౯

రాములుగాడు - సోములుగాడు - వెంకులుగాడు.

పుంలింగంలో మత్వర్థంలో అటమటాదులకు ఈ వర్ణకం వస్తుంది. ౨౦

అటమటీడు - కమ్మటీడు - మొదలైనవి. అటమటం - కమ్మతం - కన్నడం - కొండెం - బానిసం - సుంకం - ఉక్కివానికి వైకల్పికంగా వ్యలోపం - ఉక్కీడు - సాలెశబ్దానికి అమహదర్థంలో ఈప్రత్యయం డు వర్ణకం కనిపిస్తున్నది. సాలీడు - సాలెపురుగు.

మత్వర్థంలో ఉక్కివ శబ్దానికి ఉవర్ణకం మీద డువర్ణకాదులు వికల్పం. ౨౧

ఉక్కివుడు - ఉక్కీడు.

కొన్నిచోట్ల ఈ ప్రత్యయం స్వార్థంలోనూ వస్తుంది. ౨౨

మొక్కలీడు - కల్లరీడు.

జాలాదులకు అరివర్ణకం మత్వర్థంలో వస్తుంది. ౨౩

జాలరి - కల్లరి - చదువరి - జూదరి - టక్కరి - తగవరి - టీర్పరి - నేర్పరి - తెంపరి - తెరువరి - సిగ్గరి - వేటరి - మొదలైనవి.

పూజ సొన్నలకు జాలశబ్దానికి అరి పరమైతే నిత్యవైకల్పికంగా దీర్ఘం వస్తుంది. ౨౪

పూజారి - సొన్నారి - జాలరి - జాలారి.

ఒంటరి కల్లరి గద్దరలకు స్వార్థంలో గా కత్తియలు వస్తాయి. ౨౫

ఒంటరిగాడు - కల్లరిగాడు - గద్దరిగాడు - ఒంటిరికత్తె - కల్లరికత్తె - గద్దరికత్తె.

మత్వర్థంలో ఓయారాదులకు ఇవర్ణకం వస్తుంది. ౨౬

ఓయారి - ఒయారి - వయారి - అక్కసి - మొదలైనవి. ఒయారం - అక్కసం - బిత్తరం - మచ్చరం - మిటారం - బిన్నాణం - రాయబారం - ఇత్యాదులు ఓయారాదులు.

స్త్రీత్వారోపణలో మహదేకవచనంలో అడశబ్దానికి అంగి చేరుతుంది. ౨౭

అడంగి - ఈ అంగిచేరిన డకారానికి ణకారం వైకల్పికం - అణంగి - మహతీవాచకమైనప్పుడు అడంగులు - అణంగులు - అని బహుత్వంలోనే వ్యవహారం - దీని కేకవచనరూపం వుండదు - స్త్రీత్వారోపణలో సిద్ధించిన అడంగిమీద భావంలో తనవర్ణకం కూడా కనిపిస్తున్నది - అడంగితనం - అణంగితనం.

స్త్రీవాచ్యమయితే మత్వర్థంలో తవర్ణకం తరచుగా కులవాచకానికి వస్తుంది. ౨౮

చాకిత - బోయత - సాలెత - వ్రేత - తరచుగా అనడంచేత కులవాచకాలు కానివాటికిసైతం తవర్ణకం కొన్నిచోట్ల వస్తుంది - మిండత - ముట్టుత - గుబ్బెత.

కొన్నిచోట్ల తవర్ణకం పరమైతే ఎత్వం వస్తుంది. ౨౯

చెంచెత - మాలెత - గుబ్బెత.

తవర్ణకం పరమైతే చెంచు శబ్దానికి ఇ ఈ లు వికల్పంగా వస్తాయి. ౩౦

చెంచిత - చెంచీత - చెంచెత.

స్త్రీవాచ్య మవుతుంటే బహువచనాంతాలైన పగాదులకు మత్వర్థంలో ఆడివర్ణకం వస్తుంది. ౩౧

పగలాడి - చిన్నెలాడి - పలుకులాడి - వన్నెలాడి - పొమ్ములాడి - మొదలైనవి.

పుంస్త్వంలో బహువచనాంతాలైన పగాదులకు మత్వర్థంలో ఆ వర్ణకం వస్తుంది. ౩౨

పగలాడు - చిన్నెలాడు.

స్త్రీ వాచ్యమవుతుంటే పెండ్లి శబ్దానికి మత్వర్థంలో అ వర్ణకం వస్తుంది. ౩౩

పెండ్లం - ఏతాదులకు మువర్ణకం పరమైతే ఇత్యాదివిధిచేత పాక్షికంగా దీర్ఘంవస్తే పెండ్లాం.

మత్వర్థంలో ముక్కు లోనైనవాటికి వాటి అభావద్యోతకమై ఇడి వర్ణకం వస్తుంది. ౩౪

ముక్కిడి - సిగ్గిడి - వెరవిడి - వావిడి.

మానార్థానికి ఏకత్వంలో తరచుగా ఎడు వర్ణకం వస్తుంది. ౩౫

తూమెడు - ముంతెడు - ఎత్తెడు - వీసెడు - జేనెడు - మొదలైనవి. తరచుగా అనడంచేత గజం - అడుగు - పదలం - సవాసేరు - మొదలైనవాటిల్లో ఎడు వర్ణక ప్రయోగం ఉండదు. ము వర్ణాంతాలమీద కొన్నిటికి డు వర్ణం మానార్థంలో కనిపిస్తున్నది. తూముడు - పదలండు - పళ్లెండు - ఇకారాంతరూపాల మీది ఎడు ఎత్వానికి ఇత్వంకూడా కనిపిస్తున్నది - పెట్టెడు - పుట్టెడు - మానెడు - మానిడు - పిడికెడు - పిడికిడు - పుడిసెడు - పుడిసిడు.

విశేష్యానికి భిన్నవచన విభక్తులున్నా మానార్థానికి ఏకత్వం లోనే ఎడు వర్ణకం. ౩౬

పుట్టెడుతవిదలు - పుట్టెడుతవిదలను మానెడు రూపాయలు.

ఎడు వర్ణకం పరమైతే లివర్ణం లోపిస్తుంది. ౩౭

కమికిలి - కమికెడు - దోసిలి - దోసెడు - పిడికిలి - పిడికెడు - పుడిసిలి- పుడిసెడు - సందిలి - సందెడు - మొదలైనవి.

దీర్ఘంమీది లివర్ణానికి లోపంరాదు. ౩౮

చాలి - చాలెడు - బోలి - బోలెడు - మొదలైనవి.

మానార్థానికి కొన్నిచోట్ల అంత వర్ణకం వస్తుంది. ౩౯

గంపంత - చేటంత - కాసంత - నిమ్మకాయంత.

బంటి కొలదులు పరిమాణార్థకాలు. ౪౦

మోకాలిబంటి - పత్తుకబంటి - కొమ్ముకొలది - కాలికొలది - మొదలైనవి. కొలదిచేత కొద్ది గ్రాహ్యం - కొమ్ముకొద్ది - బంటి తత్సమాలమీదకూడా కొన్ని చోట్ల కనిపిస్తున్నది. కటిబంటిగా అని ప్రయోగం. కొన్నిచోట్ల మానార్థక ఎడు అంతాదులు కనిపించవు. మరికొన్నిచోట్ల వికల్పం - మూరపొడవు - మూరెడు పొడవు - జానలోతు - జానెడులోతు - ఇత్యాదులూహ్యాలు.

నిర్ణీతపరిమితిని తెల్పుతూ అంతాదులకు మాత్ర వర్ణకం వస్తుంది. ౪౧

అంతమాత్రం - ఇంతమాత్రం - ఎంతమాత్రం - కొంతమాత్రం - కుండెడుమాత్రం - మొదలైనవి.

చెడుగు దుడుకు నిడుపులకు పుంస్త్వంలో మత్వర్థంలో అ వర్ణకం వస్తుంది. ౪౨

చెడుగడు - దుడుకడు - నిడుపడు - మొదలైనవి.

చెడుగు దుడుకు నిడుపులకు మత్వర్థంలో ఉ వర్ణకం వస్తుంది. ౪౩

అమెచెడుగు - అదిచెడుగు - అమెదుడుకు - వాడుదుడుకు - అది నిడుపు - అమెనిడుపు - ఇత్యాదులూహ్యాలు.

వేర్వాదులకు అడ వర్ణకం వస్తుంది. ౪౪

వేరడం - ఇల్లడం - ఈసడం.

వెల్లకు స్వార్థంలో డి వర్ణకం వస్తుంది. ౪౫

వెల్లడి.

స్వార్థంలో వినికి మొదలైన వాటికి ఇడి వర్ణకం వస్తుంది. ౪౬

వినికిడి - తెలివిడి - విరివిడి - లేమిడి - రాపిడి - మొదలైనవి.

ఇంపు బిగు పోరులకు ఇత వర్ణకం స్వార్థంలో వస్తుంది. ౪౭

ఇంపితం - బిగితం - పోరితం.

ఒప్పు తప్పు పెల్లులకు స్వార్థంలో ఇద వర్ణకం వస్తుంది. ౪౮

ఒప్పిదం - తప్పిదం - పెల్లిదం.

కొవ్వుబెట్టులకు మత్వర్థంలో ఇద వర్ణకం వస్తుంది. ౪౯

కొవ్విదం - బెట్టిదం.

వాపుకి స్వార్థంలో ఇరి వర్ణకం వస్తుంది. ౫౦

వాపిరి.

భావంలో రవర్ణకం నాయక శబ్దానికి వస్తుంది. ౫౧

నాయకరం.

చెలి నయాలకు భావంలో కార వర్ణకం వస్తుంది. ౫౨

చెలికారం - నయగారం - ఇక్కడ కకారానికి గకారం.

స్వార్థంలో సుడి కొలలకు కారవర్ణకం వస్తుంది. ౫౩

సుడికారం - కొలగారం.

ఒండు డు వర్ణానికి భావంలో టి వర్ణకం వస్తుంది. ౫౪

ఒండు - ఒంటి

మయ వర్ణకం ప్రాచుర్యార్థంలో వస్తుంది. ౫౫

తనమయం - నీళ్లమయం - ఓట్లమయం - కార్లమయం.

ప్రాచుర్యార్థంలో చూపు బలుపులకు అసి వర్ణకం వస్తుంది. ౫౬
చూపసి - బలపసి.

అవు చెవులకు అర్థ విశేషంలో ఉడు వర్ణకం వస్తుంది. ౫౭
అవుడు - చెవుడు - వాడిచెయ్యిఅవుడు - అతనికి చెవుడుంది. మొదలైనవి వ్యవహారాలు.

అవుడు చెవుడుల డువర్ణానికి మత్వర్థంలో ఇటి వర్ణకం
వస్తుంది. ౫౮
అవిటి - చెవిటి.

కోపాదులకు మత్వర్థంలో దారి వర్ణకం వస్తుంది. ౫౯
కోపదారి - మాయదారి.

పిసిని వాపిరులకు మత్వర్థంలో గొట్టువర్ణకం వస్తుంది. ౬౦
పిసినిగొట్టు - వాపిరిగొట్టు.

తత్సమాలకు సైతం కా ప్రత్యాయాదులు కొన్నింటికి
వస్తాయి. ౬౧
అంకకాడు - అభిమానకత్తె - కటిబంటి.

తాచ్ఛీల్యంలో పెత్తనాదులకు దారువర్ణకం వస్తుంది. ౬౨
పెత్తనదారు - చోపుదారు - అంచనాదారు - మొదలైనవి. దారు పరమైతే నవర్ణానికి పూర్ణబిందువు వైకల్పికం - పెత్తందారు - పెత్తనదారు.

మాటాదులకు బహుత్వంలో మారి వర్ణకం
తాచ్ఛీల్యంలో వస్తుంది. ౬౩
మాటలమారి - మాయలమారి - జగడాలమారి - తగాదాలమారి - తగాదా శబ్దానికి ఏకత్వంలోసైతం మారి కనిపిస్తున్నది - తగాదామారి - తత్సమాల్లో మహత్ శబ్దానికి ఈ మారివర్ణకం కనిపిస్తున్నది. మహామారి - హకారానికి హ్రస్వం వస్తే మకారానికి ద్విత్వం నిత్యంగా కనిపిస్తున్నది - మహమ్మారి. మీదృష్టిలో యుద్ధం ఒక మహామారి కావచ్చు — పి — 34.

తాచ్ఛీల్యంలో పుండాదులకు జగడాదులకు ఏక బహుత్వాల్లో
కోరువర్ణకం వస్తుంది. ౭౪

పుండాదులకు ఏకత్వంలోను జగడాదులకు బహుత్వంలోను వస్తుందని గ్రహించాలి. పుండా + ఆదులు = పుండాదులు.

పుండాకోరు - దగాకోరు - తగాదాకోరు - జగడాలకోరు - అబద్ధాలకోరు - రగాడాలకోరు - మొదలైనవి.

తాచ్ఛీల్యంలో తిండి ప్రభృతులకు పోతు వర్ణకం వస్తుంది.౭౫
తిండిపోతు - పదరుపోతు.

పోతు పకారానికి బకారం బహుళం. ౭౬

తిండిపోతు - తిండిబోతు - పొగరుబోతు - తాగుబోతు - గొడ్డుబోతు - వదరుబోతు - మొదలైనవి.

తాచ్ఛీల్యంలో మాట శబ్దానికి కారి వర్ణకం వస్తుంది. ౭౭
మాటకారి.

ఒకచోట ఉత్వాదులతో మతుప్ప్రత్యయమంతకు తెలుగులో
వ్యవహారం కనిపిస్తున్నది. ౭౮
సిరిమంతుడు - గురుటామంతుడు - గరుటాలమంతుడు.

సంస్కృత శబ్దశాస నానుక్తతత్సమ తద్ధిత స్వరూప విశేషాలు
అశేషాలు వ్యవహా రానుగుణంగా గ్రాహ్యాలు. ౭౯

భావప్రత్యయాంతాలైన మిత్రభూయాదులకు స్వార్థంలో
త్వ ప్రత్యయం వైకల్పికంగా వస్తుంది. ౮౦

మిత్రభూయత్వం - మిత్రభూయం - విష్ణుభూయత్వం - విష్ణుభూయం - దేవభూయత్వం - దేవభూయం - బ్రహ్మభూయత్వం - బ్రహ్మభూయం - ఇక్కడ భావార్థకప్రత్యయంమీద తిరిగి భావార్థకమేచేరినా భావార్థకంమీది స్వార్థకంగా త్వప్రత్యయం సాధించబడింది.

భావార్థంలోను తరగతి పుస్తకార్థంలోను వాచక శబ్దం
ప్రయోగార్హం. ౨౧

వాడిది మంచివాచకం - నీవాచకంబాగుంది - రెండోవాచకం - మూడో వాచకం మొదలైనవి.

స్వార్థంలో సుభేదాదుల అంత్యాచ్చుకి పూర్వంలో యకారం
వికల్పంగా వస్తుంది. ౨౨

సుభేదాదులు భావార్థకాలు - సుభేదం - సుభేద్యం - దుర్భేదం - దుర్భేద్యం -

అతిపూర్వక సోపసర్గక కృదంత లభ ధాతువుకి
బిందువు రాదు. ౨౩

అతిసులభం - అతిదుర్లభం - సంస్కృతవ్యాకరణంచేత అతిసులంభం - అతిదుర్లంభం - అని పూర్ణబిందు సహితంగానే సాధ్యమవుతుంది. కాని తెలుగులో బిందువురాదు - అతిపూర్వకం అనడంచేత సుప్రలంభం - దుష్ప్రలంభం - ఇత్యాదుల్లో బిందు వుంటుందని గ్రహించాలి.

స్వార్థంలో సుగ్రహాదుల అంత్యస్వరానికి పూర్వంలో వైకల్పి
కంగా యకారాగమం హకార పూర్వస్వరానికి నిత్యంగా
దీర్ఘం వస్తుంది. ౨౪

సుగ్రాహం - దుర్గ్రాహం - సుగ్రాహ్యం - దుర్గ్రాహ్యం - ఈ యకారం కల రూపాలు భావార్థకాలమీద స్వార్థంలో తిరిగి ప్రత్యయాలు చేరినరూపాలు.

స్వార్థంలో దుర్నిరీక్షాదుల అంత్యస్వరానికి పూర్వంలో
యకారాగమం విభాషగా వస్తుంది. ౨౫

దుర్నిరీక్షం - దుర్నిరీక్ష్యం -దుష్ప్రేక్షం-దుష్ప్రేక్ష్యం - దుర్నిరీక్షుడు - దుర్నిరీక్ష్యుడు - దుష్ప్రేక్షుడు - దుష్ప్రేక్ష్యుడు - మొదలైనవి.

దేశాదులకు గాంధ్యాదులకు సంబంధాద్యర్థాల్లో ఈయ
ఏయలు వస్తాయి. ౨౬

భారతీయం - కాశ్మీరీయం - భారతీయులు - కాశ్మీరీయులు - బెంగాలీయులు - పంజాబీయులు - గాంధేయం - శాక్తేయం - గాంధేయులు - శాక్తేయులు - దైతేయులు - ఆదితేయులు - పాత్రికేయులు - ఇత్యాదులూహ్యాలు.

ఏయు పరమైతే ఆదిహ్రస్వానికి వృద్ధి వస్తుంది. ౭౭

పాత్రికేయులు - దైతేయులు - ఆదితేయులు.

కాశ్మీరీయాదుల యవర్ణానికి జనార్థంలో లోపం కొన్నిచోట్ల వస్తుంది. ౭౮

కాశ్మీరీయులు - కాశ్మీరీలు - పాకిస్థానీయులు - పాకిస్థానీలు - బెంగాలీలు - పంజాబీలు - కొన్నిచోట్ల అనడంచేత భారతీయాదుల కీకార్యంరాదు-భారతీయులు.

కాషాయ మాంజిష్ఠ శబ్దాల తుదిఅత్వానికి స్వార్థంలో ఇత్వం విభాషగా వస్తుంది. ౭౯

కాషాయబట్టలు - కాషాయిబట్టలు - కాషాయవస్త్రాలు - కాషాయివస్త్రాలు- మాంజిష్ఠం - మాంజిష్ఠి - వ్యవస్థితవిభాషచేత అజాదిసంస్కృతపదం పరమైతే కాషాయశబ్దానికి ఇత్వం రాదు. కాషాయాంబరాలు.

మాంజిష్ఠి దీర్ఘానికి హ్రస్వం వైకల్పికం. ౮౦

మాంజిష్ఠి - మంజిష్ఠి.

ద్విత్ర్యాది పూర్వకమైన వేదశబ్దానికి అర్థవిశేషంలో ఇత్వం వస్తుంది. ౮౧

ద్వివేది - త్రివేది - చతుర్వేది - ఇక్కడ చదివినవాడు అని అర్థవిశేషం.

మధ్యశబ్దానికి స్వార్థంలో మవర్ణం వికల్పంగా వస్తుంది. ౮౨

మృగరాజమధ్య - మృగరాజమధ్యమ.

స్వార్థంలో స్వ శబ్దానికి లోపం కొన్నిచోట్ల వస్తుంది. ౮౩

స్వదేశీయులు - విదేశీయులు - దేశీయులు - విదేశీయులు - జాతీయం విజాతీయం - స్వజాతీయం - విజాతీయం.

తావకీన మామకీనాల నకారానికి యకారం విభాషగా వస్తుంది. ౮౪

తావకీనం - తావకీయం - మామకీనం - మామకీయం.

ప్రాభాతికాదుల కవర్ణానికి లోపం తుది ఇత్వానికి
అత్వం విభాష. ౮౫

ప్రాభాతికం - ప్రాభాతం - మాధ్యందినికం - మాంధ్యందినం - దైనందినకం - దైనందినం మొదలైనవి. వ్యవస్థితవిభాషచేత లోప అభావంలో ఇత్వానికి అత్వంరాదు.

సమాసోత్తరకాలికపద ఇత్వానికి దీర్ఘం కకారానికి నకారం
విభాగా వస్తుంది. ౮౬

సమకాలికులు - సమకాలీకులు - సమకాలినులు - సమకాలీనులు - సమకాలికం - సమకాలీకం - సమకాలినం - సమకాలీనం.

అర్థవిశేషంలో వార్షికశబ్ద ఇత్వానికి దీర్ఘం వైకల్పికం. ౮౭

వార్షికం - వార్షీకం - నీకువార్షికమెంత? నాకువార్షికం పదివేలు - వార్షీకం పదివేలు - ప్రతిసంవత్సరానికి యిచ్చే ధనధాన్యాదిరూపకమైన సంభావన అని యిక్కడ అర్థవిశేషం.

పౌరోహిత అంత్యస్వరానికి పూర్వం యకారాగమం
వైకల్పికంగా వస్తుంది. ౮౮

పౌరోహిత్యం - పౌరోహితం.

పురోహిత పౌరోహిత శబ్దాల ఉత్వ ఔత్వాలు విభాషగా
వ్యత్యస్తాలవుతాయి. ౮౯

పురోహితుడు - పౌరోహితుడు - పౌరోహితం - పురోహితం- పౌరోహిత్యం వ్యవస్థితవిభాషచేత యప్రత్యయం వస్తే మహదర్థంలో ఉత్వంరాదు - అంటే పౌరోహిత్యుడు అనేకాని పురోహిత్యుడు అనే వ్యవహారం లేదనడం.

జ్యోతిష జ్యౌతిషాల అంత్యస్వరానికి పూర్వంలో విభాషగా
యకారాగమం స్వార్థంలో వస్తుంది. ౯౦

జ్యోతిష్యం - జోతిషం - జ్యౌతిష్యం - జౌతిషం.

జ్యోతిష జ్యౌతిషాల అది యకారానికి లోపం వైకల్పికం. ౯౧

జ్యోతిషం - జోతిషం - జ్యౌతిషం - జౌతిషం.

అధికార్థంలో తరతమలు తత్సమపదాల కవుతాలు. ౯౨

అధికతరం - అధికతమం - లఘుతరం - లఘుతమం - మొదలైనవి.

ప్రౌఢాదులకు స్వార్థంలో ఇమ వికల్పంగా చేరుతుంది. ౯౩

ప్రౌఢం - ప్రౌఢిమం - ముగ్ధం - ముగ్ధిమం.

వాత్సల్యాదులకు స్వార్థంలో త త్వప్రత్యయాలు
విభాషగా వస్తాయి. ౯౪

వాత్సల్యం - వాత్సల్యత - వాత్సల్యత్వం - కౌమారం - కౌమారత - కౌమారత్వం - ఐక్యత - సౌఖ్యత - ప్రాముఖ్యత - వీటికి త్వప్రత్యయంకూడా వస్తుంది - మాహాత్యం తప్పని కొంద రంటారు. మహత్‌శబ్దంమీద మహాత్యం మహాత్మన్ శబ్దంమీద మాహాత్మ్యం రెండూసాధ్యాలే - మాహాత్యత - మాహాత్యత్వం - మాహాత్మ్యత - మాహాత్మ్యత్వం.

వృద్ధ శబ్దానికి భావంలో క్య ప్య ప్రత్యయాలు విభాషగా
వస్తాయి. ౯౫

క్య ప్య ప్రత్యయాలు పరమైతే క్రమంగా ప్రథమ
ద్వితీయాచ్చులకు వృద్ధి వస్తుంది. ౯౬

వార్ధక్యం - వృద్ధాప్యం.

మహదేకవచనంలోను మహన్మహతీ బహుత్వంలోను
ప్రేమశబ్దానికి ఇక ప్రత్యయం వస్తుంది. ౯౭

ప్రేమికుడు - ప్రేమికులు.

స్త్రీపుంవాచకమై మత్వర్థంలో పాపశబ్దానికి ఇత్వం
వస్తుంది. ౯౮

పాపి - ఓరిపాపి - ఓసిపాపి.

అర్థవిశేషంలో వర్ణకాంతరాలు శిష్టజన వ్యవహార
ప్రసిద్ధాలు గ్రాహ్యాలు. ౯౯

తద్ధిత పరిచ్ఛేదం.

# వ్యావహారిక భాషా వ్యాకరణం

## క్రియా పరిచ్ఛేదం

ధాతువుకు. ౧

ఇకముందుచెప్పేది ధాతువుకు జరుగుతుందని తెలుసుకోవాలి.

వర్తమానంలో లట్టవుతుంది. ౨

వర్తమానక్రియావృత్తి అయిన ధాతువుకు లట్ అనేది వస్తుంది. ప్రారంభించబడి పరిసమాప్తంపొందనిది వర్తమానం.

భూతంలో లిట్టవుతుంది. ౩

భూతక్రియావృత్తిఅయిన ధాతువుకి లిట్ అనేది వస్తుంది. అప్పటికి లేకుండా యిదివరకున్నది భూతం.

భావిలో ల్పట్టవుతుంది. ౪

భావిక్రియావృత్తి అయిన ధాతువుకు ల్పట్ అనేది వస్తుంది.
అప్పటికిపుట్టకుండా ఇక ముందు ఉండేది.

తద్ధర్మాదుల్లో లాట్టవుతుంది. ౫

తద్ధార్మాది క్రియావృత్తిఅయిన ధాతువునకు లాట్ అనేది వస్తుంది. తచ్ఛీలం - సంభావనం - సంప్రశ్న - సాతత్యం - వర్తమానం - భావి - ఆశీరాదులాది పదంచేత గ్రాహ్యాలు.

ఆశీశ్శాప సంప్రార్థన విధుల్లో లూట్టవుతుంది. ౬

ధాతువుకు ఆశీరాదుల్లో లూట్ అనేది వస్తుంది.

వ్యతిరేకంలో ల అవుతుంది. ౭

వ్యతిరేకక్రియావృత్తియైన ధాతువుకు ల అనేది వస్తుంది.

లట్ ప్రభృతుల్లో అకారాదులు ఉచ్చారణ సౌకర్యార్థం. ౯

లట్ మొదలైనవాటిల్లోవున్న అకారాదిస్వరాలు టకారాలుసైతం ఉచ్చారణసౌకర్యార్థమై నిల్పబడినవనీ అవి సర్వత్రా లోపిస్తాయనీ తాత్పర్యం.

లకారానికి డు రు వు రు ను ములు వస్తాయి. ౯

లట్ మొదలైన లకారాలన్నిటికి డు మొదలైనవి ఆదేశాలుగా వస్తాయి.

అవి క్రమంగా రెండేసి ప్రథమమధ్యమోత్తమాలు. ౧౦

డు - రు - ప్రథమపురుష - వు - రు - మధ్యమపురుష - ను - ము - ఉత్తమపురుష.

వాటిలో రు ములు బహువచనాలు ఇతరా లేకవచనాలు. ౧౧

నామయుష్మదస్మ దర్థాల్లో ప్రథమ మధ్యమోత్తమా
లౌతాయి. ౧౨

అమహదర్థంలో డు రు లకు దు వు లౌతాయి ;
ఉన్నాను బంధంమీద దివిలవుతాయి. ౧౩

వి ప్రత్యయ వకారానికి యకారం విభాష. ౧౪

ఉత్వాంతాలకు లట్టు పరమైతే ఉన్నానుబంధ మవుతుంది.౧౫

హ్రస్వ ఉకారం చివరగల ధాతువుకి లట్టు పరమైనపుడు ఉన్న అనే శబ్దం అనుప్రయుక్తమవుతుంది.

ఉన్న శబ్దం పరమౌతుంటే తువర్ణకం వస్తుంది. ౧౬

ది వి భిన్నమైన ప్రత్యయం పరమైతే ఉన్నానుబంధానికి
దీర్ఘం వస్తుంది. ౧౭

ప్ర - వాడువండుతున్నాడు - వాళ్లువండుతున్నారు - అదివండుతున్నది- అవివండుతున్నవి. మ - నీవువండుతున్నావు - మీరు వండుతున్నారు. ఉ - నేను వండుతున్నాను - మేం వండుతున్నాము - మొదలైనవి - అవి శబ్ద వి వర్ణాలు వ్యవహారంలో ప్త్ర్యర్థ పరంగా అదృష్టాలు - కొన్నిప్రాంతాల్లో ది వి ప్రత్యయాలు పరమైనా ఉన్నానుబంధానికి దీర్ఘం కనిపిస్తున్నది. వండుతున్నాది - వండుతున్నది - పండుతున్నాది - పండుతున్నది - పండుతున్నావి - పండు

తున్నవి. ది వి భిన్నమైన ప్రత్యయం అనడంచేత య ప్రత్యయం పరమైనా దీర్ఘంవస్తుంది. పండుతున్నాయి - వస్తున్నాయి - పండుతున్నాయి.

లిట్టు లాట్టుల డు ప్రభృతి ప్రత్యయాలకు పూర్వంలో న తా వర్ణాలాగమా లౌతాయి. ౧౮

లిట్టులోవచ్చిన డు ప్రభృతిప్రత్యయాలకు పూర్వం న వర్ణం - లాట్టులో వచ్చిన డు ప్రభృతి ప్రత్యయాలకు పూర్వం తా వర్ణం ఆగమాలుగా వస్తాయి.

భూతార్థంలో ఇత్వాగమం వస్తుంది. ౧౯

ధాతువుకి భూతార్థంలో హ్రస్వఇకారం ఆగమంగా వస్తుందని తాత్పర్యం.

ది వి భిన్నమైన ప్రత్యయం పరమైతే నవర్ణానికి దీర్ఘం వస్తుంది. ౨౦

పండినాడు - పండినారు - పండినావు - పండినారు - పండినాను - పండినాము - పండినది - పండినవి - పండినది - పండినవి - దివి భిన్నమైన ప్రత్యయం అనడంచేత య ప్రత్యయం పరమైతే దీర్ఘం - యప్రత్యయ ఇకారానికి లోపం పూర్వస్వరానికి దీర్ఘం వైకల్పికంగా కొన్నిచోట్ల కనిపిస్తున్నది. పండి నాయి - పండినాయ్ - పండినయి - పండినయ్ - పండినవి - కొన్నిచోట్ల దివి ప్రత్యయాలు పరమైనా దీర్ఘం కనిపిస్తున్నది - పండినాది - పండినావి - మొదలైనవి - కొన్నిచోట్ల అన్వాదులకు పరమైన నవర్ణానికి దీర్ఘం వైకల్పికంగా కనిపిస్తున్నది. అన్నాడు - అన్నడు - అన్నారు - అన్నరు - విన్నాడు - విన్నడు - విన్నారు - విన్నరు - ఉత్తమపురుషలో ను వర్ణలోపం - వు వర్ణ ఉత్వానికిలోపం వైకల్పికం - వచ్చినవ్ - అన్నవ్ - విన్నవ్ - అన్న - విన్న - నేను విన్నగద! మొదలైనవి ప్రయోగాలు - అన్నాను - విన్నాను - బహుత్వంలో అన్నం - విన్నం - చెప్పినం - అన్నాము - విన్నాము - చెప్పాము చెప్పినాము.

ది వి భిన్నమైన ప్రత్యయం పరమైతే నవర్ణ వ్యంజనానికి లోపం వైకల్పికం. ౨౧

వ్యంజన లోపమైతే పూర్వాపరస్వరాలకు ఏ స్వరాదేశం బహుళం. ౨౨

పండు-పండేడు - పండేరు-పండేవు పండేరు - పండేను-పండేము. తగ్గు - తగ్గేడు - తగ్గేరు- మొగ్గు - మొగ్గేడు - మొగ్గేరు - తగు - తగేడు -

తగేారు - తగిన - తగినాడు - తగ్గ - తగ్గాడు - తగ్గాట - ఇక్కడ హ్రస్వరం లేదు. బాహుళకంచేత ఇంచుమీద హ్రస్వరంరాదు. పరరూపసంధివస్తుంది. అప్పుడు ఇత్వసంధికారణంగా చకారం దంత్యంకాదు - చేయించాడు - ఇల్లుకు పరరూపసంధిరాదు. హ్రస్వరంవస్తుంది. రంజిల్లేాడు - కంపిల్లేాడు - రంజిల్లేారు - కంపిల్లేారు - నలోప అభావస్థితిలో వండినాడు - వండినారు - వండినావు - వండినారు - వండినాను - వండినాము - మొదలైనవి గ్రాహ్యాలు. ది వి భిన్న మైన ప్రత్యయం అనడంచేత యప్రత్యయం పరమైనా నలోప హ్రస్వరాదేశాదులు వస్తాయి - యప్రత్యయ ఇకారానికి లోపంకూడా కొన్నిచోట్ల కనిపిస్తున్నది - వండేాయి - తగ్గేాయి - మొగ్గేాయి - రంజిల్లేాయి - కంపిల్లేాయి - మొదలైనవి. ఆదిశబ్దంచేత - ఇంచుమీద పరరూపసంధి - రంజించాయి - చేయించాయి - ఇత్వ లోపంవస్తే వండేాయ్ - తగ్గేాయ్ - మొగ్గేాయ్ - రంజిల్లేాయ్ - కంపిల్లేాయ్ - మొదలైనవి యధావ్యవహారంగా గ్రాహ్యాలు - అశిష్టవ్యవహారంలో ది ప్రత్యయం పరమైనా నలోపాదులు కనిపిస్తున్నాయి - వండేాది - తగ్గేాది - మొగ్గేాది - కంపిల్లేాది - చేయించాది - మొదలైనవి - యువర్ణాంతధాతువులకుసైతం - బాహుళకంచేత పరరూపసంధి వస్తుంది - వ్యంజనలోపమైతే స్వరసంధిలో వక్ష్య మాణసూత్రంచేత సకారానికి ప్రథమోష్మంవస్తుంది. చేశాడు - చేశారు - కోశాడు - కోశారు - పక్షంలో చేసినాడు - చేసినారు - మొదలైనవి.

నవర్ణం పరమైతే అన్వాదుల ఇత్వానికి లోపం వైకల్పికం. ౨౩

అనినది - అన్నది - అనినవి - అన్నవి - అనినాడు - అన్నాడు - అనినారు - అన్నారు - అను - కును - చను - తిను - విను - మను మొద లైనవి అన్వాదులు.

ది వర్ణకం పరమైతే సవర్ణానికి బిందువు వైకల్పికం. ౨౪

వండినది - వండింది - పండినది - పండింది - కొట్టినది - కొట్టింది - చేసినది - చేసింది - అడిగినది - అడిగింది - అనినది - అన్నది - అనింది-వినినది - విన్నది - వినింది- మొదలైనవి. అన్వాదుల ఇత్వలోపపక్షంలో న వర్ణానికి బిందువువస్తే బిందువుకు పూర్వానవ్యంజనం నిలవదు కాబట్టి అది లోపిస్తుంది. కాగా అంది - వింది - తింది - మొదలైనరూపాలు సిద్ధిస్తాయి - భూతంలో కొన్నిచోట్ల డు వర్ణకం పరమైతే బిందువు, రు వర్ణకం పరమైతే న వర్ణ

స్వరలోపం కనిపిస్తున్నది - వండింది - తెచ్చింది - కొట్టింది - తిట్టింది -
వండిన్రు - తెచ్చిన్రు - కొట్టిన్రు - తిట్టిన్రు.

దకారం పరమైతే క్రియాజన్య విశేషణం నవర్ణానికి
బిందువు బహుళంగా వస్తుంది. ౨౧౪

వచ్చినదగ్గరనుంచి - వచ్చిందగ్గరనుంచి - తెచ్చినవానికి - తెచ్చిందానికి - మొదలైనవి ఊహ్యాలు.

వు రు ను ము లు పరమైతే తివర్ణాగమం కొన్నిచోట్ల
కనిపిస్తున్నది. ౨౧౫

తా తు తూ తేలు పరమైనప్పుడు జరిగే సాదేశాదికార్యాలు తి వర్ణం పరమైనప్పుడు-సైతం గ్రాహ్యాలు - ఇలాఅనడంచేత యాంతాలకు సకారం స్వరలోపం - చేస్తివి - చేస్తిరి - చేస్తిని - చేస్తిమి - ఇలాగే కోయు - మేయు - తీయు - ప్రభృతులకు చాంతాలకు కొన్నిటికి సకారస్వరలోపకార్యాలు గుర్తించాలి. వస్తివి- వస్తిరి - వస్తిని - వస్తిమి - ఇలాగే తెచ్చు ప్రభృతులకుసైతం సాదికార్యాలు. సూత్రంలో బహుళగ్రహణంచేత యిక్కడ క్వచిదిష్ట సూచనకై కొన్నిటికి శబ్దం ప్రయోగింపబడింది. ఇలా అనడంచేత మెచ్చు ప్రభృతుల చకారానికి సకారం రాదు - మెచ్చితివి - మెచ్చితిరి - మెచ్చితిని - మెచ్చితిమి - ఇత్యాది పూర్వోక్త రూపాలే గ్రాహ్యాలు-బాహుళకంచేత అన్య హల్ సంయుక్తంలో చకారానికి సకారాదులురావు - తీర్చితివి - తీర్చితిరి - ఇత్యాదులు - అసంయుక్తావస్థలో చాకుసా నిత్యం. తీరిస్తివి - తీరిస్తిరి - మొదలైనవి.

తి వర్ణం పరమైతే ఇంచు సబిందు చకారానికి సకారం ఉత్వలోపం విభాష - రక్షించితివి - రక్షిస్తివి - రక్షించితిరి - రక్షిస్తిరి - మొదలైనవి.

అన్వాదులను స్థానంలో బిందువు తకారానికి టకారంబహుళం - అంటివి - అంటిరి - అంటిని - అంటిమి - అను - కను - కొను - తిను - విను. బాహుళకంచేత మన్వాదులకీకార్యం రాదని విధిననుసరించి చెప్పవలసిఉన్నది. కాని తద్విధికి భిన్నంగా తి వర్ణం పరమైతే మన్వాదులకుసైతం అన్వాదులకువలెనే కార్యాలు జరుగుతాయి - మంటివి - మంటిరి - మంటిని - మంటిమి - మొదలైనవి - ఉండు డు లోపం - తకారానికి టకారం - ఉంటివి - ఉంటిరి - ఉంటిని - ఉంటిమి.

చెప్పుధాతువు ద్విరుక్త పకారానికి బకారం వస్తుంది - బకారంవస్తే స్వరలో పం సైతం కొన్నిచోట్ల కనిపిస్తున్నది - చెబితివి - చెబితిరి - చెబితిని - చెబితిమి- చెబ్తివి - చెబ్తిరి - చెబ్తిని - చెబ్తిమి.

ద్విరుక్త టకారానికి అద్విరుక్త డకారంవస్తుంది. డకారంవస్తే పూర్వం లాగానే స్వరలోపం సైతం కొన్నిచోట్ల కనిపిస్తున్నది - కొట్టు - కొడితివి - కొడితిరి - కొడితిని - కొడితిమి - కొడ్తివి - కొడ్తిరి - కొడ్తిని - కొడ్తిమి - ఇలాగే తిట్టు - పెట్టు - మెట్టు మొట్టు - మొదలైనవాటికి ఈకార్యాలు గుర్తించాలి.

ఈదు ప్రభృతుల దకారానికి తకారం తకారస్వరలోపం వైకల్పికం - ఈత్తివి - ఈత్తిరి - ఈత్తిని - ఈత్తిమి - పక్షంలో ఈదితివి - ఈదితిరి - ఈదితిని - ఈదితిమి - ఇలాగే ఊదు - ఏదు - చీదు - పాదు - బాదు - మోదు - ప్రభృతులకు తెల్సుకోవాలి.

వెడలు లు లోపం - డాకు ళకారం - ళా వస్తే స్వరలోపం విభాష - ళాకు ద్విత్వం వైకల్పికం - ద్విత్వపక్షంలో స్వరలోపంరాదు - వెడితివి - వెళితివి - వెళ్తివి - వెళ్లితివి - వెడితిరి - వెళితిరి - వెళ్తిరి - వెళ్లితిరి - ఇలాగే తక్కినవి ఊహ్యాలు - బిందుపూర్వక డువర్ణ నకారరేఫయుక్తరూపాలు తివర్ణ యుక్త రూపాలు కేవలం ప్రాంతీయాలు - శిష్టుల్లో బహుళవ్యవహృతాలుకావు - కాబట్టి శిష్టప్రయోగంలో ఉపేక్షణీయాలు.

లృట్టులో అమహదర్థ ప్రథమైకవచనంలో తు పూర్వక
ఉన్నానుబంధం వస్తుంది ; వస్తే ద్విత్వ నకారానికి
బిందువు నిత్యం. ౨౭

వండుతుంది - కొడుతుంది - తిడుతుంది మొదలైనవి.

లృట్ పరమైతే తా కల అనుబంధాలు పర్యాయంగా
వస్తాయి. ౨౮

లృట్టు పరమైనప్పుడు ధాతువుకి తా కల అనేవి అనుప్రయుక్తా లవుతాయని తాత్పర్యం.

పడు, కల, క, కు, ల, ని లు పరమైతే ఉత్వానికి
అత్వం వస్తుంది. ౨౯

పడు, కల, క, కు, ల, ని అనేవి పరమైతే ధాతుగతమైన ఉత్వానికి అత్వం వస్తుంది. కు అంటే సంప్రార్థన వ్యతిరేకంలోవచ్చే కువర్ణం, ల అంటే వ్యతిరేక లకారం గ్రాహ్యం.

అనుప్రయుక్తాలైన పడు కల ల పరుషాలకు
సరళాదేశం నిత్యం. ౩౦

పండుతాడు - పండుతారు - పండుతావు - పండుతారు - పండుతాను - పండుతాము - పండగలడు - పండగలరు - పండగలదు - పండగలవు - పండగలవు - పండగలరు - పండగలను - పండగలము - వచ్చుకి - రాగలడు - తెచ్చుకి - తేగలడు - అగుకి - అవగలడు - పొగలడు - మొదలైనవి.

తా దీర్ఘానికి హ్రస్వం కొన్నిచోట్ల కనిపిస్తున్నది. హ్రస్వంవస్తే పృపష్ఠిత విభాషచేత మహద్భిన్న వి ప్రత్యయ పకారానికి యకారంరాదు. తా పరమైనపుడు జరిగేకార్యాలు త పరమైనపుడుసైతం గ్రాహ్యాలు. యాంతాలకు-చేయు-చేస్తడు-చేస్తరు - చేస్తవు - చేస్తరు - చేస్తను - చేస్తము - చేస్తది - చేస్తవి - ఇలాగే కోయుప్రభృతులకు సాదేశాదికార్యాలు. చాంతాలకు - వస్తడు - వస్తరు - వస్తవు వస్తరు - వస్తను - వస్తము - వస్తది - వస్తవి. ఇలాగే తెచ్చు మొదలైనవి గ్రాహ్యాలు. మెచ్చు ప్రభృతుల కీకార్యం లేదు - మెచ్చుతడు - మెచ్చుతరు - మెచ్చుతవు - మెచ్చుతవు - మెచ్చుతను - మెచ్చుతము - మెచ్చుతది - మెచ్చుతవి - ఇత్యాదులూహ్యాలు. అన్యహల్ సంయుక్తంలో చాకు సా రాదు - తీర్చుతడు - తీర్చుతరు - మొదలైనవి. అసంయుక్తావస్థలో చాకు సా వస్తుంది - తీరుస్తడు - తీరుస్తరు - తీరుస్తది - తీరుస్తవి - మొదలైనవి.

ఇంచు సబిందు చకారానికి సా విభాష - రక్షించుతడు - రక్షిస్తడు - రక్షించుతరు - రక్షిస్తరు - రక్షించుతది - రక్షిస్తది - రక్షించుతవి - రక్షిస్తవి-ఇత్యాదులూహ్యాలు.

అన్వాదుల ను స్థానంలో బిందువు తాకు టకారం-అంటడు - అంటరు - అంటది - అంటవి - మొదలైనవి. మన్వాదుల కీకార్యంలేదు - మనుతడు - మనుతరు - మనుతది - మనుతవి.

ఉండు డు లోపం తకారానికి టకారం. ఉంటడు-ఉంటరు - ఉంటది-ఉంటవి - ఇత్యాదులు.

చెప్పు ద్విత్వపకారానికి బకారం వైకల్పికం - చెప్పుతడు - చెప్పుతరు - చెపుతడు - చెపుతరు - చెబుతడు - చెబుతరు - చెప్తడు - చెప్తరు -మొదలైనవి.

ద్విరుక్త టకారానికి అద్విరుక్త డకారం. కొట్టు - కొడతడు - కొడతరు-కొడతది - కొడతవి - మొదలైనవి. ఇలాగే తిట్టు ప్రభృతులకు కార్యాలు.

ఈదు మొదలైనవాటి దకారానికి తకారం వైకల్పికం. ఈదు - ఈదుతడు - ఈత్తడు - ఈదుతరు - ఈత్తరు - ఈదుతది - ఈత్తది - ఈదుతవి - ఈత్తవి - మొదలైనవి.

వెతలు లు లోపం - డాకు ళకారం - తాకు ద్విత్వం వైకల్పికం. వెతుతడు - వెళ్లుతడు - వెళతడు - వెళ్తడు - వెతతరు - వెళ్లుతరు - వెళతరు - వెళ్తరు - వెళ్లుతది - వెళతది - వెడుతది - మొదలైనవి. ఈ తవర్ణయుక్త ప్రయోగాలు ప్రాంతీయాలు - శిష్టుల్లో బహుళవ్యవహృతాలు కావు. కాబట్టి శిష్ట ప్రయోగంలో ఉపేక్షణీయాలు.

అర్థవిశేషంలో లాట్టుపరమైతే కొన్నిచోట్ల ఏకారాగమం వస్తుంది; వస్తే ప్రథమలో నువర్ణం అవుతుంది. ౩౧

వండేను - కొట్టేను - వండేవు - వండేరు - వండేను - వండేము - వాడు వండేను - వాళ్లవండేను - నీవువండేవు - మీరువండేరు - నేనువండేను - మేము వండేము - వాడువిసేనుసుమా! వాళ్లకొట్టేనుసుమా జాగ్రత్త! మొదలైనవి. లాట్టుకి కొన్నిచోట్ల లిట్టుకూడా కనిపిస్తున్నది - నిన్నుకొట్టానంటే యేడుస్తూ పోతావు.

లిట్టు లాట్టుల వకారానికి ప్రశ్నార్థకం పరమైతే లోపం బహుళం. ౩౨

వండావా? వండా? తిన్నావా? తిన్నా? వండుతావా? వండుతా? మొదలైనవి. బాహుళకంచేత అనుధాతువు పరమైతే వ లోపంలేదు - తిన్నావా అని? చూచావా అని? ఇత్యాదులూహ్యాలు.

వర్తమానార్థంలో కొన్నిచోట్ల ధాతువులు ఏత్వాంతాలౌతాయి. ౩౩

వచ్చే అన్నయ్యా? తెచ్చేయిదిగో - పెట్టేయిప్పుడే - వస్తున్నాఅన్నయ్యా! తెస్తున్నాయిదుగో - పెడుతున్నాయిప్పుడు అని అర్థం - యిటువంటిరూపాలు త్రిపురుషల్లోనూ వున్నాయి.

లూట్టు ఉు ప్రత్యయాదులకు అలి బహుళంగా అవుతుంది. ౩౪

మీకు శుభం కలగాలి - మీరు సుఖంగా వుండాలి. బాహుళకంచేత పడపోను - రాను - కాను - వంటివి శాపాద్యర్థవిశేషాల్లో ప్రయోగార్హాలు.

శాపార్థంలో ధాతువుకి ద్రుతాంతమైన అవర్ణం వస్తుంది. ౩౫

నీయిమ్మపడ-నిన్ను దేవుడెత్తికెళ్ల! నువ్వుచావ! దేవుడు నిన్ను తప్పజూడ! వాడిశిరసు పగల! ఇత్యాదుల్లో ద్రుతానికి నిత్యంగాలోపం. అగు - వచ్చు -

తెచ్చు - పోవుల కాదేశమైన కా - రా - తే - పోల తుది ద్రుతానికి లోపం లేదు. ఇటువంటిచోట్ల అవర్ణానికి లోపం నిత్యం - నీ కడుపు బంగారం గాను - నీకు పోయేకాలంరాను - అసిదానిపిండంతేను - దానివంశంపోను. అగుకి కాదేశం వికల్పం కాబట్టి గకారానికి వకారంవచ్చినప్పుడు అవర్ణాగమంవస్తే ద్రుతానికి లోపం - వాడిబ్రతుకుపాడవ! వకారానికి ద్విత్వపక్షంలో పాడవ్వ - ఆశ్చర్యదూషణాద్యర్థాల్లో వీటి తుది హ్రస్వానికి దీర్ఘంకూడావస్తుంది. అరి నీ జిమ్మపడా! అరి నీశిరసు పగలా? అదేంమాటే నీయమ్మకడుపుకాలా! అయ్యో దానికిమాయరోగం రానూ!

మధ్యమపురుషైకవచన విధిలో లూట్టుకి లోపం విభాష. ౩౬
లోపాభావపక్షంలో పూర్వసూత్రంచేత అలి.

లోపమైతే చేయ్యాదుల యకారానికి ద్విత్వం తుది ఊత్వాని
కిత్వం నిత్యం. ౩౭

నీవుచెయ్యి - నీవుకొయ్యి - అదితియ్యి - ఇదివెయ్యి - దాన్నికొట్టు - దీన్నితిట్టు - అదిపెట్టు - ఇచ్చుకాదేశమైన ఈయు యకారానికిసైతం ద్విత్వాదులు - ఇయ్యి.

అడం–అండి–అలి–కు ములు పరమైతే చేయ్యాదుల
యకారానికి ద్విత్వం వికల్పం. ౩౮

చేయు - చేయడం - చెయ్యడం - చేయండి - చెయ్యండి - చేయాలి - చెయ్యాలి - చేయకు - చెయ్యకు - చేయుము - చెయ్యుము - మొదలైనవి. చేయుము ప్రభృతులుకి అచ్చుపరమైతే చేయుమన్నాడు - చేయమన్నాడు-చెయ్యుమన్నాడు - చెయ్యమన్నాడు.

సంప్రార్థనాద్యర్థాల్లో మధ్యమ రు ప్రత్యయానికి
అండి బహుళం. ౩౯

మీరంతా చదువుకొనండి - మీరుచేయండి. పక్షంలో మీరుచెయ్యాలి. బహుళగ్రహణంచేత కొన్నిచోట్ల అలిపై అండి. మీరిది చెయ్యాలండి - తాము కనికరించాలండి - మొదలైనవి.

రు ప్రభృతి ప్రత్యయాలు పరమైతే సంప్రార్థనాద్యర్థాల్లో
దు వర్ణాగమం వస్తుంది. ౪౦

వాళ్లే చేయుదురు - నీవు చేయుదువు - మీరు చేయుదురు- నేనే చేయుదును-మేమే చేయుదుము - మొదలైనవి.

చయవాంతాల తుదివర్ణానికిలోపం మీది ఆగమ దువర్ణానికి
ద్విత్వం బహుళంగా వస్తుంది. ౪౧

చాంతాలకు - ఇచ్చు - ఇద్దురు - ఇద్దువు - ఇద్దురు-ఇద్దును - ఇద్దుము - తెచ్చు - తెద్దురు - తెద్దువు - తెద్దురు - తెద్దును - తెద్దుము - వచ్చు - వద్దురు - వద్దువు - వద్దురు - వద్దును - వద్దుము - లేచు - లేద్దురు - లేద్దువు - లేద్దురు - లేద్దును - లేద్దుము - లేచుదురు - బాహుళకంచేత మెచ్చుప్రభృతుల కీకార్యం రాదు - మెచ్చుదురు - మెచ్చుదువు - గిచ్చుదురు - గిచ్చుదువు - మొదలైనవి. ఇంచు చువర్ణానికి లోపంవస్తే మీది దువర్ణానికి ద్విత్వం నిత్యంగా వస్తుంది. ద్విత్వంపరంలోకలబిందువుకి తెలుగులో స్థానంలేకపోవడంవల్ల చువర్ణలోప పక్షంలో బిందులోపంకూడా వస్తుంది - రక్షించుదురు - రక్షిద్దురు - రక్షించుదువు - రక్షిద్దువు - చూపించుదురు - చూపిద్దురు - చేయించుదురు - చేయిద్దురు-ఇత్యాదులూహ్యాలు. యాంతాలకు - చేయు - చేద్దురు - చేద్దువు - చేద్దురు - చేద్దును - చేద్దుము - కోయు - కోద్దురు - కోద్దువు - తీయు - తీద్దురు - తీద్దువు-నేయు - నేద్దురు - నేద్దువు - మూయు - మూద్దురు - మూద్దువు - మొదలైనవి. పక్షంలో చేయుదురు - చేయుదువు - మొదలైనవి. పోవుకు వ లోపం-పోదురు-పోదువు - పోదురు - పోదును - పోదుము - పోవుదురు - పోవుదువు - పోవుదురు - పోవుదును - పోవుదుము - లోపపక్షంలో ద్విత్వఅభావానికి బహుళశబ్ద ప్రయోగమే శరణ్యం.

ఆగమ దువర్ణంమీది మధ్యమ వురుల్లో వువర్ణానికి లోపం
తుది స్వరానికి దీర్ఘం బహుళం. ౪౨

బాహుళకంచేత అంగీకారార్థంలో కాని అనేఅవ్యయంఉత్తరపదమైతే వువర్ణానికి లోపంవైకల్పికం - చేయుదువుగాని - చేద్దువుగాని-చేద్దూగాని-ఇలాగే-తీద్దువుగాని-తీద్దూగాని-నేద్దువుగాని - నేద్దూగాని - కోద్దువుగాని-కోద్దూగాని - మూద్దువుగాని - మూద్దూగాని - వ్రాద్దువుగాని - వ్రాద్దూగాని - సంప్రార్థనార్థంలో వువర్ణ

లోపం నిత్యం - నువ్వుతీద్దూ - ఇద్దూ - కొడుదూ - పెడుదూ - మొద లైనవి. అంగీకారంలో రు ప్రత్యయానికి దీర్ఘంవైకల్పికం - మీరు చేద్దురూగాని- పెడుదురూగాని - చేద్దురుగాని - పెడుదురుగాని - సంప్రార్థనార్థంలో రు ప్రత్యయానికి దీర్ఘం నిత్యం-మీరు చేద్దురూ - పెడుదురూ ! ఇత్యాదులు - ఉత్తరపదం పరమైతే దీర్ఘం సర్వత్ర వైకల్పికం - అంగీకారార్థంలో చేద్దుగాని - సంప్రార్థనలో - చేద్దురుబాబు - చేద్దురూబాబు - చయాంతాలమీది దువర్ణదకారానికి తకారం చయలకు సకారం ఉత్వలోపం కొన్నిచోట్ల కనిపిస్తున్నది - తకారాదేశం వచ్చిన పక్షంలో ద్విత్వంలేదు - అంగీకారార్థంలో చేస్తూగాని - ఇస్తూగాని - వస్తూగాని-వేస్తూగాని - మొదలైనవి. సంప్రార్థనార్థంలో నీవుచేస్తూ - నీవుఇస్తూ - నీవువస్తూ! రు పరమైతే చేస్తురూగాని - ఇస్తురూగాని - చేస్తురూ ! ఇస్తురూ - చేస్తురుబాబు - ఇస్తురుబాబు - మొదలైనవి.

లూట్టు మధ్యమ పు రులకు ము అండులు విభాషగా వస్తాయి. ౪౩

నన్నురక్షించుమన్నాడు - నన్నురక్షించు - ఇక్కడ ము లోపం. నేచెప్పినపనిచెయ్యండి - అగు - కండి - వచ్చు - రండి - చొచ్చు - చొరండి. కండి - రండులకు కాండి - రాండి అని దీర్ఘంకూడా కనిపిస్తున్నది. వ్యవస్థిత విభాషచేత వ్యతిరేక లకారం పరమైతే సంప్రార్థనంలో ఎకారాదులు పరమైనపుడు ఈకార్యం పర్తించదు.

ఉభయప్రార్థనంలో అగమ తకారానికి దకారం బహుళం. ౪౪

మనంవండుదాము - మనంతిందాము - అడుగుదాము - చేదాం-కోద్దాం- బాహుళకంచేత చేతాముపంటి తకారప్రయోగాలు కొన్నిరక్షితాలయ్యాయి.

ఉభయ ప్రార్థనలో దకారం పరమైతే చయలకు
లోపం బహుళం. ౪౫

ఇచ్చు + దాము - ఇద్దాము - తెచ్చు +దాము - తెద్దాము - చేయు + దాము - చేదాము - కోయు + దాము - కోదాము - తీయు + దాము - తీదాము - వక్ష్యమాణసూత్రంచేత చకారంమీది దకారానికి ద్విత్వంనిత్యం - చేదాం_కోద్దాం- బాహుళకంచేత చేతాముపంటిచోట్ల తకారం పరమైనా య లోపం.

ఉభయ ప్రార్థన దకారానికి ద్విత్వం బహుళంగా వస్తుంది. ౪౬

చేదాము - చేద్దాము - కోదాము - కోద్దాము - తీదాము - తీద్దాము - బాహుళకంచేత ఇచ్చుప్రభృతులమీది దకారానికి ద్విత్వంనిత్యం - ఇచ్చు + దాము-

ఇద్దాము - తెచ్చు + దాము - తెద్దాము - వచ్చు + దాము - వద్దాము - పూర్వోక్త విధిచేత ఇంచు చువర్ణానికి లోపంవస్తే మీది దకారానికి దీనిచేత ద్విత్వం నిత్యంగా వస్తుంది. ద్విత్వం పరంలోకల బిందువుకి తెలుగులో స్థానం లేకపోవడంవల్ల చువర్ణలోప పక్షంలో బిందులోపంకూడా వస్తుంది - రక్షించుదాం - రక్షిద్దాం - చూపించుదాం - చూపిద్దాం - చేయించుదాం - చేయిద్దాం - మొదలైనవి ఊహ్యాలు. గిచ్చు ప్రభృతులమీది దకారానికి దాంతాలు యాంతాలు కానివాటి మీది దకారానికి బాహుళకంచేతనే ద్విత్వంరాదు - గిచ్చుదాము - మెచ్చుదాము - కొట్టుదాము - వండుదాము - అడుగుదాము - మొదలైనవి. వ్యతిరేక లకారం పరమైతే పడు - కల ఇత్యాదిసూత్రంచేత ఉత్వానికి అత్వంవస్తుంది- వండడు - వండరు - వండవు - వండరు - వండను - వండము.

మధ్యమ పురుషలో సైతం ఉభయ ప్రార్థన క్రియ ప్రయోక్తవ్యం. ౪౭

రేపు ఏంచేదామని ఆలోచన - అది తిందామనుకుంటున్నావా ?

వ్యతిరేకంలో మధ్యమ ము అండులు పరమైతే కువర్ణం వస్తుంది. ౪౮

వ్యతిరేకార్థక లకారానికి ఆదేశమైన ము అండులు పరమైనప్పుడు కు వర్ణం ఆగమంగా వస్తుందని తాత్పర్యం.

నీవువండకుము - నీవువండకు - మీరువండకండి - మీరుచేయకండి.

మధ్యమపురుష సంప్రశ్నంలో అయ్యాదులు విభాషగా అనుప్రయుక్తా లవుతాయి. ౪౯

చెయ్యకమ్మ - చెయ్యకండమ్మ - కొట్టకయ్య - కొట్టకండయ్య - వినవె - వినవే - వినరే - వినరా ! వినవా ! మొదలైనవి.

భావంలో ట వర్ణకం వస్తుంది. ౫౦

భావమంటే ధాతువు అని అర్థం - వండుట - తినుట - కొట్టుట - అడుగుట.

భావార్థక టవర్ణకానికి మువర్ణాంత అడవర్ణకం తరచుగా వస్తుంది. ౫౧

వండడము - కొట్టడము - తినడము - చెయ్యడము - మొదలైనవి -

ముపర్ణాంతఅడవర్ణకంపరమైతే అనాద్యమైన ఉత్వానికి అత్వం తరచుగా వస్తుంది - అడగడం - చెరగడం - నరకడం - పెరకడం.

డకారం టకారం. ౫౨

భావార్థకంగావచ్చిన ముపర్ణాంత అడవర్ణక డకారానికి టకారం కొన్ని చోట్ల కనిపిస్తున్నదనితాత్పర్యం - కొట్టటం - తిట్టటం - చెయ్యటం - అనటం - మొదలైనవి.

ముపర్ణాంత అడప్రత్యయం పరమైతే అడం తొలిఅత్వానికి డాంత ధాతువుల తుది స్వరానికి లోపం విభాష. ౫౩

పాడు - పాడడం - పాడ్డం - వాడు - వాడడం - వాడ్డం - మూడు - మూడడం - మూడ్డం - పడు - పడడం - పడ్డం - విడు - విడడం - విడ్డం - మొదలైనవి - వ్యవస్థితవిభాషచేత అడ్డు - అడ్డడం - ఒడ్డు - ఒడ్డడం - ఇత్యాదుల్లో ద్విరుక్త డకారానికీకార్యంరాదు.

ముపర్ణాంత అడప్రత్యయం పరమైతే అడం తొలి అత్వానికి టాంత ధాతువుల తుది స్వరానికి లోపం టాకు డా బహుళం. ౫౪

గీటు - గీటడం - గీడ్డం - మీటు - మీటడం - మీడ్డం - నాటు - నాటడం - నాడ్డం - పెట్టు - పెట్టడం - పెడ్డం - నెట్టు - నెట్టడం - నెడ్డం - మొదలైనవి.

ముపర్ణాంత అట ప్రత్యయం పరమైతే అటం తొలి అత్వానికి టాంతధాతువుల తుది స్వరానికి లోపం విభాష. ౫౫

గీటు - గీటటం - గీట్టం - మీటు - మీటటం - మీట్టం - నాటు - నాటటం - నాట్టం - మొదలైనవి. వ్యవస్థిత విభాషచేత పెట్టు - పెట్టటం - నెట్టు - నెట్టటం - ఇత్యాదుల్లో ద్విరుక్త టకారానికి ఈకార్యం రాదు.

ముపర్ణాంత అట ప్రత్యయం పరమైతే అటం తొలి అత్వానికి డాంతధాతువుల తుదిస్వరానికి లోపం డాకు టా బహుళం. ౫౬

పాడు - పాడటం - పాట్టం - వాడు - వాడటం - వాట్టం - మూడు -

మూతటం - మూట్టం - పడు - పడటం - పట్టం - విడు - విడటం - విట్టం - మొదలైనవి - బహుళగ్రహణంచేత అడ్డు - అడ్డటం - ఒడ్డు - ఒడ్డటం ఇత్యాదుల్లో ద్విరుక్త డకారానికి యీకార్యంరాదు.

భావంలో పురార్థయోగంలో అకవర్ణకం విభాషగా
వస్తుంది. ౪౭

వండకముందె - చెయ్యకమునుపె - పక్షంలో వండడానికి ముందె - చెయ్యడానికి మునుపె - పూర్వం - ముందు - మునుపు - మున్ను - తొల్లి - మొదలైనవి పురార్థకాలు.

వ్యతిరేక భావంలో భావార్థక ఉండు పోవులు బహుళంగా
అనుప్రయుక్తా లవుతాయి. ౪౮

వండకుండడం - వండకపోవడం - చెయ్యకుండడం - చెయ్యకపోవడం మొదలైనవి.

వ్యతిరేక భావార్థకాలకు ద్రుతాంతమైన ఉండాగమం
బహుళంగా అవుతుంది. ౪౯

ఉండ + ఆగమం = ఉండాగమం. పూర్వోక్తమైన సూత్రంచేత ద్రుతానికి లోపం పూర్వస్వరానికి దీర్ఘం. వండకుండా వుండడం - వండకుండాపోవడం - చెయ్యకుండావెళ్లాడు - భావార్థక ఉండుపోవులు అనుప్రయుక్తాలైనప్పుడు ఉండా వికల్పంగా ఆగమం అవుతుంది. క్రియాప్రయోగంలోమాత్రం ఈఆగమంనిత్యం- అవధారణార్థకం పరమైతే ఉండామీద నకారం కనిపిస్తున్నది. వండకుండానే - చెయ్యకుండానే - మొదలైనవి.

ఏకాశ్రయ క్రియల్లో పూర్వకాలిక ధాతువుకు
ఇవర్ణం వస్తుంది. ౫౦

దీన్నే క్త్వార్థకంఅంటారు - వండి - పండి - వచ్చి - తెచ్చి - కని - విని - తిని ఇత్యాదులు.

వ్యతిరేకార్థంలో కవర్ణకం వస్తుంది. ౫౧

వండక - పండక - కొట్టక - తిట్టక - వినక - తినక - వండ కేం చేస్తాడురా ! తినకేం చేస్తాడురా ! పెట్టకపోతే మానె - ఇత్యాదులు.

వ్యతిరేకక్త్వార్థకానికి ద్రుతాంతమైన ఉండ బహుళంగా
అనుప్రయుక్త మవుతుంది. ౬౨

ద్రుతలోపం పూర్వస్వరానికి దీర్ఘం - వండకుండా - తినకుండా - వండకుండా యేంచేదామని - వండకేంచేదామని - భూతార్థంలో ఉండా తరచుగా కనిపిస్తున్నది. వండకుండావెళ్లాడు - తినకుండా చేశాడు.

తుమర్థ అకారం మీది పరుషానికి సరళం బహుళం. ౬౩

వండబోయాడు - తినబోయాడు - నీకేంతెలుసునని వండబోయావురా! పక్షంలో నీకేంతెలుసునని వండడానికి పోయావురా! మొదలైనవి.

భావలక్షణంలో అత్వంమీద అన్నంత అగుధాతువు; ఇత్వం
మీద తేవర్ణం అనుప్రయుక్తమవుతుంది. అత్వంమీది
పరుషానికి సరళం నిత్యం. ౬౪

వెంకడు వండగా రాముడుతెచ్చాడు - వెంకడువండితే రాముడు తిన్నాడు.

అన్నంతఅగు ధాతువు, తే వర్ణం పరమైతే చేదర్థంలోను
వృత్తమైన భావలక్షణంలోను అత్వ ఇత్వాలు
క్రమంగా వస్తాయి. ౬౫

వానలుకురవగా చెరువులు నిండుతాయి - వానలు కురిస్తే చెరువులు నిండుతాయి - వాడురమ్మనగా వెళ్లాను - వాడురమ్మంటేవెళ్లాను - భిన్నవాక్యాలుగా సామాన్యక్రియకుసైతం ప్రయోగార్హతవున్నది. వాడురమ్మన్నాడు - నేనువెళ్లాను.

అనుపదంలో అన్నంత అగుధాతువు అవధారణార్థక
ఏకారసహితంగా అనుప్రయుక్త మవుతుంది.
అయితే పూర్వధాతువుకి అవర్ణం వస్తుంది. ౬౬

ఇల్లలుకగానే పండుగయ్యిందా? చందమామరాగానే కలువలు వికసించాయి - అల్లుడు వెళ్లగానే శనిపోయింది - ఇక్కడ భావార్థకంమీద అవధారణార్థకంగల తో, తోటులుకూడా కనిపిస్తున్నాయి - ఇల్లు అలకడంతోనే పండుగయ్యిందా? చందమామరావడంతోనే కలువలు వికసించాయి - చందమామ రావడంతోటే కలువలు వికసించాయి - అల్లుడు వెళ్లడంతోనే శనిపోయింది - అల్లుడు

వెళ్లడంతోటే శనిపోయింది - ఇటువంటిచోట్ల కొన్ని ప్రాంతాల్లో తూనే చేరడంకష్ట - వాడు వస్తూనే నేనువెళ్లాను - రాగానే అని అర్థం.

దీర్ఘాంత తువర్ణకం క్రియాన్వయంలో శత్రర్థంలో వస్తుంది. ౬౭

చూస్తూపోతున్నాడు - చూస్తూపోయాడు - చూస్తూవెళ్లగలడు - అవధారణార్థకం పరమైతే యిది ద్రుతాంతమవుతుంది - వాడింకా చూస్తూనే వున్నాడు. వెళ్లిపోతూనే అతడు — ర — 31 —

కర్త్రర్థంలో ఏ వర్ణంవస్తుంది. ౬౮

వచ్చేవాడు - వండేవాడు - కొట్టేవాడు - తిట్టేవాడు - ఇచ్చేవాళ్లుండగా పుచ్చుకునేవాళ్లకేంతక్కువ?

కర్త్రర్థక ఏత్వంమీది అటువంటి అర్థానికి లోపం తరచుగా వస్తుంది. ౬౯

వచ్చేటువంటి - పోయేటువంటి - తెచ్చేటువంటి - మొదలైనవి. తరచు శబ్దప్రయోగంవల్ల ఈకార్యానికి అవ్యాప్తత్వం సైతం కొన్నిచోట్ల సూచించబడింది.

ఏ వర్ణానికి లోపం బహుళం. ౭౦

వచ్చువాడు - వండువాడు - కొట్టువాడు - తిట్టువాడు.

వర్తమానార్థక శత్రర్థంలో ఉన్నవర్ణకం వస్తుంది. ౭౧

వండుతున్నవాడు - కొట్టుతున్నవాడు - కొడుతున్నవాడు - చెప్పుతున్నవాడు - చెబుతున్నవాడు - వింటున్నవాడు.

భవిష్యదర్థక శత్రర్థంలో కలవర్ణకం వస్తుంది. ౭౨

పూర్వసూత్రాలచేత అత్వసరళాలు వండగలవాడు - చేయగలవాడు - చెయ్యగలవాడు - చెప్పగలవాడు - పెట్టగలవాడు - వినగలవాడు.

భూతార్థక శత్రర్థంలో నవర్ణకం వస్తుంది. ౭౩

వండినవాడు - చేసినవాడు - కొట్టినవాడు - చెప్పినవాడు - పోయినవాడు - తెచ్చినవాడు - కనినవాడు - కను ఇత్వలోపంవస్తే కన్నవాడు.

వ్యతిరేక కర్త్రర్థంలో నివర్ణకం వస్తుంది. ౭౪

వండనివాడు - కొట్టనివాడు - చేయనివాడు - మెచ్చనివాడు - చెప్పనివాడు - రానివాడు - పోనివాడు - విననివాడు.

లకారాదులు సకర్మకాలకు కర్త్రర్థకకర్మార్థాల్లోను అకర్మకాలకు కర్త్రర్థంలోను వస్తాయి. ౭౫

కర్మార్థంలో పడు అనుప్రయుక్త మవుతుంది. ౭౬

పూర్వసూత్రంచేత అత్వసరళాలు. కొట్టబడుతున్నాడు - కట్టబడుతున్నది-చేయబడుతున్నది - చెయ్యబడుతున్నది - చెప్పబడుతున్నది - వినబడుతున్నది-కొట్టబడడం - చెప్పబడడం - పడుప్రయోగం తెలుగుకు సహజసిద్ధంకాదు.

గురువులేని యాంతాలుకాని ఏకస్వరద్విస్వరాల యించుకి పూర్వంలో ఇయ్ ఆగమం విభాషగా వస్తుంది. ౭౭

గురువుకల ధాతువుకు యాంతమైనధాతువుకు ఇయ్ ఆగమంరాదు. భుజ్+ఇయ్+ఇంచు = భుజియించు - భుజించు - గుణ + ఇయ్ + ఇంచు = గుణియించు - గుణించు - నగు + ఇయ్ + ఇంచు - నగియించు - నగించు - యాచ్ - అర్థ మొదలైనవి గురువుకలవి కాబట్టి వీటికి ఇయ్‌రాదు - యాచించు - అర్థించు - యాంతానికి - వ్యయ్ - వ్యయించు.

పడ్వాదుల మీది నవర్ణకవ్యంజనానికి లోపం కడహల్లుకి ద్విత్వం విభాషగా వస్తుంది. ౭౮

పడిన - పడ్డ - చెడిన - చెడ్డ - వినిన - విన్న-మొదలైనవి. పడు - చెడు ఇడు - తగు - అను - కను - కొను - తిను - మను - విను - చను - ఇత్యాదులు పడ్వాదులు - వ్యంజనలోపానంతరం అపదాది స్వరసంధి విధిచేత సంధి నిత్యం - ఒకసారి పడప్పటికి వాడికి బుద్ధిరాలేదు - యెన్నిదెబ్బలు తిన్నప్పటికి జ్ఞానం రాకపోతే యేంచెయ్యాలి ?

ఆత్మనే పదార్థంలో కొనుధాతువు అనుప్రయుక్త మవుతుంది. ౭౯

ధాతువాచ్యమైన వ్యాపారంచేత కోరబడ్డఫలం కర్తనే చెందినపుడు కొను ధాతువు అనుప్రయుక్త మవుతుందని తాత్పర్యం - వండుకొంటున్నాడు - చేసు

కొంటున్నాడు. చెప్పుకొంటున్నాడు - ఇత్యాదులు. సహజాత్మనేపదార్థకాలైన కూర్చొనువంటివాటికి ఈ కొనుధాతు వనుప్రయుక్తంకాదని గ్రహించాలి.

### ఆత్మనే పదార్ధక ధాతువు తుది నువర్ణానికి ముందున్న వక్రానికి ఉత్వం బహుళంగా వస్తుంది. ౮౦

వందుకొంటాడు - వండుకుంటాడు - వండుకొంటున్నాడు - వండుకుంటున్నాడు - చేసుకొంటున్నాడు - చేసుకుంటున్నాడు - వ్రాసుకొంటున్నాడు - వ్రాసుకుంటున్నాడు - తీసుకొంటున్నాడు - తీసుకుంటున్నాడు - తెచ్చుకొన్నాడు - తెచ్చుకున్నాడు - తీసికొని - తీసుకొని - తీసుకుని - అనుప్రయుక్తమైన కొనుధాతువనక ఆత్మనేపదార్ధకమనడంచేత కూర్చొను ప్రభృతులకు ఈకార్యం జరుగుత ంది - కూర్చొంటున్నాడు - కూర్చుంటున్నాడు - కూర్చొని - కూర్చుని - బాహుళకంచేత వండుకోవాలి - చేసుకోవాలి - కూర్చోవాలి - వండుకోండి - చేసుకోండి - కూర్చోండి - మొదలైనచోట్ల ఈకార్యం జరగదు. కూర్చునే కానుల్నీ కేటాయిస్తు — ర — 34. కూర్చుందామంటే కొందరు దిగలాగుతున్నారు. ర — 34 —

### ధాతువు పరమైతే ఉత్వాదేశమైన కొనుధాతువు ని వర్ణానికి లోపం వైకల్పికం. ౮౧

తీసుకొనిపోతున్నాడు - తీసుకునిపోతున్నాడు - తీసుకుపోతున్నాడు - పట్టుకొనివెళ్తాడు - పట్టుకునివెళ్తాడు - పట్టుకువెళ్తాడు - ముంచుకొనివస్తాడు - ముంచుకునివస్తాడు - ముంచుకువస్తాడు - మొదలైనవి. నివర్ణానికి లోపమైతే కువర్ణ ఉత్వానికి అత్వం కొందరు చేస్తున్నారుగాని అదిశిష్టజనవ్యవహార ప్రసిద్ధం కాదు. తీసుకపోతున్నాడు - పట్టుకవెళ్తాడు - ముంచుకవస్తాడు - ఇత్యాదులు అప్రశస్తాలని తాత్పర్యం.

### ఇకారవక్రాలు కొనుధాతువు పరమైతే యాకు సకారం వస్తుంది. ౮౨

చేసి - తీసి - పోసి - చేసినాడు - తీసినాడు - పోసినాడు - చేసేను - తీసేను - పోసేను · వాడు చేసేనుసుమా ! - నీవు తీసేవు కొంపముంచి - మరచిపోయి పోసేవు జాగ్రత్త - మొదలైనవి వ్యావహారికాలు - చేసుకొను - తీసికొను - పోసుకొను - మొదలైనవి.

యాదేశ సకారం ఆ ఏ లతో కూడితే నిత్యవైకల్పికంగా శవర్ణం అవుతుంది. ౨౩

చేశాడు - చేశారు - చేశావు - చేశారు - చేశాను - చేశాము - తీశాడు - తీశారు - తీశావు - తీశారు - తీశాను - తీశాము - ఇక్కడ సాకు శా నిత్యం - చేసేను - చేశేను - తీసేను - తీశేను - పోసేను - పోశేను - ఇక్కడ సాకు శా వైకల్పికం.

తా తు తూ తే లు పరమైతే యాకు సకారం ఉత్వానికి లోపం నిత్యం. ౨౪

చేస్తాడు - తీస్తాడు - చేస్తున్నాడు - తీస్తున్నాడు - చేస్తూవున్నాడు - తీస్తూవున్నాడు - చేస్తే - తీస్తే - ఇత్యాదులూహ్యాలు.

కొను ధాతువు పరమైతే సకారగతమైన ఉకారానికి లోపం వైకల్పికం. ౨౫

చేసుకొంటున్నాడు - చేస్కొంటున్నాడు - చేసుకుంటున్నాడు - చేస్కుంటున్నాడు మొదలైనవి గ్రహించాలి.

తా తు తూ తేలు పరమైతే చకారానికి సకారం ద్విత్వోత్వాలకు లోపం బహుళం. ౨౬

వస్తాడు - తెస్తాడు - వస్తున్నాడు - తెస్తున్నాడు - వస్తూవున్నాడు - తెస్తూవున్నాడు - వస్తే - తెస్తే - బహుళగ్రహణంచేత మెచ్చుమొదలైనవాటికి ఈకార్యం జరగదు మెచ్చుతాడు - మెచ్చుతున్నాడు - మెచ్చుతూవున్నాడు - మెచ్చితే - మొదలైనవి. మెచ్చితే నాకే? మెచ్చకపోతే నాకే? ఇత్యాదులు వ్యావహారికాలు. బాహుళకంచేతనే తీర్చుతున్నాడు - ఇత్యాదుల్లో అన్యహల్ సంయుక్త చకారానికి సకారంరాదు. తీర్చుతాడు - తీర్చుతున్నాడు - తీర్చుతూవున్నాడు - తీర్చితే - అసంయుక్తావస్థలో చాకు సా నిత్యం - తీరుచు - తీరుస్తాడు - తీరుస్తున్నాడు - తీరుస్తూవున్నాడు - తీరిస్తే - మొదలైనవి.

తా తు తూ తేలు పరమైతే ఇంచు ఉత్వం లోపం సబిందు చకారానికి సకారం విభాష. ౨౭

రక్షించుతాడు - రక్షిస్తాడు - రక్షించుతున్నాడు - రక్షిస్తున్నాడు - రక్షించుతూవున్నాడు - రక్షిస్తూవున్నాడు - రక్షించితే - రక్షిస్తే - మొదలైనవి.

తా టు తూ తేలు పరమైతే అన్వాదుల నుస్థానంలో బిందుపు
తకారానికి టకారం బహుళం. ౭౮

అంటాడు - అంటున్నాడు - అంటూవున్నాడు - అంటే - అను, కను, కొను, తిను, విను ఇత్యాదు లన్వాదులు. వీటికి బిందు టకారాలు నిత్యం - బాహుళకంచేత మను ప్రభృతుల కీకార్యంలేదు - మనుతాడు - మనుతున్నాడు - మనుతూవున్నాడు - మనితే.

అటం దా దు తా తు తూ తేలు పరమైతే చెప్పు ధాతువు ద్విత్వ
పకారానికి అద్విరుక్త బకారం విభాషగా వస్తుంది. ౭౯

దా అంటే ఉభయప్రార్థనంలో దకారం ఆదేశమైన తావర్ణమని గ్రహించాలి. చెప్పటం - చెబటం - టాను దా వస్తే - చెప్పడం - చెబడం - చెప్పదాం - చెబుదాం - చెప్పుదుగాని - చెబుదుగాని - చెప్పుతాడు - చెబుతాడు - చెప్పుతున్నాడు - చెబుతున్నాడు - చెప్పుతూవున్నాడు - చెబుతూవున్నాడు - చెప్పితే - చెబితే.

తా తు తూ తేలు పరమైతే చెప్పుధాతువు ద్విత్వానికి లోపం
అంత్యస్వరలోపం వైకల్పికం. ౮౦

చెప్పుతాడు - చెపుతాడు - చెప్తాడు - చెప్పుతున్నాడు - చెపుతున్నాడు - చెప్తున్నాడు - చెప్పుతూవున్నాడు - చెపుతూవున్నాడు - చెప్తూవున్నాడు - చెప్పితే - చెపితే - చెప్తే - స్వరలోపస్థితిలో సైతం కొన్నిచోట్ల పకారానికి పూర్వోక్తబకారం కనిపిస్తున్నది - చెబ్తాడు - చెబ్తున్నాడు - చెబ్తూవున్నాడు - చెబ్తే - ఇటువంటివి సార్వత్రికాలు కావని తాత్పర్యం.

దా దు తా తు తూ తేలు పరమైతే ద్విరుక్త టకారానికి
అద్విరుక్త డకారం విభాషగా వస్తుంది. ౮౧

కొట్టుతున్నాడు - కొడుతున్నాడు - కొట్టుతూవున్నాడు - కొడుతూవున్నాడు - కొట్టితే - కొడితే - కొట్టు - కిట్టు - తట్టు - తిట్టు - పెట్టు - మొట్టు - ప్రభృతులకు ఈవిధంగానే విభాషగా డాదేశం.

దా తాలు పరమైతే టాదేశ డకార ఉత్వానికి అత్వం
నిత్యం. ౮౨

కొట్టుదాం - కొడదాం - తిట్టుదాం - తిడదాం - కొట్టుతాడు - కొడతాడు -

తిట్టుతాడు - తిడతాడు - పెట్టుతాడు - పెడతాడు - మొదలైనవి - కొడుదాం - తిడుదాం - కొడుతాడు - తిడుతాడు - పెడుతాడని కొందరు ఉత్వవిశిష్టంగా ప్రయోగిస్తారు కాని అది మహాజనవ్యవహారవిరుద్ధం.

దా తాలు పరమైతే ఆదేశాత్వానికి లోపం వైకల్పికం. ౯౩

దా తాలు పరమైతే టాదేశడకార ఉత్వానికి ఆదేశమైన అత్వానికి లోపం వైకల్పికమని తాత్పర్యం.

కొడదాం - కొడ్దాం - తిడదాం - తిడ్దాం - కొడతాడు - కొడ్తాడు - తిడతాడు - తిడ్తాడు - పెడతాడు - పెడ్తాడు - ఇత్యాదులు గ్రాహ్యాలు.

తూ తు తేలు పరమైతే టాదేశ డ స్వరానికి లోపం కొన్నిచోట్ల కనిపిస్తున్నది. ౯౪

కొడ్తూఉన్నాడు - కొడ్తున్నాడు - కొడ్తే - మొదలైనవి.

తా తు తూ తేలు పరమైతే ఈదు ప్రభృతుల దకారానికి తకారం ఉత్వానికి లోపం విభాష. ౯౫

ఈదుతాడు - ఈత్తాడు - ఈదుతున్నాడు - ఈత్తున్నాడు - ఈదుతూవున్నాడు - ఈత్తూవున్నాడు - ఈదితే - ఈత్తే - మొదలైనవి. ఈదు - ఊదు - ఏదు - ఓదు - చీదు - పాదు - బాదు - మోదు - ఇత్యాదులు ఈదు ప్రభృతులు - వ్యవస్థిత విభాషచేత ఉత్వానికి లోపంరానిపక్షంలో దకారానికి తకారంరాదు.

దా దు తా తు తూ తేలు పరమైతే వెడలు లువర్ణానికి లోపం వైకల్పికం. ౯౬

దా దు తూ తు తేలు పరమైతే లు లోప పక్షంలో వెడలు అత్వానికి ఉత్వం బహుళం. ౯౭

వెడుదాం - వెళుదాం - వెళ్దాం - వెడదాం - వెళదాం - వెడుదును - వెళుదును - వెళ్దను - వెడుతూవున్నాడు - వెడుతున్నాడు - వెడితే - తావర్ణానికి సూత్రంలో గ్రహణలేకపోవడంచేత వెడతాడు అన్నప్పుడు ఉత్వంరాదు. లువర్ణానికి లోపంవస్తే డాకు ళకారం వైకల్పికం - వెడతాడు - వెళతాడు - వెళుతాడు - వెళ్తాడు - వెడుతున్నాడు - వెళుతున్నాడు - వెడుతూవున్నాడు - వెళుతూవున్నాడు - వెడితే - వెళితే. లేవమ్మా వెడదాం — ర 31.

తా తు తూ తేలు పరమైతే వెళ్లు ద్విత్వోత్వేత్వాలకు లోపం వైకల్పికం. ౯౮

వెళ్లుతాడు - వెళుతాడు - వెళతాడు - వెళ్తాడు - వెళ్లుతున్నాడు - వెళుతున్నాడు - వెళ్తున్నాడు - వెళ్లతూవున్నాడు - వెళుతూవున్నాడు - వెళ్తూవున్నాడు - వెళ్లితే - వెళితే - వెళ్తే - భూతంలో ఇవర్ణాగమం నిత్యం కాబట్టి తే పరమైతే యీసూత్రంచేత వెళ్లు ధాతువు ఇత్వానికి లోపం వైకల్పికంగా విధించబడింది.

ఉన్నశబ్దం పరమైతే ఉండు ధాతువుకి లోపం వస్తుంది. ౯౯

ఉన్నాడు - ఉన్నారు - ఉన్నది - ఉన్నవి - ఉన్నాది - ఉన్నాయి - ఉన్నావు - ఉన్నారు - ఉన్నాను - ఉన్నాము.

తా తు తూ తేలు పరమైతే ఉండు డు లోపం తకారానికి టకారం వస్తుంది. ౧౦౦

ఉంటాడు - ఉంటారు - ఉంటున్నాడు - ఉంటున్నారు - ఉంటూవున్నాడు - ఉంటూవున్నారు - ఉంటే.

చే దాద్యర్థ న ప్రత్యయాంతమైన ఉండుకు ఉన్నాదేశం విభాషగా వస్తుంది. ౧౦౧

ఉండినా - ఉన్నా - ఉండినప్పటికీ అని అర్థం.

మువర్ణాంత అట ప్రత్యయం పరమైతే అన్వాదుల ను స్థానంలో సున్నా ఉండు డు లోపం విభాషగా వస్తుంది. ౧౦౨

అనుట - అనటము - అంటము - అనటం - అంటం - ఉండుట - ఉండటం - ఉంటం - వ్యవస్థితవిభాషచేత ఈకార్యం మన్వాదులకు జరగదు - మనటం - అటప్రత్యయం అని కేవల టకారనిర్దేశం చెయ్యడంవల్ల అడప్రత్యయానికి ఈకార్యం లేదని గ్రహించాలి.

బింద్వాదేశ డు వర్ణలోపాలు జరిగితే అటము ము వర్ణానికి లోపం వైకల్పికం. ౧౦౩

అనటం - అంటం - అంట - వినటం - వింటం - వింట - ఉండటం - ఉంటం - ఉంట - అదే వాడిందాక అంట - ఈసంగతే నేనప్పుడు వింట - అక్కడే వీడుంట - ఇటువంటివి మహాజనవ్యవహారంలో గుర్తించాలి.

ఆత్మనేపదార్థకమైన ధాతువు ఒత్వంమీది ను వర్ణానికి లోపం పూర్వస్వరానికి దీర్ఘం బహుళం. ౧౦౪

బాహుళకంచేత తా తు తూ తే నలు పరమైతే ఈకార్యంరాదు - అనుకొంటాడు - అనుకొంటున్నాడు - అనుకొంటూవున్నాడు - అనుకొంటే - అనుకొనిన - అనుకొన్న - ఇక్కడ ను లోపపూర్వస్వరదీర్ఘాలురావు - అనుకోడు - అనుకొనడు - అనుకోగలడు - అనుకొనగలడు - అనుకోబోయాడు - అనుకొనబోయాడు - ఇలాగే చేసుకోడు మొదలైనవి ఊహ్యాలు. బహుళగ్రహణంచేత పతె కాదేశమైన అలి పరమైనప్పుడు ను వర్ణానికి లోపం పూర్వస్వరానికి దీర్ఘం నిత్యం-కను కొను ధాతువులు ఆత్మనేపదార్థకాలైనప్పుడు అనుప్రయుక్తమైన కొనుధాతువు కకారానికి ద్విత్వం రావడం బాహుళకంచేతనే అని గ్రహించాలి. కనుక్కొను - కొనుక్కొను - కనుక్కొన్నాడు - కనుక్కొన్నారు - కొనుక్కొన్నాడు - కొనుక్కొన్నారు. గ్రాంథికభాషాక్షీరార్ణవరాజహంస అయిన చిన్నయసూరి చెప్పినవిధంగా అనుప్రయుక్తమైన కొనుధాతువుకి కో ఆదేశం చెప్పకుండా ఆత్మనేపదార్థకమైన ధాతువుఅనడంచేత కూర్చొను ప్రభృతులకుసైతం యీకార్యప్రవృత్తి సాధించబడింది. కూర్చోడు - కూర్చొనడు - కూర్చోగలడు - కూర్చొనగలడు - కూర్చోబోయాడు - కూర్చొనబోయాడు ఇత్యాదులూహ్యాలు.

ఓకారాంతాత్మనేపదార్థకాలకు కా రా తేలకు అలి అడం వర్ణకాలు పరమైతే నిత్యవైకల్పికంగా వకారాగమం వస్తుంది. ౧౦౫

ఆడుకోవాలి - తీసుకోవాలి - కావాలి - రావాలి - తేవాలి - ఆడుకోవడం - ఆడుకోడం - తీసుకోవడం - తీసుకోడం - కావడం - కాడం - రావడం - రాడం - తేవడం - తేడం - ఓకారాంత ఆత్మనేపదార్థకాల కనడంచేత కూర్చోవాలి కూర్చోవడం - కూర్చోడం - మొదలైనవి అడం డకారగ్రహణంవల్ల టకారంసైతం గ్రాహ్యం కా రా తే లకు వకారాగమం శిష్టవ్యావహారికంలో తరచుగా కనిపిస్తున్నది.

ఓకారాంతాత్మనేపదార్థకాల కా రా తేలమీది అడం అత్వానికి పూర్వరూపం వస్తుంది. ౧౦౬

వకారాగమ అభావంలో ఈపూర్వరూపకార్యం వస్తుందని గుర్తించాలి. అడం అని డకార గ్రహణం చెయ్యడంచేత అటం టకారరూపానికిసైతం గ్రహణ-

అడుకోడం - అడుకోటం - పాక్షికంగా పూర్వసూత్రంచేత వకారాగమరూపం - కూర్చోడం - కూర్చోటం - కాడం - కాటం - రాడం - రాటం - తేడం - తేటం - వకారాగమరహిత కా రా తే ల భావార్థకరూపాలు శిష్టవ్యవహారికంలో అరుదుగా కనిపిస్తున్నవి.

మధ్యమ ము అండులు పరమైతే దీర్ఘానికి హ్రస్వం మువర్ణ
కానికి ద్విత్వం విభాష. ౧౦౭

ముందు ఉదాహరణలవల్ల స్పష్టపడుతుంది.

ఓకారాంతాత్మనేపదార్థకాల కా రా తేల మధ్యమ మువర్ణ
కానికి లోపం బహుళం. ౧౦౮

తీసికో - చేసికో - కూర్చో - నిల్చో - హల్లుపరమైతే - తీసికోరా - చేసికోరా - కూర్చోరా - నిల్చోరా - అచ్చుపరమైతే ములోపం విభాష - తీసుకో అన్నాడు - తీసుకోమన్నాడు - పూర్వసూత్రంచేత పాక్షికంగా హ్రస్వద్విత్వాలు వస్తే తీసుకొమ్మన్నాడు - మొదలైనవి. బాహుళకంచేత ద్విత్వావస్థలో ము వర్ణానికి లోపంరాదు - బహుళగ్రహణంచేత హలవసానాలు పరమైతే లోపం నిత్యం.

ఓకారాంత ఆత్మనేపదార్థకాల కా రా తే పోలమీది అండి
అకారానికి లోపం నిత్యం. ౧౦౯

తీసుకోండి - కూర్చోండి - నిల్చోండి - కాండి - రాండి - తేండి - పోండి - పూర్వసూత్రంచేత దీర్ఘానికి హ్రస్వంవస్తే తీసుకొండి - కూర్చొండి - నిల్చొండి - కండి - రండి - పొండి - తెండి. అండి ప్రయోగంలో కా రా తే పో లకు హ్రస్వం శిష్టవ్యావహారికంలొ తరచుగా కనిపిస్తున్నది.

సంస్కృతాలకు అంగలాదులకు నామధాతువులకు ఇంచు
అనుప్రయుక్తమౌతుంది. ౧౧౦

సంస్కృతధాతువులకు, అంగలప్రభృతులకు, నామధాతువులకు ఇంచు అనుప్రయుక్తమవుతుందని తాత్పర్యం - వచించు - పచించు - త్యజించు భజించు - యజించు - ఇత్యాదులు సంస్కృతధాతువులు - అంగలించు - అరగించు - అవులించు - ఉంకించు - ఉగ్గడించు - కారించు - గాలించు - జాడించు - తిలకించు - తులకించు - పంకించు - పరికించు - పలవరించు -

ఒప్పించు - ఆలించు - మొదలైనవి అంగలాదులు. శయనించు - పయనించు - అడ్డగించు - ఇత్యాదులు నామధాతువులు.

ఇంచుపరమైతే నామధాతువుల విభక్తి ప్రత్యయాలకు లోపం వస్తుంది. ౧౧౧

అడ్డము - అడ్డగించు - పయనము - పయనించు - శయనము - శయనించు - ఇత్యాదులూహ్యాలు.

ఇంచు పరమైతే ఇ ఉ ఋ లకు అయవర్‌లు ఆదేశ మవుతాయి. ౧౧౨

అయ్ - జి - జయించు - నీ - నయించు - అవ్ - ద్రు - ద్రవించు - లూ - లవించు - అర్ - ధృ - ధరించు - తౄ - తరించు - మొదలైనవి.

నిర్జినామాలకు అయాగమం రాదు. ౧౧౩

నిర్జిధాతువుకి నామధాతువులకు ఇంచుపరమైతే అయ్ ఆగమంరాదని తాత్పర్యం.

నిర్జించు - నుతించు - స్తుతించు.

లఘూపదాలైన సంస్కృత ధాతువులకు ఇంచు పరమైతే ఏ ఓ అర్ లు బహుళంగా ఆదేశా లవుతాయి. ౧౧౪

ఇంచు పరమైతే సంస్కృతధాతుగతమై ఉపధలుగా ఉన్న ఇ ఉ ఋ లకు క్రమంగా ఏ ఓ అర్‌లు బాహుళంగా ఆదేశా లవుతాయని తాత్పర్యం - ఇ-ఛిద్ - ఛేదించు - భిద్ - భేదించు - ఉ - ఘుష్ - ఘోషించు - పుష్ - పోషించు - ఋ - వృష్ - వర్షించు - హృష్ - హర్షించు - మొదలైనవి. బహుళగ్రహణంచేత కుచ్ స్పృశ్ లకు ఓ అర్‌లు విభాషగా వస్తాయి - సంకుచించు - సంకోచించు - స్పర్శించు-స్పృశించు - లిఖ భుజ రుచ కృశ లకు ఏ ఓ అర్‌లు రాకపోవడం బాహుళకంచేతనేనని గ్రహించాలి. లిఖించు - భుజించు - రుచించు - కృశించు - ఇక్కడ ఆదేశంలేదు. ఉత్ పూర్వకమైన లిఖధాతువుకి ఏత్వంవస్తుంది. ఉల్లేఖించు-బహుళశబ్దప్రయోగంచేతనే సృజికి నిర్మాణార్థంలో అరాదేశంరాదు. అన్యార్థంలో వస్తుంది. శాంతిని సృజించాడు - బుద్ధుడు విషయాలను విసర్జించాడు - సృష్టిశబ్దంమీదసైతం ఇంచు వ్యవహారంలో చేరుతున్నది - సృష్టించు - సృష్టించాడు - సృష్టించారు - మొదలైనవి.

ఇంచు పరమైతే హ్వా పరక ఉదా దీర్ఘానికి హ్రస్వం
వైకల్పికం. ౧౧౫

ఉదాహరించు - ఉదహరించు.

ఇంచుపరమైతే హెచ్చరిక కవర్ణం లోపిస్తుంది. ౧౧౬

హెచ్చరించు.

ప్రేరణార్థంలో సర్వధాతువులకు ఇంచు అనుప్రయుక్త
మవుతుంది. ౧౧౭

పచింపించు - వచింపించు - ఆపులింపించు - వండించు - పండించు - మొదలైనవి.

రంజాదుల ఇంచు బిందుపూర్వక చకారానికి అప్రేరణంలో
ద్విత్వలకారం వస్తుంది. ౧౧౮

రంజిల్లు - భాసిల్లు - వర్ధిల్లు - విలసిల్లు - రాజిల్లు ఈఆదేశంవచ్చినప్పుడు ఛిదాదులు అకర్మక ధాతువు లవుతాయి - ఛేదిల్లు - కంపిల్లు - సంధిల్లు- ఇత్యాదులూహ్యాలు.

ప్రేరణార్థకమైన ఇంచుపరమైతే రంజాదుల ఇంచుకు
లోపం వస్తుంది. ౧౧౯

లాదేశసూత్రాని కిది అపవాదసూత్రం - రంజించు - ఛేదించు - సంధించు- మొదలైనవి.

అసంయుక్త స ల డ రాంతాలైన అచ్ఛిక ధాతువులకు
ప్రేరణంలో చువర్ణాగమం బహుళంగా వస్తుంది. ౧౨౦

పూను - పూనుచు - పూనించు - తేలు - తేలుచు - తేలించు - కుదురు - కుదురుచు - కుదిరించు - మొదలైనవి. బహుళగ్రహణంచేత కొన్నిటికి చు వర్ణాగమంరాదు - వక్ష్యమాణసూత్రంచేత పు వర్ణాగమం వస్తే - విను - వినిపించు- అను - అనిపించు - తిను - తినిపించు - కను - కనిపించు - మొదలైనవి. ఊహ్యాలు - బాహుళకంచేత చెడు - పడులకు చు వర్ణం నిత్యం - చెరుచు - పరుచు - డకారానికి రేఫాదేశంసైతం బాహుళకంచేతనే అని గ్రహించాలి.

ప్రేరణంలో మాన్వాదులకు పువర్ణాగమం బహుళంగా వస్తుంది. ౧౨౧

మాను - మానుపు - మను - మనుపు - మనుచు - చెరు - చెరుపు - చెరుచు - బహుళగ్రహణంచేత మను ధాతువుకి ఇంచులేదు.

**చు** పు వర్ణాలు పరమైతే ఇత్వానికి ఉత్వం వస్తుంది. ౧౨౨

కలియు - కలుపు - తడియు - తడుపు - తెలియు - తెలుపు - బిగియు - బిగుపు - ఇత్యాదులూహ్యాలు.

అడగ్వాదులకు చువర్ణాగమం బహుళంగా వస్తుంది; వస్తే వాటి తుదివర్ణం లోపిస్తుంది. ౧౨౩

అడగు - అడచు - అడగించు - కరగు - కరచు - కరగించు - కలగు - కలచు - కలగించు నలగు - నలచు - నలగించు - ఆగు - ఆచు - ఆగించు - రేగు - రేచు - రేగించు - పాయు - పాచు - పాయించు - ఇత్యాదులు వ్యవహారవేద్యాలు.

మాయు ప్రభృతులకు పువర్ణాగమం బహుళంగా వస్తుంది; వస్తే వాటి తుదివర్ణం లోపిస్తుంది. ౧౨౪

మాయు - మాపు - మాయించు - ఉడుగు - ఉడుపు - ఉడిగించు - కడచు - కడపు - కడపించు - కుడుచు - కుడుపు - కుడిపించు - బిగియు - బిగుపు - బిగియించు - చూచు - చూపు - నేరుచు - నేరుపు - మేయు - మేపు - లేచు - లేపు - కలియు - కలుపు - తడియు - తడుపు - తెలియు - తెలుపు - ఆగు - ఆపు - ఆగించు - రేగు - రేపు - రేగించు - పాయు - పాపు - పాయించు - ఇత్యాదులు మాయ్వాదులు - ఆగు ప్రభృతులకు అడగ్వాది మాయ్వాదుల్లో రెండింటిలోను పరిగణన - బాహుళకంచేత కొన్నిటికి ఇంచు చు పు ఆగమాలు మూడు - కొన్నిటికి వాటిలో యథాసంభవంగా రెండు-కొన్నిటికి ఒక్కటి మాత్రం వస్తుందని తెల్సుకోవాలి.

ఇంచు చు పు ఆగమాలు పరమైతే ఆదేశాగమలోపాలు అనేకవిధాలుగా కనిపిస్తున్నాయి. ౧౨౫

అగు - కావించు, కానిచ్చు - వచ్చు - రావించు - రప్పించు - విన్నపం - విన్నవించు - మొకాలు - మొకరించు - కేక - కేకరించు - కెక్కరించు -

పలవ - పలవరించు - అల - అలకించు - అలించు - వ్రక్క-వ్రక్కలించు - నొచ్చు - నొంచు - నొప్పించు - ఉండు - ఉనుచు - ఉంచు - దిగు - దించు - పెరుగు - పెంచు - తునుగు - తుంచు - త్రుంచు - మునుగు - ముంచు - చొచ్చు - చొనుపు - చొప్పించు - చినుగు - చించు - చింపు - నిలుచు - నిలువరించు - నిలుపు - పోవు - పుచ్చు - అనుప్రయుక్తమైనపుడు పోవుకి పుచ్చుమాత్రం వస్తుంది - మోసపోవు - మోసపుచ్చు - మొదలైనవి తెల్సుకోవాలి.

ఇంచు పరమైతే అన్వాదులకు పువర్ణాగమం వస్తుంది. ౧౨౬

అను - అనిపించు - కను - కనిపించు - తిను - తినిపించు - మాను - మానిపించు - విను - వినిపించు మొదలైనవి.

ఇంచు పరమైతే అడ్డాదులకు గువర్ణాగమం వస్తుంది; కోప శబ్దానికి వైకల్పికంగా వస్తుంది. ౧౨౭

అడ్డం - అడ్డగించు - ఓర - ఒరగించు - చిత్తం - చిత్తగించు - పంతం - పంతగించు - పెల్ల - పెల్లగించు - బీర - బీరగించు - మట్టం - మట్టగించు - మేళం మేళగించు - అప్ప - అప్పగించు - ఒప్ప - ఒప్పగించు - పల్ల - పల్లగించు - కోప - కోపించు - కోపగించు - ఇత్యాద్యమలడ్డాదులు.

ఇంచు చకారానికి ద్విత్వం పూర్వమందలి పూర్ణబిందువుకి లోపం విభాష. ౧౨౮

తేలు - తేలించు - తేలిచ్చు - కుదురు - కుదిరించు - కుదిరిచ్చు - అను - అనిపించు - అనిపిచ్చు - తిను - తినిపించు - తినిపిచ్చు - మాను - మానిపించు - మానిపిచ్చు - అడ్డు - అడ్డగించు - అడ్డగిచ్చు - ఒప్పు - ఒప్పించు - ఒప్పిచ్చు - కోపగించు - కోపగిచ్చు - అప్రేరణంలో - అలించు - అలిచ్చు - పరికించు - పరికిచ్చు - అవులించు - అవులిచ్చు - జాడించు - జాడిచ్చు - మొదలైనవి - ఇంచుమీదవలెనే ఇచ్చుమీద లోకవ్యవహారానుగుణంగా రూపాలు గ్రాహ్యాలు.

చువర్ణం పరమైతే ఆ డోడు కూడు పడుల డకారం రేఫ అవుతుంది. ౧౨౯

ఆడు - ఆరుచు - ఆడించు - ఆడిచ్చు - ఓడు - ఓరుచు - ఓడించు - ఓడిచ్చు - కూడు - కూరుచు - కూడించు - కూడిచ్చు - పడు - పరుచు.

చు పు వర్ణాలు పరమైతే చెడు డకారం రేఫ అవుతుంది. ౧౩౦

చెడు - చెరుచు - చెరుపు.

శబ్దపల్లవమైన పడుకి ఇంచు విభాషగా వస్తుంది;
వస్తే డకారం రేఫ అవుతుంది. ౧౩౧

వెలువడు - వెలువడించు - వెలువడిచ్చు - చొప్పడు - చొప్పడించు - చొప్పడిచ్చు - చు వర్ణంపరమైతే పూర్వసూత్రంచేత రేఫవస్తే వెలువరుచు - చొప్పరుచు.

ప్రేరణంలో ఇంచుమీద ఇంచు రాదు. ౧౩౨

ప్రేరణార్థకమైన ఇంచుమీద మరో ఇంచు రాదని తాత్పర్యం - ఇంచుమీద అనడంచేత ప్రేరణార్థకాలైన చు పుల మీద ఇంచు రావచ్చును - నొచ్చు - నొంచు - నొంపించు - నొంపిచ్చు - చచ్చు - చంపు - చంపించు - చంపిచ్చు.

ఇత్వం గాని హాత్వంగాని కూడితే అనాద్యమైన
ఉత్వానికి ఇత్వం బహుళంగా వస్తుంది. ౧౩౩

నిగుడు - నిగిడి - నిగిడేడు - నిగిడేను - మునుగు - మునిగి - మునిగేడు - మునిగేను - బాహుళకంచేత - వందురి - పురుడించి - అవులించి - పురుడించేడు - అవులించేడు - ఇత్యాదుల్లో ఉత్వానికి ఇత్వంరాదు.

ప్రేరణేంచు పరమైతే పూర్వచకారానికి పకారం
బహుళంగా వస్తుంది. ౧౩౪

పచించు - పచింపించు - వచించు - వచింపించు - పిలుచు - పిలిపించు - వలచు -వలపించు - మెచ్చు - మెప్పించు - బాహుళకంచేత హెచ్చుకి పత్వంలేదు - హెచ్చించు.

అద్విరుక్తమైన ఆగమ చకారానికి పకారం వ్యతిరేక
మధ్యమల్లో విభాషగా వస్తుంది. ౧౩౫

వ్యతిరేకార్థంలో - పచింపడు - పచించడు - వచింపడు - వచించడు - మధ్యమపురుషలో - పచింపుము - పచించుము - వచింపుడు - పచించుడు - వచింపుము - వచించుము - వచింపుడు - వచించుడు - మొదలైనవి.

అద్వ్యర్థకమైన ఆగమ చకారానికి వ్యతిరేక మధ్యమల్లో
నిత్యంగా వకారం వస్తుంది. ౧౩౬

పిలువడు - పిలువుడు - పిలువుము.

వ్యతిరేక మధ్యమల్లో తలచు ప్రభృతుల సిద్ధ చకారానికి
పకారం విభాష. ౧౩౭

తలపక - తలచక - త్రేపక - త్రేచక - ఏపక - ఏచక వ్యవస్థితవిభాష చేత నోచుకు పకారంరాదు - నోచు - నోచక.

తా తు ప్రభృతులు పరమైతే బిందువుమీది సిద్ధచకారానికి
పకారం బహుళంగా వస్తుంది. ౧౩౮

దంచుతారు - దంపుతారు - దంచుతున్నారు - దంపుతున్నారు - చించుతారు - చింపుతారు - చించుతున్నారు - చింపుతున్నారు - ప్రభృతిశబ్దంచేత అన్-ఇనన్ - తూ-తే లు గ్రాహ్యాలు - దంచగా - దంపగా - చించగా - చింపగా - దంచినా - దంపినా - చించినా - చింపినా - దంచుతూ - దంపుతూ - చించుతూ - చింపుతూ - దంచితే - దంపితే - చించితే - చింపితే. ఇలాగే తెంచు - దించు - వంచు - నించు - ప్రభృతులకు ఈకార్యం జరుగుతుందని గ్రహించాలి. బాహుళకంచేత ముంచు ప్రభృతులకు మించు ప్రభృతులకు ఈకార్యంజరగదు. ముంచుతారు - ముంచుతున్నారు - ముంచుతూ - ముంచితే- ముంచగా - ముంచినా - మించుతారు - మించుతున్నారు - మించుతూ - మించితే - మించగా - మించినా - ఇత్యాదులూహ్యాలు.

వచ్చు-చొచ్చు-చూచులకు వ్యతిరేక తుమాద్యర్థాల్లోను
పడుకలల మధ్యమ ము అండుల యోగంలోను
రా-చొరు-చూడు లవుతాయి. ౧౩౯

వచ్చు - రాడు - రారు - రాదు - రావు - రాగా - రానిమ్ము - రాబడు - రాగల - రా - రాండి - రండి. చొచ్చు - చొరడు - చొరరు - చొరదు - చొరవు - చొరగా - చొరనిమ్ము - చొరబడు - చొరగల - చొరుము - చొరండి. చూచు - చూడడు - చూడరు - చూడదు - చూడవు - చూడగా - చూడనిమ్ము - చూడబడు - చూడగల - చూడు - చూడండి - మొదలైనవి. ఆదిశబ్దంచేత భావ లక్షణాదులు గ్రాహ్యాలు.

అగు ధాతువుకు వ్యతిరేక తుమాద్యర్థాల్లోను పడు కలల మధ్యమ ము అండుల యోగంలోను కా విభాషగా వస్తుంది. ౧౪౦

అగు - కాడు - కారు - కాదు - కావు - కాగా - కాబడు - కాగల - కా - కండి - కాండి - పక్షంలో అపదాద్యమైన గకారానికి వకారం వక్ష్యమాణ సూత్రంచేత విభాషగా ద్విత్వం - అవ్వడు - అవ్వరు - అవ్వదు - అవ్వవు - అవ్వగా - అవ్వబడు - అవ్వగల - అవ్వ - అవ్వండి - మొదలైనవి ఊహ్యాలు.

ఇచ్చుకు ఈ విభాషగా వస్తుంది. ౧౪౧

ఈడు - ఈరు - ఈదు - ఈవు - ఈము - ఇమ్మ - ఇండి - ఈండి - ఈబడు - ఈగల - వ్యవస్థిత విభాషచేత వాదేశస్థితిలో ఈ ఆదేశంరాదు.

ఇచ్చు చకారానికి యవలు బహుళంగా వస్తాయి. ౧౪౨

ఇయ్యడు - ఇయ్యరు - ఇయ్యదు - ఇయ్యవు - ఇయ్యగా - ఇయ్యము - ఇయ్య - ఇయ్యండి - ఇయ్యడం - ఇవ్వడు - ఇవ్వరు - ఇవ్వదు - ఇవ్వవు - ఇవ్వగా - ఇవ్వము - ఇవ్వండి - ఇవ్వడం - ఇత్యాదులూహ్యాలు.

ఇచ్చు చాదేశ యద్విత్వానికి లోపం పూర్వస్వరానికి దీర్ఘం విభాష. ౧౪౩

ఈయడు - ఈయరు - ఈయదు - ఈయవు - ఈయగా - ఈయము - ఈయండి - ఈయడం.

తెచ్చుకు తేవస్తుంది. ౧౪౪

తేడు - తేరు - తేదు - తేవు - తేము - తెమ్మ - తేమన్నాడు - తెమ్మన్నాడు - తేగా - తేబడు - తేగల - తే - తెండి - తేండి - తేడం-మొదలైనవి. తెచ్చుకాదేశమైతే ఏత్వానికి తరచుగా ఓత్వం కనిపిస్తున్నది. తోడు - తోరు - తోదు - తోవు - ఇత్యాదులూహ్యాలు. తరచు శబ్దప్రయోగంవల్ల ఈకార్యం సార్వత్రికం కాదని గ్రహించాలి. తే. ఇక్కడ ఓత్వం రాదు.

చచ్చు నొచ్చులకు చావు నోవులు నిత్యవైకల్పికాలు. ౧౪౫

చచ్చు - చావడం - చావడు - చావరు - చావదు - చావవు - చావము - చావగా - చావుము - చావండి. నొచ్చు - నోవడం - నోవడు - నోవరు -

నోవదు - నోవవు - నోవగా - నోవుము - నోవండి - నొచ్చడం - నొచ్చడు - నొచ్చరు - నొవ్వదు - నొవ్వవు - నొచ్చగా - నొచ్చుము - నొచ్చండి - ఇత్యాదులూహ్యాలు. నొచ్చువాదేశరహితరూపాలు సకృత్తుగా వ్యవహారంలో కనిపిస్తున్నాయి.

అగు-వచ్చు-తెచ్చు-చొచ్చులకు భావార్థకం పరమైతే కా కావ-రా రావ-తే తేవ-చొరులు బహుళంగా వస్తాయి. ౧౪౬

అగు - కాడం - కావడం - వచ్చు - రాడం - రావడం - తెచ్చు - తేడం - తేవడం - చొచ్చు - చొరడం - బాహుళకంచేత చొచ్చుకు చొరు నిత్యం - అగుకు కా కావలు రాని పక్షంలో వక్ష్యమాణవిధిచేత అవడం - అవ్వడం - రూపాలు గ్రాహ్యాలు. భావార్థకమైన ట వర్ణకం పరమైతే ధాతువుకు అగమాదేశాదులులేవు - అడం - అటం వర్ణకాలు పరమైతేనే విశేషకార్యాలు.

కను ధాతువు తొలిహ్రస్వానికి వ్యతిరేకాద్యర్థాల్లోను పడు కలాదుల యోగంలోను దీర్ఘం విభాషగా వస్తుంది. ౧౪౭

కనడు - కానడు - కనరు - కానరు - కనదు - కానదు - కనవు - కానవు - కనము - కానము - కనబడు - కానబడు - కనగల - కానగల - ఆదిశబ్దంచేత కనరాదు - కానరాదు-కనిపించు - కానిపించు ఇత్యాదులూహ్యాలు.

అగు గాదేశ వకారానికి ద్విత్వం విభాష. ౧౪౮

అపదాద్యమై అసంయుక్తమైన ఇత్యాదిపూర్వోక్తవిధిచేత గకారానికి వకారం- అవుతాడు - అవ్వుతాడు - అవడు - అవ్వడు - అవరు - అవ్వరు - అవుము - అవ్వుము - అవండి - అవ్వండి - మొదలైనవి. ద్విత్వాభావంలో పాక్షికంగా అవుకు వక్రతమంవస్తే-ఔతాడు - ఔతారు - ఔతావు - ఔతారు - ఔతాను - ఔతాము - ఔము - ఇత్యాదులూహ్యాలు.

పోవుకు వు లోపం బహుళం. ౧౪౯

పోతాడు - పోతారు - పోడు - పో - పొమ్ము - బాహుళకంచేత పోడం - పోవడం - పోగలడు - పోవగలడు - ఇత్యాదుల్లో విభాష.

ము అండులు పరమైతే పోవుకు పద విభాషగా వస్తుంది. ౧౫౦

పోవుము - పొమ్ము - పో - పద - ఇక్కడ ము లోపం నిత్యంగా కనిపిస్తున్నది - పోండి - పొండి - పదండి.

ఇకారం పరమైతే అగు పోవుల కడవ్రాయి యకార
మవుతుంది. ౧౫౧

అగుధాతువు ఎత్వాంతమై గకారానికి యకారంవచ్చి కొన్నిచోట్ల అనుప్రయుక్తమై వ్యవహరించబడుతున్నది. వక్ష్యమాణసూత్రంలో ఈవిషయం స్పష్టపడుతుంది.

అగు యకారానికి ద్విత్వం బహుళం. ౧౫౨

అగు గకారానికి ఆదేశమైన యకారానికి ద్విత్వం బాహుళకమని తాత్పర్యం.

అయ్యి - అయి - అయ్యింది - అయింది - బాహుళకంచేత అయ్యాడు - అయ్యారు - అయ్యావు - పొయ్యారు - అయ్యాను - అయ్యాము - ఇత్యాదుల్లో మాత్రం ద్విత్వం నిత్యం.

పోవు వకారానికి ఆదేశమైన యకారానికిసైతం కొన్నిచోట్ల ద్విత్వంకనిపిస్తున్నది. పొయ్యి - పోయి - పొయ్యాడు - పొయ్యావు - పొయ్యారు - పొయ్యాను-పోయ్యాము - ఇత్యాదులు. కొన్నిచోట్ల అనడంవల్ల శిష్టవ్యవహారంలో వైరళ్యం సూచించబడింది.

వ్యతిరేకార్థంలోను మధ్యమ ము అండుల యోగంలోను పిలుచు
ప్రభృతుల కడవ్రాయికి లోపం బహుళం. ౧౫౩

పిలుచు - పిలడు - పిలువడు - పిలుము - పిలు - పిలువుము - పిలువు - లేచు - లెమ్ము - లే - లెమ్మంటే - లేమంటే - లేవండి - లేండి - లెండి - ఇత్యాదులూహ్యాలు - పిలుచు - నిలుచు - తలగు - లేచు - ఇత్యాదులు పిలుచు ప్రభృతులు. ఇది ఆకృతిగణం - బహుళగ్రహణచేత పడుయోగంలో అన్నంత నిలుచు ధాతువు కీకార్యం పాక్షికంగా జరుగుతుంది - నిలువబడు - నిలబడు.

వ్యతిరేకార్థక అకారం పరమైతే అనాద్యమైన ఉత్వాని
కత్వం వైకల్పికం ౧౫౪

అడుగక - అడగక - మునుగక - మునగక - అలుగక - అలగక - అరుగక - అరగక - తరుగక - తరగక - ఇత్యాదులు.

వ్యతిరేకవ్యతిరిక్త మధ్యమ ము అండుల కచ్చుపరమైతే
అనాద్యమైన ఉత్వానికత్వం బహుళం. ౧౫౫

అడుగు - అడుగుము - అడుగుమన్నాడు - అడుగమన్నాడు - అడగమన్నాడు - అడుగండిఅన్నాడు - అడగండిఅన్నాడు - బహుళగ్రహణంచేత

అడగుమన్నాడువంటి రూపాలుకావు. ద్వితీయఉకారానికి అకారంవచ్చి తర్వాతి దానికి రాకుండా ఉండదనితాత్పర్యం - మీరు అడగండి - ఇత్యాదుల్లో అండికి అచ్చుపరంకాకపోయినా ఉత్వానికత్వంరావడం బాహుళకంచేతనేనని గ్రహించాలి.

అచ్చికాల్లో అయి అవులకు వక్రతమాలు బహుళం. ౧౫౬

అయిదు - ఐదు - అయితే - ఐతే-మయిదు - మైదు - మయిలు - మైలు - ఇక్కడ మైలుమాలిన్యార్థకం - తయిదులు - తైదులు - పయిన - పైన - అవుగాక - ఔగాక - కవుగిలి - కౌగిలి - గవుద - గౌద - జవుజవ్వన - జౌజవ్వన - తవుడు - తౌడు - ఇత్యాదులూహ్యాలు. దౌవుదౌవుల - దవుదౌవుల- దౌవుదవుల - ఇత్యాదుల్లో దవ్వుశబ్దం అవ్‌కారానికి వక్రతమంరావడం బాహుళకం చేతనేనని గ్రహించాలి.

అనాచ్ఛికాల్లో కొన్నిచోట్ల ఐ ఔలకు అయి అవులు
కనిపిస్తున్నవి. ౧౫౭

కైక - కయిక - వైద్యం - వయిద్యం - ఔత్సుక్యం - అవుత్సుక్యం - కౌస్తుభం - కవుస్తుభం - మొదలైనవి. కనిపిస్తున్నవనడంచేత ఈకార్యం సార్వత్రికంకాదని గ్రహించాలి. సంస్కృతసమాల్లో అనక అనాచ్ఛికాల్లో అనడంచేత- మైలు - మయిలు - ఎనిమిదిఫర్లాంగులుదూరం - రైలు - రయిలు - జైలు - జయిలు - ఫైలు - ఫయిలు - మైకు - మయికు - డైరెక్టర్ - డయిరక్టర్ - పైపు - పయిపు - ప్రైవేటు - ప్రయివేటు - హైకోర్టు - హయికోర్టు - మైనరు - మయినరు - కౌన్సిలరు - కవున్సిలరు - పౌడరు - పవుడరు - ఫౌండరు - ఫవుండరు - ఇత్యాది అన్యదేశ్యాలనేకాలు రక్షితాలయ్యాయి.

అస్త్యర్థంలో కలుగు ధాతువుకి లట్టు పరమైతే కల
అవుతుంది. ౧౫౮

కలడు - కలరు - కలదు - కలవు - కలవు - కలరు - కలను - కలము - మొదలైనవి.

కర్త్రర్థంలో కలుగుకు కలాదేశం విభాష. ౧౫౯

కలవాడు - కలుగువాడు - కలిగినవాడు.

వడి వర్ణకం వ్యతిరేకార్థకం పరమైతే కలుగు ధాతువుకి
లే వస్తుంది. ౧౬౦

వడి - లేవడి - వ్యతిరేకంలో - మి - లేమి - క - లేక - ని - లేని - లేషు - లేరు - లేదు - లేవు - (నువ్వు) లేవు - లేరు - లేను - లేము.

వ్యతిరేకార్థకం పరమైతే వలచుకు ఒల్ల విభాషగా వస్తుంది౧౬౧

ఒల్లమి - ఒల్లక - ఒల్లని - ఒల్లడు - ఒల్లరు - ఒల్లదు - ఒల్లవు - ఒల్లవు - ఒల్లరు - ఒల్లను - ఒల్లము - పక్షంలో వలవమి - వలచమి - వలవక - వలచక - వలవని - వలచని - వలవడు - వలచడు - వలవరు - వలచరు - వలవదు - వలచదు - వలవవు - (నువ్వు) వలచవు - వలవవు - వలచవు - వలవరు - వలచరు - వలవను - వలచను - వలవము - వలచము-మొదలైనవి. వలవక-వలవని - ఇత్యాదిచాదేశవకారరూపాలు జనవ్యవహారంలో అప్రసిద్ధాలు.

స్వార్థంలో పడు కొనులు కొన్నిచోట్ల అనుప్రయుక్తా
లవుతాయి. ౧౬౨

చొచ్చు - చొరబడు - నిలుచు - నిలువబడు - నిలబడు - కూడు - కూడబడు - పండు - పండుకొను.

అగు ప్రభృతులకు తెంచు ధాతు వనుప్రయుక్త మవుతుంది;
అయితే తెంచు తకారానికి దకారం బహుళం. ౧౬౩

అగుదెంచు - నెగయుదెంచు. అగు - నెగయు - పోవు - చొచ్చు - వుచ్చు - తోచు - నడచు - పరచు - మొలచు - వీచు - ఇత్యాదులు అగు ప్రభృతులు.

అరుగ్వాదులకు ఆగమనార్థంలో తెంచుధాతు వనుప్రయుక్త
మవుతుంది; అయితే గువర్ణానికి లోపం వైకల్పికం. ౧౬౪

అరుగుదెంచు - అరుదెంచు - ఏగుదెంచు - ఏతెంచు - చనుదెంచు - మొదలైనవి.

చువర్ణానికి లోపం హ్రస్వంమీది తెంచు తకారానికి
ద్విత్వం వస్తుంది. ౧౬౫

చొచ్చు + తెంచు - చొత్తెంచు - వుచ్చు + తెంచు - వుత్తెంచు - తోచు + తెంచు - తోతెంచు - మొదలైనవి.

వ్యతిరేకార్థంలోను మధ్యమ ము అండుల యోగంలోను
అనుప్రయుక్తమైన తెంచుకు తే తేరు లవుతాయి. ౧౬౬

అగుదేడు - అగుదేరడు - అగుదెమ్ము - అగుదేరుము - అగుదెంకి - అగుదేరండి

అప్యర్థంలో భూతార్థక అసమాపక క్రియకు ద్రుతాంతమైన
నవర్ణం చేరుతుంది. ౧౬౭

చేరినా - కొట్టినా - తిట్టినా - అడిగినా - ద్రుతానికిలోపం పూర్వస్వరానికి దీర్ఘంనిత్యం. అప్యర్థకాలకు తరచుగా వ్యవహారంలో సరే ప్రభృతులు స్వార్థంలో అనుప్రయుక్తాలవుతాయి - కొట్టినాసరే - కొట్టినప్పటికి - అప్పటికి పరమైతే సంధి నిత్యం.

కొన్నిచోట్ల భూతార్థక క్రియకు ఏత్వాంతమైన అగు
ధాతు వనుప్రయుక్త మవుతుంది. ౧౬౮

వాడు రాడయ్యె - వాడు రాడాయె - వీరు లేరాయె - నేను తెచ్చానాయె- వారు తిన్నారయ్యె - అది రాదయ్యె - అవి పోవయ్యె - మొదలైనవి.

ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తాలయి విలక్షణార్థాభి
దాయకా లవుతాయి; వీటినే శబ్దపల్లవా లంటారు. ౧౬౯

కూరుచుండు - నిలుచుండు - పరుండు - పన్నుండు - ఆకొను - ఊకొను - ఊయకొను - ఇయ్యకొను - పడుకొను - రక్కొను - త్రెక్కొను - మేక్కొను - మయికొను - వెలువడు - విజయంచేయు - కయివ్రాలు మొదలైనవి.

చేదర్థయోగంలో ల్రృట్టుకి లిట్టవుతుంది. ౧౭౦

చేదర్థయోగంలో భవిష్యదర్థక్రియకు మారుగా భూతార్థక్రియ ప్రయోగించ బడుతుందని తాత్పర్యం.

ఆమహాత్ముడువచ్చాడా ప్రజలు శాంతిస్తారు. ఆయన రేపు హామీయిచ్చాడా పనులు మొదలుపెట్టండి.

బహుకర్తృకంలో తాశబ్దయోగంలో ధాతుజవిశేషణాలకు
ఆత్మార్థకలింగవచనా లవుతాయి. ౧౭౧

బుద్ధుడు భిక్షను స్వీకరించి నందుడూ తానూ శిష్యబృంద సహితంగా పాదచార్తై ఆరామానికి వచ్చాడు.

భ్వాదులకు తెలుగులో ప్రయోగం లేదు. ౧౨౨

భూ - స్ఫృ - కృ - రేకృ - లోకృ - లోచ - పచి - లప - మొదలైన వాటికి ఈభాషలో ప్రయోగంలేదు - ఆదిశబ్దంచేత అతిభిన్నప్రాదులు గ్రాహ్యాలు - ప్ర - పరా - అప - సమ్ - అను - అవ - నిస్ - నిర్ - దుస్ - దుర్ - వి - ఆఙ్ - ని - అధి - అపి - అతి - సు - ఉద్ - అభి - ప్రతి - పరి - ఉప - ఈ యిరవై రెండు ప్రాదులు. అతిభిన్నప్రాదులు అనడంచేత అతివాగుడు - అతివస - అతిపిచ్చి - అతిగా మొదలైన ప్రయోగాలు రక్షితాలయ్యాయి - తక్కినప్రాదులకు అసంస్కృతాలతో ప్రయోగంలేదు-అలవాటు-సలహా-పదాలకు మాత్రం పూర్వంలో దుర్ దుస్‌ల ప్రయోగాలు లోకప్రసిద్ధంగా కనిపిస్తున్నవి దురలవాటు - దురలవాట్లు - దుస్సలహా - అర్థవిశేషంలో ప్రతికి ప్రయోగం తరచుగా కనిపిస్తున్నది - ప్రతివాడు - ప్రతిది - ప్రతి ఇత్వానికి దీర్ఘంరూపా కనిపిస్తున్నది. ప్రతీవాడు - ప్రతీది - సంస్కృతంలో గతిసంజ్ఞలేని తక్కిన వాటికికూడా తెలుగులో వ్యవహారంలేదు - అగతికమే అయినా సాక్షాత్ అనేదానికి తుదిహల్లుకి ద్విత్వోత్వాలతో తరచుగా ప్రయోగం కనిపిస్తున్నది. సాక్షాత్తుగా - సాక్షాత్తు దేవుడే మొదలైనవి.

ప్రాదులు సాంస్కృతికాలకు పూర్వంలో ప్రయుక్తాలై సమరూపాలుగా తెలుగులో ప్రయోగ యోగ్యా లవుతాయి. ౧౨౩

ప్రభవించు - ఆవిర్భవించు - ప్రసరించు - సంస్కరించు - భస్మీకరించు - సాక్షాత్కరించు - అతిరేకించు - వ్యతిరేకించు - ఆలోకించు - అవలోకించు - ప్రపంచించు - ప్రలపించు - మొదలైనవి గ్రాహ్యాలు.

వలయు ప్రభృతులకు కర్తయైన భావంలో అత్వం వస్తుంది. ౧౨౪

వాడు చూడవలయు - మీరు కోరవలయు - మేము తినవలయు. వలయు - వలదు - వద్దు - కూడును-కూడదు - చెల్లు - చెల్లదు - తగును - తగదు - మొదలైనవి వలయు ప్రభృతులు.

సకర్మకానికి స్వరూపప్రేరణార్థాలు రెండూ ; కొను - పడు - అనుబంధాల్లో ఒక్కొక్క-దానితోను రెండింటితోను కూడితే ఏర్పడే ఆరురూపాలూ మొత్తం కూడితే యెనిమిది రూపా లవుతాయి.

కర్త్రర్థకం.

సత్యనారాయణ - వంటకాన్ని - వండాడు.

ఆత్మనేపదకర్త్రర్థకం.

సత్యనారాయణ - వంటకాన్ని - వండుకొన్నాడు.

కర్మార్థకం.

సత్యనారాయణచేత - వంటకం - వండబడింది.

ఆత్మనేపద కర్మార్థకం

సత్యనారాయణచేత - వంటకం - వండుకొనబడింది.

ప్రేరణకర్త్రర్థకం.

ఆనంద్ - సత్యనారాయణచేత - వంటకాన్ని - వండించాడు.

ప్రేరణాత్మనేపదకర్త్రర్థకం

ఆనంద్ - సత్యనారాయణచేత - వంటకాన్ని - వండించుకున్నాడు.

ప్రేరణకర్మార్థకం.

ఆనంద్‌చేత - సత్యనారాయణచేత - వంటకం - వండించబడింది.

ప్రేరణాత్మనేపదకర్మార్థకం.

ఆనంద్‌చేత - సత్యనారాయణచేత - వంటకం - వండించుకొనబడింది.

అనుప్రయుక్తమైన వలయుఃధాతువుకి ఆలి విభాషగా
ఆదేశ మవుతుంది. ౧౭౪

చూడవలయు - చూడాలి - ఇలాగే వాడాలి - కోరాలి - పోవాలి - తేవాలి - రావాలి - మొదలైనవి ఊహ్యాలు. వ్యవస్థిత విభాషచేత అన్నంత ఆగు ధాతువుమీది వలయుకు ఆలిరాదు - కాని ఇటువంటి వలయు రూపాలు వ్యవహారంలో అప్రసిద్ధాలు చూడగావలయు.

ప్రేరణంలో గత్యాద్యర్థకాల అప్రేరణకర్త కర్మ
అవుతుంది. ౧౭౫

గత్యర్థకమంటే పొందుమొదలైనవి. ఆదిశబ్దంచేత తెలియు మొదలైన బుధ్యర్థకాలు - తిను మొదలైన ప్రత్యవసానార్థకాలు - విను - చెప్పు - చదువు మొదలైన శబ్దకర్మాలు - అకర్మకాలు గ్రాహ్యాలు - నారాయణ అవమానం పొందాడు- ప్రజలు నారాయణ్ని అవమానం పొందించారు - ఇతరత్రసహితం యీకార్యం

కొన్నిచోట్ల కనిపిస్తున్నది. మహాత్ముడు ప్రపంచాన్నేలాడు-ప్రజలు మహాత్ముణ్ని ప్రపంచాన్నేలించారు.

కొన్నిచోట్ల అనభిహిత కర్తకు షష్ఠి బహుళంగా వస్తుంది. ౧౭౭

వాళ్లు మహాత్ముని వాక్యాలు విన్నారు - వాళ్లకు మహాత్ముని వాక్యాలు వినబడ్డాయి - ప్రజలు అహింసాతత్వం తెలుసుకొన్నారు - మహాత్ముడు ప్రజలకు అహింసాతత్వం తెలిపాడు - బుద్ధుడు ప్రజలకు అహింసాశక్తిని చూపించాడు - పంచశీల ప్రపంచానికి శాంతిశక్తిని చూపించింది - మొదలైనవి.

అకర్మకానికి ఆప్రేరణంలో ఆత్మనేపదకర్మానుబంధాలు లేనందువల్ల రూపభేదాలు అయిదుమాత్రమేనని గ్రహించాలి.

కర్త్రర్థకం.

శాంత్యహింసలు - బ్రతికాయి.

ప్రేరణకర్త్రర్థకం.

ప్రజలు - శాంత్యహింసలను - బ్రతికించారు.

ప్రేరణాత్మనేపదకర్త్రర్థకం.

ప్రజలు - శాంత్యహింసలను - బ్రతికించుకొన్నారు.

ప్రేరణకర్మార్థకం.

ప్రజలచేత - శాంత్యహింసలు - బ్రతికించబడ్డాయి.

ప్రేరణాత్మనేపదకర్మార్థకం.

ప్రజలచేత - శాంత్యహింసలు - బ్రతికించుకొనబడ్డాయి.

ఇంతేకాక - ప్రేరణంలో ఇంచు ఆగమంవస్తే సకర్మానికి పన్నెండు రూపాలు-అకర్మానికి తొమ్మిదిరూపాలు అవుతాయి. వీటిని వ్యవహారానుగుణంగా పరిగ్రహించాలి.

అన్నంత అగు ధాతువు దీర్ఘానికి హ్రస్వం బహుళం. ౧౭౮

దానిలాగ - దానిలాగా - దీనిలాగ - దీనిలాగా - దేనిలాగ - దేనిలాగా - కాగ - కాగా - రాగ - రాగా - పోగ - పోగా - కొట్టగ - కొట్టగా - మొదలైనవి. బహుళగ్రహణంచేత అర్థవిశేషంలో అలాగా - ఇలాగా - ఎలాగా ? అన్నప్పుడు హ్రస్వంరాదు. స్వార్థంలో అంటే - ఆవిధంగా - ఈవిధంగా - ఏవిధంగా అనే అర్థాల్లో అలాగ - ఇలాగ - ఎలాగ - అన్నప్పుడు హ్రస్వంనిత్యం.

సరిమీది అన్నంత అగుధాతువు గకారానికి ద్విత్వం వైకల్పికం. ౧౭౭

సరిగా - సరిగ్గా - సరిగ - సరిగ్గ - గకారానికి అనడంచేత సరికాగా వంటివి రక్షితా లయ్యాయి.

కకారం పరమైతే ధాత్వాదుల గకారనికి కకారం విభాషగా వస్తుంది; వస్తే తుది అత్వాదులకు లోపం ధాతువు అనాద్యమైన ఉత్వాని కత్వం తరచుగా వస్తుంది. ౧౭౦

అడుగక - అడక్క - మునుగక - మునక్క - అడుగకుండా - అడక్కుండా - తిరుగకుండా - తిరక్కుండా - విరుగక - విరక్క - తరుగక - తరక్క - తరచుగా అనడంచేత అడుక్కో - చెరుక్కో - చెరుక్కోనకుండా - ఇత్యాదుల్లో ఉత్వానికత్వంరాదు - ఆదిశబ్దంచేత అడుగడుగుకీ - అడుగడుక్కీ - రాగికి - రాక్కి - మొదలైనవి గ్రాహ్యాలు - విసుగుప్రభృతుల ఉత్వానికి అత్వం రాకపోవడానికి తరచుశబ్దం శరణ్యం - విసుక్కోకుండా.

గయుక్తఅన్నంత అగు ధాతువు పరమైతే ధాత్వాదుల అద్విరుక్త గకారం అత్వాదులకు లోపం విభాష; లోపిస్తే అన్నంత మైన ధాతువు అనాద్యమైన ఉత్వానికి అత్వం నిత్యం.౧౭౧

అడుగగా - అడగ్గా - తరుగగా - తరగ్గా - ఆదిశబ్దంచేత పోగుగా - పోగ్గా - మొదలైనచోట్ల ఉత్వలోపంగ్రాహ్యం - అద్విరుక్త మనడంచేత మొగ్గగా - తగ్గగా - ఒగ్గగా - ఇత్యాదుల్లో స్వరలోపంలేదు. అన్నంతమైన ధాతువనడం చేత తరుగుగా - తరుగ్గా - విసుగుగా - విసుగ్గా - ఒరుగుగా - ఒరుగ్గా - బొజుగుగా - బొజుగ్గా - ఇత్యాదుల్లో అనాద్యమైన ఉత్వానికత్వంరాదు.

వ్యతిరేకార్థంలో తెలియ్యాదుల యకారానికి వకారం విభాషగా వస్తుంది; వస్తే తత్పూర్వ ఇత్వాని కత్వం నిత్యం. ౧౭౨

తెలియక - తెలవక - కలియక - కలవక - ఇత్యాదులూహ్యాలు.

గయుక్తఅన్నంత అగు ధాతువు పరమైతే ధాత్వాదుల కకారానికి గకారం విభాషగా వస్తుంది; వస్తే అత్వాదులకు లోపం నిత్యం. ౧౭౩

చెరుకుగ్గా - చెరుగ్గా - మొరుకుగా - మొరుగ్గా - నరుకుగా - నరుగ్గా - కరుకుగా - కరుగ్గా - తేలికగా - తేలిగ్గా - మనకగా - మనగ్గా - మొదలైనవి.

అన్నంత కకారానికి గాదేశమైతే అనాద్యమైన ఉత్వాని
కత్వం నిత్యం. ౧౮౪

నరుకగా - నర్గా - కెలుకగా - కెల్గా - మొదలైనవి. అన్నంత మనడంచేత నరుకుగా ఇత్యాదుల్లో ఉత్వాని కత్వంరాదు. నరుగ్గా - అదే నరుగ్గా కనిపిస్తున్నది అని వ్యవహారం.

కకారంపరమైతే ధాత్వాదుల తుది కకారస్వరానికి లోపం
విభాష. ౧౮౫

పలికికూడా - పలిక్కూడా - పలుకకుండా - పలక్కుండా - దానికి కూడా - దానిక్కూడా - బుద్ధునికికట్టి - బుద్ధునిక్కట్టి - స్వరలోపమైతే కొన్ని చోట్ల ఉత్వాని కత్వంసైతం కనిపిస్తున్నది.

తద్ధర్మార్థక విశేషణం అసహాయతలోను త్రికాలవాచి
అవుతుంది. ౧౮౬

అతడు వేసే చిత్రం - అతను నేసే వస్త్రం - అతడు వేస్తున్న చిత్రం - అతను నేస్తున్న వస్త్రం (వర్త) - కృష్ణుడుచేసేపెళ్లికి వెళ్లవన్నమాట - అతను పెట్టేది తినవన్నమాట - చేసేపెళ్లికి - చేయబోయేపెళ్లికి - పెట్టేది- పెట్టబోయేది (భవిష్య) - నేను ఇష్టపడు పనిచెయ్యి - ఇష్టపడు - ఇష్టపడిన (భూత).

అయ్యాదు లనుప్రయుక్తాలై భూత తద్ధర్మక్రియలు
ప్రశ్నార్థకా లౌతాయి. ౧౮౭

దేశసేవ చేస్తావయ్యా ? శాంత్యహింసలు కాంక్షిస్తావమ్మా ? అభ్యుదయ పథంలో ఉంటావన్నా ? మొదలైనవి.

అయ్యాదు లనుప్రయుక్తాలైన తద్ధర్మక్రియలు కొన్ని చోట్ల
ప్రశ్నార్థకాలై వ్యతిరేకార్థకా లౌతాయి. ౧౮౮

నీకిది తగునయ్యా ? నువ్వుచేసినపనిని ఎవరు హర్షిస్తారమ్మా ? నీకిదితగదు- ఎవరూ నువ్వుచేసిన పనిని హర్షించరు అని అర్థం.

అయ్యాదులు ప్రశ్నార్థంలో విభాషగా అటుశబ్ద
పూర్వకా లవుతాయి. ౧౮౯

నీకిది తగునటయ్య ? నీకిది తగునయ్య ? నువ్వుచేసినపనిని ఎవరైనా

హర్షిస్తారటమ్మా ? నువ్వు చేసిన పనిని ఎవ్వరైనా హర్షిస్తారమ్మా ? వ్యవస్థితవిభాష చేత ఎవరు హర్షిస్తారమ్మా ? ఇత్యాదుల్లో అటు శబ్దం ప్రయోక్తం కాదు.

మహన్మహతుల బహుకర్తృక క్రియకు ఏకవచనం విభాషగా వస్తుంది. ౧౯౦

శాంతిని వ్యతిరేకించినవాడు యుద్ధాన్ని ప్రేరేపించినవాడు నాశనమైపోతాడు- సహనంకల యువతి దూరాలోచనకల పడతి బాగుపడుతుంది - పక్షంలో నాశనమై పోతారు - బాగుపడతారు.

సత్వరభావిక్రియకు తరచుగా భూతక్రియ వస్తుంది. ౧౯౧

ఇదిగో వస్తున్నానమ్మా - ఇప్పుడే తెస్తున్నా - రేపు వస్తున్నాడు - ఎల్లుండి వెళ్తున్నాడు.

వ్యతిరేకక్రియ భూతభవిష్యద్వర్తమానార్థకం అవుతుంది. ౧౯౨

ఎంతవెదికినా కనపడదాయె - ఎంతడబ్బిద్దామన్నా దొరకదాయె - కన పడలేదు - దొరకలేదు అనిభూతార్థం - వెంకటరావు రాడు - వెంకటేశ్వర్రావు నడగడు - రాడు - రాగలవాడుకాడు; అడగడు - అడిగేవాడుకాడు - అని భవిష్యదర్థం - ఎవరితోనూ మాట్లాడడు-అన్నమైనా తినడు - మాట్లాడుతున్నవాడు కాడు - తింటున్నవాడుకాడు - మాట్లాడడంలేదు - తినడంలేదు - అని వర్తమా నార్థం - భావార్థకంమీది వ్యతిరేకక్రియ కొన్నిచోట్ల భావివర్తమానార్థకంగా కని పిస్తున్నది - వాడిప్పుడుపండడంలేదు - వాడాపనిప్పుడు చెయ్యడంలేదు - రేపు కృష్ణుడు రావడంలేదు - పుస్తకం తేవడంలేదు - ఇత్యాదులు శిష్టజనవ్యవహారాను గుణంగా గ్రాహ్యాలు.

అన్విత్యయాంత క్రియలమీద కదవు పూర్వకంగా అయ్యాదులు సంప్రార్థనంలో అనుప్రయుక్తా లవుతాయి. ౧౯౩

దయదలచగదవయ్యా ! కాపాడగదవన్నా - దయచూడగదవమ్మ- ఇత్యాదు లూహ్యాలు.

కదవు వకారానికి లోపం బహుళం. ౧౯౪

దయదలచగదయ్యా ! కాపాడగదన్నా! - దయచూడగదమ్మా ! మొదలైనవి.

సంప్రార్థనాదుల్లో అన్ ప్రత్యయాంత క్రియల మీది
ఇమ్ముకి ఈకారం విభాషగా వస్తుంది. ౧౯౫

రానిమ్ము - రానీ - కానిమ్ము - కానీ - తేనిమ్ము - తేనీ - ఉండనిమ్ము - ఉండనీ - తిననిమ్ము-తిననీ - నవ్వనిమ్ము - నవ్వనీ - మొదలైనవి.

భూతార్థక అసమాపక క్రియ కొన్నిచోట్ల హేత్వాద్యర్థక
మవుతుంది. ౧౯౬

ఆటంబాంబుపడి హిరోషిమానగరం భస్మీపటల మైపోయింది. తల్లులుపోయి పిల్లలు - పిల్లలు భర్తలుపోయి తల్లులు - కాళ్లుతెగికొందరు - కళ్లుపోయికొందరు - వలవలా యేడ్చారు - నానారకాల రోగాలువచ్చి అనేకవేలమంది యమయాతనలు పడ్డారు - ఆదిశబ్దంచేత ఇటువంటి కిరాతకకృత్యాలు చూచియెరుగం - ఇన్ని బాధలు పడియెరుగం - **ఇత్యాదులు** గ్రాహ్యాలు - ఇక్కడ చూచి అంటే చూడడం అని - పడి అంటే పడడం అని అర్థం.

చేయుయోగంలో అన్నంత క్రియ ప్రేరణార్థక
మవుతుంది. ౧౯౭

కీర్తివహింపచేశాడు - మింగజేశాడు - కక్కజేశాడు - మొదలైనవి.

అన్నంతక్రియలకు అత్వాంతగుణవాచకాలకు క్రియాసిద్ధి
ఉన్ముఖత్వంలో పారు ధాతు వనుప్రయుక్త
మవుతుంది. ౧౯౮

పండబారు - ఎండబారు - తెల్లబారు - పచ్చబారు - ఎర్రబారు-మొదలైనవి.

కంటె వర్ణకం పరమైతే భావార్థకానికి ఏవర్ణం
విభాషగా వస్తుంది. ౧౯౯

కొట్టడంకంటె - కొట్టేకంటె - తీయడంకంటె - తీసేకంటె - మెచ్చడంకంటె- మెచ్చేకంటె - **ఇత్యాదులు.**

అన్నంత అగు ధాతువు పరమైతే బాగు గువర్ణానికి లోపం
వైకల్పికం. ౨౦౦

బాగుగా - బాగా - బాగుగ - బాగ.

చక్కమీది అన్నంత అగుధాతువుకు లోపం పూర్వస్వరానికి దీర్ఘం బహుళం. ౨౦౧

చక్కగావచ్చాడు - చక్కాపచ్చాడు - చక్కగావెళ్లాడు - చక్కావెళ్లాడు - చక్కగాఉన్నాడు - చక్కాఉన్నాడు - మొదలైనవి.

క్రియా విధేయ విశేషణాలమీది అన్నంత అగుధాతువుకి లోపం విభాష. ౨౦౨

క్రియావిశేషణాలకు - పెచ్చుగా పెరిగిందిరా పంట - పెచ్చుపెరిగిందిరా పంట - చలిజ్వరం తచుగా వస్తున్నది - చలిజ్వరం తరచు వస్తున్నది - ఎక్కువగా మిగిలింది- ఎక్కువ మిగిలింది. విధేయవిశేషణాలకు - ఉంగరం లంచంగా అడిగేడు - ఉంగరం లంచం అడిగేడు - మొదలైనవి.

ద్విరుక్తశబ్దపల్లవ క్రియల ఆమ్రేడితం పూర్వావయవాలకు లోపం విభాష. ౨౦౩

మాట్లాడి ఆడి - మాట్లాడి మాట్లాడి - పోట్లాడి ఆడి - పోట్లాడిపోట్లాడి - సమకూర్చికూర్చి - సమకూర్చిసమకూర్చి - తలపోసిపోసి - తలపోసి తలపోసి - తెగటార్చిఆర్చి - తెగటార్చితెగటార్చి - మొదలైనవి.

సమాప్తాలై పునర్గృహీతాలైతే శబ్దపల్లవక్రియల పూర్వావయవాలకు లోపం వైకల్పికం. ౨౦౪

నువ్వువాణ్ణి కారెక్కించి తిరిగిరా - రావడానికి వీలులేకపోతే బాధపడకు - నీవువచ్చి మళ్లీవెళ్లు - వెళ్లకపోతేఉండు - పక్షంలో తిరిగిరావడానికి మళ్లీవెళ్లకపోతే అని శబ్దపల్లక్రియలే పునర్గృహీతాలవుతాయి.

కర్తృభూతక్రియతో తత్కర్త కన్వయ మవుతుంది. ౨౦౫

నీవు రావచ్చు పోవచ్చు-నీవు తేవచ్చు ఇవ్వచ్చు - నేనుండవచ్చువెళ్లవచ్చు - మొదలైనవి.

సందేహాధికార్థాల్లో ఓకారం వస్తుంది. ౨౦౬

అక్క డెంతున్నదో తెలియదు - అంతా ఉందో లేదో - వాళ్లెంత ధన్యులో - ఎంతోధన్యులని తాత్పర్యం.

ఓ దీర్ఘానికి హ్రస్వం బహుళం. ౨౦౭

సందేహాధికార్థక ఓకారానికి హ్రస్వంబాహుళకమని అర్థం - ఎంతుందో - ఎంతుందొ - ఏమో - ఏమొ.

సందేహాధికార్థక ఓకారానికి కదా విభాషగా అనుప్రయుక్త
మవుతుంది. ౨౦౮

ఎంతధన్యులోకదా ! - ఎంతధన్యులో.

స్త్రీనుద్దేశించినపుడు కదా తుది అకారానికి ఏత్వం
వైకల్పికం. ౨౦౯

అవునోకాదోకదా! - అవునోకాదోకదే! - నిజమో అబద్ధమోకదా! - నిజమో అబద్ధమోకదే! ఆదరాద్యర్థసూచకంగా పురుషుణ్ణి ఉద్దేశించినప్పుడుసైతం ఏత్వం కొన్నిచోట్ల కనిపిస్తున్నది. - యేంతాతా! అది నిజమో అబద్ధమోకదే.

కదా కదేల దీర్ఘానికి హ్రస్వం వైకల్పికం. ౨౧౦

ఎంతధన్యులోకద - ఎంతధన్యులోకదె - అవునో కాదోకద - అవునో కాదోకదె.

ఉద్దేశ్యంద్వ్యవయవం కలదైతే తుదిదానికే "కదా"
అనుప్రయుక్త మవుతుంది. ౨౧౧

అవునో కాదోకదా - నిజమో అబద్ధమోకదా.

క్రియాలమీది కదపుకు అయ్యాదులు వైకల్పికంగా
అనుప్రయుక్తా లవుతాయి. ౨౧౨

అలసిపోయావుకదవయ్య! పూర్వోక్తసూత్రంచేత కదపు వకారానికి పాక్షిక లోపం అలసిపోయావుకదయ్య! సుశీలవుకదవమ్మ - సుశీలవుకదమ్మ - బుద్ధిమంతురాలవుకదవే - బుద్ధిమంతురాలవుకదే - పక్షంలో అలసిపోయావు - సుశీలవు - బుద్ధిమంతురాలవు - అయ్య - అమ్మ - అన్న - అక్క - అప్ప - అత్త - ఆ - ఏ - మొదలైనవి అయ్యాదులు.

నామాదులమీది కదపుకు సైతం అయ్యాదులు వైకల్పికంగా
అనుప్రయుక్తా లవుతాయి. ౨౧౩

దయాసముద్రుడవుకదవయ్య - దయాసముద్రుడవుకదయ్య - అమహత్కర్తృక ప్రథమోత్తమ పురుషకర్తృకాలైనప్పుడు బాహుళకంచేత వకారలోపం నిత్యం - లేతగదయ్య - ముదురుగదమ్మ - ఎరుపుకదన్న - నలుపుగదమ్మ -

అతను మంచివాడునమ్మ - మేము అహింసావ్రతులంకదయ్యా ! ఇవు లననుప్రయుక్తాలైతే దవు వకారానికిలోపం నిత్యం.

వ లోపమైన కదవు ఉత్వానికి అకారం వైకల్పికం. ౨౧౪

లేతకద - తకదా ! లేతకదు - వక్ష్యమాణవిధిచేత లేతకదూ - అత్వ మనక అకారమనడంచేత హ్రస్వదీర్ఘాలు రెండిటికీ గ్రహణ.

వ లోపమైన కదవు ఉత్వానికి ఆదరాద్యర్థాల్లో దీర్ఘం వైకల్పికం. ౨౧౫

మైత్రి - విరోధం - భయపెట్టడం - గద్దించడం - ప్రశ్న - క్రోధాదులు ఆదిశబ్దగ్రాహ్యాలు.

కాదె ఇూర్థక మవుతుంది. ౨౧౬

నాకున్న బలమంతా ఆత్మశక్తికాదె - ఆత్మశక్తికదా ! అని అర్థం.

అయి కాలు ప్రథమాంతంమీద స్వయమర్థంలో వైకల్పికంగా అనుప్రయుక్తా లవుతాయి. ౨౧౭

వాడై వచ్చాడు - వాడుగా వచ్చాడు - వాడు స్వయంగా వచ్చాడని అర్థం.

కరుగ ప్రభృతులు అంతర్భావిత ప్రేరణాలు. ౨౧౮

కంసాలి బంగారం కరిగాడు - కరిగించాడు అని అర్థం.

అడుగ్వాది ధాతువులు ద్వికర్మకాలు. ౨౧౯

భావే భూదానం అడిగాడు-ఇక్కడ అడిగాడు అన్న క్రియ భావే అడిగాడు- భూదానం అడిగాడు అని - భావే భూదానశబ్దాలు రెండింటితోను అన్వయిస్తుంది.

ఇతరాలు క్రియా ప్రయోగ విశేషాలు శిష్టమహాజన వ్యవహారానుగుణంగా గ్రాహ్యాలు. ౨౨౦

క్రియా పరిచ్ఛేదం.

---

# వ్యావహారికభాషా వ్యాకరణం

## కృదంత పరిచ్ఛేదం

కృత్తులకు అర్థాలు యథావ్యవహారంగా గ్రాహ్యాలు. ౧

ధాతువులకు విధించిన డు ప్రత్యయాదులకు భిన్నమైనప్రత్యయాలను కృత్ప్రత్యయాలంటారు. ముందు చెప్పబోయే కృత్ప్రత్యయాలకు భావకర్తృ కర్మాద్యర్థాలు మహాజనానుసారంగా తెల్సుకోవాలి.

కృత్ప్రత్యయాలైన క గ త ప వేములు పరమైతే క గ చ య వలకు లోపం వస్తుంది. ౨

కృత్సంబంధంకలకాదిప్రత్యయాలు పరమైతే ధాతువుల చివరకల క గ చ య వ లకు లోపంవస్తుంది - ముందుముందు ఉదాహరణలవల్ల స్పష్టంగా యీసంగతి తెలుస్తుంది.

అలుగు మొదలైన వాటికి క వర్ణకం వస్తుంది. ౩

అలుగు - అలుక - ఆగు - ఆక - ఎరుగు - ఎరుక - కడగు - కడక - కలగు - కలక - కాగు - కాక - తునుగు - తునక - నడచు - నడక - నలగు - నలక - పోవు - పోక - మలగు - మలక - మునుగు - మునక - మూగు - మూక - మొలచు - మొలక - వంగు - వంక - వీగు - వీక - వచ్చు - రాక - కినియు ముదియులకు ఉత్వంవస్తుంది - కినియు - కినుక - ముదియు - ముదుక - ఇక, క, వులు పరమైతే కను ఆదిహ్రస్వానికి దీర్ఘంవస్తుంది - కానుక.

కలుగు మొదలైన వాటికి ఇమి వర్ణకం వస్తుంది. ౪

కలుగు - కలిమి - ఓరుచు - ఓరిమి - కూరుచు - కూరిమి - వ్రేలుచు - వ్రేలిమి - బలియు - బలిమి - తాలు - తాలిమి - ఇమి ఆదిస్వరానికిలోపం కొన్నిచోట్లకనిపిస్తున్నది - ఓర్మి - కూర్మి - వ్రేల్మి - బల్మి - తాల్మి - కల్మి.

చేయు మొదలైనవాటికి తవర్ణకం వస్తుంది. ౫

చేయు - చేత - అలయు - అలత - కూయు - కూత - కోయు - కోత -

గీయు - గీత - నేయ- నేత - కూయు - కూత - పోయు - పోత - మూయు - మూత - మేయు - మేత - మోయు - మోత - రోయు - రోత - వ్రాయు - వ్రాత.

తవర్ణకంపూర్ణ బిందుపూర్వకం విభాషగా అవుతుంది. ౬

అలత - అంత - కలత - కలంత - వ్యవస్థితవిభాషచేత దీర్ఘంమీద పూర్ణబిందువురాదు కోత - రోత.

అడంగుమొదలైన వాటికి కువ వర్ణకం వస్తుంది. ౭

అడంగు - డంకువ - అడగు - అడకువ - మరచు - మరకువ - మెలగు - మెలకువ పెనగు - పెనకువ - లోగు - లోకువ - వేగు - వేకువ మొదలైనవి.

ఆడు మొదలైన వాటికి టవర్ణకం వస్తుంది; వస్తే అంత్యాక్షర లోపం నిత్యం. ౮

ఆడు - ఆట - ఊరు - ఊట - ఊరడు - ఊరట - ఓడు - ఓటు - తేరు - తేట - పండు - పంట - పాడు - పాట - మండు - మంట - వండు - వంట - వేసడు - వేసట - మొదలైనవి.

అనుప్రయుక్తమైన ఆడు ధాతువుకి తరచుగా మువర్ణాంత టవర్ణకం వస్తుంది. ౯

కోలాటం - పోరాటం - మొదలైనవి.

పడు మొదలైనవాటికి టు వర్ణకం వస్తుంది; వస్తే అవి అంత్యాక్షరశేషాలయి దీర్ఘయుక్తాలౌతాయి. ౧౦

పడు - పాటు - చెడు - చేటు - కరచు - కాటు - పొడుచు - పోటు - ఓడు - ఓటు - వాయిచు - వాటు - వేయు - వేటు - మొదలైనవి.

పొలయ్యాదులకు పవర్ణకం వస్తుంది. ౧౧

పొలయు - పొలపం - తిరియు - తిరిపం - మురియు - మురిపం - వలియు - వలిపు - కలియు ఇత్యానికత్వం - కలపం.

అవులించు ప్రభృతులకు తవర్ణకం వస్తుంది. ౧౨

అవులించు - అవులింత - ఇకిలించు - ఇకిలింత - కుళ్లగించు - కుళ్లగింత - కొక్కరించు - కొక్కరింత - గిలిగించు - గిలిగింత - మొదలైనవి.

మాయు ప్రభృతులకు పు ప్రత్యయం వస్తుంది. ౧౩

మాయు - మాపు - మేయు - మేపు - అడుచు - అడుపు - ఇంచు - ఇంపు - ఏచు - ఏపు - కను - కానుపు - కాచు - కాపు - తోచు - తోపు - చూచు - చూపు - తలచు - తలపు - తేచు - తేపు - తో - తోపు - పెనుచు - పెనుపు - పెంచు - పెంపు - పొలుచు - పొలుపు - పల - పలపు - మెచ్చు - మెప్పు - మోచు - మోపు - వాచు - వాపు - మొదలైనవి.

ప్రేరణార్థకాలైన దించు ప్రభృతులకు పు ప్రత్యయం విభాషగా వస్తుంది. ౧౪

దించు - దింపు - దంచు - దంపు - మొదలైనవి.

అలయ్యాదులకు ఇక వర్ణకం వస్తుంది. ౧౫

అలయు - అలయిక - ఓపు - ఓపిక - కను - కానిక - కూడు - కూడిక - కోరు - కోరిక - పొందు - పొందిక - పోలు - పోలిక - మొదలైనవి.

అక ఇకలు పరమైతే తూగు గకారానికి నకారం వస్తుంది. ౧౬

తూగు - తూనకం - తూనిక.

అన వర్ణకం అప్పాదుల కవుతుంది. ౧౭

అప్పు - అప్పన - గడ - గడన - దట్టు - దట్టన - అప్పనకు మువర్ణం కూడా కనిపిస్తున్నది - అప్పన - అప్పనం.

అన వర్ణకం పరమైతే వీచు చకారం వకారం అవుతుంది. ౧౮

వీచు - వీవన.

ఏల్వాదులకు బడి వర్ణకం వస్తుంది. ౧౯

ఏలుబడి - కట్టుబడి - కనుబడి - కొనుబడి - గిట్టుబడి - చెల్లుబడి - చేరుబడి - తగులుబడి - పెట్టుబడి - మ్రొక్కుబడి - వచ్చుపోవులకు - రాబడి - వచ్చుబడి - పోబడి - మొదలైనవి.

మన్వాదులకు గడ వర్ణకం వస్తుంది. ౨౦

మనుగడ - విరుగడ - చేరుగడ - తేరుగడ-తేగడ-ఇత్యాదులూహ్యాలు-

వచ్చు పోలుచులకు కడ వర్ణకం వస్తుంది. ౨౧

డ - పోకడ - - నిలుకడ.

చూచు-కాదాచులకు మత్వర్థంలో అరివర్ణకం వస్తుంది;
వస్తే ారానికి పకారం వస్తుంది. ౨౨

చూ॥ ాపరి - దాపరి.

కోరు ప్రభృతులకు ఇకి వర్ణకం వస్తుంది. ౨౩

కోరికపూనికి - పోలికి - మనికి - వినికి.

ఇకి పరమై చూచు చకారం డకారం అవుతుంది. ౨౪

చూచు - చూడికి.

మన్వాదులకు పు వర్ణకం వస్తుంది. ౨౫

మను - ము - కాచు - కాపు - కొలుచు - కొలుపు - తడయు - తాపు - నిలుచు - నిలుపు - పూచు - పూపు - చచ్చు - చావు - నొచ్చు - నోపు - పుచ్చు - ప్వ - ఉలియు - ఉలిపు - అరయు - అరపు - అరువు - తగు - తగుపు - కూడ గలోపంలేమ.

పువర్ణకుకారానికి దీర్ఘం మీద ద్విత్వం బహుళం. ౨౬

నొచ్చు - ౖ - నొప్పు - పూచు - పూవు - పువ్వు - బాహుళకంచేత కాచు - కాపు - ర్యాదులలో ద్విత్వంలేదు.

మార్గాదులకు అక వర్ణకం వస్తుంది. ౨౭

మారకం అమ్మకం - అమరకం - అంపకం - పంపకం - తూనకం - అద్దకం - తోమః - మొదలైనవి.

అక వర్ణకం పరమైతే వండు డకారానికి టకారం
స్తుంది. ౨౮

వండు - వంటకం.

పార్వాదులకు డువర్ణకం వస్తుంది. ౨౯

పాచు - పారడు - అమ్ముక - అమ్ముడు - అల్లు - అల్లుడు - ఎక్కు -

ఎక్కుడు - ఆరు - ఆరుడు - తొక్కు - తొక్కుడు - ప్రాకు - ప్రాకుడు - ఇత్యాదులూహ్యాలు.

డు వర్ణకం పరమైతే చయలకు పకారం వస్తుంది. ౩౦

తోచు - తోపుడు - దోచు - దోపుడు - దంచు - దంపుడు - పెంచు - పెంపుడు - రాచు - రాపుడు - మాయు - మాపుడు - మొదలైనవి.

ఒరుగు ప్రభృతులకు ఉ వర్ణకం వస్తుంది. ౩౧

ఒరుగు - ఒసగు - అడుగు - అంటు - ఒప్పు - తప్పు.

దయ్యు నొచ్చు పుచ్చులకు ఇవర్ణకం వస్తుంది; వస్తే చ య
లకు పకారం నిత్యం. ౩౨

దయ్యు - దప్పి - నొచ్చు - నొప్పి - పుచ్చు - పుప్పి.

ఇప్రత్యయం పరమైతే నొప్పి ఒత్వానికి ఎత్వం
విభాషగా వస్తుంది. ౩౩

నెప్పి - నొప్పి.

పుప్పి ఉత్వ ఇత్వాలకు ఇత్వ ఉత్వాలు
విభాషగా వస్తాయి. ౩౪

పుప్పి - పిప్పు - పుప్పిపన్ను - పిప్పుపన్ను.

రాచు రాయు తోయులకు ఇడి వర్ణకం వస్తుంది. ౩౫

ఇడివర్ణకం పరమైతే రాచు తోయుల చ య లకు
పకారం వస్తుంది. ౩౬

రాచు - రాపిడి - తోయు - తోపిడి - తోయు యకారానికి అనడంచేత రాయు యకారానికి పకారంరాదు - రాయిడి.

ఎన వర్ణకం ఊర్చుబ్బు కందు దువ్వులకు వస్తుంది;
వస్తే చ య ల కు పకారం వస్తుంది. ౩౭

ఊర్పెన - ఉప్పెన - కందెన - దువ్వెన.

అనవర్ణకం ంచుకి వస్తుంది; వస్తే ఇంచు లోపిస్తుంది. ౩౮

వడ్డించు - వడ్డన.

దాచు దాయులకు రవర్ణకం వస్తుంది; వస్తే వాటి అంత్యాంశం పకారం అవుతుంది. ౩౯

దాచు - దాపుః దాయు - దాపురం - కాచు - కాపురం - మూచు - మూపురం - దాచు - పురం (దాచడం) - దాయు - దాపురం (సమీపం).

ప్రేరణార్థంలో ఎక్కు దిగులకు మతి వర్ణకం వస్తుంది. ౪౦

బడి మతి డులు పరమైతే అనధికార్థక ఎక్కు ద్విత్వకకారానికి అరుక్త గకారం వస్తుంది. ౪౧

ఎక్కు - ఎగుమతి - దిగుమతి.

విలుచు ప్రకృతులకు వ వర్ణకం వస్తుంది. ౪౨

విలుచు - విల - కొదరు - కొదవ - నిలుచు - నిలువ - చొచ్చుకి - చొరవ.

వ వర్ణకం పరమైతే తగ్గు గకారానికి కకారం వస్తుంది. ౪౩

తగ్గు - తక్కువ.

వ వర్ణకం పరమైతే ఎక్కు దిగుల క గ ల కు లోపం రాదు. ౪౪

కృత్ప్రత్యయమైన క గ త ప వేముల అనే సూత్రానికిది బాధకం - ఎక్కువ - దిగువ - అనధికార్థకమైన ఎక్కు అనడంచేత - అధికార్థంలో గకారంరాదు.

కాచు వీం తిరుగులకు అలివర్ణకం వస్తుంది; వస్తే చకారానికి వకారం వస్తుంది. ౪౫

కావలి - వీవలి - తిరుగలి.

తగ్గు ప్రభృతులకు దల వర్ణకం వస్తుంది. ౪౬

తగ్గుదల - హెచ్చుదల - అరుగుదల - ఎక్కుదల - ఒప్పుదల - పట్టుదల - అచ్చుదల - తిరుగుదల - క్రమ్ముదల - పాయుదల - మొదలైనవి.

గీరు ప్రభృతులకు అవర్ణకం వస్తుంది. ౪౭

గీరు - గీర - ఎందు - ఎండ - పాయు - పాయ - కాయు - కాయ - తునియు - తునియ - పరియు - పరియ - పిడుచు - పిడుచ - మీటు - మీట - ముడియు - ముడియ - వదరు - వదర - వ్రయ్యు - వ్రయ్య.

అవర్ణకం పరమైతే కాచు చకారానికి యకారం వస్తుంది. ౪౮

కాచు - కాయ.

తెలియు ప్రభృతులకు వి వర్ణకం వస్తుంది. ౪౯

తెలియు - తెలివి - తనియు - తనివి - విరియు - విరివి - మొదలైనవి.

నగ్వాదులకు అవు వర్ణకం వస్తుంది. ౫౦

నగవు - తగవు - అరవు.

కాయు ప్రభృతులకు ఇ వర్ణకం వస్తుంది. ౫౧

కాయు - కాయి - చేయు - చేయి - వ్రాయు - వ్రాయి - వ్రాయు ఆదిహల్లోపం జరిగితే ఇవర్ణకంరాదు - రాయు ధాతువుకి పూర్వోక్తమైన అవర్ణకంవస్తే రాయ అవుతుంది.

విను కనులకు కలివర్ణకం వస్తుంది. ౫౨

వినుకలి - కనుకలి.

కొలుచు ప్రభృతులకు వడి వర్ణకం వస్తుంది. ౫౩

కొలుచు - కొలువడి - గెలుచు - గెలువడి - నడచు - నడవడి - లేచు - లేవడి - కలుగు వ్యవతిరేకంలోసైతం లేవడి.

ఎక్కు దిగులకు అరవిశేషంలో డువర్ణకం వస్తుంది. ౫౪

ఎక్కుకి పూర్వసూత్రంచేత ఎగు - ఎగుడు - దిగుడు - ఎక్కుకి - ఎత్తు - దిగుకి - పల్లం అర్థవిశేషాలు,

చెక్కు ప్రభృతులకు ఇలి వర్ణకం వస్తుంది. ౫౫

చెక్కు - చెక్కిలి - అంకు - అంకిలి - ఒదుగు - ఒదిగిలి - పొత్తు - పొత్తిలి - వీటికి బహుత్వంలోకూడా వ్యవహారంవుంది. అంకిళ్లు - ఒదుగుళ్లు - పొత్తిళ్లు.

పొగడుకు తవర్ణకంవస్తుంది; వస్తే ఉత్వలోపం నిత్యం. ౪౬

పొగ త్త.

అ వ కాది ప్రత్యయాలు పరమవుతుంటే అనాద్యమైన ఉత్వా
నికి అత్వం బహుళం. ౪౭

అ - పిడుచ - పిడచ - వ - నిలువ - నిలవ - చొచ్చు ధాతువుకి చొరు ఆదేశమే రావాలి - కాని చొరువ రూపం లేనేలేదు. అతిప్రాచీనకాలంలోనే దీని ఉత్వానికి అత్వం స్థిరపడింది చొరవ. క - అలుక - అలక - తునుక - తునక - మునుక - మునక. గడ - విరుగడ - విరగడ. కడ - నిలుకడ - నిలకడ. ర - దాపురం - దాపరం - కాపురం - కాపరం - అలి - తిరుగలి - తిరగలి. ఇలా ఉత్వానికి అత్వం వ్యవహారంలో తరచుగా వస్తుంది. గ్రాంథికాంధ్రభాషా క్షీరార్ణవరాజహంస బాలవ్యాకరణం తొలిముద్రణప్రతి చూస్తే యీవిషయం స్పష్టపడుతుంది. అయిన చిన్నయసూరికూడా "కవర్గకంబలుగ్వా దులకగు" అని సూత్రించి లక్ష్యాలివ్వడంలో వ్యవహారానికి లోబడి మునుగు ధాతువు అనాద్యమైన ఉత్వానికి అత్వంచేసి మునక అనే పేర్కొన్నాడు. ఇది గమనించక అలుకాదుల ఉత్వానికి అత్వంరాదని కొందరు జీవద్భాషాపరిణామస్వరూప స్వభావ అనభిజ్ఞు లంటారు - వారిమాట నిరాకరం.

సంస్కృత కృదంతాలు తత్సమస్వరూపంలో వ్యవహారాను
గుణంగా గ్రాహ్యాలు. ౪౮

అంబికేయుడు - అధీతం - అధీతి - ఇత్యాదులు సంస్కృతవ్యాకరణోక్తాలు పరిగ్రాహ్యాలు కొన్నిసంస్కృతవ్యాకరణఅనుక్తాలైనా వ్యవహారానుగుణంగా గ్రాహ్యాలు.

జయ వృధలకు అర్ధవిశేషంలో అంతి చేరుతుంది. ౪౯

జయంతి

బాలగంగాధరతిలక్కును జయంతి — పి — 43.

అంతి పరమైతే వృధ అద్యచ్చుకి గుణం నిత్యం. ౫౦

వృధ + అంతి = వర్ధంతి

బాలగంగాధరతిలక్కును జయంతి వర్ధంతుల నాడైనా — పి — 43.

ఇతరాలు విశేషాలు శిష్టజనవ్యవహారంలోంచి తెల్సుకోవాలి. ౫౧

కృదంత పరిచ్ఛేదం

---

# వ్యావహారికభాషా వ్యాకరణం

## వాక్యపరిచ్ఛేదం

అర్థబోధకం ప్రయోగార్హం పదం. ౧

కుండ - బండ - మొదలైనవి.

నామక్రియావ్యయ భేదాలతో పదాలు త్రివిధాలు. ౨

నామాలని - క్రియలని - అవ్యయాలని పదాలు మూడు విధాలని అర్థం.

కర్తృకర్మ భేదాలతో నామాలు ద్వివిధాలు. ౩

వ్యాపారావబోధకం క్రియ. ౪

ధాత్వర్థవ్యాపారానికి ఆశ్రయమైనది కర్త అనీ - ధాత్వర్థఫలానికి ఆశ్రయమైనది కర్మ అనీ పూర్వమే ప్రోక్తమైంది. కాబట్టి క్రియ అంటే ఏమిటో యిక్కడ చెప్పబడింది.

సకర్మకాలు అకర్మకాలని క్రియలు ద్వివిధాలు. ౫

కర్మ కలది సకర్మకం. ౬

కర్మ లేనిది అకర్మకం. ౭

కర్తృకర్మక్రియాన్వితం ప్రయోగం. ౮

కర్తరి కర్మణి భేదాలతో ప్రయోగం ద్వివిధం. ౯

క్రియ కర్తను చెబితే కర్తరి ప్రయోగం - క్రియ కర్మను చెబితే కర్మణి ప్రయోగం.

సాంస్కృతికం కర్మణి ప్రయోగం. ౧౦

కర్మణిప్రయోగం సంస్కృతసంబంధంవల్ల తెలుగులో ప్రవేశించింది. ఇది తెలుగుకి అస్వాభావికం - ఈప్రయోగం అంత ప్రశస్తంకాదు.

సకర్మకం అకర్మకమని కర్తరిప్రయోగం ద్వివిధం. ౧౧

కర్తరిప్రయోగానికి సకర్మకక్రియవుంటే సకర్మకకర్తరిప్రయోగమనీ కర్తరిప్రయోగానికి అకర్మకక్రియవుంటే అకర్మకకర్తరిప్రయోగమనీ పేరు.

విభక్తివచన శూన్యా లవ్యయాలు. ౧౨

సిద్ధాలు సాధ్యాలని అవ్యయాలు ద్వివిధాలు. ౧౩

సహజంగావున్న అవ్యయాలు సిద్ధాలు - భలే - ఆహా - ఓహో ! - అయ్యో - మొదలైనవి సిద్ధావ్యయాలు - విశేషార్థకస్వరాదులుచేరిన అసమాపక క్రియలు సాధ్యాలైన అవ్యయాలు - చేసి - కొట్టి - వెళ్లక - పాడక మొదలైనవి.

యోగ్యత ఆకాంక్షా సహితమై అర్థంకల ఆసత్తియుక్త పదసముదాయం వాక్యం. ౧౪

పదార్థాలకు పరస్పరసంబంధంలో బాధ కలగకుండావుండడం యోగ్యత - ఆపుదల లేకుండా మీదిమీదికిపోయే పదార్థాలపైని ఆదరం ఆకాంక్ష - వినేవారికి తెలిసికోవాలనే అపేక్షారూపమైన ఆదరమే ఆకాంక్ష - పదాలచేరికను ఆసత్తి అంటారు. నిప్పుతో తడుపుతున్నాడు అన్నప్పుడు యోగ్యతలేదు. గోవు గుఱ్ఱము అన్నప్పుడు ఆకాంక్షలేదు - ఒకరోజున "నారాయడు" అని చెప్పి మరోనాడు "వెళ్తున్నాడు" అని చెప్పడంవల్ల ఆపదసమూహం వాక్యంగా యేర్పడినా అది వాక్యం అని చెప్పతగిందికాదని భావం. వాక్యాల్లో కొన్ని క్రియాన్వయంకలవి. మరికొన్ని యితరాన్వయంకలవి. వర్తమానాద్యర్థకాలైనవి సమాపకక్రియలు. క్త్వా తద్వ్యతిరేక శతృ తుమున్ చేదానంతర్యార్థకాలు అసమాపకక్రియలు. వీటిల్లో మొదటివి నాలుగూ అంటే - క్త్వార్థక - వ్యతిరేకక్త్వార్థక - శత్రర్థక తుమున్నర్థకాలు క్రియలకు అభిన్నాలైన కర్తకలవి. తర్వాతివి రెండూ - అంటే - చేదానంతర్యార్థకాలు క్రియలకు విభిన్నాలైన కర్తకలవి.

పదాలకు పరస్పరం వున్న సంబంధాన్ని అన్వయమంటారు. ౧౫

వాక్యం విషయబోధకం. ౧౬

ఉద్దేశ్య విధేయాలు కలది విషయం. ౧౭

విషయంలో ఉద్దేశ్యం విధేయం రెండూ వున్నాయని అర్థం - ఉద్దేశించి

చెప్పతగింది ఉద్దేశ్యం. తర్వాత విశేషంగా తెలియతగింది విధేయం - ఉద్దేశ్యం వక్తకు శ్రోతకు ఇద్దరికీ తెలుస్తుంది - విధేయం వక్తకుమాత్రం తెలుస్తుంది.

విశేష్యాదికం ఉద్దేశ్యం. ౧౮

ఆదిశబ్దంచేత విశేషణాలు సర్వనామాలు గ్రాహ్యాలు.

క్రియాదికం విధేయం. ౧౯

ఆదిశబ్దంచేత విశేష్యాలు - విశేషణాలు - సర్వనామాలు - అన్నంత క్రియలు- ఏలాది అవ్యయాలు గ్రాహ్యాలు. విశేష్యాదులు ఉద్దేశ్యవిధేయాలు రెండూ అవుతాయి. క్రియలు ఉద్దేశ్యాలు కావు.

సంపూర్ణం, అసంపూర్ణమని వాక్యం రెండు విధాలు. ౨౦

సమాపకక్రియాన్వితం క్రియావిరహిత నామాంతం సంపూర్ణ వాక్యం. ౧౧

అసమాపక క్రియాన్వితం అసంపూర్ణవాక్యం. ౨౨

వాక్యసముదాయాన్ని మహావాక్యమంటారు. ౨౩

కొత్తగడ్డ - జగన్నాటకం - భారతం - రామాయణం - ఆంధ్రులచరిత్ర - మొదలైనవి.

క్రియాన్వయవాక్యాలు కొన్ని వ్యంగ్యార్థద్యోతకా లవుతాయి. ౨౪

భావక్రియలున్నవాక్యం వ్యతిరేకక్రియలున్నవాక్యానికి - వ్యతిరేకక్రియ లున్నవాక్యం భావక్రియలున్నవాక్యానికి - భావక్రియలున్నవాక్యం భావక్రియ లున్నవాక్యానికి - వ్యతిరేకక్రియలున్నవాక్యం వ్యతిరేకక్రియలున్నవాక్యానికి వ్యంజకా లవుతాయని తాత్పర్యం. అప్పుడు భావక్రియలు తే వర్ణాంతాలుగాను లేదా "అట్లయితే" అనుప్రయుక్తమైన ఇనన్నంతాలుగాను తా వర్ణాంతాలుగాను - వ్యతిరేకక్రియలు "పోతే" అనుప్రయుక్తమైన వ్యతిరేకార్థకాలుగాను వ్యతిరేకార్థాకాలు గాను ఉంటాయి. వాడువస్తే వీడువస్తాడు - వాడు వచ్చినట్లయితే వీడు వస్తాడు - వాడురాకపోతే వీడురాడు అని ఈవాక్యాలకు వ్యంగ్యం. వాడువస్తే వీడు రాడు- వాడు వచ్చినట్లయితే వీడురాడు - వాడురాకపోతే వీడువస్తాడు - అని వీటికి వ్యంగ్యం. నువ్వివ్వకపోతే నేనివ్వను - నువ్విస్తే నేనిస్తానని దీనికి వ్యంగ్యం -

నువ్విస్తే నేనివ్వను - నువ్వివ్వకపోతే నేనిస్తాననిదీనికి వ్యంగ్యం - ఇటువంటి వాక్యాలనేకవిధాలుగా వ్యవహారానుగుణంగా చెప్పవచ్చును. ఆవిశేషాలు శిష్టజన ప్రయోగాల్లో గ్రహించాలి.

భావ్యర్థకథనప్రారంభంలో ఇట్లా అన్నాడు
ప్రయుక్త మౌతుంది. ౨౫

భావర్థకథనప్రారంభంలో పూర్వవాక్యంచివర ఇట్లా అన్నాడు అనేదాన్ని ప్రయోగించడం జరుగుతుంది. ఇట్లా ఇట్టా ఇల్లా ఇలా లకు ఉపలక్షణం. ప్రజలతో బుద్ధుడిట్లా అన్నాడు.

తత్పరిసమాప్తిలో అనిన-అనగా-అంటేలు ప్రయుక్త
మవుతాయి. ౨౬

ప్రారంభంచేసిన వాక్యపరిసమాప్తిలో - అన్న - అనగా - అంటే - అనేవి ప్రయోగించడం జరుగుతుంది. ప్రజలతో మహాత్ము డిట్లా అన్నాడు - శాంత్యహింసలతో స్వదేశాన్ని రక్షించుకుంటూవుండడం మీబాధ్యత - విశ్వశ్రేయస్సుకై పాటుపడడం మీధర్మం అంటే - ప్రజలుఅంతా భక్తిశ్రద్ధలతో మహాత్ముని మాటలు శిరసావహించారు.

విశేషణత్రికాదులు కొన్నిచోట్ల అధ్యాహార్యా లవుతాయి. ౨౭

హింసావాదం విజృంభిస్తే దేశంలో శాంతి సౌఖ్యాలుండవు - ఇక్కడ ఏదేశంలో విజృంభిస్తే ఆదేశంలో అని ఏ ఆ లు అధ్యాహార్యాలు.

సంబంధంలో పూర్వవాక్యంలోని పదం కొన్నిచోట్ల
అధ్యాహార్య మవుతుంది. ౨౮

సత్యనారాయణకష్టాలు కూతురుగోడు కొడుకుగోల యెవరికితెలుస్తాయి ? - ఇక్కడ సత్యనారాయణకూతురుగోడు- సత్యనారాయణకొడుకుగోల అనిగ్రాహ్యాలు.

కర్త్రేకకర్మక్రియలు కొన్నిచోట్ల అధ్యాహార్యా లవుతాయి. ౨౯

నిన్నుచూస్తే నవ్వుతారు - ఇక్కడ ప్రజలు అధ్యాహార్యం. కృష్ణుడింట్లో ఉన్నాడా?-ఉన్నాడు-కృష్ణుడు ఇంట్లో అనేవిరెండూ యిక్కడ అధ్యాహార్యాలు. ఆ వాగేదెవర్రా ? నారాయణ - ఇక్కడ వాగుతున్నాడనే క్రియ అధ్యాహార్యం.

బహుకర్తృక క్రియకు సమీపకర్త్ర లింగవచనా
లవుతాయి. ౩౦

ఏనాయకుడిప్రజలు శాంతికాములై అహింసాతత్పరులై వుంటారో ఆనాయ కుణ్ని మహాత్ముడంటారు - మీశాంతిసైన్యం మీరూ శాంతించండి - మొదలైనవి.

అవయవకర్తృకక్రియ ఆ అవయవికర్తృక మవుతుంది. ౩౧

గడగడవణికే వెంకణ్ని చూచి - గడగడవణకడంకలవెంకణ్ని అని అర్థం. గుండె బేజారై యుద్ధోన్మాదులు పరిగెత్తారు. గుండె బేజారెత్తడంకల యుద్ధోన్మాదులు పరిగెత్తారు.

తే వర్ణాంతక్రియాపూర్వకమైన కాని అవ్యయం అనుక్త
వాక్యపదగ్రాహక మవుతుంది. ౩౨

నీవు దేశానికి సేవచేస్తేగాని నీశక్తిసామర్థ్యాదులు సార్థకం కావు - దీనికి వాక్యవ్యాసంలో నీవు దేశానికి సేవచేస్తే నీశక్తిసామార్థ్యాదులు సార్థకం అవుతాయి. నీవు దేశానికి సేవ చేయకపోతే నీశక్తిసామర్థ్యాదులు సార్థకం కావు - అని వుంటుంది. ఇటువంటిచోట్ల అవధారణార్థక ఏత్వంసైతం కొన్నిచోట్ల కనిపిస్తు న్నది. నీవు దేశానికి సేవచేస్తేనేగాని నీశక్తి సామర్థ్యాదులు సార్థకం కావు. ఇత్యాదులూహ్యాలు.

క్రియాపూర్వకమైన కాని పూర్వవిరుద్ధార్థసూచక
మవుతుంది. ౩౩

వాడు వచ్చేవాడేకాని కొన్ని అడ్డంకులవల్ల రాలేదు. పూర్వార్థంలో క్రియ మీది కానికి తర్వాతవచ్చే వాక్యార్థం పూర్వార్థానికి విరుద్ధంగా వుంటుందని సూచిస్తుంది.

విపులవాక్యానికి ముందు సంగ్రహవాక్యం
తరచుగా వస్తుంది. ౩౪

నీకు ఋణపడివుంటాను- నువ్వుఎట్లాగైనా శ్రమపడి ఆపని పూర్తిచేసిపెట్టు- అదేమిటిరా ? యింతఅన్యాయంగా ప్రజలసొమ్ము కాజెయ్యడం న్యాయమట్రా - యిదేమిటిరా ? ఏదీకానివేళ మూటాముల్లెకట్టి యెక్కడికి వెళ్దామని యేంచేద్దా మన్రా ?

వాక్యం వాక్యాంతర గర్భం కూడా అవుతుంది. ౩౫

వస్తానన్నారు - కారణం తెలియదు - ఇంతవరకూరాలేదు.

నిశ్చయార్థంలో క్రియకు పొమ్మ అనుప్రయుక్త మౌతుంది. ౩౬

నేనేమైనా రానుపో - నేరానుపొమ్మంటే - నేరానుపోమంటే - మొదలైన వూహ్యాలు.

నామాద్యంత వాక్యాలు క్రియా విరహితాలు. ౩౭

నామం మొదలైనవి అంతంలోకల వాక్యాలు క్రియావిరహితాలై సంపూర్ణ వాక్యత్వాన్ని పొందుతాయి. అతను రాముడు - అది ఊరు - అవి పళ్లు - అది కంపుది - అవి కుళ్లవి - ఆమె భలేమనిషి - విజ్ఞాని అతను - మంచివాడురా వాడు - మొదలైనవి.

వాక్య పరిచ్ఛేదం.

---

# వ్యావహారికభాషా వ్యాకరణం

## ప్రకీర్ణక పరిచ్ఛేదం

ఉత్వభిన్నస్వరానికి అరిక వర్ణకం పరమైతే
పూర్వరూపం వస్తుంది. ౧

చిన్న - అరికం - చిన్నరికం - కన్నె - అరికం - కన్నెరికం - లంజె - అరికం - లంజెరికం - మొదలైనవి.

అర్థాదులు పరమైతే ఏడు ప్రభృతుల డకారానికి ణకారం
నకారాగమం బహుళంగా వస్తుంది. ౨

ఏణ్నర్ధం - ఏణ్ణర్ధం - మూడుఅణాలు - మూణ్నాలు - మూణ్ణాలు - ఏడుఅణాలు - ఏణ్నాలు - ఏణ్ణాలు - ఇత్యాదులూహ్యాలు.

అరశబ్దం పరమైతే ఒకటి ప్రభృతులకు ద్విరుక్త
నకారాగమం బహుళం. ౩

ఒకటిన్నర - రెండున్నర - మూడున్నర - నాలుగున్నర - ఐదున్నర - ఆరున్నర - ఏడున్నర - ఎనిమిదిన్నర - తొమ్మిదిన్నర - పదిన్నర - రూపాయిన్నర - అణన్నర - మొదలైనవి. మూడణాల్నర - మూతణాలనర - ఇత్యాదుల్లో అద్విరుక్తనకారం బాహుళకంచేతనేనని గ్రహించాలి. అర రేఫకు ద్విత్వం వైకల్పికం. రూపాయిన్నర్ర - ఒకటిన్నర్ర-మూణ్నాలన్నర్ర-మొదలైనవి.

కకారం పరమైతే పదం తుది కకారహ్రస్వస్వరానికి
లోపం విభాష. ౪

| | | | | |
|---|---|---|---|---|
| కాక | .... | కాదు | .... | కాక్కాదు<br>కాకకాదు |
| లేక | .... | కాని | .... | లేక్కాని<br>లేకకాని |

| | | | | |
|---|---|---|---|---|
| పోక | .... | కొరికి | .... | పోక్కొరికి<br>పోకకొరికి |
| లేకి | .... | కచ్చి | .... | లేక్కచ్చి<br>లేకికచ్చి |

మొదలైనవి.

గకారం పరమైతే పదం తుది కకార హ్రస్వస్వరానికి లోపం కకారానికి గకారం విభాష. ౫

| | | | | |
|---|---|---|---|---|
| పోక | .... | గుబురు | .... | పోగ్గుబురు<br>పోకగుబురు |
| రూక | .... | గడ్డు | .... | రూగ్గడ్డు<br>రూకగడ్డు |
| లేక | .... | గాని | .... | లేగ్గాని<br>లేకగాని |
| మోకు | .... | గంట | .... | మోగ్గంట<br>మోకుగంట |

మొదలైనవి.

గకారం పరమైతే పదం తుది గకార హ్రస్వస్వరానికి లోపం విభాష. ౬

| | | | | |
|---|---|---|---|---|
| మూగు | .... | గుంపు | .... | మూగ్గుంపు<br>మూగుగుంపు |
| లాగి | .... | గడ్డి | .... | లాగ్గడ్డి<br>లాగిగడ్డి |
| రాగి | .... | గంగాళం | .... | రాగ్గంగాళం<br>రాగిగంగాళం |
| మోగు | .... | గంట | .... | మోగ్గంట<br>మోగుగంట |

మొదలైనవి.

కకారం పరమైతే పదం తుది గకార హ్రస్వానికి లోపం గకారానికి కకారం విభాష. ౭

| | | | | |
|---|---|---|---|---|
| రాగి | .... | కాగు | .... | రాక్కాగు<br>రాగికాగు |

| | | | | |
|---|---|---|---|---|
| మోగు | .... | కాగు | .... | మోకాఁగు / మోగుకాగు |
| రాగి | .... | కడ్డీ | .... | రాకఁడ్డీ / రాగికడ్డీ |
| లాగి | .... | కట్టు | .... | లాకఁట్టు / లాగికట్టు |

మొదలైనవి.

గత్రాదులు ఇత్యాద్యర్థకాలు. ౮

గత్ర - నత్ర - మొదలైనవి మొదలైనవి అనే అర్థాన్ని యిస్తాయని తాత్పర్యం - పెట్టి గత్ర పుచ్చుకొని - నగ నత్రదాచి - మొదలైనవి వ్యావహారిక ప్రయోగాలు. సముచ్చయార్థకానికి లోపంవస్తే గత్రాదుల తుదిహ్రస్వానికి దీర్ఘం వస్తుంది. కొన్నిచోట్ల దీర్ఘానికి హ్రస్వం సైతం కనిపిస్తున్నది. పెట్టీ గత్ర - పెట్టీ గత్రా - నగా నత్ర - నగా నత్రా.

అర్థవిశేష ఏత్వానికి హ్రస్వం వైకల్పికం. ౯

అడే - అడె - అరే - అరె - ఇడే - ఇడె - ఇరే - ఇరె.

గారు వారులు నిందాద్యర్థాల్లోను అనుప్రయుక్తా లౌతాయి. ౧౦

అదిశబ్దంచేత హేళన నిర్లక్ష్యాద్యర్థాలు గ్రాహ్యాలు. అబ్బాయిగారు దయ చేస్తారని అన్నీ రడీచేసిపెట్టాలి పాపం! - ఓహోహో మహారాజాగారు వేంచేశారని కూర్చోపెట్టి కుర్చీవెయ్యండి! మొదలైనవి.

రెండుకు ఇరు ఆదేశం బహుళం. ౧౧

బహుళగ్రహణంచేత పదిపరమైతే ఇరు విభాషగా వస్తుంది. ఇరవై - ఇరవైఒకటి మొదలైనవి. వ్యవస్థితవిభాషవల్ల రెండుపదులు అన్నప్పుడు ఇరు ఆదేశంరాదు.

సన్నిహిత సంబంధంకల వస్తువాచకమే కొన్నిచోట్ల వ్యక్తి వాచక మవుతుంది. ౧౩

ఏయ్ గొడుగూ! - గొడుగు వేసుకొన్న ఓమనిషీ! అని అర్థం - ఇదిగో

ముసుగూ ! - ముసుగువేసుకొన్న ఓమనిషీ ! అని అర్థం - అతలగుడ్డెవరు ? - తలగుడ్డచుట్టుకొన్న మనిషెవరు ? అని అర్థం- ఎవరీ యిల్లు ? ఈ యింట్లో ఉన్న వారు యెవ రని అర్థం - ఇలాగే ఎవ రావాగుడు ? ఎవ రామోత - ఎవ రాగోల- మొదలైనవి ఊహ్యాలు.

ఇరువురు రు వు వర్ణాలకు అత్వయుక్త ద్విత్వ
దకారాదేశం వైకల్పికం. ౧౪

ఇరువురు - ఇద్దరు.

గుణ రస వాచకాలైన నల్లాదులు అత్యంతార్థంలో తరచు విశేష
ణాలుగా పునరుక్తాలై పూర్వప్రయోజ్యా లౌతాయి. ౧౫

ఎర్ర టెరుపు - ఎర్ర నెరుపు - నల్లటి నలుపు - నల్లని నలుపు - యిక్కడ ఇత్వలోపం వస్తే - నల్లన్నలుపు - తెల్లటి తెలుపు - తెల్లని తెలుపు - పచ్చటి పసుపు - పచ్చని పసుపు - తియ్యటి తీపి - తియ్యని తీపి - పుల్లటి పులుపు - పుల్లని పులుపు - మొదలైనవి. తరచు శబ్దగ్రహణంచేత వగరు - చేదుప్రభృతుల కీకార్యం జరగదు.

అధికార్థంలో గుణ రస వాచకాలు కొన్నిచోట్ల ఏకార్థకభిన్నపద
ద్వంద్వంగా ప్రయుక్త మవుతాయి. ౧౬

కారుప్పు - కారునలుపు - చేదువిషం - పుల్లరొడ్డు - మొదలైనవి ఊహ్యాలు. ఇతరత్రసైతం యిటువంటి ప్రయోగాలు కొన్నిచోట్ల కనిపిస్తున్నవి - నుగ్గునూచం - పురుగు పుట్ర - మొదలైనవి.

ఆమ్రేడితం పరమైతే పూర్వపదాంత అన్నంత అగుధాతువుకి
లోపం బహుళం. ౧౭

తియ్యతియ్యగా - పుల్లపుల్లగా - కమ్మకమ్మగా - నల్లనల్లగా - తెల్లతెల్లగా - ఎర్రెర్రగా - మొదలైనవి - పక్షంలో తియ్యగాతియ్యగా - పుల్లగాపుల్లగా - కమ్మగాకమ్మగా ఇత్యాదులూహ్యాలు.

ఎకారయుక్తమైన సకారానికి శా బహుళంగా వస్తుంది. ౧౮

సెనగలు - శెనగలు - సెలవు - శెలవు - సేరు - శేరు - మొదలైనవి.

ఎకారయుక్తమై సాదేశమైన శా అకారయుక్తం
బహుళంగా అవుతుంది. ౧౯

సెలవు - శెలవు - శలవు - సెనగలు - శెనగలు - శనగలు - మొదలైనవి. బాహుళకంచేత యీకార్యం సార్వత్రికం కాదని గ్రహించాలి.

హిత శబ్దానికి పాక్షికంగా వు వర్ణకం మాత్రం
కనిపిస్తున్నది. ౨౦

హితం - హితవు - మాత్రశబ్దప్రయోగంవల్ల అత్వానికి ఉత్వం రాదని సూచించబడింది.

ఆగమ ని వర్ణానికి దకారం పరమైతే బిందువు
బహుళం. ౨౧

దానిది - దాంది - దీనిది - దీంది - దేనిది - దేంది - చక్కనిది - చక్కంది - నల్లనిది - నల్లంది - చక్కనిదానికి - చక్కందానికి - నల్లనిదానికి - నల్లందానికి - మొదలైనవి. బాహుళకంచేత ఈకార్యం సార్వత్రికం కాదని గ్రహించాలి.

నిర్నయాదుల రేఫయుత నకారానికి ణకారం విభాష. ౨౨

నిర్నయం - నిర్ణయం - స్వర్నది - స్వర్ణది - ఇత్యాదులు వ్యవహారానుగుణంగా గ్రాహ్యాలు.

త్రినయన త్రిణయనులు. ౨౩

త్రినయనశబ్ద ప్రథమనకారాన్ని ణత్వంతో కొందరు ప్రయోగించగా అది అసాధువని కొందరు లాక్షణికులు భావించారు-కాని అది నిరాకరం. మహాభాష్య కారుడు "అబాధకాన్యపి నిపాతనాని భవంతి" అని వ్రాసి కొన్నిచోట్ల నిపతితాలైన శబ్దాలు నిపతితాలకు సాధుత్వాన్ని సంపాదిస్తాయేకాని వాటిపూర్వరూపాల అసాధుత్వాన్ని ప్రతిపాదించనేర వని స్పష్టపరచడంచేత త్రినయన - త్రిణయన

నత్వ ణత్వరూపాలు రెండూ సాధువులేగాని వీటిల్లో ఏరూపమూ అసాధువుకాదని గ్రహించాలి. విశేషవివరణంకోసం ప్రాచీనవాఙ్మయంలో వ్యావహారికభాష - లేక - ధ్వని - లిపి - పరిణామగ్రంథంలో ౨౯౧ వ పేజీ మొదలు ౨౯౭ వరకూ పరిశీలించాలి.

సమాసంలో నామవాచకాలైన ఈశాదుల తుది అత్వానికి
లోపం తరచు కనిపిస్తున్నది. ౨౪

జగదీశ్ - రమేశ్ - సురేశ్ - హరీశ్ - దేవినాథ్ - హరనాథ్ - మొదలైనవి.

తుది అత్వం లోపిస్తే ఈశాదుల శాకు షకారం
విభాషగా వస్తుంది. ౨౫

జగదీశ్ - జగదీష్ - రమేశ్ - రమేష్ - సురేశ్ - సురేష్ - హరీశ్ - హరీష్ - మొదలైనవి.

దా దు వర్ణాలు పరమైతే తాంతధాతువుల తుది స్వరానికి
లోపం తాకు దకారం బహుళం. ౨౬

పాతు-పాతుదాం-పాద్దాం - పాతుదువు - పాద్దువు-మొదలైనవి ఉహ్యాలు.

తా తు తూ తే లు పరమైతే తాంతధాతువుల తుది స్వరానికి
లోపం బహుళం. ౨౭

పాతు - పాతుతాడు - పాత్తాడు - పాతుతున్నాడు - పాత్తున్నాడు - పాతుతూ వున్నాడు - పాత్తూ వున్నాడు - పాతితే - పాత్తే - మొదలైనవి.

దా దు వర్ణాలు పరమైతే దాంతధాతువుల తుది స్వరానికి
లోపం బహుళం. ౨౮

బాదు - బాదుదాం - బాద్దాం - బాదుదువు - బాద్దువు - మొదలైనవి.

దా దు వర్ణాలు పరమైతే ఇంచు బిందుపూర్వక చువర్ణానికి లోపం దకారానికి ద్విత్వం బహుళం. ౨౯

రక్షించుదాం - రక్షిద్దాం - రక్షించుదును - రక్షిద్దును - పంపించుదాం - పంపిద్దాం - పంపించుదువు - పంపిద్దువు - మొదలైనవి.

దా దు వర్ణాలు పరమైతే అన్వాదుల ను స్థానంలో బిందువు బహుళం. ౩౦

అందాం- అందును - విందాం - కూర్చొందాం-చేసుకొందాం - విందును- కూర్చొందును - చేసుకొందును - మొదలైనవి - వక్రానికి పాక్షికంగా ఉత్వంవస్తే కూర్చుందాం - చేసుకుందాం - కూర్చుందును - చేసుకుందును - మొదలైన రూపాలూహ్యాలు.

దా దు వర్ణాలు పరమైతే ఉండు డు వర్ణానికి లోపం బహుళం. ౩౧

డు వర్ణానికి అనడంచేత బిందువుకి లోపం రాదు - ఉండుదాం-ఉందాం - ఉండుదును - ఉందును - మొదలైనవి.

శత్రర్థక తూ వర్ణ స్వరానికి అకార ఒకారాలు పర్యాయంగా కొన్నిచోట్ల కనిపిస్తున్నాయి. ౩౨

చూస్తూ వున్నారు - చూస్తా వున్నారు - చూస్తోవున్నారు - మొదలైనవి. ఆత్వ ఒత్వా లనకుండా అకార ఒకారా లనడంవల్ల హ్రస్వదీర్ఘాలకు రెండింటికీ గ్రహణ - చూస్త వున్నారు - చూస్తా వున్నారు - ఇత్యాది హ్రస్వరూపాలు మరీ సకృత్తుగా కనిపిస్తున్నాయి. సూత్రంలో కొన్నిచోట్ల కనిపిస్తున్నాయి అనడంవల్ల యీ అకార ఒకార ప్రయోగాలకు శిష్టవ్యవహారంలో తరచుగా ప్రయోగంలేదని గ్రహించాలి.

అర్థ విశేషాల్లో ఇత్యాదులు పరమైతే వలయుకు ఆదేశమైన అలి లకారానికి పరంలో సకారాగమం వస్తుంది. ౩౩

చేయవలసివుంటుంది - చేయాల్సివుంటుంది - చేయాల్సిందేనా ? - చేయల్సా ? - మొదలైనవి.

వలయుకి ఆదేశమైన ఆలికి పరమైన అర్థవిశేష ఇత్వానికి
తే వర్ణం పరమైతే తకారానికి పూర్వంలో సకారా
గమం వస్తుంది. ౩౪

చేయాలిస్తే - అడగాలిస్తే - రావాలిస్తే రండి - తేవాలిస్తే తెండి - రావాలిస్తే వస్తాం - తేవాలిస్తే తెస్తాం - మొదలైనవి వ్యవహారప్రయోగాలు.

అశేష వాక్య ప్రయోగ విశేషాలు శిష్టమహాజనవ్యవహార
వేద్యాలు. ౩౫

ప్రకీర్ణక పరిచ్ఛేదం

---

# సూత్ర సూచి

| సూత్రం | పరిచ్ఛేదం | సంఖ్య | పేజీ |
| --- | --- | --- | --- |
| క్రియాపదోక్తంకాని కర్తకు | కా | ౬౩ | 165 |
| క్రియాపూర్వకమైనకాని పూర్వ | వా | 33 | 270 |
| క్రియావిధేయ విశేషణాలమీది | క్రి | ౨౦౨ | 255 |
| క్రీడావిశేషవాచకాలు | శ | ౩౦౧ | 123 |
| క్రొత్తశబ్దానికి ఆద్యక్షర శేషానికి | సంధి | ౩౬ | 32 |
| క్రొత్తాదుల రేఫకు | శ | ౨౪౬ | 113 |
| క్షక స్థిరం | సంజ్ఞా | ౨౯ | 5 |
| క్షకారం పరమైతే తకారానికి | సంధి | ౧౩౦ | 71 |
| క్షకారం పరమైతే విసర్గకు | సంధి | ౧౦౬ | 61 |
| క్ష్మాతలాదుల | శ | ౧౭౮ | 101 |
| క్షమాపణ ఆకారానికి రేఫాగమం | శ | ౧౫౮ | 98 |
| ఖద్యోత్యంలో తుదిహల్లుకి | స | ౬౯ | 183 |
| గకారం పరమైతే కికు వర్ణకాల | సంధి | ౭౯ | 49 |
| గకారంపరమైతే పదంతుది కకార | ప్ర | ౫ | 273 |
| గకారంపరమైతే పదం తుది గకార | ప్ర | ౬ | 273 |
| గకారం వకారం | శ | ౨౪౪ | 112 |
| గ జ డ ద బ లు సరళాలు | సంజ్ఞా | ౨౭ | 5 |
| గత్రాదులు ఇత్యాద్యర్థకాలు | ప్ర | ౮ | 279 |
| గయుక్త......అద్విరుక్తగకారం | క్రి | ౧౮౧ | 251 |
| గయుక్త......ఖాత్వాదుల కకారానికి | క్రి | ౧౮౩ | 251 |
| గారు వారులు నిందాద్యర్థాల్లోను | ప్ర | ౧౦ | 274 |
| గారు వారులు పరమైన అకారాంత | సంజ్ఞా | ౪౫ | 9 |

# తప్పొప్పులు

| తప్పు | ఒప్పు | పేజీ | పంక్తి |
|---|---|---|---|
| ఒష్ఠా్యలు | ఓష్ఠ్యాలు | 4 | 7 |
| ఆకారంత | ఆకారాంత | 9 | 11 |
| తత్సమం | సంస్కృతం | 12 | 2 |
| పోజాతర | పోజ్జాతర | 46 | 14 |
| ఏత్వౌత్వ | ఏత్వౌత్వ | 72 | 5 |
| నాచకాలు | వాచకాలు | 122 | 10 |
| పద్య | పద | 147 | 19 |
| వ్యత్యస్తం | వ్యత్యయం | 148 | 24 |
| ఆన్యార్థా | అన్యార్థా | 158 | 22 |
| దితీ్వయ | ద్వితీయ | 164 | 20 |
| ప్రయోగ్య | ప్రయోగ | 169 | 25 |
| సరసత్వీ | సరస్వతీ | 173 | 10 |
| పఝ్ఝుల | వఝ్ఝుల | 183 | 12 |
| అరకాలు | అర్ధకాలు | 192 | 3 |
| గుసుటా | గరుటా | 207 | 17 |
| స్రీ | స్త్రీ | 211 | 21 |
| కును | కను | 215 | 21 |
| ఇత్వాదుల్లో | ఇత్యాదుల్లో | 230 | 22 |
| లఘూపదా | లఘూపధా | 236 | 16 |
| ఆగమ | అనాగమ | 241 | 2 |
| ఇనన్–తూ | ఇనన్–దా–దు–తూ | 241 | 13 |
| అస్వర్థం | అస్త్యర్థం | 245 | 22 |
| అరవిశేషం | అర్ధవిశేషం | 264 | 21 |

* 113 వ పేజీలో 15 వ పంక్తి తర్వాత ఈక్రింది వాక్యం చేర్చుకోవాలి.

  ఈ కార్యం సంస్కృతసమాసాల్లో వ్రణ శబ్దానికి కనిపిస్తున్నది. వ్రణం-రణం.

* 187 వ పేజీలో 17 వ పంక్తిని అదే పేజీలో రెండవ సూత్రంక్రింద చేర్చుకోవాలి.
* 264 వ పుటలో 12 వ పంక్తిలో “బాలవ్యాకరణం.... స్పష్టపడుతుంది” అనే వాక్యం “మునకల అనే పేర్కొన్నాడు” అనేదానితర్వాత చేర్చుకోవాలి.
* 274 వ పేజీలో ౧౧ సూత్రం తర్వాత సూత్ర సంఖ్యలు తప్పినాయి. ఒకటి తగ్గించుకోవాలి.

సరస్వతీ పవర్ ప్రెస్ — రాజమండ్రి

ఈ వ్యాకరణం అనుశాసనం కాదు. శిష్టలోకంలో
ఇలా కనిపిస్తున్నదని చూపించడమే యీ
రచన తత్వం. భాషను అనుశాసించడం
పాణిన్యాది మహర్షులకు సైతం సమ్మతంకాదు

—గోపాలకృష్ణయ్య



పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కొ
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరం

